# పాల్కురికి సోమనాథుఁడు -
# వీరశైవ సిద్ధాంతము

## ద్వితీయ సంపుటం

కీ॥ శే॥ ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్య

# పాల్కురికి సోమనాథుఁడు - వీరశైవ సిద్ధాంతము

## ద్వితీయ సంపుటం

కీ॥ శే॥ ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్య

# PĀLKURIKI SOMANATHUDU - VIRASAIVA SIDDHANTAMU
(Vol. 2)

(Late) Prof. TIMMĀVAJJHALA KODANDARAMAIAH
Formerly Professor and
Head of the Department of Telugu,
Madurai Kamaraj University, Madurai



ప్రథమ ముద్రణ : ప్రతులు 1000, మార్చి 2001

వెల రూ :



ప్రతులకు :

1. తిమ్మావజ్ఝల కృష్ణమూర్తి
రిటైర్డ్ ఫారెస్ట్ ఆఫీసర్
18-3-52/డి4, ఖాదీకాలనీ
తిరుపతి, చిత్తూరు జిల్లా. ఫోన్ 31701

2. విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాద్, తిరుపతి, విజయవాడ
హనుమకొండ, అనంతపురం, విశాఖపట్నం
గుంటూరు, కాకినాడ

లేజర్ టైప్‌సెట్ అండ్ ప్రింటింగ్ :
ఎల్. వి. ప్రెస్
ప్రకాశం రోడ్, తిరుపతి

# విషయానుక్రమణిక

# సప్తమాధ్యాయము

## సోమనాథుని దేశి కవిత్వోద్యమ లక్ష్యము

ఏ యుద్యమమున కైనను నొకలక్ష్యముండును. ఒకానొక పరమార్థమును సాధించునుద్దేశముతోనే సాధారణముగా నుద్యమములు తల యెత్తుచుండును. అట్టి యేదో పరమార్థము - పరమప్రయోజనము లేక యెప్పుడును నే యుద్యమము గాని ప్రారంభించఁబడదు. సాహిత్యోద్యమముల విషయము కూడ నంతియ. సాహిత్యోద్యమముల లక్ష్యమా భాషా సాహిత్యములలో నేదో యొక విప్లవమో - విపర్యాసమో తెచ్చుట మాత్రమే కానక్కఱలేదు. ఆయాయి యుద్యమములవెనక నే మతమో, యే రాజకీయమో యదృశ్యలక్ష్యములుగా నుండుట కూడఁ గలదు. సాహిత్యోద్యమ లక్షణములను నధ్యాయమున నాయాయుద్యమములు సాధారణముగా నెట్టియెట్టి లక్ష్యములను సాధించుటకై యుప్పతిల్లుచుండునో తెలిసికొంటిమి. నన్నయభట్టునకుఁ బూర్వ మత్యల్పముగా - సన్నసన్నగా మాత్రమే పొడసూపుచు - నన్నయ కాలమున నాతనిమార్గకవిత్వ ప్రభావముచేఁ గొంతవఱకు మఱుఁగునఁ బడిపోయి, నన్నెచోడుని కుమారసంభవమున నొకింతగాఁ దొంగిచూచి, మఱల సోమనాథుఁడు చేపట్టుటతో ననల్ప మయినయుల్బణము నందిన యాతని దేశికవిత్వోద్యమముయొక్క లక్ష్యమెట్టిదై యుండునో యీ యధ్యాయమునందుఁ బరిశీలింతము.

శైవప్రపంచమునఁ బాల్కుఱికి సోమనాథునిగూర్చి యిక్రింది ప్రాస్తావిక శ్లోకమొకటి యనుశ్రుతముగా వినవచ్చుచున్నది.

*'ఆదౌ భృంగిరిటః పురా కృతయుగే నామ్నా సుకేశిప్రభుః*
*త్రేతాయాం వరవీరశైవశరణశ్రేష్ఠో మునిః పాణినిః*
*ద్వాపరే శివమంత్రసిద్ధికలిత స్సానందనామాంకితః*
*ఏవం భక్తహితార్థతః కలియుగే పాల్కుర్కిసోమేశ్వరః.'*

పరమశివుని ప్రమధగణములలో నొకఁ డగుభృంగిరిటియే కృతయుగము నందు సుకేశిప్రభు వను నామధేయముతోను, త్రేతాయుగమున వీరశైవశరణశ్రేష్ఠుఁ డగు పాణినిమునిరూపమునను, ద్వాపరయుగమందు శివమంత్రసిద్ధికలితుఁ డగు సానందనామాంకితుఁడుగను, గలియుగమున భక్తహితార్థమై పాల్కుర్కి సోమేశ్వర రూపమునను నవతరించి శివభక్తిమహిమను లోకమునందు వ్యాపింపఁ

జేసె నని పయి ప్రాస్తావికశ్లోకము తెలుపుచున్నది. దీనిఁబట్టి భృంగిరిటియే కలియుగమున శివతత్త్వ ప్రచారమునకై పాల్కురికి సోమనాథుని రూపమున నవతరించె నని తెలియుచున్నది. సోమనాథుఁడు భృంగిరిటి యవతార మని వీరశైవుల విశ్వాసము. ఈప్రాస్తావిక శ్లోకమొక్కటి మాత్రమే కాక పిడుపర్తి సోమనాథుఁడు రచించిన పద్యబసవపురాణములోని యీ క్రిందిపద్యము కూడ నీవిషయమునే తెలుపుచున్నది.

చ॥ అసదృశతన్మహామహిమ మారవితారకమై చెలంగ శ్రీ
బసవపురాణమున్ సకలభక్తకథా మణిసూత్రభాతిగా
వెస రచియింపు మీవు పృథివీస్థలికిం జని నాఁగ భృంగి సం
తసమునఁ బుట్టెఁ బాల్కురికి నామపురీవర సోమనాథుఁడై.

పరమేశ్వరుఁడు భృంగిని బిలిచి "ఓయీ, నీవు భూలోకమునకుఁ జని సకలభక్తకథ అనెడి మణులు కూర్చిన సూత్రమువలె నొప్పు బసవపురాణమును రచింపుము. అందుచే సాటి లేని నీ మహామహిమ యాచంద్రార్కమై విరాజిల్లఁ గలదు" అని యాదేశింపఁగా భృంగియు మిక్కిలి సంతస మంది పాల్కురికి యను గ్రామమునందు సోమనాథుఁడై జనించె నని పిడుపర్తి సోమనాథుఁ డీపద్యమునందుఁ దెలిపి యున్నాఁడు.

ఇతఁడు భృంగియొక్క యపరావతార మనుమాట యెట్లున్నను నీతఁడు భృంగిగోత్రసంజాతుఁ డనువిషయమును మాత్రము సోమనాథుఁడే తనప్రాథమిక కృతి యగు ననుభవసారమునందిట్లుచెప్పుకొనినాఁడు.

క॥ భృంగిరిటి గోత్రుఁడను గురు
లింగతనూజుండ శివకులీనుండ దుర్వ్యా
సంగవివర్జిత చరితుఁడ
జంగమలింగప్రసాద సత్ప్రాణుండన్.

పిడుపర్తి సోమనాథకవి యీతని కంకితముగా రచించిన పద్యబసవ పురాణము నందలి యాశ్వాసాంతపద్యములలో నాతని నిట్లనుసంధించినాఁడు.

క॥ భృంగిరిటి గోత్రసంభవ
జంగమపాదార్చనా విశారద విలస
త్సంగీతశాస్త్ర పారగ
గంగోత్పత్తి ప్రకారకావ్యధురీణా.

సోమనాథుఁడు భృంగరిటి గోత్రమునకుఁ జెందినవాఁ డని దీనిఁబట్టి యేర్పడు చున్నది.-ఈతని యీభృంగిగోత్రత్వమే యాతఁడు భృంగిరిటి యవతారముగా వీరశైవులు విశ్వసించుటకు హేతువు కాఁ దగును. ఏది యెటు లున్నను నీ వీరశైవుల విశ్వాస మొక విషయమును మాత్రము స్పష్టము చేయుచున్నది. సోమనాథుఁడు పరమేశ్వరుని యాదేశముచొప్పున లోకములో శివభక్తిప్రచారముఁ గావించెను. అతని యాదేశముచొప్పుననే 'సకలభక్తకథామణి సూత్రభాతి' గా బసవపురాణమును రచించెను అని. పరమేశ్వరుఁడానతి యిచ్చిన విషయమును మనము విశ్వసించినను, విశ్వసింపక పోయినను నతఁడు బసవపురాణాది గ్రంథములు రచించి శైవమతప్రచారముఁ గావించెనను విషయమును మాత్రము మన మొప్పుకొనక తప్పదు.

ఇట్లు పారంపర్యముగాఁ జెప్పికొను జనశ్రుతినిబట్టియే కాక సోమనాథుని గ్రంథములను బట్టి కూడ శైవమతప్రచారమే యాతని పరమాశయ మని విశద మగుచున్నది. బసవపురాణమునందలి యవతారికలో --

*'అనద్యశలింగదేహస్థుఁడై యున్న*
*బసవని వేఁడొక్కభావంబు గాఁగఁ*
*దగిలి వర్ణించుట దప్పన వలదు*
*తగు భక్తి వర్ధనార్థంబు దా నగుట.'*

-- *బస. 1-9* పుట.

అనుద్విపదపంక్తులలో - లింగదేహస్థుఁ డయిన బసవేశ్వరుని జీవితమును గావ్యరూపమున సంతరించుట తప్పు కాకపోవుటకుఁ గారణము దానిమూలమున శివభక్తి లోకమున వ్యాపించుటయే యని పేర్కొనెను. కనుక బసవపురాణరచనము భక్తివర్ధనార్థమే యనుట తెల్లము. మఱియు నందే కుకవినింద చేయుచు -

*'మృదుమహత్త్వముఁ గానమిని బొంకు లనఁగఁ*
*బడుఁ 'గవయః కింన పశ్యంతి' యనుట*
*యనుచుఁ గుకవులఁ గీఁటునఁ బుచ్చి పేర్చి.'*

-- *బస. 1-13* పుట.

అను పంక్తులలోఁ గుకవులు పరమేశ్వరుని మహత్త్వము నెఱుఁగక పోవుటచే - అనఁగా శివతత్త్వప్రతిపాదకము లయినకావ్యములు రచింపని కారణమున -

'కవయః కిం న పశ్యంతి' యనునాభాణకము బొంకగుచున్న దనెను. అనఁగా సత్కవి యగువాఁడు తనకావ్యమున శివమహిమానువర్ణనము చేయ వలయు నని భావము. అట్లు చేయని నాఁడు అతఁడు కుకవి యగును. 'కవి గాంచ రాని దేమి కల?' దను నర్థమిచ్చు 'కవయః కిం న పశ్యంతి' యనుమాట పరమేశ్వరుని మహత్త్వము నెఱుఁగనివా రగుటచే నట్టికుకవులయెడ బొం కగుచున్నది – దీనిమూలమునఁ గూడ సత్కవి కృతి శివభక్తిప్రతిపాదకము కావలయునన్న యాతని యాశంసనము స్ఫురించుచున్నది. ఇట్లితఁడే చెప్పుకొనిన వాక్యములనుబట్టి కూడ నాతనియాశయము మతప్రచారమే యనుట విశద మగును.

సోమనాథుని పరమాశయ మయిన శైవమతప్రచార మాతని మూలమున నేవిధమున నెఱవేరెనో యించుక పరిశీలింతము. అతఁడు కావించిన శైవమతప్రచారము నెఱుఁగుటకు ముందాతని శివభక్తి తత్పరతను గూర్చి తెలిసికొనుట యప్రస్తుతము కాఁజాలదు. బసవపురాణమునందలి యవతారికలో –

*వరపురాణోక్తి నీశ్వరకులజుండ*
*శరణగణాశ్రయ సకలస్వరూప*
*గురులింగ వరకరోదర జనితుండ*
*భక్తకారుణ్యాభిషిక్తుండఁ బాశ*
*ముక్తుండఁ గేవలభక్తి గోత్రుండ*
... ... ...
... ... ...
... ... ...
*వీరమాహేశ్వరాచారవ్రతుండ*
*సంభావితుఁడ భవిజనసమాదరణ*
*సంభాషణాది సంసర్గదూరగుఁడ* --

-- *బస. 1-7, 8* పుటలు,

అని తన్నుగూర్చి చెప్పుకొని యున్నాడు. పండితారాధ్యచరిత్రమునందలి యవతారికలో –

‘భవికృతారంభ సంభవదాస్యనిచయ
భవనిరీక్షణ రసపాక వితాన
భవిహస్తగత ఫలపత్రశాకాది
భవిగృహక్షేత్రాంఘ్రిపదవర్జితుండ
భవిజనదర్శనస్పర్శనాలాప
వివిధదానాదానవిషయదూరగుండ
శుద్ధభక్తిస్థలశ్రుతిమతాచార
సిద్ధవీరవ్రత శీలాన్వితుండ’

– పండి. *1–15* పుట.

... ... ...
... ... ...
‘భువి నేన ధన్యుండఁ బుణ్యుండ నాదు
వీరభక్తిస్థల విశ్రుతాచార
సారవ్రతాదులు సఫలత నొంద
నాయూర భక్తుల వర్ణింపఁ గంటి
బాయక నాజిహ్వ పావనం బయ్యె’

– పండి. *1–13* పుట.

అను పంక్తులయందుఁ దన శైవాచారపరాయణత్వమును సోమనాథుఁడు మిక్కిలి విపులముగాఁ దెలుపుకొని యున్నాఁడు.

అనుభవసారమునందు ––

క॥ అనయముఁ బాలకురికి సో
మనాథుఁ డనఁ బరఁగువాఁడ మానవసంస
ర్గనివర్తకుఁడను మఱిభ
క్తినిరూపిత మానసుండఁ గృతకృత్యుండన్.

అని తాను మానవసంసర్గనివర్తకుఁ డనువిషయమును దెలుపుకొని యున్నాఁడు. ఇతని యీ శైవాచారధౌరేయత్వమునే పిడుపర్తి సోమనాథుఁడు తన పద్యబసవపురాణావతారికలో నిట్లు ప్రశంసించి యున్నాఁడు.

క॥ భవిపాకభవిసహోదిత
భవిదృష్టి స్పృష్టి దుష్ట భవిక్ల్పప్తమహీ
భవిదాస్య భవికరద్ర
వ్యవర్జన శీలునకు దయాలోలునకున్.

తనభవిదర్శన పరిహరణ వ్రతమునకు భంగము లేకుండున ట్లీతఁడు కాండపటము వెనుకనుండి తన ప్రతివాదులతో వాదము నెఱపెడివాఁడని సోమనాథుని వర్ణనమునకు సంబంధించిన పిడుపర్తి సోమనాథుని యీ క్రింది పద్యమును బట్టి యూహింప నగుచున్నది.

ఉ. శ్రీ భసితత్రిపుండ్రక పరీతవిశంకటఫాలు, జూటజూ
టీభరధారు, నిర్మల పటీపటలవృతదేహు, నక్షమా
లాభరణాభిరాము, బసవాక్షరపాఠపవిత్రవక్త్రుఁ జి
చ్ఛోభితచిత్తుఁ బాల్కుఱికి సోమయదేశికుఁ బ్రస్తుతించెదన్

ఇందుఁ బేర్కొనఁబడిన నిర్మలపటీ పటలావరణము భవిముఖదర్శన పరిహారమున కయినదే యని యూహింపఁ దగుచున్నది. అతఁడు వీరశైవులకు విహితము లయిన పంచాచారములను, నష్టావరణములను, జతుష్షష్టిశీలములను నిర్వహించినట్లు తెలియుచున్నది. నిరతిశయ మగు నీచతుష్షష్టిశీల నిర్వహణము సోమనాథునితోనే యంతరించినదని శైవులు చెప్పుదురు.[1] అతని వీర శైవాచారపరాయణత యంత యభినివేశముతోఁ గూడినది,

తనవైయక్తిక జీవితమున నిట్టి కఠోర నియమనిష్ఠలు పాలించి శైవసమయ దీక్షను నిర్వహించిన సోమనాథుఁడంత పట్టుదలతోనే ప్రజానీకములో శైవమతప్రచారము చేయుటకును గంకణము కట్టుకొనెను.

అనుభవసారము సోమనాథుని ప్రాథమికకృతి. దానిని రచించునప్పటి కతఁడించుమించుగా నిరువదియేండ్ల ప్రాయమువాఁడై యుండును. అప్పటి కాతఁడు తన మాతృభాష యగు నాంధ్రమునందుఁ గొంతపాండిత్యమును సంపాదించి సంస్కృతములో వేదపురాణములను గొంతవఱకు నేర్చుకొని యుండునని భావింపఁబడుచున్నది, అప్పటి కాతఁ డష్టభాషాప్రవీణుఁడు కాని, చతుర్వేద పారగుఁడు కాని కాలేదు. కాని బాల్యమునుండియే యాతనికి శైవాచార

1. చూ. పాలకుఱికి సోమనాథకవి : శివశ్రీ బండారు తమ్మయ్యగారు, పుట. 87.

తత్పరత మాత్రము పూర్తిగా నలవడినట్లు తోఁచును. కర్ణాటకదేశమున వీరశైవమతోద్ధరణ మొనర్చిన బసవేశ్వరునిగూర్చి యప్పటి కతని కంతగాఁ దెలియదు. అతఁడు వేదాంతగర్భితములుగా రచించినకర్ణాటక గీతములతోఁ గూడ నాతని కప్పటికిఁ బరిచయము లభించి యుండ లేదు. అందుచేతనే తన యనుభవసారమునందాంధ్రదేశీయుఁ డయిన మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారాది కృతులను బ్రశంసించుచు నాతనిని మూఁడుపద్యములలో నుతించియు సోమనాథుఁడందు బసవేశ్వరుని నామము నైనను బ్రస్తావింపలేదు. అనంతరము కొంతకాలమునకు బసవేశ్వరునిగూర్చియు, నతనిసమకాలికు లగు భక్తజనములనుగూర్చియు నాతనికిఁ గొన్ని వివరములు భక్తులమూలమునఁ దెలియ వచ్చెను. అట్లు తెలిసినపిదప నాతనికి బసవేశ్వరునియందుఁ గ్రమముగా భక్తిభావము కుదురఁ జొచ్చెను. అతనిపై భక్తి కుదిరిన పిదపనే యాతఁడు సోమనాథస్తవము, బసవస్తోత్రపరము లగు గద్యలు, రగడలు, ఉదాహరణములు మున్నగులఘుకృతులను రచించెను. ఆతరువాత సంస్కృతపదభూయిష్ఠము లయినయట్టిదేశీయగేయకృతులు జనవశీకరణమునకును, మతప్రచారమునకును నంతగా నుపకరింపఁ జాల వని తలంచి, జానుతెనుఁగుపై వలపు పచరించి, యాంధ్రజాతీయచ్ఛంద మగు ద్విపదలో బసవపురాణమును సప్తాశ్వాసపరిమిత మగుకావ్యముగా సంతరించెను. తరువాత వృషాధిపశతకమును, చతుర్వేదసారమును, రచించి యందు బసవభక్తి నతివేలముగాఁ బ్రదర్శించెను. పండఁబాఱిన వయఃపరిపాకదశలో నతఁడు పండితారాధ్య చరిత్రమును రచించి దానిని బసవేశ్వరునికే యంకితము గావించెను.

బసవేశ్వరునిగూర్చి, యాతనిమహిమాదికమునుగూర్చి తెలియవచ్చిన పిదప నితని కాతనిపై భక్తిభావము కలుగఁగా నితఁడు తన్మహిమాను వర్ణనవ్యాజమున శైవమత ప్రచారమునకుఁ గడఁగెను. ఇతని శైవమతప్రచారము ముఖ్యముగా మూఁడు తెఱఁగులుగా సాఁగినది. శైవమతావలంబకు లగువారికి నిత్యానుసంధానమునకుఁ బారాయణాదులకు ననువగుస్తోత్రగ్రంథములు నాఁటి కొక్క శివతత్త్వసారము తప్ప మఱి యేదియు లేక పోయెను. శివతత్త్వసార మయినను కేవలస్తోత్రగ్రంథము కాదు. అం దితరవిషయములును ప్రస్తావింపఁబడినవి. అందుచే శైవుల కుపాదేయము లయిన స్తోత్రరూప రచనములను వెలయింప వలసిన యావశ్యకమెంతేనియు నాకాలమున నుండినది. ఆ కొఱఁతను సోమనాథుఁడు సోమనాథస్తవము, పంచప్రకారగద్య మొదలగుస్తోత్ర

రూపరచనలను గొన్నింటిని వెలయించి కొంతవఱకుఁ దీర్చెను. ఇట్టి స్తోత్రరచనలు పామరు లయినవారు, శైవులు ప్రతిదినము పారాయణము చేసికొనుటకు మిక్కిలిగా నుపయోగిపడినను వానిమూలమున జరుగుప్రచారము స్వల్పమే. శైవు లగువారు శైవేతరుల వాదములకుఁ బ్రతివాదములు సలిపి, తమమతము యొక్క యౌత్కృష్ట్యమును బ్రతిష్ఠాపించుకొనవలసినయవసరము కూడ నెక్కువగానే యుండినది. వారికిఁ దమమతమునకు సంబంధించిన ధర్మములుఁ, దదౌత్కృష్ట్యముఁ దెలిసి యుండుటతో పాటు ఇతరమతముల ఖండనవిధానము కూడఁ దెలిసియుండ వలయును. అట్టికార్యమును నిర్వహించుటకు స్తోత్రగ్రంథములు చాలవు. సిద్ధాంతగ్రంథములు మాత్రమే యట్టి కార్యమును నిర్వహించగలవు. సోమనాథుఁడు చతుర్వేదసారము, సోమనాథభాష్యము, రుద్రభాష్యము నను గ్రంథములను రచించి వానిమూలమున నితర మతములను ఖండించి స్వమతస్థాపనము గావించెను. పండితు లగువారు మాత్రమే యాగ్రంథములలోఁ దెలుపఁబడిన విషయములను గ్రహింపఁగలిగి యుందురు. స్తోత్రరచనలు శైవమతావలంబకు లయిన పామరులకును, సిద్ధాంతగ్రంథములు పండితులకును మాత్రమే యుపయోగపడఁగా శైవేతరు లయినవారికి శైవమతమునం దభినివేశము, నభిమానముఁ గల్పించుటకును, శైవులకుఁ గూడ మతధర్మముల రూపమునఁ గాక కథావ్యాజమున శైవమతధర్మములఁ దెలిపి వానియంది తోఁ ఇ ధికముగా నాస్థ కలిగించుటకును సోమనాథుఁడు బసవపురాణము, పండితారాధ్య చరిత్రము అను ద్విపద కావ్యములను రచించి వానిలోఁ బెక్కురు పురాతననూతనభక్తులచరిత్రముల నభివర్ణించి సమకాలమునందలి శైవులకును, శైవేతరులకును శైవమతమునందుఁ గొంత యాదరాభిమానములు కలుగుటకుఁ దోడ్పడినదాఁ డాయెను. తమవారికాలమున నైతము దనకావ్యములపఠనమువలన శైవమత ప్రచారము జరుగుటకుఁ గూడ వాని మూలమున నతఁడు కొంతసాయము చేసిన వాఁడయ్యెను. ఇట్లుతని పరమాశయ మయిన శైవమతప్రచార మతఁడు సృష్టించిన శైవసాహిత్యముమూలమునఁ బూర్ణముగా నెఱవేరిన దనియే భావింప వచ్చును.

వీరశైవమునకుఁ బ్రధానాంగము లింగధారణము. అట్టి లింగధారణ దీక్ష నొంది శివజీవైక్యజ్ఞానరూప మగుమోక్షమును సాధించుటకు నందఱకు నధికారము కలదు. కాని, భారతదేశమునందు వర్ణవ్యవస్థ చిరకాలమునుండి నెలకొని యుండిన కారణమున వీరశైవదీక్ష నొందువారు వారివారి కులముల

ననుసరించి మునుముందు బ్రాహ్మణునకిన్ని సంవత్సరములు, తక్కినకులముల వారికి కిన్నిన్ని సంవత్సరములునని కొంతకాలము వ్యవధినేర్పఱిచి యావ్యవధి గడచినపిమ్మటనే వారివారికి శివదీక్ష యిచ్చునాచారము బసవేశ్వరునికిఁ బూర్వకాలమం దుండి యుండును. ఇట్టి కాల నియమాది నిర్బంధము వలన వీరశైవమతము విస్తరింపక బసవేశ్వరునికిఁ బూర్వము క్షీణదశయం దుండెను. బసవేశ్వరుఁ డీ నియమములను సడలించి యేకులజు లయినను వారి పూర్వాచారధర్మములను విడనాడి సదాచారముఖ్యము లగు పంచాచారముల నవలంబించి యష్టావరణములు గ్రహించినచో వీరశైవమతావరణమునఁ జేరఁ దగునని యుద్బోధించి యాతఁడు తన దివ్యప్రభావముచేతను, దృష్టప్రత్యయాదులచేతను ననతికాలముననే యసంఖ్యాకు లగుజనులు వీరశైవమతము నవలంబించు నవకాశములను గల్పించెను. దానిమూలమున కర్ణాట మహారాష్ట్ర దేశములందును, నాంధ్రదేశమునందును వీరశైవ మతము మిక్కిలి వ్యాప్తి గాంచినది. ఇదియే బసవేశ్వరుఁడు పంచాచార్యుల మతవ్యవస్థకు ముఖ్యముగాఁ గావించినసంస్కరణము. బసవేశ్వరునివంటి మతసంస్కర్త యవతరించి యాకాలమున కనుగుణ మయినసంస్కరణము చేయుట మూలముననే దక్షిణహిందూదేశమున వీరశైవమతోద్ధరణము జరిగి యామత మచట విస్తృతిగాంచినది. అట్టి సంస్కరణము మూలమునను, స్వీయమహిమాదికప్రదర్శనముల మూలమునను– కన్నడభాషలో వేలకొలఁదిగా భక్తిమయము లగుగేయములను రచించి పారవశ్యముతోఁ బాడియు నాతఁడు జనులను స్వీయమతావలంబకులనుగాఁ జేసి వీరశైవమతోద్ధరణము గావించెను.

కాని, యట్టి మహిమాదికములవలన జరిగిన మతప్రచారము కేవలము ప్రజల నమ్మకము మీఁదనే యాధారపడి యుండును. ఆ మతము నిలువఁద్రొక్కుకొన వలయునన్నచో నితరమతముల వాదముల ఖండించి శైవమతముయొక్క యౌత్కృష్ట్యము స్థాపింపఁబడ వలయును. తక్కిన మతములవారు వాదమునం దోడి యామతము యొక్క యౌత్కృష్ట్యము నంగీకరింప వలయును. ఇట్టి కార్యమును సామాన్యులు సాధింపఁజాలరు. దీనికి గొప్ప పాండిత్య మవసరము. వివిధశాస్త్రములందు, వేదవేదాంగములందు విస్తార మయిన పాండిత్యము కలవాఁడు మాత్రమే యాకార్యమును నిర్వహింపఁ గలఁడు. మల్లికార్జున పండితుఁడు వీరశైవమతమునకుఁ జేసినసేవ యట్టిది. అతఁడు బౌద్ధాదికము లగునితరమతములను వాదములోఁ జిత్తుగా నోడించి

శైవమతాధిక్యమును స్థాపింపఁగలిగెను. కాని, శైవమతమున కా యజేయస్థితి యూతఁడు జీవించి యుండు నంతవఱకు మాత్రమే యుండును. అతనియనంతర మామతము తిరిగి యితర మతములకుఁ జెందిన విద్వాంసులచే నోడింపఁబడి యడుగంటు ప్రమాదము వాటిల్ల వచ్చును. పాల్కురికి సోమనాథుఁడు శైవమతమునకుఁ జేసినసేవ బసవేశ్వరుఁడును, మల్లికార్జున పండితుఁడును జేసినదానికంటెను జాల గొప్పది. తనకాలముననే కాక తన తరువాతికాలమునఁ గూడ శైవమతము ప్రచార మందుటకుఁ దనకావ్యములమూలమున నతఁ డవకాశము కల్పించెను. స్తోత్రరూపవచనలు చేసి శైవులకు నిత్యానుసంధానమున కుపయోగపడుసామగ్రి నొసఁగిన వాఁడాయెను. సిద్ధాంతగ్రంథములను బ్రత్యేకముగా విరచించి పరమతఖండనము, స్వమతస్థాపనము గావించెను. బసవపురాణాదికావ్యములలో నచట నచట కథావ్యాజమున శైవాచారనియమములను గూర్చి తెలిపి శైవులకుఁ బరోక్షముగా శివదీక్షా బోధఁ జేసినవాఁడాయెను. బసవపురాణాది కావ్యములరచనము మూలమున శైవమతమునుగూర్చియు, పురాతననూతన భక్తులను గూర్చియు, బసవేశ్వరాదులగు మహనీయులను గూర్చియు, శైవులే కాక శైవేతరులును దెలిసికొనునవకాశమును గల్పించెను. ప్రతిపాద్యమగు శివభక్తి తాత్పర్యము పాఠకుల హృదయములలోఁ జక్కఁగా హత్తుకొని యుండు మూలమున వారికి రసానుభవము కలుగుటకై సమానార్థకములగు పర్యాయ పదములను బుంఖానుపుంఖములుగాఁ బ్రయోగించి యూతఁడు రచనలో నొక క్రొత్తసొంపును సాధించుటయే కాక శైవమయముద్ర వారిహృదయ ఫలకములపై శాశ్వతముగాఁ బడునట్లు చేయఁ గలిగె ననుట యయథార్థము కాదు. ఇట్టి యూతని ప్రజ్ఞనే డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు తమపండితారాధ్య చరిత్ర పీఠికలో నిట్లు పేర్కొనిరి.

"వీరశైవేతరుల కపరిచితు లైన శైవభక్తులపేళ్లు, కథలు మొదలయినవాటిని గూడా చెవులలో గింగురుమనునట్లు మ్రోగించి, మ్రోగించి అవి పరిచితము లయినట్లు చేయడము –

వీరశైవేతరపాఠకునికి ఇతరసమయములలో వెగటుగా తోచే విషయముల నయినా తనకవితానైపుణ్యముచేత హితవుగా ఉన్నట్లే తోపజేయడము". [౨]

---

౨. చూ. పండితారాధ్యచరిత్ర పీఠిక – పుట 104.

కనుక దీనినిబట్టి వీరశైవమతప్రచారమే సోమనాథుని పరమాశయ మగుట సిద్ధాంత మయినది. తన్మతప్రచారమున కతఁడు కవిత్వమును సాధనముగా గ్రహించెను. ఏమతమయినను బ్రజలలో బహుళప్రచార మందవలె నన్నచో నామతధర్మములను వారి భాషలోనే బోధింప వలయును. హైందవ మతధర్మములు ప్రాచీనకాలమున సంస్కృత భాషలో నుండుటచేతను, నగ్రవర్ణములవారికి మాత్రమే సంస్కృతము తెలిసి యుండుట చేతను, దక్కువ కులములవారికి హైందవమతగ్రంథములు చదువుటకును, నామతధర్మముల నెఱుంగుటకును నవకాశము లేక పోయెను. అందుచేతనే యాకాలమున హిందూ మతమును విసర్జించి ప్రజ లనేకులు బౌద్ధజైనాదిమతములను స్వీకరించుచుండిరి. బుద్ధ భగవానుఁడు తనమతము ప్రజలలోఁ జక్కఁగా వ్యాపింపవలయునని యెంచి తనమత ధర్మములను బ్రజలభాష యయినఁ బ్రాకృతభాషలోనే బోధించెను. బౌద్ధమతగ్రంథము లన్నియుఁ బ్రాకృతభాషలోనే రచితము లయినవి. ఈ రహస్యము నెఱిఁగిన పాల్కురికి సోమనాథుఁడును శైవమతము జనులలో బాగుగా వ్యాపింపవలయునన్నచో నది సంస్కృతములోనో, సంస్కృతసమాసభూయిష్ఠమయిన మార్గపద్ధతిలోనో కాక ప్రజల కతిసన్నిహిత మయిన జానుతెనుఁగుభాషలో తెనుఁగునందే విరచింపఁబడ వలయు నని తలఁచెను. ప్రచారమునకు గేయములు పనికి వచ్చినంతగా నితరచ్ఛందములు పనికి రావు. అందుచే నాతఁడు తన కావ్యములను గానానుకూల మయిన దేశీయచ్ఛందోభేద మగుద్విపదలో రచించెను. గద్యలు, రగడలు, ఉదాహరణములు కూడఁ గొంత గేయధర్మమును గలిగి యుండుటచే మతప్రచారమునకు మిక్కిలిగా నుపకరింపఁ గల వనునుద్దేశముతో నట్టి లఘుకృతులను గూడఁ బెక్కింటిని రచించెను. పౌరాణిక మయిన యితివృత్తమును గ్రహించినచో వాస్తవికదృష్టి, మౌలికత కొఱవడు ననియో – శైవమతమునకుఁ – దన కించుక పూర్వకాలమునందే – గొప్పసేవ చేసి యామతమును సముద్ధరించిన మహనీయుల చరిత్రముల నభివర్ణించినచో శైవమతప్రచారము మఱింతగా జరుగు నని కాంక్షించియో యాతఁడు దేశీయేతివృత్తమునే గ్రహించి తనమతప్రచారాశయమును నెఱవేర్చుకొనెను.

ఇట్లాతని దేశికవిత్వోద్యమ లక్ష్యము ప్రధానముగా శైవమతప్రచార మేమయినను నానుషంగికముగా నాంధ్రసాహిత్యమున నొకవిస్పష్ట పరిణామము, సభ్యుదయదీపనము దానిమూలమున నేర్పడినది. నన్నయ మార్గకవితాపద్ధతిఁ

భిన్నముగా నాతనికాలమున మఱుఁగుపడిపోయి పాటలు, పదములు, గేయములు మొదలగు వానితో ప్రాణము నిలుపుకొనియుండిన దేశికవిత్వము మఱలఁ గొంత తేజము పుంజుకొని వస్తుభాషాచ్ఛందో విషయములలో వేఱు మార్గము త్రొక్కినది. మతప్రచారాశయముతోఁ బ్రారంభ మయినయాతని దేశికవిత్వోద్యమ మాంధ్రసాహిత్యములో నొక ప్రధాన ఘట్ట మయినది. ఈ యుద్యమము కవిత్వవిషయకముగాఁ గ్రొత్తపుంతలు త్రొక్కుటకు దారులు వేసి మతప్రచారముతోఁ బాటు సాహిత్య సంస్కరణము కూడ సాధించుట యనునది యనూహ్య మయినపరిణామము. అది సత్ఫలదాయకమే యగుట మన యదృష్టము.

ఈయధ్యాయమునఁ జర్చింపఁబడిన వివిధాంశముల సారాంశము నీక్రింది విధముగా సమీకరింప వచ్చును.

౧. సోమనాథుఁడు పరమశివుని ప్రమథగణములలో నొకఁ డగు భృంగిరిటి యొక్క యవతారము. అతఁడు పరమేశ్వరుని యాదేశముచొప్పున లోకములో శివ భక్తిప్రచారముఁ గావించెను. అతని యాదేశముచొప్పుననే యాతఁడు 'సకలభక్తకథా మణిసూత్ర భాతి' గా బసవపురాణమును రచించెను. ఈవిషయములను శైవప్రపంచమున ననుశ్రుతముగా వినవచ్చు ప్రాస్తావిక శ్లోకమును, బిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణమును, సోమనాథుని యనుభవసారమునందలి పద్యములును దెలియఁ జేయుచున్నవి. పరమేశ్వరుఁ డానతి యిచ్చినవిషయమును మనము విశ్వసించినను, విశ్వసింపక పోయినను నతఁడు బసవపురాణాదిగ్రంథములు రచించి శైవమతప్రచారము గావించె ననుమాట మాత్రము సత్యము.

౨. సోమనాథుని గ్రంథములలో నాతఁడు చెప్పుకొనిన యంశములనుబట్టి కూడ శైవమతప్రచారమే యాతని పరమాశయ మని విశద మగును.

౩. తాను శివభక్తితత్పరుఁ డయినఁ గాని శైవమతప్రచారముఁ జేయుట కాతని కధికార ముండదు. అతఁడు తన వైయక్తికజీవితమునఁ గఠోరము లగునియమ నిష్ఠలు పాటించి శైవసమయదీక్షను నిర్వహించిన యవిరళశివభక్తి తత్పరుఁ డని యాతని గ్రంథములనుబట్టియు, నితరు లాతనినిగూర్చి చేసిన వర్ణనాదికమునుబట్టియు విశదమగుచున్నది.

౪. అతని శైవమతప్రచారము ముఖ్యముగా మూఁడు తెఱఁగులుగా సాఁగినది. శైవమతావలంబకు లగువారికి నిత్యానుసంధానమునకుఁ, బారాయణాదులకు నుపయోగపడు స్తోత్రగ్రంథములు రచించుట, పరమతఖండనముఁ గావించి శైవమతౌత్కృష్ట్యమును స్థాపించుసిద్ధాంత గ్రంథములు రచించుట, శైవులకును, శైవేతరులకును శైవమతమునం దాస్థయు నభినివేశమును గల్పించుటకుఁ గథావ్యాజమున శైవ మతధర్మములను దెలుపు గ్రంథములు విరచించుట. అతఁ డీ ముత్తెఱఁగులను సృష్టించిన శైవసాహిత్యము మూలమున నతని పరమాశయ మయిన శైవమతప్రచారలక్ష్యము పూర్ణముగా నెఱవేరినది.

౫. బసవేశ్వరుఁడనాదిగా నుండినశైవమతమును సంస్కరించియు, వేల కొలఁదిగా భక్తిమయము లగుగేయములను గన్నడభాషలో రచించియు, స్వీయమహిమాదికప్రదర్శనముల (దృష్టప్రత్యయముల) మూలమునను వీరశైవమతోద్ధరణముఁ గావించెను. మల్లికార్జున పండితుఁడు తన పాండిత్యముచే నితరమతములవాదములను ఖండించి శైవమతౌత్కృష్ట్యమును స్థాపించెను. అట్టి మహిమాదికముమీఁద విశ్వాసము సడలినప్పుడును, నట్టి పాండిత్యమును బ్రదర్శించిన మహనీయుని నిర్యాణముతోను శైవమతము తిరిగి దిగనాశిల్లుప్రమాద మేర్పడును. వా రిరువురును జేసిన సేవకంటె గొప్పది సోమనాథుఁడు వీరశైవమునకుఁ జేసినసేవ. తనకాలముననే కాక తన తరువాతికాలమునఁ గూడ శైవమతము ప్రచార మందుటకుఁ దనకావ్యముల మూలమున నతఁడు గొప్పయవకాశమును గలిగించెను.

౬. వీరశైవమతప్రచారమే సోమనాథుని పరమాశయము. దాని కతఁడు కవిత్వమును సాధనముగా గ్రహించెను. బుద్ధభగవానుఁడు తనమతము ప్రజలలో బాగుగా వ్యాపింప వలయునను నుద్దేశముతోఁ దనమత ధర్మములను సంస్కృతభాషలోఁ గాక ప్రాకృతభాషలో వెలయించిన ట్లీతఁడు జానుతెనుఁగున దేశీయచ్ఛంద మగుద్విపదలోఁగతిపయ గ్రంథములను రచించెను. గద్యలు, రగడలు, ఉదాహరణములు గొంత గేయ ధర్మములను గలిగియుండుటచే వానియందుఁ గొన్ని లఘుకృతులను విరచించెను. పౌరాణికేతివృత్తమును గాక దేశియేతివృత్తమును గావ్యవస్తువుగాఁ బరిగ్రహించెను. ఇట్లు శైవమత ప్రచారలక్ష్యముతో నాతఁడు దేశికవిత్వోద్యమమును జేపట్టెను. దాని మూలమున నాంధ్ర సాహిత్యమునం దానుషంగికముగా నొక విస్పష్టపరిణామము, నభ్యుదయదీపనము నేర్పడినది.

# అష్టమాధ్యాయము
# సోమనాథుని రచనలలో దేశి
# ఇతివృత్తమునందలి దేశీయత

పాల్కుఱికి సోమనాథుని గ్రంధసంచయమును బరిశీలించినపు డితివృత్తము నందలి దేశీయత, దేశిఛందస్సు, దేశివర్ణనలు, దేశీయము లగు నుపమానాదికములు, తెలుఁగు సామెతల యొక్కయు, జాతీయములయొక్కయుఁ బ్రయోగము, దేశి పదజాలము, వ్యావహారికమునకు సన్నిహిత మగుభాషా ప్రయోగము, దేశిరచనా విధానము, దేశీయవిజ్ఞానము, దేశీయజీవనచిత్రణము – ఇత్యాదిక మగు పెక్కు భంగులలో నాతని దేశికవితోద్యమవృక్షము శాఖోపశాఖలుగా విస్తరిల్లినట్లు గోచరించును. ఇన్ని టను దేశీయతను సాధించి తనకవిత్వమును బ్రజల కత్యంతము సన్నిహిత మగునట్లు చేసి తన్మూలమున శైవమతప్రచారము గావించుటయే యాతని లక్ష్యము. అదియే యాతని ధ్యేయము. పయియంశములలో నాతఁ డితివృత్తమునందు సాధించిన దేశీయతయొక్క స్వరూప మెట్టిదో యించుక పరిశీలింతము.

పాల్కుఱికి సోమనాథునికిఁ బూర్వ మాంధ్రవాఙ్మయస్వరూప మే తీరున నుండెనో యొకప్రత్యేకాధ్యాయమునఁ బరిశీలించితిమి. అతనికిఁ బూర్వము వెలసిన గ్రంధములు ప్రాయికముగా సంస్కృతమూలకములు. నన్నయభారతము వ్యాస భగవానుఁడు సంస్కృతమున రచించిన మహాభారతమున కనువాదము. పావులూరి మల్లనకృత మగు సారసంగ్రహగణిత మనుపేరు గల పావులూరి గణితమునకు మహావీరాచార్యుఁడు సంస్కృతమున రచించిన గణితసారసంగ్రహ మనుగ్రంథము మూలము. అందుఁ బరికర్మక్షేత్రగణితములలో నాంధ్రదేశమునకు సంబంధించిన మానములు మున్నగునవి తెలుపఁబడినను నది సంస్కృత మూలమున కనువాదముగానే సాఁగినది. కవిజనాశ్రయమునకు జనాశ్రయి సంస్కృతమున రచించినఛందోగ్రంధము మూలము. దేశీయతవంక నొకకొంత మ్రొగ్గు చూపి యుందందు దేశీయతాభిమానమును బ్రదర్శించిన నన్నెచోడ మహాకవి కుమారసంభవమునకు సంస్కృతమునందలి శివపురాణమును, గాళిదాసకృతమగుకుమారసంభవమహాకావ్యమును మూలప్రాయములు. ఉద్భట కవికృత మగుకుమారసంభవము కూడ దానికిఁ గొంతవఱకు మాతృభూత మయ్యె నని కొందఱు పండితుల యభిప్రాయము.

మల్లికార్జునపండితారాధ్యకృత మగు శివతత్త్వ సారము మాత్రము సంస్కృత మూలకము కాదు. అది స్వతంత్రగ్రంథము. కాని యందెట్టి యితివృత్తమును గాన రాదు. శైవధర్మములను బ్రతిపాదించుచు, శైవుల కుపాదేయము లయిన కొందఱు శివభక్తులచరిత్రములఁ బ్రస్తావించుచు స్తోత్రములను గలిగి యుండ లేదు. లక్షణగ్రంథములలో నుదాహరింపఁబడిన పద్యములమూలమునఁ దెలియవచ్చుచున్న యథర్వణభారతము సంస్కృతమూలకము. వేములవాడ భీమకవి రచితము లగుచాటువులు, తిట్టుకవిత్వము ముక్తకరచనములు. అం దితివృత్తము గాని కావ్యత్వము గాని లేదు.

పాల్కుఱికి సోమనాథునికిఁ బూర్వ మాంధ్రవాఙ్మయము యొక్క పూర్వ రంగ మిట్టిదై యుండఁగా సోమనాథుఁడు అనుభవసారము, చతుర్వేదసారము మొదలగు కొన్ని గ్రంథములను శైవతత్త్వప్రతిపాదకములుగాను, శివపారమ్య సిద్ధాంతప్రతిష్ఠాపకములు గాను రచించుటయే కాక వృషాధిపశతకము, బసవోదాహరణము, పండితారాధ్యోదాహరణము మొదలగులఘుకృతులను స్తోత్రగ్రంథములుగా రచించి శైవమతావలంబకు లగు నాంధ్రజనులకు సిద్ధాంతగ్రంథములను, స్తోత్రగ్రంథములను సమకూర్చినవాఁ డయ్యెను. ఇట్లు శివతత్త్వసార మనెడి యొకగ్రంథములో మల్లికార్జునపండితారాధ్యుఁ డాశించి సాధించిన యుభయలక్ష్యములను వీనిమూలమున సిద్ధించినవి. అంతటితో నాతనికిఁ దృప్తి కలుగ లేదు. కావ్యముయొక్క కాంతాసమ్మితత్వముచేత సాధించుఫలము సిద్ధాంత ప్రచారముకంటెను, స్తోత్రరచనములకంటెను బలవత్తరమని గుర్తించిన సోమనాథుఁడు బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, మల్లమదేవీపురాణము అనుకావ్యములను కూడ రచించి యీమూఁడువిధము లయినప్రయోజనములను దాను సృష్టించిన శైవ గ్రంథసంచయముమూలమున సాధించెను. ఈమూఁడు కావ్యముల యందలి యితి వృత్తసంబంధ మగు దేశీయత యెట్టిదో పరిశీలింతము.

బసవపురాణము వీరశైవమతోద్ధారకుఁ డగుబసవేశ్వరుని జీవితము నభివర్ణించు గ్రంథరాజము. అతఁడు క్రీస్తుశకము **1120–1168** సంవత్సరముల నడిమికాలమునఁ గల్యాణకటకము రాజధానిగాఁ బశ్చిమచాళుక్యరాజ్యమును బరిపాలించిన కలచుర్యవంశజుఁ డగు బిజ్జలునికి మంత్రియు, దండనాథుఁడునై యుండినవాఁడు. అట్టి బసవేశ్వరుని జీవితచరిత్రము నిందుఁ గావ్యరూపమున సంతరించుట మాత్రమే కాక యాతఁడు ప్రసక్తానుప్రసక్తముగా –

'పూరితం బై యొప్పు పూసలలోన
దారంబుక్రియఁ బురాతనభక్తవితతి
చరితలలోపల సంధిల్ల బసవ
చరిత మే వర్ణింతు .........' – బస. 1-9 పుట.

నని యాతఁడే చెప్పుకొనినట్లు ఈకావ్యరాజమున బసవేశ్వరుని చరిత్రముతోఁబాటు పురాతననూతన భక్తులచరితములను బెక్కింటిని నభివర్ణించెను. శైవమతావలంబకులకు బసవేశ్వరుని చరిత్రముతోఁబాటు ప్రాచీనశివభక్తుల చరిత్రములు కూడ నుపాదేయము లగుటచే వానిని సముచితస్థానములందు మనోహరముగా నభివర్ణించు నీ బసవపురాణము శైవులకు నిత్యపారాయణగ్రంథమయినది.

మతగ్రంథములు సాధారణముగా మతధర్మములను సూత్రప్రాయముగాఁ దెలుపును. అట్లు దెలుపుటతో వానిలక్ష్యము చాలవఱకు నెఱవేరినట్లే. కాని బసవపురాణమున శైవమతమునకు సంబంధించిన మతధర్మములను, నాచారములను సూత్రరూపము నఁ గాక కథావ్యాజమున సవిస్తరముగాఁ దెలుపఁబడుటచే శైవులకనుష్ఠింపఁదగు మతాచారములను బరోక్షముగాఁ దెలియఁజేయు నీగ్రంథము వారికిఁ బరమోపాదేయ మయినది.

ఆంధ్రవాఙ్మయమునందు వెలసినయనేకకావ్యములవలె బసవపురాణ మేసంస్కృత గ్రంథమునకును ననువాదము కాదు. అది యొకస్వతంత్రగ్రంథము. స్వతంత్ర గ్రంథములు కళాపూర్ణోదయాదులవలె నుత్పాద్యగ్రంథములు కావచ్చును. ఇది యట్టులుత్పాద్యగ్రంథమును గాదు. కనుక నిందలి యితివృత్తము సంస్కృతమూలకము కాదు, కవి తనమేధస్సుచే నభ్యూహించి రచించిన కల్పితగ్రంథమును గాదు. అది కేవలము దేశీయము. దక్షిణదేశమునఁ దన కించుక పూర్వకాలమునందు వెలసినయొకానొక చారిత్రకపురుషుని జీవితచరిత్ర యందలి యితివృత్తము. ఆ జీవితచరిత్రము నయినను నంతకు ముం దెవ్వరును నంతరించి యుండ లేదు. అం దనుస్యూతముగా రచింపఁబడిన పురాతనభక్తుల చరిత్రములు భక్తజనులు భక్తితో ననుదినము తమ గోష్ఠీప్రసంగములలోఁ జెప్పుకొనునట్టివి. నూతనభక్తుల చరిత్రములు బసవేశ్వరుని సమకాలము నందును, తదనంతరకాలమునందును వీరశైవమత ప్రచారము కలదేశభాగముల యందు – తెలుఁగు, తమిళ, కన్నడ దేశములందు – భవ్యజీవితము గడిపిన భక్తజనులకు సంబంధించినది. ఇవి చెదరులు చెదరులుగా నానోట నానోట వినఁబడుచుండినకథలే కాని వీని నెల్ల నొక్కచో గుది గ్రుచ్చిన గ్రంథ మేదియు నతనికాలమునాఁటికి వెలసి యుండలేదు.

బసవేశ్వరుఁడు కర్ణాటదేశమున జనించి యచ్చటనే విశేషముగా వీరశైవమతోద్ధరణము గావించినవాఁ డయ్యును నాతనిచరిత్ర మింత విపులముగాఁ గర్ణాటభాషలో నయినను సోమనాథునికిఁ బూర్వము రచింపఁ బడలేదు. బసవేశ్వరుని యనంతరము ఆకాలమునఁ బంపాక్షేత్రమున నుండిన హరీశ్వరుఁ డనుకన్నడకవి తాను రచించిన 'శివగణద రగళె' యనుగ్రంధమున బసవచరితము నతిస్వల్పముగా మాత్రమే కూర్చి యున్నాఁడు. సోమరా జను కన్నడ వీరశైవకవి 'శృంగారసార' మను నామాంతరము కల యుద్భటకావ్యమును రచించి యందు బసవపురాణకర్త యగుసోమనను '**వృషభస్తవామరమహీజారామనుసోమనుఁ**' డని ప్రస్తుతించి యున్నాఁడు. సోమన బసవపురాణము ప్రప్రధమముగాఁ గ్రీస్తుశకము **1369** సంవత్సరములో భీమకవి యనుకన్నడ కవీశ్వరునిచేఁ గన్నడములోని కనువదింపఁ బడినది. ఇట్లు, బసవేశ్వరుఁడు కర్ణాటకుఁ డయినను నాతని చరిత్రమును దొలుదొల్తఁ గావ్యరూపమున వెలయించినకీర్తి యాంధ్ర కవీశ్వరుఁడగు సోమనాథునికే దక్కుచున్నది. ఇట్లు, కన్నడభాషాగ్రథితగ్రంథములను సోమనాథుని బసవపురాణమునకు మాతృకతో, మాతృకా కల్పములో కా వనుట తేలినది. కాని, బసవపురాణముయొక్క యుపతారికలో సోమనాథుఁడు –

*'ఆతత సకల పురాతనభక్త*
*గీతార్థసమితియే మాతృక గాఁగఁ*
*బూరితంబై యొప్పు ప్రాసలలోన*
*దారంబుక్రియఁ బురాతన భక్తవితతి*
*చరితలలోపల నంధిల్ల బసవ*
*చరిత మే వర్ణింతు ....*

*– బస. 1–9 పుట.*

నని చెప్పుసందర్భమునఁ దన బసవపురాణమునకుఁ బురాతనభక్తగీతార్థ సమితి మాతృక యయినట్లు పేర్కొనెను. ఆ పురాతనభక్తగీతముల విషయము కొంత యెఱుఁగుదము.

వీరశైవమతోద్ధరణమున్నకై కర్ణాటదేశమున నవతరించిన శ్రీ బసవేశ్వరుఁడు పశ్చిమ చాళుక్యరాజధాని యగు కల్యాణకటకమున బిజ్జలుని యాస్థానములోఁ బ్రధానమంత్రిగను, దండనాథుఁడుగను నుండినపుడు నిర్మించిన యనుభవ మంటపమునకు భారతదేశము నలుమూలలనుండియు శివశరణు లనేకు లాగమించి తమ తమ యాధ్యాత్మికానుభవాలులను గేయరూపము

లగువచనములలో నావిష్కరించిరి. అట్లు వెలసిన యీ శరణ వాఙ్మయము భక్తి, జ్ఞాన, వైరాగ్య, నీతి, వేదాంతబోధకమై గణుతిఁ గాంచినది. అందుఁ జేరిన శివ శరణులు వారివారి యిష్టదైవముల పేరఁ బెక్కుగేయకృతులను వెలయించిరి. వానికి **'వచనము'** అని పేరు. వానిలో శ్రీ బసవేశ్వరుఁడు నిజగురుఁ డగుకూడలి సంగమేశ్వరుని పేరను, ననుభవమంటపాధ్యక్షుఁ డగు నల్లమప్రభుదేవర 'గుహేశ్వరా' యనుమకుటము తోను, వీరవిరాగిణి యని వినుతి కెక్కిన యక్కమహాదేవి శ్రీశైలమందలి చెన్నమల్లికార్జును నాత్మనాయకునిగా వరించి 'చెన్నమల్లికార్జునా' యనుమకుటముతోను రచించిన వచనములు పరమ పూజ్యములై యలరారుచున్నవి. వానిలో శ్రీ బసవేశ్వరుఁడు రచించిన గీతములే తనకాలమునాఁటికి నాల్గులక్షల యిరువదినాలుగు వేలదాఁక నుండె నని సోమనాధుఁడు తన బసవపురాణమునందలి మడివాలు మాచయ్యగారి కథలో నిట్లు పేర్కొని యున్నాఁడు.

*'లాలితంబుగ నాల్గు లక్షలమీఁద*
*నోలి నిర్వదినాల్గువేల గీతములఁ*
*గావించు టది యెగ్గ గని యేవగించు*
*భావన నా కయ్యె నీవు గైకొనమి.'*

*– బస. **4–253** పుట.*

ఇట్లు, సోమనాథునికాలమున కసంఖ్యాకములుగా నుండిన బసవగీతములు కాలవశమునఁ బెక్కు నశించి నేఁటికి దాదాపు వేయి మాత్రమే లభించుచున్నవి. ఇట్లు లభించిన వేయింటిలో మే లేర్చి నూటయెనిమిది గీతముల నిటీవల బెంగుళూరులోని బసవ సమితివా రాంగ్లాంధ్రానువాదములతో వెలయించిరి.[౧] ఆ నూటయెనిమిది గీతములఁ బరిశీలించినను నందుఁ గొందఱు పురాతన భక్తుల విషయములు పేర్కొనఁబడిన గేయములు సోమనాథుని కాయాభక్తులకు

---

౧. 'Thus Spake Basava' English Renderings of Basava's Vechanas by A Sunderraj Theodore and Devendra Kumar Hakari. Published by Basava Samiti, Bangalore 9 - 1965

*బసవవచనామృతము – అనువాదకులు : శ్రీ బాడాల రామయ్య, బసవసమితి, బెంగుళూరు – 9*

*బసవవచనామృత – సంపాదక : డా. ఎల్. బసవరాజు : ప్రచురణ : బసవసమితి, బెంగుళూరు – 9*

'Vacanas of Basavanna' — A selection Translated by Armando Menezes, M.A., and S M Angadi, B A , B.T, Published by Annana Balaga, Sirigere, Mysore State.

సంబంధించిన కథలవిషయమై యొకకొంత పరిజ్ఞానమును గలిగించి యుండు నని యుహింప వచ్చును. ఈ క్రింది కన్నడ బసవవచనములను, దదనువాదములను బరిశీలింపుఁడు. [౨]

'నీ నొలిదరె కొరడు కొనరువుదయ్యా
నీ నొలిదరె బరడు హాయనహుదయ్యా
నీ నొలిదరె విష మమృత వహుదయ్యా
నీ నొలిదరె సకల - పడి-పదార్థ ఇదిర్దల్లిప్పువు కూడలసంగమదేవా.'

– బసవవచనామృత – 7వ వచనము

'నీ వొలయఁగ కొఱడు కొన లిడు నయ్యా
నీవు కోర గొడ్డు పా లిడు నయ్యా
నీవు దలప విసమె అమృత మగు నయ్యా
నీవు దలప సకలపదార్థము రెదుట నిల్చును కూడలసంగమదేవా.'

– బసవవచనామృతము – 6వ వచనము.

'నంబరు సెచ్చరు బరిదె కరెవరు'
నంబలరియరీ లోకద మనుజరు
నంబ కరెద దో యెన్ననె శివను
నంబదె సెచ్చదె బరిదె కరెవర
కొంబ మెట్టి కోగెంద - కూడలసంగమదేవా.

– బసవవచనామృత – 8వ వచనము.

'నమ్మరు మెచ్చ రూరక పిలుతురు
నమ్మ టెఱుఁగ రీ లోకపు మనుజులు
నమ్మి పిలిచిన 'ఓ' యనఁడే శివుఁడు
నమ్మక నచ్చక పిలుచువారల
గొమ్మెత్తి కూయుఁ డనె కూడలి సంగమదేవుఁడు.'

– బసవవచనామృతము 7వ వచనము.

---

౨. అనువాదకర్త: శ్రీ బాడాల రామయ్య, యం. ఏ, : బసవవచనామృతము – ప్రచురణ: బసవసమితి, బెంగుళూరు – 9.

'హోల నేమ హోల కెనయ నేమ
కెన తప్పిద బళిక కిచ్చుతియ నేమ
బెణ్ణెయ నేమ బెల్లద నేమ
అంబలియ నేమ దచరనారనూ కాణె
కూడలిసంగన శరణదల్లి
అబలియ నేమదాత మాదార చెన్నయ్య.'

— బసవవచనామృతః 52వ వచనము.

'పాలు వ్రతము మీగడ వ్రతమ్ము
మీగడ లే దనగ పొంగలి వ్రతము
వెన్న వ్రతంబు బెల్లము వ్రతము
అంబలివ్రత మగువారి నెవరినీ చూడ
కూడలి సంగని శరణులందు
నంబలి వ్రత మగువాడు మేదర చెన్నయ్య.'

— బసవచనామృతముః 50వ వచనము.

'కోపి మజ్జనక్కెరెదరె రక్తదధారె
పాపి హోమనేరిసిదరె మసెదదాయుధరగాయ
కూపవరనారనూ కాణెను మాదార చెన్నయ నల్లదె
కూపవరనారనూ కాణెను దోహద కక్కయ్య నల్లదె
(వ్యాపత్తి) యుల్లవ నమ్మ మడివాళ మాచయ్య
నిన్న పత్తి గతివరయ్య కూడలి సంగయ్య.'

— బసవవచనామృత ః 66వ వచనము.

'.................................
కూర్మికలవారి నెవరినీ కాన మేదరచెన్నయ్యను తప్ప
వేర్మి కలవారి నెవరినీ కాన దోహర కక్కయ్యను దప్ప
వ్యాప్తి యున్న మాచాకలి మాచయ్య మీయాపదలకోదవు
నయ్యా కూడలిసంగమదేవా.'

— బసవవచనామృతము ః 65వ వచనము.

‘కల్లనాగర కండరె హాలనెరె యంబరు
దిటదనాగర కండరె (కో రెంబరయ్యా) కొల్లెంబరయ్యా
ఉంబజంగమ బందరె నడె ఎంబరు
ఉమ్మద ఎంగక్కె బోనవ హిడి ఎంబరయ్య
నమ్మ కూడలసంగన శరణర కండు
ఉదాసీనవ మాడిదరె
కల్ల తాగిద మిట్టె యం తప్పరయ్య.’

– బసవవచనామృత : 79వ వచనము.

‘ఱాతినాగులఁ జూచిన బాల నిడు మందురు
జాతినాగులఁ జూడఁ జంపుఁ డందు రయ్యా
తినెడి జంగము రాగ నడువు డందురు
తినని లింగమునకు భోజన మిడు మందు రయ్యా.’
...........................

– బసవవచనామృతము : 78వ వచనము.

‘గోత్రనామవ బెసగొండరె
మాత నూంకదె సుమ్మ నిద్దిరిదేకయ్య
తలియ కుత్తి నెలన బరవు తిద్దిరి దేసయ్య
గోత్ర మాదార చెన్నయ్య
దోహర కక్కయ్య నెంబు దేను కూడలసంగయ్య.’

– బసవవచనామృత : 85వ వచనము.

‘గోత్రనామము ప్రశ్నించగ
మాట మార్చుచు నూరకుంటి రిదేమయ్యా
తలను వంచి నేల రాయుచుంటిరి, ఏమయ్యా
గోత్రము మేదర చెన్నయ్యది
దోహరకక్కయ్య దందు కీ దేమి
కూడల సంగమదేవా.’

– బసవవచనామృతము : 85వ వచనము

'సెట్టి ఎంబనే సిరియాళన
మడివాళ నెంబనే మాచయ్యన
దోహర నెంబనే కక్కయ్యన
మాదార నెంబనే చెన్నయ్యన
(నాను) హారువ నెందరె కూడలసంగయ్యా నగువ నయ్యా.'

– బసవవచనామృత : 88వ వచనము.

'సెట్టి యన వచ్చునే సిరియాళుని
చాకలి యను బోలునే మాచయ్యను
చండాలు డన దగునే కక్కయ్యను
మేదరి యన నౌనే చెన్నయ్యను
నన్ను బ్రాహ్మణుఁ డనఁగా కూడలిసంగయ్యా నవ్వునయ్యా.'

– బసవవచనామృతము : 88వ వచనము

'భక్తి యిల్లద బడవ నానయ్యా
కక్కయ్యన మనయిలు బేడిదె
చెన్నయ్యన మనయిలు బేడిదె
దాసయ్యన మనయిలు బేడిదె
ఎల్లా పురాతనరు నెరెదు భక్తి భిక్షవన్నిక్కిదరె
ఎన్న పాత్రె తుంబిత్తు కూడలసంగమదేవ.'

– బసవవచనామృత : 106వ వచనము.

'భక్తి లేని నిఱుపేద నయ్యా
కక్కయ్య గృహంబున వేడితి
చెన్నయ్య కడపల యాచించితి
దాసయ్యయింటఁ జే సాచితి
పురాతను లెల్లా చేరి భక్తిభిక్ష వెట్టంగ
నాపాత్ర నిండు నయ్యా, కూడల సంగమదేవా.'

– బసవవచనామృతము : 106వ వచనము

బసవేశ్వరుని వచనములలో నివియు, నిట్టివి మఱికొన్నియు సోమనాథునికిఁ బురాతనభక్తుల చరితములకు సంబంధించిన విశేషములను దెలిపి యుండు ననుట యసంభావ్యము కాదు. బసవేశ్వరుని వచనములే కాక యల్లమప్రభుదేవర వచనములును నాతనికుద్బోధకములు కాఁ దగును. ఇట్టి పురాతన గీతార్థసమితియే తన బసవపురాణ కథకు మాతృక యని సోమనాథుఁడు పేర్కొన్నది. అందును బురాతనగీతము లనక 'గీతార్థము' లనుటచే నతఁ డందలి విషయమును మాత్రమే పరిగ్రహించె నని విశదమగును.

ఇట్టి బసవగీతాదులు పురాతనభక్తచరితములను బ్రస్తావవశమునఁ దడవుచు సూక్ష్మముగా వారినిగూర్చి తెలియఁజేయుచుండఁగా వాని నెల్లఁ గథారూపమున రచింప నెంచిన సోమనాథునికి మఱికొన్ని కథావివరములు గావలసి వచ్చెను. అట్టి వివరముల నాతఁడు తనకాలమునాఁటి భక్తవరుల నడిగి తెలిసికొనెను. ఈ విషయము నాతఁడు బసవపురాణమున నిట్లు పేర్కొనెను.

*'ప్రస్తుతి కెక్కిన బసవని చరితఁ*
*జెప్పితి భక్తులచే విన్నమాడ్కిఁ*
*దప్పు కుండఁగ యథాశక్తిఁ జేసి.'*

*— బస. 7–584 పుట.*

సోమనాథుఁ డనుభవసారమును రచించునాఁటికి నాతనికి బసవేశ్వరుని గూర్చి యేమియుఁ దెలియదు.[3] అనుభవసారమందు మల్లికార్జున పండితారాధ్యుని మూఁడు పద్యములలోఁ బ్రస్తుతించి యుండెనే కాని –

*'బసవని పుత్త్రుండ బసవగోత్రుండ*
*బసవేశు శ్రీపాదపద్మశేఖరుఁడ*

*3. కర్ణాటదేశమున వీరశైవమతోద్ధరణ మొనర్చిన బసవేశ్వరునిగూర్చి యంతగాఁ దెలిసికొని, యుత్కృష్టవేదాంతగర్భితము లగునాతని కర్ణాటగీతములతోడి పరిచయము గలిగి యాతనియందు భక్తి పారవశ్యము గుదురుట సోమనాథుని కప్పటికి జరగి యుండదు. అందుచేతనే యాంధ్రదేశీయుఁ డగు మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వసారాదికృతులఁ బ్రశంసించుచు నాతనిని మూఁడు సీసపద్యములలో నుతించియు సోమనాథుఁ డీ గ్రంథావతారికలో బసవేశ్వరుని నామోచ్చారణ మయినను గావింప లేదు.*

*బసవపురాణము : శివశ్రీ బండారు తమ్మయ్యగారి పీఠిక.*
*పుటలు. 20, 21 : వావిళ్లవారిచేఁ బ్రకటితము : 1952*

బసవనిఁ బొగడఁ బాల్పడుకవీంద్రులదు
బసవన్నఁ బొగడఁ బాల్పడు పాతకుండ
బసవన్నదూత నే బసవన్న బంట
బసవన్న యిలువుట్టు బానిసకొడుక
బసవన్న లెంక నే బసవన్నలింగి
బసవన్న పన్నలపన్న గావునను.'

– పం.చ. *1–14* పుట.

అని పండితారాధ్యచరిత్రమునందలి యవతారికలో సుదాత్త మగు భక్తిభావముతో, భృత్యాచారముతోఁ దనబసవతన్మయత్వమును బ్రకటించిన సోమనాథుఁ డందు (అనుభవసారము) బసవేశ్వరునిగూర్చి యించుకంతైనఁ బ్రస్తావింప లేదు. దాని తరువాతనే యాతఁడు భక్తుల మూలమున బసవేశ్వరుని చరితమును, నాతని మహిమాదికమును నెఱుఁగఁ గల్గెను. బసవేశ్వరునిపై నెన లేని భక్తి గౌరవములాతనికిఁ గుదురుకొనెను. తద్భక్తిప్రేరితుఁ డై యాతఁడు తొలుదొలుత బసవరగడ, బసవాధ్య రగడ, గంగోత్పత్తిరగడ మొదలగు లఘు కృతులను రచించి సంస్కృతభాషాగ్రథితములును, సంస్కృతపదభూయిష్ఠములు నగు నట్టిదేశీయగేయకృతులు జనవశీకరణమునకును, మతప్రచారమునకును సహాయకములు గానేర వని తలఁచి యాతఁడు జానుతెనుఁగుపై వలపు పచరించి యాతెనుఁగు నుడికారపుమెఱుఁగులు తుఱంగలించునట్లుగా బసవపురాణము నాంధ్రుల జాతీయచ్ఛందమగుద్విపదలో సప్తాశ్వాసపరిమిత మగుకావ్యముగా సంతరించెను.

ఇట్లు తనకుఁ బూర్వకాలమందు బసవాదు లగు పురాతనభక్తులు పాడుకొనుచుండినగీతములను, దనకాలమునందలి భక్తజనములు బసవేశ్వరుని గూర్చియు, నాతని మహిమాదికములను గూర్చియుఁ జెప్పిన కథలను, విశేషములను నాధారముగాఁ జేసికొని సోమనాథుఁడు బసవపురాణమును బసవేశ్వరుని జీవితచరిత్రాభివర్ణనప్రధానముగాఁ, బురాతననూతన భక్తులచరితము లనుస్యూతము లగునట్లుగా రచింప సంకల్పించెను. కాని యాతనికి నుద్దిష్టసకలవిషయసంపన్నముగా నాయాకథల నెల్ల నేకసూత్రమున గుదిగ్రుచ్చు విధానము గోచరింప దయ్యెను. అట్టి కథాసూత్రము – అనఁగా రచనాప్రణాళిక నొకదానిఁ దనకుఁ దెలుపవలసినదిగా నతఁడు భక్తగోష్ఠిలోఁ దనమిత్రుల నభ్యర్థించెను. అభక్తగోష్ఠిలో నుండిన యాతని మిత్రులు కరస్థలి సోమనాథయ్యగారు, మల్లినాథుఁడు, రెంటాల మల్లినాథుఁడు, దోచమాంబ,

గోడగి త్రిపురారి యనువారు. వారతనికిఁ గథాసూత్రము ననుగ్రహించిరి. వారు తెలిపిన 'కథాసూత్రము ననుసరించి' పూరితం బై యొప్పు పూసలలోన దారంబుక్రియఁ బురాతనభక్తవితతి చరితలలోపల సంధిల్ల బసవచరితము నాతఁడు వర్ణించెను. ఇతఁడు బసవపురాణకథా సూత్రమును మిత్రవరులవలన నెఱిఁగిన విషయము బసవపురాణావతారికలో నిట్లు కలదు.

*'జంగమరత్నంబు శరణసమ్మతుఁడు*
*లింగైక్యవర్తి గతాంగవికారి*
*పండితారాధ్యకృపాసముద్ధతుఁడు*
*మండితసద్భక్తిమార్గప్రచారి*
*విలసిత పరమసంవిత్సుఖాంభోధి*
*నలిఁ గర్స్థలి సోమనాథయ్యగారు,*
*బసవని కారుణ్య రససుధావార్ధి*
*ననదృశలీల నోలాడుచు నిత్య*
*నియమవ్రతాచార నిరుపమనిష్ఠ*
*క్రియగొనఁ దత్త్వనిర్ణయము నంధిల్లి*
*నతులగోష్ఠీసుఖస్థితిఁ బేర్చుభక్తి*
*మతి నియమంబుల మల్లినాథుఁడును,*
*నాటి వేదాంతసిద్ధాంతపురాణ*
*వేదశాస్త్రాగమవిహితమార్గములఁ*
*దనుమనోధననివేదన సమగ్రతయుఁ*
*బనుగొన జంగమార్చనలు సేయుచును*
*నోలిమై గ్రామసీమాలంఘనవ్ర*
*తాలంకృతిని బేర్చి యాచారలీల*
*యనలారఁగాఁ గుమారాద్రికిఁ దూర్పు*
*దెసను సోపానముల్ దీర్చి పాల్పార*
*మహితసద్భక్తి నమంచితవృత్తి*
*మహిఁ జనురెంటాల మల్లినాథుఁడును*
*నిరతిశయప్రీతి నిత్యంబు నైదు'*
*గరవీరపుష్పముల్ హరున కర్పింప*
*నొక్కనాఁ డొకపువు దక్కువ యైన*
*గ్రక్కునఁ దననేత్రకమల మర్పించి*

భవునిచే ననద్భుశు బవుకన్ను వడసి
ధ్రువకీర్తిఁ బేర్కొన్న దోచమాంబయును,
ధీరుండు మున్నయదేవయోగీశు
కూరిమి శిష్యుండు నారయాంకునకుఁ
బుత్త్రుండుఁ బరమపవిత్రుండు విమల
గాత్రాంచితుఁడు నీలకంఠాగ్రజుండు
జగదభినుతుఁడు ప్రసాదావధాని
నిగమార్థవేత్త గోడగి త్రిపురారి,
లోనుగా సకలభక్తానీక మెలమి
మానిత భక్తిసామ్రాజ్యసంపదలు
సిలివితి వోవంగఁ జిరతరమహిమ
నలరారుచుండంగ నం దొక్కనాఁడు
మండితా సంఖ్యాతమాహేశ్వరులకు
దండప్రణామంబు దగ నాచరించి
భక్తిదయారసపరమామృతాభి
షిక్తుండ నగుచు గోష్ఠిప్రసంగతిని
'ననద్భుశం బై యొప్పు బసవపురాణ
మెనకంబులోఁ జెప్పు నిష్ఠ మయ్యేడును
వరకథాసూత్రంబు వెర వెలింగించి
చరితార్థుఁ జేయరే కరుణతో' ననుచు
నన్నుతి సేయుచు నన్మహత్త్వమున
విన్నవించుడు భక్తవితతి హర్షించి
నముదితప్రీతిఁ బ్రసాదావలోక
నము నివ్వటిల్లంగ నన్ను వీక్షించి
'బసవపురాణంబుఁ బనరించు శక్తి
ననలార నొసఁగితి మట్లు గావునను
రచియింపు బసవపురాణంబు నీవు
నచలిత భక్తిహితార్థంబు గాఁగ
నావుడు భక్తజనావలి యాజ్ఞఁ
దల మోచి ....'

– బస. *1* పుటలు *3* నుండి *6* వఱకు.

సోమనాథుఁడు బసవపురాణమును రచింప నమకట్టెను.

## కథాసూత్రము

కథాసూత్ర మనఁగాఁ గావ్యేతివృత్తమునకు సంబంధించినప్రణాళిక. నన్నయభట్టారకుఁడు సంస్కృతభారతము నాంధ్రీకరింపఁ దలఁచినవాఁ డగుటచే నతనికిఁ గావ్యప్రణాళికయొక్క యావశ్యకము లేక పోయినది. మూలమునందలి ప్రణాళిక ననుసరించి యనువాదరచనము సాఁగించుట మాత్రమే యాతఁడు చేయువలసినపని. నన్నెచోడుఁడు శివపురాణము, కాళిదాసకృత వంగు కుమారసంభవము నను గ్రంథములను మూలములుగా గ్రహించినను నతఁడు స్వతంత్రముగానే కావ్యనిర్మాణము చేయఁ గడగినవాఁ డగుటచే నతఁడు తన కావ్యమున కొక ప్రణాళికను గల్పించుకొన వలసినవాఁ డయ్యెను. కన్నడభాషలో నిట్టికావ్యప్రణాళికను గావ్యాంతమునఁ జేర్చు పరిపాటి కలదు.[౪] వారిచేఁ బ్రభావితుఁ డయిన నన్నెచోడుఁడు కూడఁ దన కుమార సంభవమునందలి కృత్యతరణికలోఁ గథాసూత్రము నొకదానిని బరికల్పించుకొనెను. చూడుఁడు:

వ: పరమభక్తియుక్తి నావర్జితహృదయుండ నై సకలభువనభవనావతారకార ణుం డయిన పరమేశ్వరు నవతారం బగుటయుం దదంశావతారంబుగా వ్యావర్ణించి నా చెప్పంబూనిన దివ్యకథాసూత్రం బెట్టి దనిన –

---

౪. చూ. పంప భారతము.

*'అదెంతెనె ఆదివంశావతారసంభవం, రంగప్రవేశం, జతుగృహదాహం, హిడింబవధె, ద్రౌపదీస్వయంవరం, వైవాహం, యుధిష్ఠిరపట్టబంధనం, ఇంద్రప్రస్థప్రవేశం, అర్జునదిగ్విజయం, ద్వారవతీప్రవేశం, సుభద్రా హరణం, సుభద్రావివాహం, ఖాండవవనదహనం, మయదర్శనం, నారదాగమనం, జరాసంధవధె, రాజసూయం, శిశుపాలవధె, ద్యూత వ్యతికరం, వనప్రవేశం, కిమ్మీరవధె, కామ్యకవనదర్శనం, ద్వైతవన ప్రవేశం, సైంధవబంధనం, చిత్రాంగదయుద్ధం, కిరాతదూతాగమనం, ద్రౌపదీవాక్యం, పారాశరవీక్షణం, ఇంద్రకీలాభిగమనం, ఈశ్వరార్జున యుద్ధం, దివ్యాస్త్రలాభం, ఇంద్రలోకాలోకనం, నివాతకవచాసురవధె, కాలకేయపౌలోమవధె, సౌగంధిక కమలాహరణం, జటాసురవధె, ......, ద్రోణచాపమోక్షం, ద్రోణవధె, అశ్వత్థామక్షర్ణ వివాదం, కర్ణాభిషేకం, సంశప్తకవధె, కర్ణసూర్యలోకప్రాప్తి, శల్యాభిషేకం, శల్యనిపాతనం, భీమదుర్యోధనగదా యుద్ధం, దుర్యోధనవధె, స్త్రీపర్వం, అర్జునాభిషేకం, పెఱ ఉపాఖ్యాన కథెగళొళమొందుం కుండలీయదె ప్పేళెం.'*

చతుర్థాశ్వాసము. *536* వచనము

మహాస్రగ్ధర :

సతిజన్మంబున్ గణాధీశ్వరు జననము దక్షక్రతుధ్వంసము బా
ర్వతి జన్మంబున్ భవోగ్రవ్రతచరితయు దేవద్విషత్క్షోభమున్ శ్రీ
సుతసంహారమ్ము భూభృత్సుతతపము నుమాసుందరోద్వాహమున్ ద
ద్రతిభోగంబుల గుమారోదయము నతఁడనిం దారకుల బోరఁగెల్వున్.

వచనము : అనం బరఁగు సకలావయవంబులు బరిపూర్ణార్థం బైనదివ్య
కావ్యాం గనాసృష్టికిం బ్రధానసృష్టికర్త యైన.

– కుమా. *1-67, 68/69* ప.

నన్నెచోడుఁ డిట్లు తనకావ్యకథాసూత్రమును స్వయముగా, స్వతంత్రముగాఁ బరికల్పించుకొని కావ్యనిర్మాణము చేయఁగాఁ బాల్కురికి సోమనాథుఁడు బసవపురాణ మనుస్వతంత్రకావ్యమును రచింప సంకల్పించి శ్రీశైలమునందు భక్తజనగోష్ఠిలోఁ దనకుఁ గథాసూత్రమును దెలిపి తన్నుఁ జరితార్థుఁ జేయ వలసిన దని భక్తవరేణ్యు లగు తనమిత్రుల నర్థించెను. వారును నతనికిఁ గథాసూత్రము దెలిపి యాతనికి బసవపురాణముఁ బసరించుశక్తి ననుగ్రహించిరి. వారియాజ్ఞఁ దల మోచి యాతఁడు బసవపురాణ రచనముఁ దొడంగెను. భక్తజను లాతని కెఱింగించిన కథాసూత్ర మెట్టిదో, బసవపురాణ మునందు సోమనాథుఁడు వారు దెలిపిన కథాసూత్రము నెంతవఱకుఁ బాటించెనో యించుక పరిశీలింతము.

బసవపురాణము బసవేశ్వరుని జీవితచరిత్రమును, బురాతన, నూతన భక్తుల చరితములను గలగాపులగముగా గుదిగ్రుచ్చి రచించిన యందదు కులకావ్యము గాదు. సోమనాథుఁడే పేర్కొనినట్లు 'పూసలలోన దారంబుక్రియఁ బురాతన భక్తవితతి చరితల లోపల సంధిల్ల బసవచరిత' మం దభివర్ణింపఁ బడినది. పురాతనభక్తవితతిచరిత లనెడిపూస లలో ననుస్యూతముగా నుండునట్లు బసవ చరిత మనుదారము కూర్పఁ బడినది. బసవ చరితమును దీర్చి దిద్దుటలో నేయే భక్తుల చరిత్రము లెక్కడెక్కడఁ గూర్ప వలెనో, యెట్లుగా వానిని వర్గీకరించుకొని కూర్చినఁ గావ్యము శోభావహముగ నుండునో యనువిషయములలోనే యాతఁడు తనమిత్రులగు భక్తజనుల సహకారము నర్థించెను. వారును నాతని కాయాయివిషయములయందుఁ జక్కని సూచనలనే యొసఁగి కావ్య నిర్మాణమునకుఁ దోడ్పడి రనువిషయము బసవపురాణకావ్యమును

దిలకించినప్పుడు మనకుఁ దప్పక స్ఫురింపఁ గలదు. ఇట్లీకావ్య మశిథిలబంధము కల దగుటకు వారితోడు పాటెంతేనియుఁ గలదు.

ప్రథమాశ్వాసమున శివునియానతిపై నందికేశ్వరుఁడు మర్త్యలోకమున బసవేశ్వరుఁడుగా జనించుటయు, బసవేశ్వరుఁడు తనకు వడుగు వల దని తండ్రితో వాదించి యిల్లు వదలి పోవుటయు, నతని మేనమామ యగు బలదేవదండనాయకుఁడు తన కుమార్తె యగు నాగాంబిక నిచ్చి యాతనికి వివాహము చేయుటయు, బసవేశ్వరుఁడు కప్పడి సంగమేశ్వరమున కేఁగుటయు, సంగయదేవుఁ డాతనికిఁ బ్రత్యక్ష మగుటయు నను బసవకథావిషయములు ప్రపంచింపఁబడినవి. ఇందు శిలాదుఁడు, నందికేశ్వరుఁడు ననుపురాతన భక్తుల కథ లభివర్ణింపఁ బడినవి.

ద్వితీయాశ్వాసమున బసవేశ్వరుఁడు కల్యాణకటకమున బిజ్జలునికడ దండనాయకపదవి నందుటయు, నతఁ డల్లమప్రభునికి విందు పెట్టఁగా నతఁడు బసవనికి వరము లిచ్చుటయుఁ దరువాత నతఁడు కొన్ని మహిమలు ప్రదర్శించుటయు నభివర్ణింపఁ బడినది. పిదప సంగమేశ్వరుఁడు బసవని మూఁడవక న్నడుగుకథ, బసవఁడు గొల్లెత చల్ల కడవఁ బడకుండఁ బట్టినకథ, శివుఁడు పార్వతికి బసవని మహిమ తెలిపినకథ యను బసవ కథావృత్తాంతములు వివరింపఁబడినవి. దీనితో – అల్లమప్రభునికి విందు పెట్టినసందర్భమును బురస్కరించుకొని పార్వతి ప్రమథులకు విందు పెట్టిన కథ – వంగకాయలు లింగము లైన కథను వివరించు సందర్భమున బల్లేశు మల్లయ్య కథ, కాటకోటయ్యకథ – జొన్నలు ముత్తెము లైనకథను దెలుపు సందర్భమున మొఱటదనంకయ్య కథ – బసవఁడు గొల్లెత చల్లకడవఁ బడకుండఁ బట్టినకథను బురస్కరించుకొని తిరుచిట్టంబలునికథ – శివుఁడు తన హృదయమున బసవనిఁ జూపినసందర్భమున వివరించుటలో సిద్ధరామయ్య యను నూతనభక్తుని వృత్తాంతము – అను మొదలగువిషయములు సందర్భోచితముగా గుది గ్రుచ్చఁబడినవి.

తృతీయాశ్వాసమున బసవేశ్వరుఁ డొకమిండజంగమునకు రాజధనము నొసఁగఁగా మంత్రు లావిషయము రాజున కెఱింగించిరి. బిజ్జలుఁడు నిక్కచ్చి సేయఁగా బసవేశ్వరుఁడు లెక్కకగ్గలముగా నందుఁ బ్రభుత్వధన ముండుటను జూపెను. ఈసందర్భమున నక్కలు గుఱ్ఱము లైనకథను బ్రసక్తానుప్రసక్తముగాఁ

జొప్పించెను. పిదప బసవకథావిషయములనే వివరించుచు ముగ్ధసంగయ్యకథను బురస్కరించుకొని యతనిఁ బోలిన రుద్రపశుపతి, నక్కినైనారు, బెజ్జమహాదేవి, గొడగూచి, దీపదకళియారు, నాట్య నమిత్తండి, ఉడుమూరు కన్నప్ప యను ముగ్ధభక్తులకథలను వివరించెను. వీ రందఱును బురాతనభక్తులు. పిదప నభివర్ణింపఁబడిన సకలేశ్వరమాదిరాజయ్యగారికథ బసవకథా సంబంధియే. అతఁడు నూతనభక్తుఁడు.

చతుర్థాశ్వాసములోని మడివాలు మాచయ్య కథ బసవేశ్వరుని కాలమునందు జరిగినది. దానిఁ బురస్కరించుకొని బసవేశ్వరుఁడు బిజ్జలునకు శివభక్తుల మహిమను దెలుపుచు ఇరువదాండారి, బావూరి బ్రహ్మయ్య యను భక్తులకథలను వివరించెను. మాచయ్యకడ కేఁగిన బసవన్నకు మాచయ్యయే తెలిపినట్లుగా శంకరదాసికథ, జగదేక మల్లనికథ, నిమ్మవ్వకథ, అందు సిరియాలునికథ, హలాయుధునికథ మున్నగుపెక్కు కథలు, వాల్మీకేశుఁ డొడయనంబికిఁ జెప్పినట్లుగా బాణునికథ మొదలగు పెక్కు శివభక్త కథలు వర్ణింపఁ బడినవి.

పంచమాశ్వాసమునందు బసవనికి సమకాలికుఁ డయిన కిన్నరబ్రహ్మయ్య బసవనియొద్దకుఁ బోయినకథను దెలుపుచుఁబ్రసక్తానుప్రసక్తముగా కలకేత బ్రహ్మయ్య, మోళిగమారయ్య, కన్నడ బ్రహ్మయ్య, ముసిఁడిచౌడయ్య, సురియ చౌడయ్య, తెలుఁగు జొమ్మయ్య యనువారికథలు వివరింపఁ బడినవి.

షష్ఠాశ్వాసమున బసవనికి సమకాలికుఁ డగుఏకాంతరామయ్య జైనులను డీకొనినసందర్భమును వివరించుచుఁ బ్రసక్తానుప్రసక్తముగా జైనసమయులను బరిభవించిన ఇరుత్తాండి, పిళ్లనైనారు, నిడుమారఁడు, నమినంది, సాంఖ్యతొండఁడు, కోవూరి బ్రహ్మయ్య, తేడర దాసయ్య, హిరియ నాచయ్య, వైజకవ్వ, షోడ్డలదేవు బాచయ్య మొదలగుశివభక్తులకథలు వివరింపఁ బడినవి.

సప్తమాశ్వాసమునందు శివనాగుమయ్య యను శ్వపచభక్తుని బసవేశ్వరుఁడు గౌరవింపఁగా నతని నాక్షేపించిన బిజ్జలునికిఁ దెలిపినట్లుగా కల్లిదేవయ్య, బిబ్బబాచయ్య, మాదరదూడయ్య మొదలగు శ్వపచ భక్తులకథలు వివరింపఁబడినది. తరువాత బసవకథా సంబంధు లగు బోయల తగవు, బసవన్న విషమారగించుట, జగదేవదండనాయకుని కథ, అల్లయ్యమధువయ్యల కథ వివరింపఁ బడినవి. వీనిలో జగదేవదండనాయకుని కథను బురస్కరించుకొని ఏలేశ్వరు కేతయ్యగారికథయు, సవరద నాచయ్య కథయుఁ దెలుపఁబడినది.

ఇట్లు మహిమామాత్మకవము లగుకథలు, ముగ్ధభక్తుల కథలు, భక్తుల యాధిక్య స్థాపకము లగుకథలు, అధమకులుల కథలు, జైనసమయవిధ్వంసము చేసిన భక్తులకథలు, శ్వపచభక్తులకథలు నని పురాతనభక్తులకథల నెల్ల వర్గీకరించుకొని, బసవేశ్వరుని జీవితచరితాను వర్ణనమున నేయేఘట్టములం దేయే కథలను గూర్పఁ దగునో యాప్రణాళికను భక్త గోష్ఠిలో మిత్రులగు శివభక్తులతోఁ గూడఁ బలుకుకొని, వారి యాదేశముచొప్పున నొకకథా సూత్రమును బరికల్పించుకొని యాసూత్రముబడి సోమనాథుఁడు తన బసవపురాణ మను స్వతంత్రకావ్యమును దీర్చిదిద్దెను.

బసవపురాణమువలెనే యాతని పండితారాధ్యచరిత్రముకూడ నొక స్వతంత్ర గ్రంథము. అది, యేసంస్కృతగ్రంథమునకును ననువాదము కాదు. అందాంధ్ర దేశమున వీరశైవమత వ్యాప్తికై విశేషముగాఁ బాటుపడిన మల్లికార్జున పండితారాధ్యుని జీవిత చరిత్రము సాభిప్రాయనామధేయములు కల దీక్షా, పురాతన, వాద, మహిమ, పర్వతప్రకరణము లను పంచప్రకరణములలో నభివర్ణింపఁ బడినది. సోమనాథుఁడు పాండిత్య వము పండఁబాఱిన ప్రౌఢవయస్సున దీని రచించుటచే నిందలి రచనము బసవపురాణరచనము కంటెఁ బ్రౌఢతరముగా నుండును. ఇది కూడ శ్రీశైలమునందు మల్లికార్జునదేవుని మంటపమున శివభక్తితత్త్వగోష్ఠీప్రసంగము చేయుచుఁ బురాతన నూతనభక్తమహిమ నాలకించు చుండిన భక్తజనులు సోమనాథునిఁ జూచి యాతఁడు రచించిన పూర్వ గ్రంథములను బేర్కొని నూతనముగాఁ బండితారాధ్యుల చరిత్రమును గావ్యముగా సంతరింప వలసిన దని యాదేశింపఁగా వారియాదేశముచొప్పున రచింపఁబడినట్లు పండితారాధ్య చరిత్రము నందలి యవతారిక వలనఁ దెలియుచున్నది. కనుక బసవపురాణ, పండితారాధ్య చరిత్రముల రచనాసంకల్పము సోమనాథునికిఁ గలిగించిన సందర్భములు రెండును సమానములే. అక్కడను, నిక్కడను గూడ భక్తజనులయాదేశమే యాతని కుద్బోధక మయినది. కాని, పండితారాధ్య చరిత్రము రచించునాఁటి కాతఁడు స్వయముగానే కావ్యప్రణాళికను నిర్మించుకొనుపాటి ప్రజ్ఞాపాటవముల నలవరించుకొని యుండుటచేఁ దనకుఁ గథాసూత్రము దెలుప వలసిన దని యాతఁడు పండితారాధ్యచరిత్రరచనా సందర్భమున భక్తజనుల నర్థింప లేదు. కాని, వారే స్వతంత్రించి యాతనికిఁ జేసిన స్సూచన యొకటి కలదు. చూడుఁడు:

'...... వరుసన వీను
లారుగ గురుమల్లికార్జునపండి
తారాధ్యుల చరిత్ర మర్థి వర్ణింపు
పరిశిష్టపరిమితప్రాక్తనభక్త
చరితంబు లితిహాసనంగతి నొలయ
సంధింపు పండితచరితంబు నందు,
బంధురతన్మహాభక్తైక మహిమఁ
బసరింపు మసముహాక్ప్రాటవశక్తి
ననలార నొసఁగితి మని ప్రసాదింప.'

– పండి. 1–12 పుట.

ఆ భక్తజనులే యంతకుమునుపు బసవపురాణరచనమును గూర్చి పేర్కొనుచు –

'బసవపురాణప్రబంధంబునందుఁ
బ్రథితపురాతనభక్తగణాను
కథనంబు లితిహాసఘటనఁ గూర్చితివి.'

– పండి 1–11 పుట.

అని యందుఁ బురాతనభక్తులకథల నితిహాసములుగాఁ గూర్చిన విషయమును బ్రస్తావించిరి. అందుఁ (బసవపురాణము) దెలుపఁబడని మఱికొందఱు భక్తుల చరితములు కూడ నిందుఁ బండితారాధ్యుని కథావర్ణనవ్యాజమునఁ దెలుపఁబడినవి. ఇందలిప్రణాళిక యంతయు సోమనాథుఁడు స్వయముగాఁ గల్పించుకొనినది. పండితారాధ్య చరిత్ర మునఁ బురాతనభక్తుల చరితములు సందర్భోచితముగా నెట్లు కూర్పఁ బడెనో యించుక పరిశీలింతము.

మల్లికార్జునపండితుఁడు కోటిపల్లి యారాధ్యదేవుల వలన శివదీక్షఁ బడసి శైవాచారధౌరేయుఁ డయి వర్తిల్లుచుండఁగా బ్రాహ్మణులు కొందఱు వచ్చి బ్రాహ్మణ కులమున జనించినవారికిట్టి వీరశైవాచారసరణులు సరిపడునా యని యాతనితో వివదింతురు. అంత నతఁడు పెక్కు వేదాదిప్రమాణములతో వారివాదముల నెల్లఁ బరిహరించి యాసందర్భమున వారికి ఘంటాకర్ణుఁడు, భీతుఁడు, దుర్వాసుఁడు, సంకేశి మున్నగు శివభక్తుల చరితములు వినిపించును. ఈకథ లెల్ల దీక్షాప్రకరణమునఁ గలవు.

ఒకనాఁడు పండితుఁడు శివపూజకై పూవులు కోసికొని వచ్చుచుండును. అప్పుడు వెల్లగొండ మహాదేవయ్య యనుభక్తుఁడు వేఁగుజామున శివపూజకై పూవులు తేవలయునని పోయిచీఁకటిలోఁ బ్రమాదవశమున శివపూజోప కరణములకుఁ దన పాదములు తగులఁగా నాయపరాధమునకై తనపాదములను గడికండలుగా ఖండించుకొని నేలపైఁ బడి యుండును. మల్లికార్జునపండితుఁ డది చూచి యాభక్తికి వీరవ్రతమున కాశ్చర్యపడి శివాయతనమందలి దీపతైలమును దెచ్చి తుత్తునియలైపడిన యాతని పాదములను జక్కఁగా గూర్చి వాని కాతైలమును బూసినంతనే యాతనిపాదము లెప్పటియట్లు పాలిచెను. అప్పు డచ్చటి భక్తులు పండితునిమహిమము ననేకవిధములఁ బ్రశంసించి యట్టి మహిమలనే ప్రదర్శించిన కలియంబనయనారు, పిళ్లనయనారు, వాగీశనయనారు, దసరయ్య, గురుభక్తయ్య, శ్వేతుఁడు, మలహణుఁడు, కుమార పాలఘూర్జరుఁడు, ఓహిళుఁడు అను పురాతనభక్తుల చరితములను, సమకాలికు లగు బెలిదేవి వేమయ్య, చేటల వేమయ్య యనుభక్తుల మహత్త్వములను వారికి వినిపింతురు. ఈకథ లెల్లం బురాతనప్రకరణమునఁ గలవు.

ఉదయావనీశుఁడు తనసేవకులలో నొకఁడగు ధవళేశునామయ్య యను శివభక్తుఁడు పండితునిపూజనమున నియుక్తుఁడై యుండఁగా నాతనిఁ బిలిపించి యాతనికిఁ దన తమ్మనిడి దానిని దనయెదుటనే తిను ...ని యాతని నిర్బంధించును. అట్లాతఁడు తనతమ్మ తిన నొల్లఁ డయ్యె నేనిఁ దనకొలువున కర్పించినయాతనితనువును దనకు సమర్పింపు మని కోరును. అంత నామయ్య బసవేశ్వరాదుల మహిమలను గొన్నింటి నాతనికెఱిఁగించును. అతఁ డుదయావనీశునికరమున నున్నసురియను లాగుకొని దానిచేఁ దనకంఠమును ఖండించుకొని యారాజన్యుని శపించును. పండితారాధ్యుఁ డమరారామ క్షేత్రమున కరుదెంచి యమరేశ్వరుని సందర్శించి యాతనియనుగ్రహమున నూర్ధ్వనేత్రయుగ్మమును బడయును. ఆసందర్భమున ఇరిత్తాండి, సుందర నంబెన్న యనుభక్తులకథలు వివరింపఁ బడినది. ఇవి మహిమప్రకరణమునఁ గలవు.

వాదప్రకరణమునందు వేదవాద, కర్మవాదాదివాదములను ఖండించుటయు, శివాధిక్యమును స్థాపించుటయు నాతని ధ్యేయమగుటచే నందు భక్తులచరిత్రములు దెలుపునవకాశము లేక పోయినది. ఇఁకఁ గడపటి దగు పర్వతప్రకరణమున శ్రీశైలవర్ణనము తన్మాహాత్మ్యము, యాత్రార్థ మరుదెంచిన భక్తగణముల యొక్కయు, వివిధదేశముల పరుసలయొక్కయు వేషభాషల వర్ణనములు, వారి

పర్వతారోహణక్రమము, దోసయ్య శివరాత్రి జాగరణము ననువిషయములకే ప్రాధాన్య మగుటచేత నందుఁ గూడ భక్తుల చరితము లభివర్ణించు నవకాశము లేక పోయినది. అయినను నందు మృగవ్యాధుని కథ, కరవీరుని కథ యనురెండు కథలు మాత్రము కలవు.

ఇట్లు ప్రసక్తానుప్రసక్తముగాఁ బండితారాధ్యచరిత్రమునందును గొందఱు పురాతననూతనభక్తుల చరితములు చేర్పఁబడినవి. దీనిలో బసవపురాణమున నభివర్ణింపఁ బడినవి కూడఁ గొన్ని గలవు. అవి కళియంబకథ, పిళ్లనయనారుకథ, ఓహిళునికథ, సకలేశ్వరమాదిరాజయ్య కథ మొదలయినవి. మలహణుఁడు, కుమారపాలఘూర్జరుఁడు, చేటలవేమయ్య, కదిరె రేమయ్య యనుశివభక్తుల కథ లిందు (పండితారాధ్య చరిత్రము) నూతనముగాఁ జేర్పఁబడినవి.

ఇందలి పండితుని చరితమును, బ్రసక్తానుప్రసక్తముగా నిందభివర్ణింపఁ బడిన భక్తులచరితములును నే సంస్కృతమూలమునో యాధారముగాఁ గొని రచించినట్టివి కావు. ద్రవిడకర్ణాటకభాషల నుండి గ్రహించినవి కూడఁ గావు. భక్తుల మూలమునఁ దానప్పుడప్పుడు వినినట్టివి. పురాతనభక్తగీతములందుఁ బ్రస్తావింపఁబడినవి. అట్టివానికి స్వకీయ మగుకథామాత్రమున రూపకల్పనము కావించి సోమనాథుఁడు దేశీయ మగు నితివృత్తముతో స్వతంత్రకావ్యనిర్మాణము గావించెను. ఇందలి నాయకుఁడగుపండితుఁడును, నితరభక్తులును మననడుమ నెప్పుడో యొకప్పుడు భక్తిమయజీవితము గడపినట్టి వారు కాని, పురాణవ్యక్తులు కారు. వారు కూడ నే యగ్రకులమునకో, రాజకులమునకో చెందినవారు కాక యన్నికులములకును సంబంధించినవా రగుట యిందు విశేషము. ఇందుచే నీగ్రంథమందును నితని దేశీయతాభిమాన ముట్టిపడుచున్నది.

ఇతివృత్తము కల యీతనిగ్రంథములలో మూఁడవది మల్లమదేవీ పురాణము. ఇది బసవపురాణానంతరము రచింపఁబడినట్లు తలఁపబడుచున్నది. ఈగ్రంథ మలభ్యము. అందుచే దానిఁ గూర్చిన వివరములు తెలియ వచ్చుట లేదు. కాని శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తమ తండ్రిగా రగు శ్రీ నిడుదవోలు సుందరముపంతులుగారి వలన నొక యైతిహ్యమును విని యున్నట్లు తెలిపి యున్నారు.[౨౮] మల్లమదేవి శ్రీశైల ప్రాంతమం దుండిన యొకమహా

౨౮. చూ. పాలకుఱికి సోమనాథకవి: కర్త: శివశ్రీ బండారు తమ్మయ్య గారు: పుటలు *162–163; ప్రచరణ: 1948.*

భక్తురాలు. ఆమెచరిత్ర మిం ద్విపదకావ్యముగా సంతరింపఁబడినది. ఏకారణముచేతనో సోమనాథునికి నేత్రనిరోధము కలుగఁగా స్వప్నమున శివునిచే బోధితుఁడై, యతఁడత్తవారియింట నికృష్టజీవితము గడుపుచుండిన మల్లమదేవి యను శివభక్తురాలి గృహమునకేఁగి, యామె తన పసులకొట్టములో నేరికిం గానరాకుండ దీపార్చనము చేయుచోట గోడపై నేర్పడిన మసిని గాటుకగా నాతనికన్నులయం దిడఁగా నతనికి నెప్పటియట్లు కన్నులు వచ్చిన విషయ మిందు మనోహరముగా నభివర్ణింపఁ బడినట్లు (శ్రీ) నిడుదవోలు వెంకటరావుగారు తెలుపుచున్నారు. ఇందలికథ విశ్వసనీయ మయినను గాక పోయినను నిందలి యితివృత్తము పయిన దెలిపినట్లు మల్లమదేవి మహిమను వర్ణించునదే యగుచో దేశీయేతివృత్తముతోఁ గూడినస్వతంత్రగ్రంధమనియే గ్రహింపఁదగును. మల్లమదేవి యొక్కప్పు డాంధ్రదేశమునందే జీవించినమహా శివభక్తురాలు. అందుచే నిదియు దేశీయేతివృత్తముతోఁ గూడిన రచన మగుచున్నది.

ఇట్లు బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, మల్లమదేవీపురాణము అను మూఁడు గ్రంధములందును సోమనాథుఁడు పురాణవ్యక్తుల చరిత్రములను గాక బసవేశ్వరుఁడు, పండితారాధ్యుఁడు, మల్లమదేవి యనుభక్తవరేణ్యుల చరిత్రములను, బ్రసక్తానుప్రసక్తముగా దక్షిణదేశమం దొకప్పుడు భక్తిమయజీవితములను గడపినపురాతన నూతనభక్తుల చరిత్రములను నభివర్ణించి సంస్కృతమూలకము కాని, యితరభాషా కావ్యములమీఁద నాధారపడని స్వతంత్రదేశీయేతివృత్తములతోఁ గూడినకావ్యములను దెలుఁగున రచించి నిరుపమాన మయిన యశస్సును సముపార్జించెను. అతనికిఁ బూర్వము రచితములయినకావ్యము లట్టివి కావు.

మల్లికార్జునపండితారాధ్యవిరచిత మగు శివతత్త్వసారము పాల్కురికి సోమనాథునికిఁ బూర్వము వెలసిన శైవగ్రంధము. మల్లికార్జునపండితుఁడు బసవేశ్వరునికి సమకాలికుఁడు. అతఁడు బసవేశ్వరుసందర్శనార్థమై కల్యాణకటకమున కేఁగుచు మార్గమధ్యమున వనిపురమున విడిసి యుండఁగా నంతకు నెనిమిది దినములకు ముందు కల్యాణమున గజిబిజి సంభవింపఁగా బసవేశ్వరుఁడు నగరమును వదలి సంగమేశ్వరస్వామి యం దైక్యము చెందె ననువార్త వినవచ్చెను. అంత మల్లికార్జునపండితుఁడు బసవేశ్వరా నంతరము తాను బ్రపంచమునం దుండియుఁ బ్రయోజనము లేదని నిశ్చయించుకొని తన పయనమును శ్రీశైలమునకు మరలించుకొని గిరిప్రదక్షిణాదికముతో శివరాత్రినియమమును

జెల్లించి మల్లికార్జునస్వామిలో నైక్యమందెను. ఈవిషయము సోమనాథుని పండితారాధ్యచరిత్రమునందు వివరింపఁబడి యున్నది. బసవేశ్వరుఁడును, నాతనియేలికయగు కలిచుర్యబిజ్జలుఁడును నేకకాలమునందే యనఁగాఁ గ్రీస్తుశకము 1168లో మరణించి యుందు రని చరిత్రజ్ఞులు నిర్వివాదముగ నిర్ణయించి యున్నారు. అందుచే మల్లికార్జునపండితుఁడు గూడ బసవేశ్వరునియనంతర మొుండు రెండు సంవత్సరములలోనే అనఁగా క్రీ.శ. 1170 ప్రాంతమున మరణించి యుండు నని చరిత్రజ్ఞుల విశ్వాసము. అతఁడు రచించిన శివతత్త్వసార మాకాలమునకు ముందు రచింపఁబడినది కావలెను. అందు శైవమతమునకు సంబంధించినపె క్కితరవిషయములలోఁబాటు కొందఱు భక్తుల చరిత్రములు కూడఁ బేర్కొనఁ బడినవి. ఇంచుమించుగా నాగ్రంథమునందలి యేఁబది యాఱుపద్యములలో నాశివభక్తులకథలు తెలుపఁబడినవి. చూడుఁడు :

*క: వలయు నని దేవ, కొందఱు*
*నెలకొని పేర్కొంటిఁ గాక నీచేత వర*
*మ్ములు వెలయఁగఁ బడసిన భ*
*క్తులకొలఁ దెఱుఁగుదు నసంఖ్య గొలఁదియె నాకున్.*

*– శివ – 35 పుట*

ఇట్లిందుఁ బేర్కొనఁబడిన యాకొందఱు శివభక్తులలో విష్ణుదేవుఁడు, రావణుఁడు మొదలగు పురాణవ్యక్తులతోఁబాటు చండీశుఁడు, కాటకోటఁడు, కన్నప్పఁడు, శివనాగుమయ్య మొదలగు వివిధజాతులకుఁ జెందినశివభక్తులు కలరు. ఈక్రిందిపట్టిక యాయాయిభక్తుల క్రమమును దెలుపును.

| | | |
|---|---|---|
| చండీశుఁడు | – | 391 |
| అచ్యుతుఁడు | – | 392 |
| భవాని | – | 393 |
| వ్యాఘ్రపాదపుత్త్రుఁడు | – | 394 |
| రావణుఁడు | – | 395 |
| భట్టబాణుఁడు | – | 396 |
| కాట కోటఁడు | – | 397 |
| వీరశంకరుఁడు | – | 398 |

వీరిలో శంకరుఁడు, కిన్నెరబ్రహ్మయ, ముసిఁడి చౌడరాయఁడు, బండారువు బసవఁడు అనువారినిగూర్చి యొకటికంటె నెక్కువ పద్యములు గలవు. ఇట్లు చూడఁగా నిందు మొత్తముమీఁద నలువది యెనిమిది మంది శివభక్తుల చరితములు ప్రస్తావింపఁబడినట్లు తెలియు చున్నది. సోమనాథుఁడు మల్లికార్జునపండితుని శివతత్త్వసారమును బెక్కుపర్యాయములు చదివి యుండెను. అతని బసవపురాణమునందు శివతత్త్వ సారానుకరణములు పెక్కు కలవు. చూడుఁడు :

క: శ్వపచుం డైనను శివభ
క్తిపరుం డగు నేని నతఁడ ద్విజవర్యుం డా
శ్వపచునకుఁ గీడు శివభ
క్తిపరాఙ్ముఖుఁ డైనయట్టి ద్విజుఁడు మహేశా.

– శివ. *194* ప.

శ్వపచుఁ డైనను లింగసహితుఁడై యున్న
నుపమింప సద్బ్రాహ్మణోత్తమోత్తముఁడు
త్రిపురారిఁ గొల్వని ద్విజముఖ్యుఁ డైన
శ్వపచాధములకంటెఁ జాలుగఁ గీడు.

– బస. *189* పుట.

క: మొల్లల వైచిన లక్ష్మీ
వల్లభసుతుఁ గాల్పవే యవారితవృత్తిన్
మొల్లముగ జాల వైచిన
యల్ల గణాధిపున కీవె యపవర్గ మజా.

– శివ. *449* ప.

మల్లెమొగ్గల వైవ మదనుని వేఁడి
వెల్లఁగాఁ జేసితి దెల్లంబు గాదె
జాల వైచినఁ గరుణా లోకనమునఁ
బాలించితివి భక్తిపరునిగా నన్ను.

– బస. *157* పుట.

పయి శివతత్త్వసారానుకరణములు సోమనాథుని కాగ్రంథముపైఁ గలయపార భక్తిగౌరవములు వెల్లడించును. ఇట్లు రచనాసందర్భములనే యనుకరించిన సోమనాథుఁడా గ్రంథమునందలి శివభక్తుల చరిత్ర ప్రస్తావకము లగు పద్యములను జదివి చక్కఁగా నొంటఁ బట్టించుకొని యాయాయిభక్తులకు సంబంధించిన యితరవిశేషములను, ప్రస్తావితవిషయ వివరములను భక్తజనుల నడిగి తెలిసికొని తన బసవపురాణ పండితారాధ్య చరిత్రములందు ఆయాకథల నెల్లఁ గూర్చి యుండును. ఇట్లన్నంతమాత్రమున శివతత్త్వసారము బసవ పురాణపండితారాధ్య చరిత్రములకు మాతృక యునఁగాదు.[౬] ఆయా భక్తులచరితము లెంత

౬. 'ఇదియే పండితారాధ్యచరిత్రమునకు మూలప్రాయము. ఇందులోని విషయములును, సంక్షేపముగాఁ జెప్పఁబడినభక్తులచరిత్రలుఁ బండితారాధ్యచరిత్రములో విపులముగా వర్ణింపఁబడినవి.'
– తెలుఁగుకవులచరిత్రము : శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు : పుట *254*

సంగ్రహముగా శివతత్త్వసారమునందుఁ బ్రస్తావింపఁబడెనో యీ క్రిందిపద్యమునఁ దిలకింపుఁడు.

కః గొఱియలపా ల్విమీఁదను
నెఱయఁగఁ బిడుకునెడఁ దండ్రి నిష్ఠురుఁ డైనన్
మఱి వానిఁ జంపి నీదయఁ
గొఱులఁడె గణపదవిఁ గాటకోటఁడు రుద్రా.

– శివ. 31 పుట.

ఈకాటకోటనికథ బసవపురాణమునందలి ద్వితీయాశ్వాసమున (98 పుట) నభివర్ణింపఁ బడినది. ఇట్లే తక్కినభక్తుల చరిత్రములును సందర్భోచితములుగా నచ్చటచ్చటఁ గూర్చఁబడినవి. శివతత్త్వసారమునందుఁ బేర్కొనఁబడినశివభక్తుల కథలు బసవపురాణ పండితారాధ్యచరిత్రములం దేయే సందర్భములఁ గూర్పఁ బడినవో యీ క్రిందిపట్టికను దిలకింపుఁడు:

| శివతత్త్వసారము | బసవపురాణము | పండితారాధ్యచరిత్రము |
|---|---|---|
| చండీశుఁడు | – | – |
| అచ్యుతుఁడు | – | – |
| భవాని | – | – |
| వ్యాఘ్రపాదపుత్త్రుఁడు | – | – |
| రావణుఁడు | – | – |
| భట్టబాణుఁడు | 4–308 | – |
| కాటకోటఁడు | 2–95 | – |
| వీరశంకరుఁడు | 6–466 | – |
| శివనాగయ్య | 7–491 | – |
| చిఱుతొండనంబి | 4–267 | – |
| జంబూరిమహాకాళయ్య | – | – |
| మొఱటద వంకయ్య | 2–100 | – |
| (కరుణాకర) గోవిందుఁడు | – | – |
| వరగొండచక్రవర్తి | – | – |
| ఒడయపిళ్ల | 6–409 | – |

| శివతత్త్వసారము | బసవపురాణము | పండితారాధ్యచరిత్రము |
|---|---|---|
| శ్రీపతిపండితుఁడు | – | – |
| ఒడయనంబి | 4–298 | – |
| కిన్నరబ్రహ్మయ | 5–331 | 1–239 |
| మలయరాజు | – | – |
| ఉద్భటుఁడు | 7–517 | – |
| కుమ్మరగుండయ్య | 4–325 | – |
| అరియమరాజు | – | – |
| ముసిఁడిచౌడరాయఁడు | 5–368 | – |
| మలహణుఁడు | – | 1–358 |
| ఒకయాఁడుఁగూతురు | – | – |
| కెంబావి భోగిదేవయ్య | 7–523 | – |
| మాదర చెన్నయ్య | 7–514 | – |
| ఏడర బంకయ్య | – | – |
| తేడరదాసయ్య | 4–260; 6–426 | – |
| శంకరదాసయ్య | 4–257 | – |
| వైజకవ్వ | 6–444 | – |
| సురియ చముడయ్య | 5–384 | – |
| కన్నప్పఁడు | 3–180 | – |
| అంబన | 3–205 | – |
| తెలుఁగు జొమ్మయ | 5–389 | – |
| కరికాలచోడనృపతి | – | – |
| కేశవరాజు | – | – |
| కదిరిరేమణార్యుఁడు | – | 1–467 |
| బండారువుబసవయ్య | 7–546 | – |
| పాండ్యనాయకుఁడు | – | – |

| శివతత్త్వసారము | బసవపురాణము | పండితారాధ్యచరిత్రము |
|---|---|---|
| శంకరుఁడు | – | – |
| బెజ్జమహాదేవి | 3–151 | – |
| కౌమారపాలఘూర్జరుఁడు | – | 1–367 |
| కిన్నెరుడు | 5–331 | 1–239 |
| మడివాలు మాచయ్య | 4–232 | – |
| ఇఱుద (వ?)త్తుఁడు | 4–242 | – |
| బావురిబ్రహ్మయ్య | 4–247 | – |
| సకలేశు మాదిరాజయ్య | 3–205 | 1–449 |
| చేరమచక్రవర్తి | – | – |
| కన్నడబమ్మయ | 5–361 | – |
| ఇతరులు | – | – |

ఇట్లు శివతత్త్వసారమునందలి భక్తులచరిత్రల నభివర్ణించుపద్యము లాయాయి చరిత్రములఁ గూర్చినవివరముల నెఱుఁగుజిజ్ఞాసఁ గలిగించి తత్తద్వివరములతో వానిని దన కావ్యములం దభివర్ణించునవకాశమును జేకూర్చినవి. మఱికొందఱు భక్తులకథలు ప్రత్యేకముగా నాయుభయగ్రంథములందును నభివర్ణింపఁబడక పోయినను వారినిగూర్చిన యెఱుక యాతనికిఁ గలిగింపఁగా నతఁడు వారి నెల్ల భక్తులపట్టికల నొసఁగుసందర్భమునను, నితరసందర్భములందును స్మరించి యున్నాఁడు. అంతేకాని, యది యాతని బసవపురాణ, పండితారాధ్య చరిత్రములకు మూలములు మాత్రము కాలేదు.

తమిళమునఁ బెరియపురాణ మని యొకమహాగ్రంథము కలదు. దానిని గొందఱు తమిళదేశపుఁ బంచమవేద మని ప్రశంసింతురు. దానికి తిరుత్తొండర్పురాణ మను నామాంతరము కలదు. దానికి శ్రీభక్తవిజయ మని యర్థము. శైవవాఙ్మయమున దీనికిఁ బ్రముఖస్థానము కలదు. దానిని సేక్కిలార్ అనుమహనీయుఁడు రచించెను. అతఁడు రెండవకులోత్తుంగునికాలమున జీవించినవాఁడు. రెండవకులోత్తుంగునికే అనపాయుఁ డని పేరు. అతఁడు క్రీస్తుశకము 1130–1150 సంవత్సరములనడిమికాలమున జీవించి యుండెను. కనుక నతఁడు బసవేశ్వరునికి సమకాలికుఁడే యగును. బసవేశ్వరుని మహిమాదిక మాచోళదేశమున సమకాలముననే వ్యాపించి యుండు ననుట సత్యదూరము.

పెరియపురాణమునందుఁ బురాతనశివభక్తుల చరితములు కలవు. కాని, సోమనాథుఁడు బసవపురాణమును 'భక్తులచే విన్నమాడ్కి'[౭] రచించితి నని ఘంటాపథముగా వచించి యుండుటచే నాతమిళగ్రంథము సోమన బసవపురాణమునకు మూలమయి యుండు నను ప్రశ్న యుదయింపదు.

కనుక, సోమనాథుని బసవపురాణము సంస్కృతమూలకము కాదు. కన్నడ మునందలి బసవగీతములు మాతృక యని యాతఁడు పేర్కొని యుండినను నాయాభక్తుల చరితములను స్థూలముగా నెఱిఁగించువఱకే యని యాతనికిఁ దోడ్పడినవి. వాని మూలకత్వము తావన్మాత్రము. వారిఁ గూర్చినవివరముల నాతఁడు భక్తజనులవలన నెఱిఁగెను. తమిళమునందలి పెరియపురాణమును దానికి మూలము కాదు. శివతత్త్వసారమునందలి కొందఱుభక్తులచరితముల నితఁడు తనకావ్యములయందుఁ బెంచి వ్రాసినను, నది యాయాయిభక్తజనుల చరితములను వివరముగా నరయఁగోరు జిజ్ఞాసను గలిగించువఱకే తోడ్పడి యుండును. ఆభక్తులకథలనెల్లఁ దనకావ్యములందుఁ జేర్చుటకును, నుచితస్థలము లందు వాటిని భక్తగణములలో స్మరించుటకును నాతనికి సంకల్పమును మాత్రము కలిగించి యుండ నగును గాని యాతని బసవపురాణమునకుఁ గాని, పండితారాధ్య చరిత్రమునకుఁ గాని శివతత్త్వసారమునందలి యాభాగము మూలము మాత్రము కాదు. భక్తజనులగోష్ఠిలో నాతఁడు తన మిత్రుల నడిగి కథాసూత్రము నెఱింగెను. ఇట్లు, బసవపురాణము దేశీయేతివృత్తములోఁ గూడిన స్వతంత్రగ్రంథము. అందలి యితివృత్తము పురాణములయందలి పౌరాణిక వ్యక్తులకు సంబంధించినది కాక, చారిత్రకపురుషునికి సంబంధించినది. ఇతర భక్తులు కూడ దేశమునం దెప్పుడో యొకప్పుడు బ్రదికి బట్ట గట్టినవారే. కనుక బసవపురాణమునందలి యితివృత్తము భక్తజనుల నుండి సేకరించినట్టిది. ఆ యితివృత్తమును జారిత్రకపురుషునికి సంబంధించినది. పండితారాధ్య చరిత్రమునందలి యితివృత్తము కూడఁ జారిత్రకపురుషునికే సంబంధించినది. సంస్కృతమూలకము కాదు. స్వతంత్రగ్రంథము. మల్లమదేవీపురాణము ఒకమహా భక్తురాలి మహిమాదికము నభివర్ణించు గ్రంథము. అదియు స్వతంత్రగ్రంథమే. అతని గ్రంథముల యందభివర్ణింపఁబడిన యితరభక్తులును నీదేశమునకే చెందినన వివిధజాతుల వారు. ప్రజలతోఁ గలసి మెలసి తిరిగి తమ మహిమాదికమును

---

౭. చూ. 'ప్రస్తుతి కెక్కిన బసవనిచరితఁ
 జెప్పితి భక్తులచే విన్నమాడ్కి' — బస. 7-58.

ప్రదర్శించినవారు. అతని గ్రంథములయం దితివృత్త విషయముగా సాధించిన దేశీయత యిట్టిది. ఇది సిద్ధాంతము.

## దేశి ఛందస్సు

పాల్కురికి సోమనాథుఁడు బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, మల్లమదేవీపురాణము అనుగ్రంథములను దేశీయేతివృత్తములతోఁ దీర్చి దిద్ది తనదేశీయ తాభిమానమును ప్రదర్శించె నను విషయమును బూర్వప్రకరణమునఁ దెలిసికొంటిమి. ఇతివృత్తగ్రహణమునందే కాక యాతఁడు ఛందోవిషయమునను నట్టి దేశీయాభిమాన మునే ప్రదర్శించెను. అతఁడు వెలయించిన కావ్యజాతమును బరిశీలించినచో నీవిషయము సువ్యక్తము కాఁ గలదు. అతఁడు తనకావ్యము లందును, లఘుకృతులయందును నెక్కొలిపిన దేశీయచ్ఛందఃప్రయోగములను గూర్చి పరిశీలించుటకు ముం దాతఁడు రచించిన గ్రంథజాతమును గూర్చి యించుక తెలిసికొనుట యావశ్యకమై యున్నది.

బసవపురాణము, పండితారాధ్యచరిత్రము అనుగ్రంథరాజములను రచించి యాంధ్రసాహిత్యమున కపూర్వ మయిన యభ్యుదయమును సమకూర్చిన సోమనాథకవీశ్వరుఁ డవి కాక పెక్కు లఘుకృతులను గూడ రచించెను. అవి అనుభవసారము, వృషాధిపశతకము, చతుర్వేదసారము, చెన్నమల్లు సీసములు, బసవరాజీయమను నామాంతరము కల సోమనాథభాష్యము, రుద్రభాష్యము, బసవరగడ, బసవాధ్య రగడ, సద్గురురగడ, గంగోత్పత్తిరగడ, పంచప్రకారగద్య, నమస్కార గద్య, అక్షరాంక గద్య, అక్షరాంకపద్యములు, అష్టోత్తరశతనామగద్య, సంస్కృతబసవోదాహరణము, తెలుఁగు బసవోదాహరణము, పండితారాధ్యో దాహరణము, బసవాష్టకము, బసవపంచరత్నములు, త్రివిధ లింగాష్టక మనునవి. ఇవికాక, పాల్కురికి సోమేశ్వరస్వామిపైఁ జెప్పిన 'సోమనాథస్తవము' అనుచిన్నద్విపదకృతి కూడ సోమనాథరచితముగాఁ బ్రచారమునం దున్నది. మల్లమదేవీపురాణ మను మఱొక ద్విపదకృతి కూడ నితఁడు రచించినట్లు చెప్పఁబడుచున్నది. కాని యది నేఁడు లభ్యమగుట లేదు. పయిగ్రంథములలో సోమనాథ భాష్యము, రుద్రభాష్యము, సంస్కృత బసవోదాహరణము అనునవి యాతని సంస్కృతగ్రంథములు. సద్గురురగడ, చెన్నబసవరగడ యనునవి యాతఁడు కన్నడభాషలో రచించిన లఘుకృతులు. తక్కినవి తెలుఁగు. ఇట్లీతఁడు సంస్కృతకర్ణాటకభాషలలోను, నాంధ్రభాషలోను రచించిన గ్రంథములు మొత్త

మిరువది యొక్కటిదాఁకఁ గలవు. వానిలో నాంధ్రగ్రంథముల సంఖ్యయే యధిక మనుట స్పష్టము. ఆయాంధ్రగ్రంథములలోఁ బెక్కింటి నాతఁడు దేశీయము లగు ఛందములందు రచించి యుండుట కూడ నాతని దేశీయతాభిమానమును జెప్పక చెప్పుచున్నవి. బసవపురాణము, సోమనాథస్తవము, పండితారాధ్య చరిత్రము, మల్లమదేవీపురాణము అనునవి ద్విపదలో రచింపఁబడినగ్రంథములు. బసవాఢ్యరగడ, గంగోత్పత్తిరగడ యనునవి రగడకృతులు. బసవోదాహరణము, పండితారాధ్యోదాహరణము అనునుదాహరణకృతులలోని కళికలును, ఉత్కళికలును రగడచ్ఛందోభేదములే. చతుర్వేదసారము, చెన్నమల్లు సీసములు సీసపద్యకృతులు. పంచప్రకారగద్య, నమస్కార గద్య, అక్షరాంకగద్య, అష్టోత్తరశతనామగద్య యనునవి గద్యస్తోత్రములు. అనుభవసారము చంపూపద్ధతిని రచింపఁబడిన లఘుకావ్యము. అందు సోమనాథుని వృత్తరచనా వైశద్య మెఱుకపడును. అందుఁ ద్రిభంగి, క్రౌంచపదము, తరువోజ, వనమయూరము మొదలగు విశేషవృత్తము లుపయుక్తము లయినవి. చతుర్విధకందము, ద్విప్రాసత్రిప్రాస కందములు నిందు గలవు. ఇతని వృషాధిపశతక మేకైక మకుటముతో నూటయెనిమిది చంపకోత్పలములతో రచింపఁ బడిన శతకము. ఇట్లీతఁడు ఛందోవైవిధ్యమును బాటించి తనకృతులను భిన్నభిన్నఛందములలో వెలయించి తనకుఁ గలకవితాప్రావీణ్యమును బ్రదర్శించి యుండినను నాతనికి దేశిచ్ఛందములయందే మక్కువ యెక్కువ యనువిషయం మా యాదేశిచ్ఛందములం దాతఁడు రచించిన గ్రంథములును, లఘుకృతులును వెల్లడించుచున్నవి. ఛందఃప్రయోగమునం దాతనికిఁ గలదేశీయాభిమానమును, దేశిదృక్పథమును బ్రధానముగా ద్విపద రగడలు, సీసపద్య రచనము, కందములు, గద్యలు అనునయిదువిభాగముల క్రింద వింగడించుకొని పరిశీలింపఁ దగి యున్నది.

సోమనాథుని దేశికవిత్వోద్యమము ఛందోవిషయమునందు ముఖ్యముగా ద్విపదరచనయందెట్లు ప్రవర్తిల్లెనో యెఱుఁగుటకు ముందు నన్నయకుఁ బూర్వకాలమందును, నన్నయకాలమునను వెలసిన యాంధ్రవాఙ్మయముయొక్క స్వరూపమును గొంత స్థూలముగా నయినను నెఱుఁగుట యుక్తము. చాళుక్యయుగమునం దాంధ్ర భాషలో దేశిమార్గసంప్రదాయములకుఁ జెందిన రెండువిధములయినరచనలును నుండినవి. అందుఁ గ్రీస్తుశకము పదియవ

శతాబ్దికిఁ బూర్వము లభించిన దంతయు దేశిరచనయే. అద్దంకి, కందుకూరు, బెజవాడ యనుస్థలముల వేయఁబడిన శాసనములే యందులకుఁ దార్కాణము. ఇవి పద్యమయశాసనములు. ఇవి కాక పాల్కురికి సోమనాథుఁడు పేర్కొనిన తుమ్మెదపదములు, ప్రభాతపదములు మొదలగుపదరచనములుమూలమునఁ బదవాఙ్మయము కూడఁ గొంత యుండి యుండు నని మనము భావింప వచ్చును. క్రీస్తుశకము పదియవశతాబ్దికిఁ దరువాత రచితము లయినట్లు చెప్పఁబడు కొందఱు జైన కవులకావ్యములును, విరియాలకామసాని గూడూరు శాసనమును మార్గపద్ధతినే రచింపఁబడినవి. అంతకుఁ బూర్వమునుండి వచ్చుచుండిన పదవాఙ్మయ మాకాలమునఁ గూడ నొకవంక సాఁగుచునే యుండె నని భావింప వచ్చును. ఇట్లు చాళుక్యయుగ మునఁ గ్రీస్తుశకము పదియవశతాబ్దికిఁ బూర్వము కేవల దేశికవిత్వమును, దరువాతి కాలమున దేశిమార్గకవిత్వములు రెండును బ్రవర్తిల్లె నని తలంప వచ్చును.

నన్నయకుఁ బూర్వ ముండిన శాసనములలో దేశీయచ్ఛందమునకుఁ జెందిన తరువోజ, మధ్యాక్కర, సీసము అనుపద్యములు కానవచ్చుచున్నది. రగడ, కందము, చంపకమాల మున్నగు నితరపద్యములు కూడ నప్పు డుండె ననుటకుఁ దార్కాణము లాకాలమునకుఁ జెందినశాసనములందే కలవు. ఇట్లు, మొత్తముమీఁద నాకాలమున మాత్రాచ్ఛందమునకుఁ జెందిన జాత్యుపజాతులే హెచ్చుగా వాడఁబడుచుండెను. ఇట్టి స్థితిలో నన్నయభట్టారకుఁడు వానికిఁ దో డక్షరచ్ఛందమునకుఁ జెందిన పలువృత్తములను సంస్కృతమునుండి గ్రహించి తనభారతమునందు వానికి విశేషప్రాముఖ్య మొసఁగెను. బహుసంఖ్యాకము లయిన సంస్కృతవృత్తములనుండి ధారాళ మయినగమనము కల మత్తేభ, శార్దూల, చంపకోత్పలమాలాది వృత్తములను గ్రహించి యాతఁడు తెలుఁగు కవితలో వాడఁదగు ఛందస్సంపదను విస్తృతము గావించెను. కన్నడమునఁ గావ్యములు విరచించిన పంపాదు లగుకవీశ్వరులు ఛందోవిషయమున ననుసరించిన పద్ధతియే నన్నయ కీవిషయమున నుద్బోధము గలిగించి యుండును. ఇట్లు ఛందోవిషయముననే కాక యాతఁ డనుసరించిన చంపూకావ్యపద్ధతికిఁ గూడఁ గన్నడకవులే యాతనికి మార్గదర్శకులు.

ఛందోవిషయముగా నాంధ్రకావ్యపథముఁ దీర్చిన నన్నయ పరించినమార్గమునే యాంధ్రమునఁ బెక్కురు కవు లనుసరించిరి. న యాకవీశ్వరులందఱును మార్గ సంప్రదాయమునకుఁ

జెందినకవీశ్వరు లయిరి. దేశి కవిత్వముఁ జెప్పుదు నని, దేశిమార్గంబులు దేశీయములుగా రచింతు నని సంకల్పించిన నన్నెచోడుఁడు కూడ నీవిషయమున నన్నయభట్టారకునే యనుసరింప వలసినవాఁ డయ్యెను. అతఁడు మత్తేభాదికము లగుసంస్కృతగ్రహణమునందు నన్నయభట్టారకునే యనుసరించినను కందము, తరువోజ, సీసము మొదలగుదేశీయచ్ఛందములను గూడఁ దనకవితలోఁ జొప్పించి తనదేశీయంతాభిమానమును వ్యక్తపఱచుకొనెను. అతని కుమారసంభవములోఁ దక్కిన యన్నిరకము లయినఛందములసంఖ్యతోఁ బోల్చిచూచి నపుడు అతఁడు కందములను వాడుటలోఁ గనుపఱిచిన యభినివేశ మాతని దేశీయచ్ఛందః ప్రయోగాభిమానమును వ్యక్తము చేయుచున్నది. మల్లికార్జునపండితారాధ్యుఁడు రచించిన శివతత్త్వసారమునందలి పద్యము లన్నియుఁ గందములే. పాల్కుఱికి సోమనాథుఁడు తనప్రాథమికకృతి యగు ననుభవసారమునందు నన్నయమార్గమునే యవలంబించి సంస్కృతవృత్తములను రచించుటే కాక తరువోజ, త్రిభంగి, క్రౌంచపదము, మంగళమహాశ్రీ మొదలగు విశేషవృత్తములను గూడ రచించి తన వృత్తరచనావైశారద్యమును బ్రకటించెను. అనుభవసారమును రచించినపిదప సోమనాథునికి వీరశైవమతోద్ధారకుఁ డగు బసవేశ్వరునిగూర్చియు, నాతని యనుయాయులను గూర్చియుఁ బెక్కువివరములు తెలియవచ్చెను. బసవేశ్వరునిపై నాతని కెనలేని భక్తిగౌరవములు కుదిరెను. అతఁడు ప్రవచించిన వీరశైవసిద్ధాంతమును బ్రజానీకమునఁ బ్రచారము చేసి లోకము నుద్ధరింప వలయు ననునాశయమతనికిఁ గలిగెను. ప్రజానీకమున మతవిషయకోద్బోధము కలుగ వలయుననినచో దాని నుద్దేశించిన యారచనలు పండితమాత్రైకవేద్యములు కాక పామరులకును నర్థ మగుభాషలో నుండ వలయును. అది వా రనుదినము పారాయణము చేసికొనుటకో, మననము చేసికొనుటకో యను వైనరీతి నుండ వలయును. అట్టి యుద్దేశముతో నాతఁడు మున్ముందు సోమనాథస్తవమును, బసవస్తోత్రపదము లగు గద్యలు, రగడలు, ఉదాహరణములు మున్నగు లఘుకృతులను రచించెను. కాని, సంస్కృతపద భూయిష్ఠము లయిన – స్తోత్రమాత్రప్రయోజనము సాధించునట్టి – యా దేశీయగేయకృతులు జనవశీకరణమునకును, మతప్రచారమునకును దగినంతగా సహాయకములు కా నేరవని తలంచియుఁ, బ్రజలలో శైవమతతత్త్వము చక్కఁగాఁ గుదురుకొనవలయునన్నచోఁ గాంతాసమ్మితము లయినకావ్యముల మూలముననే సాధ్యమగు ననియుఁ దలఁచి జానుతెనుఁగుపై వలపు పచరించి, దేశీయచ్ఛంద మగుద్విపద గానయోగ్య మగుటచే మతప్రచారమునకును, బఠనపాఠనములకును

మిక్కిలిగా నుపకరింపఁ గల దనుసంకల్పముతో బసవపురాణ మనుగ్రంథమును సప్తాశ్వాసపరిమిత మగు ద్విపద కావ్యముగా సంతరించెను. అతఁడు రచించిన పండితారాధ్య చరిత్రమును, సోమనాథ స్తవమును, మల్లమదేవీపురాణమును గూడ ద్విపదకృతులే.

నన్నయకుఁ బూర్వకాలమునుండి పాలకుఱికి సోమనాధునికాలములో నతఁడు ద్విపదను జేపట్టి కావ్యరచనము చేయుదాఁక నాంధ్రవాఙ్మయములోఁ గావ్య రచనమునం దనుసరింపఁ బడిన ఛందఃపరిణామమును బరిశీలించితిమి. ఇఁక ద్విపదయొక్క దేశీయత యెట్టిదో, తచ్ఛందస్స్వీకారముతోఁ బాల్కుఱికి సోమనాధుఁడు దేశీయతాభిమానమును బ్రదర్శించినవాఁ డెట్లయ్యెనో యించుక పరిశీలింతము.

ద్విపదకుఁ బూర్వరూపము తరువోజ, తెలుఁగున నన్నయభట్టారకునికిఁ బూర్వము వేయఁబడిన పద్యమయశాసనములలో మొట్టమొదటి దగు పండరంగని అద్దంకి శాసనములో నొక తరువోజ కలదు. శాసనకాలము క్రీస్తుశకము **848**. చూడుఁడు:

*పట్టంబు గట్టినప్రథమంబునేఁడు – బలగర్వ మొప్పఁగఁ బైలేచి సేన*
*పట్టంబు గట్టించి ప్రభుఁ బండరంగుఁ – బంచినసామంతపదువతో బోయ*
*కొట్టము ల్పంద్రెండు గొని వేంగినాఁటి – గొఱల్చియుఁ ద్రిభువనాంకుశబాణ నిల్పి*
*కట్టెపుదుర్గంబు గడుబయల్సేసి – కందుకూర్బెజవాడ గావించెమెచ్చి.*

"తరువోజ వృత్తము ధ్రువాపదమునుండి నిష్పన్నమైనది. ధ్రువపద, దరువద, తరువద, తరువోజ యని దీని రూపాంతరములు. కొఱవి గోపరాజు తన సింహాసనద్వాత్రింశికలో ధ్రువాపద ప్రబంధములను జెప్పినాఁడు. నన్నిచోడమహాకవి తరువద నుపయోగించి యున్నాఁడు"– అని శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తమ తెలుఁగు కవులచరిత్రములోఁ దరువోజను గూర్చి తెలిపి యున్నారు. విన్నకోట పెద్దన తనకావ్యాలంకార చూడామణిలో–

*'తలకొని తలఁబ్రాలు దంపెడుచోటఁ*
*దరుణులచే సొంపు దనరుఁ దర్వోజ'*

అని తరువోజ దంపుళ్లపాటలలో నుపయోగింపఁబడు ఛందోవిశేష మనిపేర్కొని యున్నాఁడు. నన్నయభారతమునను, నన్నెచోడుని కుమార

సంభవమునను, సోమనాథుని యనుభవసారమునను నీతరువోజ పద్యములు కలవు. ప్రాచీనకవులు కొంద ఱీతరువోజ నుపయోగించినను దరువాతికాలమునఁ బ్రబంధకవులెవ్వరును దీనిని వాడి యుండలేదు. రెండు ద్విపదపాదములను గలుపఁగా నొక తరువోజపాద మేర్పడును. అనఁగా దరువోజలోఁ బ్రతిపాదమునందును మూఁ డింద్రగణములు, నొక సూర్యగణము, మఱల మూఁ డింద్రగణములు, నొక సూర్యగణము మొత్తమెనిమిది గణము లుండ వలయును. మూఁడవగణము యొక్కయు, నైదవగణముయొక్కయు, నేడవగణముయొక్కయు మొదటియక్షరములు యతిమైత్రి కలిగి యుండ వలయును. అట్టి పాదములు నాల్గింటిలోను ద్వితీయాక్షరప్రాసమైత్రి యుండ వలయును. అద్దంకి శాసనమునందలి తరువోజ యిట్టి లక్షణమునే కలిగి యున్నది. నన్నయభారతభాగములో స్వల్పముగా నున్నతరువోజలలోఁ గూడ నీలక్షణమే కుదురుకొని యున్నది. నన్నయభారతమునఁ గాని, సోమనాథునికిఁ బూర్వము వెలసిన యితరగ్రంథములఁ దెందుఁ గాని ద్విపదలు మాత్రము కానరావు. విన్నకోట పెద్దన చెప్పినట్లు నన్నయ కింకను జాలకాలమునకుఁ బూర్వము నుండియు దంపుళ్లపాట లీతరువోజలలోఁ బాడఁబడుచుండఁగా నదియే కాలక్రమమున శాసనములోనికిని దరువాతఁ గావ్యభాషలోనికిని నెక్కి యుండవచ్చును. సోమనాథునికాలమునాఁటికిఁ గూడ నీతరువోజ జానపదుల పాటలలోఁ బాడుకొనఁ బడుచుండఁగా – దానికిఁ గల గానానుకూల్యమును గుర్తించి సోమనాథుఁడు ప్రజా సామాన్యములో మతప్రచారము చేయుటకును, జనవశీకరణమునకును నెత్తి వచ్చిన దనురూపికలయీ ఛందము నభిమానించి గ్రహించి యుండఁ దగును. కాని యీ వృత్తము నట్లే యెనిమిదిగణములు కలపాదములు కలదానినిగాఁ బరిగ్రహించినచో నది యెంత గానయోగ్యమయినను బామరజనులకు సులభముగాఁ బట్టువడునవి కాకపోవచ్చును. అందుచే నాతఁడు నాలుగుపాదములు గలిగినయీదేశీయ వృత్తమును – ఆనాలుగుపాదములు గలిగియుండుటకూడ నక్షరగణ బద్ధము లయిన సంస్కృతవృత్తములపోలికతో దేశభాషాకవులు చేసిన సంస్కారమువలన నేర్పడినదే. తొలు దొలుత దేశీయ పద్యములయందుఁ గాని, పాటలయందుఁ గాని పాదనియమము లేదు. దేశీయ వృత్తము లగుతరువోజ, మధ్యాక్కర యనునవి చతుష్పాదులుగా స్థిరపడుటకు సంస్కృత ప్రభావమే కారణమయి యుండును – ప్రతిపాదమును రెండు సమభాగములు చేసి య ట్లేర్పడిన నాలుగు గణములతోడి సమభాగములకుఁ బ్రాసమైత్రిని – నొక్కొక్కపాదమునకుఁ బ్రత్యేకముగా యతిమైత్రిని గూర్చి

పాదనియమమును బరిహరించి కావ్యోపయోగిగా దిద్ది తీర్చుకొని యుండును. సోమనాథునికిఁ బూర్వము శాసనములలోఁ గాని, కావ్యభాషలోఁ గాని యాతఁడు వాడినరూపములో ద్విపదలు కానరాకపోవుటయు – దాని పూర్వరూపముగాఁ దరువోజ మాత్రమే యాయుభయస్థలముల యందును గానవచ్చుచుండుటయు నీయభిప్రాయమునకుఁ గారణము. ఇట్లు జానపదుల పాటగాఁ బాడుకొనఁబడుచుండిన యీ తరువోజ ఛందమును మహాకావ్యోప యోగి యగురీతిగా మలఁచుకొని ద్విపదగా దిద్ది తీర్చుకొనినయశస్సు పాల్కురికి సోమనాథునిదే యని నుడువ వలసి యున్నది.

ఇట్లు తెలుఁగున ద్విపదచ్ఛందము యొక్క యావిర్భావమును గుర్తించిన పిదప నది దేశీయచ్ఛందమెట్లయ్యెనో పరిశీలింతము. పద్యములు వృత్తము లనియు, జాతు లనియు ద్వివిధము. వృత్తము లక్షరగణబద్ధములు, అది సంస్కృతమునుండి గ్రహింపఁబడినది. జాతులు దేశీయము లగుపద్యములు. అది సాంస్కృతికము లని యు, దేశ్యము లనియు రెండువిధములు. సాంస్కృతికము లయినజాతుల మాత్రాసంఖ్యానియమము కలిగి నాలుగు పాదములతోఁ గూడి యుండును. దేశ్యజాతులు మాత్రాగణనిబద్ధము లై పాదనియమము లేక రచింపఁబడునట్టివి. కాలక్రమమున సంస్కృతవృత్తముల ననుసరించి దీనికిఁ గూడఁ బాదసంఖ్యానియమము వేర్పడినను మొదట నట్టినియమమేదియు వానికి లేనట్లే తోఁచును. సీసములు, తేటగీతులు, తరువోజలు నీశాఖకుఁ జెందును. దేశ్యజాతులు మరల జాతులు, ఉపజాతులు నని రెండు విధములు. వృత్తములయందువలె యతిప్రాసనియమము కలవి జాతులు. కందములు, తరువోజలు, ద్విపదలు దీనిక్రిందికి వచ్చును. ఉపజాతులలో యతి యొక్కటి మాత్రమే యుండును. ప్రాస ముండదు. సీసము, తేటగీతి, ఆటవెలఁది యిట్టివి. ఒక్కొక్కప్పుడిందు యతికి బదులు ప్రాసయతి యుండు నన్నమాట. జాతులలోఁ బ్రాసపూర్వాక్షరనియమము పాటింపఁ బడును. ఉపజాతులలోఁ బ్రాస ముండదు. కనుక నాలుగుపాదములయందును బ్రథమాక్షరములు యథా సంభవముగా మార్పు చెందుచుండును. ఇట్లు వివిధముగా వింగడింపఁబడిన పద్యజాతులలో ద్విపద మాత్రాగణబద్ధము లయినపాదములతో, యతిప్రాసములను రెంటిని గలిగిన పద్య విశేష మగుటచే దేశ్యజాతులలో జాతులు అను నుపశాఖక్రిందికిఁ జేరును. క్రమముగా నుపజాతు లయిన సీస, గీతాదుల యనుకరణముచేతనో – ప్రాచీనకాలమునందలి జానపదుల

పాటలయందలి ప్రాసయతి సౌందర్యానురోధముననో ద్విపదయందుఁ గూడఁ బ్రాసయతి ప్రయోగింపఁబడఁ జొచ్చెను. ద్విపదకుఁ బూర్వరూపమయిన తరువోజలో అద్దంకిశాసనములోఁ గాని, నన్నయాదులకావ్యప్రయోగము లందుఁ గాని ప్రాసయతి పాటింపఁబడలేదు. పాల్కుఱికి సోమనాథుఁడు తనబసవపురాణ, పండితారాధ్యచరిత్రము లలో ద్విపదలయందుఁ బ్రాసవళ్లు పెట్టి రచించెను. అట్లు రచించుట యాతనికాలముననే యాక్షేపణకు గుఱియయ్యెను. అట్టి వారి యాక్షేపములకు సమాధానముగా సోమనాథుఁడు 'అనియతగణైః, ప్రాసో వా, యతి ర్వా' యని మూఁడు సంస్కృత సూత్రముల నుదాహరించి మాత్రాగణఘటితములగు జాతివృత్తములలోఁ బ్రాసయతి చెల్లునని సిద్ధాంతము గావించెను. చూడుఁడు:

*'జాతులు మాత్రానుసంధాన గణవి*
*నీతులు గాన యనియతగణైర*
*నియును బ్రాసో వా యనియు యతి ర్వా య*
*నియుఁ జెప్పు ఛందోవినిహితోక్తి గాన*
*ప్రాసమైనను యతిపై వడి యైన*
*దేసిగా నిలిపి యాదిప్రాసనియతి*
*దప్ప కుండఁగ ద్విపదలు రచియింతు' –*

*– పండి. 1–18 పుట.*

పయివాక్యములలో సోమన ద్విపదలోఁ బ్రాసయతి నిలుపుటయందుఁ దనకుఁ గలయభినివేశమును వ్యక్తపరచెను. ఇతనికిఁ దరువాత గోన బుద్ధారెడ్డియు, చక్రపాణి రంగనయు, గౌరనమహాకవియుఁ గూడ నితనినే యనుసరించి ద్విపదలోఁ గ్వాచిత్కముగాఁ బ్రాసయతిని వాడి యున్నారు. తాళ్లపాక చిన్నన్న సోమనాథునికిఁ జాలకాలమునకుఁ దరువాత ద్విపదలలోఁ బ్రాసయతి చెల్ల దను లక్షణము నేర్పఱిచెను. కవిజనాశ్రయములో నిందుఁగూర్చి యేమియుఁ జెప్పి యుండలేదు. కాని సోమునికాలమున మాత్ర మిది కొంత యలజడికిఁ గారణ మయినట్లు పిడుపర్తి సోమనాథుఁడు తనపద్యబసవపురాణమునఁ బేర్కొనిన యోరుగంటి వృత్తాంతమును బట్టి కూడఁ దెలియుచున్నది. ఆ వృత్తాంత మిది:

ఒకనాఁడు శివభక్తు లోరుగంటిలో స్వయంభూదేవుని యాలయ మంటపములోఁ గూర్చుండి బసవపురాణమును వినుచుండగాఁ బ్రతాపరుద్ర

చక్రవర్తి యీశ్వర దర్శనార్థమై యచ్చటి కరుదెంచి యది చూచి యీసంభ్రమ మేమి? యని యడిగెను. వారు బసవపురాణమును వినుచుంటి మని బదులు పలికిరి. అంతట రాజు బసవపురాణ మనఁగా నెట్టి దని మఱల వారి నడిగెను. అపు డొక ధూర్తవిప్రుఁడు 'ఈనడుమఁ బాల్కురికి సోమనాథుఁడను పతితుఁడు ప్రావళ్లు పెట్టి బసవపురాణమును ద్విపదరూపమునఁ గల్పించెను. అది యప్రామాణికము, అనాద్యము'నని రాజుతో దానిని గూర్చి తెగడి పలికెను. రాజంతట నటనుండి వెడలి పోయెను. బసవపురాణమును వినుచుండిన శివభక్తవిప్రునిఁ జంపుటకై పాల్కురికి పురమున నున్న సోమనాథునియనుజ్ఞఁ బడయుటకై వెడలిరి.

ఈవృత్తాంతమువలన ద్విపదలోఁ బ్రాసయతి నిలిపినందులకు సోమనకాలము ననే గొప్ప యలజడి చెలరేఁగె నని విశద గుచున్నది.

కాని ద్విపదలలోఁ బ్రాసయతి చెల్లు ననుటకు సాధకముగా 'అనియతగణైః', 'యతి ర్వా', 'ప్రాసో వా' యను ప్రాచీనచ్ఛందస్సూత్రములను సంస్కృతభాషలో రచితమైన యేఛందోగ్రంథమునుండియో సోమనాథుఁడు పేర్కొనియే యున్నాఁడు. యతిప్రాసనియమములు రెండును లేని సంస్కృత శ్లోకములకుఁ గాని, ప్రాసనియమమే కాని యతినియమము లేని కర్ణాటకపద్య రచనములకుఁ గాని యీసూత్రములు సంబంధించినవి కావు. యతిప్రాసములు రెండును గలయాంధ్రపద్యములకు సంబంధించినలక్షణమునే యీ సూత్రములు దెలుపుచున్న వనుటలో సందేహము లేదు. అక్షర గణబద్ధము లై, చతుష్పాదనియతి కలయుత్పలమాలాదివృత్తములందును – అనియత గణబద్ధములయ్యుఁ జతుష్పాదనియతి కల కందము, ఉత్సాహము, అక్కర మున్నగు జాతులందును ద్వితీయాక్షరప్రాస మున్న దన్నకారణముచే వానిలోఁ బ్రాసయతి పనికి రాదని లాక్షణికులు తలంచియుందురు. అట్లే చతుష్పాదనియతి గల్గియు, యతి నియమము దప్ప ద్వితీయాక్షరప్రాసనియమము లేని సీసము, తేటగీతి, యాటవెలఁది మున్నగు నుపజాతులయందును,సంగీతమునందును బ్రాసయతి చెల్లు ననుసంప్రదాయమాంధ్రలాక్షణికులలో నేర్పడినది. మాత్రాసంఖ్యా నియమము కలిగి చతుష్పాదనియతి కల లయగ్రాహి, లయహారిణి, లయవిభాతి, త్రిభంగి మున్నగు కొన్ని సాంస్కృతిక జాతుల విషయమున మాత్ర మందు లయప్రాధాన్యమున్న దనుకారణముచేఁ గొంబోలు

నీలక్షణకర్తలు వానియందు మాత్రము ప్రాసయతి నంగీకరించి యున్నారు. అనియత గణబద్ధరచనములలోఁ జతుష్పాద నియతితోఁబాటు ద్వితీయాక్షర ప్రాసనియము కల కందాది జాతులమాట యెట్లున్నను, నిట్టి ప్రాసనియమ ముండియు ద్విపాదనియతి మాత్రమే కలద్విపద, రగడ, యట్టిప్రాసనియమము లేని మంజరీద్విపద మున్నగునవి పాటలుగాఁ బాడుకొనుట కను వగు గేయకృతు లగుటచే సంగీతమునందువలె వాని యందుఁ గూడఁ బ్రాసయతిని వాడవచ్చు ననుటయే ప్రాచీనచ్ఛందోలక్షణకర్తల యభిప్రాయమై యుండును. ఆ యభిప్రాయమునే సోమనాథుఁడు తన ప్రాసయతి ప్రయోగమును సమర్థించు కొనుచు నుదాహరించిన సంస్కృతసూత్రములు తెలియఁ జేయుచున్నవి.

ప్రాచీనకాలమునందలి జానపదగీతములు, పాటలు చాలవఱకు ద్విపదరూపములుగనో, తద్వికారములగనో యుండును. వాని ప్రాచీనతను, గాలమును నిర్ణయించుట మిక్కిలి దుస్తరము. నన్నయకుఁ బూర్వకాలము నందును, నతనికి సమకాలమునందును వెలసిన గేయములను వానిలోఁ గొన్ని యుండుట సంభావ్యమే. అట్టి గేయరచనములలోఁ దఱచుగాఁ బ్రాసయతి గోచరించుచుండును.

'అత్తింటికోడలు ఉత్తమురాలు
చేట జొన్నలు పాటి చే నిద్రపోను'
'చక్క నాన్నగారి ముక్కుపైఁ జెమట
చేరెడేసి ముత్యాలు చెదరిన ట్లుండు'
'చలికి వెఱచినట్లు పులికి నే వెఱువ
ఆలికి వెఱచినట్లు అమ్మ కే వెఱువ'
'కొడుకుల గననివాళ్ల కడుపేమి కడుపు
కుల ముద్ధరించని కొడు కేమి కొడుకు'

ఇట్టి ప్రాచీనము లగుగేయములయందుఁ గానవచ్చు రచనాసంప్రదాయ మునుబట్టియే సోమనాథుఁడు కూడ ద్విపదల యందును, రగడలయందును బ్రాసయతిని వాడి యున్నాఁడు. నన్నయభారతములోఁ దరువోజయందుఁ బ్రాసయతి ప్రయోగము కానరానంతమాత్రమున ద్విపదలోఁ బ్రాసయతి చెల్ల దనునియమమాతనికాలమునకే యుండెనని చెప్పఁజాలము. వానియందుఁ బ్రాసయతి లేక పోవుట యాదృచ్ఛికము కా వచ్చును గదా.

సంస్కృతభాషలో ననుష్టుప్ఛంద మక్షరబాహుళ్యము లేక సులువుగాఁ జదువఁ దగిన దై, యన్వయక్లేశము లేక పోవుటచే సులువుగా నర్థము చేసికొనఁ దగిన దై పురాణములయందు లక్షలసంఖ్యలో వెలసి యుండును. సంస్కృత కావ్యముల యందును ప్రతిసర్గయు నొకేఛందమున రచింపఁబడినశ్లోకములతోఁ గూడి యుండును. తెలుఁగున మాత్రము పరుసకాలములో నెంతవైవిధ్య మున్నను నిరోధ మేల యుండ వలయునను నభిప్రాయములో నాకావ్యములయందుఁ బాలించినట్లేయేకైకచ్ఛంద అనురోధవముతోఁ దన ద్విపదకావ్యములను సోమనాథుఁడు వెలయించెను.

తాను నూతనముగా దేశీయచ్ఛంద మగుద్విపదలో రచించుకావ్యము గద్య పద్యాత్మక మగు చంపూకావ్యముతో సమానముగాఁ బరిగణింపఁబడ వలయు ననియు, ద్విపదలో రచింపఁబడినంతమాత్రమున నది యుపేక్షా పాత్రము కా రాదనియు నతని యాకాంక్ష. బసవపురాణమునందును, బండితారాధ్య చరిత్రమునందును నాతఁడు తన ద్విపదరచనమును సమర్థించుకొనుచు రచించిన యీక్రింది ద్విపదలను బరిశీలించినచో ద్విపద రచనలో నాతనికిఁ గలయభినివేశ మభివ్యక్తమగును. చూడుఁడు:

*'ఉరుతరగద్యపద్యోక్తులకంటె*
*సరసమై పరఁగిన జానుతెనుంగు*
*చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ*
*గూర్చెద ద్విపదలు గోర్కి దైవారఁ*
*దెలుఁగుమాటలనంగ వలదు, వేదముల*
*కొలందియ కాఁ జూడుఁ డిల నెట్లు లనినఁ*
*బాటిఁతూమునకును బాటి యౌనేనిఁ*
*బాటింప నోలయుఁ బాటియ కాదె?*
*యల్పాక్షరముల ననల్పార్థ రచన*
*గల్పించుటయె కాదె కవివివేకంబు.'*

*– బస. 1–5 పుట.*

*'పటు పద్యగద్యప్రబంధసామ్యముగఁ*
*గావ్యకళా ప్రౌఢిఁ గల్పింతు ద్విపద*
*కావ్యంబు భవ్యంబు గాన....'*

*– పండి 1–20 పుట.*

'ఒప్పదు ద్విపదకావ్యోక్తి నా వలవ
దారూఢగద్యపద్యాదిప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబుగామి
... ... ...
... ... ...
నట్టులు గాక కావ్యప్రౌఢి పేర్మి
నెట్టణ రచియింప నేర్చినఁ జాలు
నుపమింప గద్యపద్యోదాత్తకృతులు
ద్విపదయు సమమ భావింప నెట్లనిన
... ... ...
తిప్పనిసూక్తుల ద్విపద రచింతు
నదియుఁ గా నైహికాముష్మిక ద్వి
పదహేతు వగుట ద్విపద నాఁగఁ బరఁగు
ద్విపదాంబురుహముల ధృతి బసవేశు
ద్విపదాంబురుహము లతిప్రీతిఁ గొల్తు.'

– *పండి. 1–22 పుట.*

ఇతఁడు చేపట్టినద్విపద ఛందోమాత్రమేకాక యైహికాముష్మిక ద్విపదహేతు వగుటచే సార్థకనామధేయ మయిన దనికూడ నాతని విశ్వాసము. అతని కాఛందమును దంతటి ప్రత్యయము కలదు. పండితారాధ్య చరిత్ర పీఠికలో డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు సోమనాథుని ద్విపదరచనమును గూర్చి వ్రాసినవాక్యము లివి – చూడుఁడుః

"కన్నడులకు త్రిపద యెట్లో, అట్లే తెలుగువారికి ద్విపద జాతీయచ్ఛందమై అనాదినుంచిన్ని వెలసినది. అది తెనుగువారి జీవితములో అల్లుకొని పోయినది. తెనుగులో కావ్యమనేది పొడసూపక ముందలినుంచిన్నీ దీని ఉనికి కనబడుతున్నది. తొమ్మిదో శతాబ్దమువాడయిన గుణగవిజయాదిత్యుని శాసనములో ద్విపదవిశేష మయిన తరువోజ కనబడుచున్నది. నన్నయ కూడా తరువోజను వాడినాడు. దాని ప్రచారము నాటినుంచి నేటివరకున్ను పల్లెపాటలలో, పడవపాటలలో, విసురురాతిపాటలలో, దంపుడు పాటలలో, జోలపాటలలో,

పెండ్లిపాటలలో – తెలుగువారి జీవితములోని సమస్తవిషయములలోను – వారి ఆనందము, వారి నవ్వు, వారి కోపము, వారి జాలి, వారి కన్నీళ్లు, వారి ఉత్సాహము కనబడినచో ట్లన్నిటిలోను సాగుతూనే ఉన్నది. ఇట్టి సర్వసామాన్య మయిన ద్విపదచ్ఛందస్సు ఆంధ్రవాఙ్మయము కేవల సంస్కృతపండితులచేతులలో పడడముచేత కొన్నాళ్లు అజ్ఞాతముగా జనులలోనే నిలిచినది. దాని కొక ఉన్నతి నిచ్చి పైకి తెచ్చినవారిలో మొదటివాఁడు పాల్కురికి సోమనాథుడు –''

పండి. పీఠిక. *119* పుట.

శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు పరిశోధన – పాల్కురికి సోమనాథప్రత్యేకసంచికలో 'సోమన సృష్టించిన ఛందస్సు' అనువ్యాసమును రచించి యందు ద్విపద దేశి చ్ఛంద మెట్లగునో సప్రమాణముగా నిరూపించి యున్నారు. పయివ్యాసమునందు వారు ద్విపదనుగూర్చి తెలిపినయంశము లిట ననుసంధింపఁ దగి యున్నది. చూడుఁడు:

''ఆంధ్రవాఙ్మయమున ద్విపదకావ్యోత్పత్తికి కారణభూతుఁడైన పాల్కురికి సోమనారాధ్యుఁడు – అతిప్రాచీనమును, వైదికబుక్ఛందోవిశేషము నగు ద్విపదిని, వైదికానంతరకాలికమును, లౌకికమాత్రాచ్ఛందోవిశేషము నగు ద్విపదను సమ్మేళనము గావించి లక్షణసమన్వయము చేసి, ద్విపదపదమునే సాహిత్యప్రపంచమున చిరస్థాయిఁ గావించి నాఁడు. ద్విపదను మార్చరాని యతిస్థానమునఁ బ్రయోగించి యాపదమునందలి యర్థసార్థ్యమును గూడ నందు నిరూపించి యున్నాఁడు.''

'..... ఆదిప్రాసనియతి
తప్పకుండఁగ ద్విపదలు రచియింతు
ద్విపదాంబురుహముల ధృతి బసవేశు
ద్విపదాంబురుహము లతిప్రీతి c బూన్తు.'

ద్విపద అనఁగా రెండుపదములు. ద్విపద అనఁగా రెండు పద్యపాదములు. ద్విపద = పుం. ద్వే పదే యస్య అనియు, పద – న. పద –అచ్ చిహ్నే, స్థానే, ఉద్యమే, త్రాణే, వస్తుని, శబ్దభేదే సుప్తిఙంతరూపే, ప్రదేశే, శ్లోకపాదే చ – అని సంస్కృతకోశములు తెలుపుచున్నది. పదశబ్దమునకుఁ గలపద్యపాదార్థమును గ్రహించి సోమనాథుఁడు ద్విపదాంబురుహములు అని శ్లేషించి యున్నాఁడు. ఇంతకంటెను మనోహరముగా, పదమునకుఁ గల స్థానము, ప్రదేశము అను

నర్థములను బురస్కరించుకొని 'ఐహికాముష్మికద్విపదహేతు వగుట ద్విపద నాఁగఁ బరఁగు' అను నిర్వచనమును సోమనాథుఁడు స్వయముగా సృష్టించినాఁడు. ఈయర్థమున భావము గంభీరోదాత్తమై యున్నది.

ఆంధ్రలక్షణగ్రంథములలో కావ్యాలంకారచూడామణియందు ద్విపదకు బదులుగా 'ద్విపది' యని ప్రయుక్తమైనది. సంస్కృతనిఘంటువుల ననుసరించి చూడఁగా దీనికర్థభేదము కన్పట్టుచున్నది. వైదికవాఙ్మయమున ఋక్కున కర్థమైనపుడు ద్విపద యనియు, మాత్రాచ్ఛందోవిశేషమున కర్థమైనప్పుడు ద్విపది యనియు నందు వివరింపఁబడియున్నది.

ద్విపదా = స్త్రీ. ద్వౌ పాదౌ వస్యాః పాదస్యాన్తలోపః – టాప్ – భత్వాత్పదాదేశః ఋగ్విశేషే ఛందోభేదే జీప్ – ద్విపదీ (శబ్దస్తోమమహానిధి)

ద్విపదా – స్త్రీ. ఋగ్విశేషే – ద్వౌపాదౌ వస్యాః – సంఖ్యానుపూర్వ స్యేతి పాదస్యాన్తలోపః – టాబృచీతి టాప్. పాదః పత్.

ద్విపదీ = స్త్రీ. మాత్రావృత్తాంతరే – అదౌ షట్కలసంగత మేతత్తదను పంచ చతుష్కలమ్, గుర్వంతు ద్విపదీ భవతీహ వింశత్యష్టతలం దలమ్ (శబ్దార్థచింతామణి)

ఇంకను సంగీతశాస్త్రగ్రంథములలో 'ద్విపదగము', 'ద్విపది' యనుపేళ్లు కన్పట్టుచున్నది.

'సంస్కృతే యే ద్విపదగాః
ప్రాకృతే దోహకాశ్చ తే
అభీష్టమాత్రతాళః స్యా
దాభోగోఽస్యపదైః కృతః
స్వదై ర్న్యాసో విధాతవ్యః
తాళమానద్వయేనవా'

(జగదేకః)

ద్విపదగస్య సారసాది భేదా స్సప్త వర్తంతే. సంగీతచూడామణౌ స్పష్టం ద్రష్టవ్యమ్.

త్రయో గణా గురు శ్చాంతే
ప్రథమేஉథ తృతీయకే
ద్వితీయే చ తురీయే చ
ద్వౌ గణౌ ద్వౌ గురూ తథా
జగణో నాత్ర కర్తవ్యో
భాగాంతే యమకం భవేత్
ఇతి ద్విపదగం నామా
తస్యోదాహృతి రుచ్యతే.
గాతవ్య స్స్వరసంయుక్తః తాలేన పరివర్జితః
ప్రబంధో ద్విపదాభిఖ్యో గీతావిద్యావిశారదైః.

సోమేశ్వరః పుట. ***209, 291***

<u>ద్విపదీ - ప్రబంధః</u>
శుద్ధద్విపదకా పూర్వా
పూర్ణద్విపదికే తతః
మానవీ చంద్రికా చాథ
స్మృతి స్తాద స్తతః పరమ్
గేయ మష్టప్రకారోஉయం
అస్య లక్ష్మాథ కథ్యతే.

జగదేకః

అత్ర భేదాః శుద్ధద్విపదీ, పూర్ణద్విపదీ, మానవీచంద్రికా, స్మృతిః, తారః, సంచారిణీ, మనోహారిణీతి గమ్యంతే.

కరణాఖ్యేన తాలేన
గాతవ్యో గమకాంతరే
అభోగోஉ న్యపదైః కార్యో
న్యాన స్తాలా ద్విమానతః
ద్విపదీ చ భవే దేమా— (హరిపాలః)
షట్కలో గణ అద్యస్య
తతః పంచచతుష్కలాః

అంతే గురు ద్వితీయే జః
షష్ఠీ చద్విపదీ తు సా
పాదద్వయాంతే కర్తవ్యః
స్వరన్యాసో యథోచితః ఏనకేనాపి తాలేన
గాతవ్యా ద్విపదీ బుధైః (సోమేశ్వరః)

పై యుదాహృతుల ననుసరించి ద్విపదఛందస్సు చాలప్రాచీనమైన దనియు, నది గేయవిశిష్ట మగుటచే సంగీతశాస్త్రమునఁ గూడ లక్షణములు చెప్పఁబడిన వనియు, సంస్కృతమున నది ద్విపది, ద్విపదగ, ద్విపదా, ద్విపద యను పేళ్లతో వ్యవహరింపఁబడె ననియు, నేది సంస్కృతమున ద్విపదగ యని చెప్పఁబడు చున్నదో, అదియే ప్రాకృతమున 'దోహా' అని యందురనియు స్పష్టమగుచున్నది.

సంస్కృతమున ద్విపదచ్ఛందస్సు వాడుకలో లేదు. కావ్యములయందును ప్రయుక్తము కాలేదు. ఛందశ్శాస్త్రమున సంస్కృతమునుండి పెక్కువృత్తముల గ్రహించిన కన్నడభాషలో లేదు. పేళ్లు సంస్కృతమైనను, గణనియమములలో సంస్కృతము ననుసరించినను – కొన్ని ఛందస్సులు తెలుగున ప్రత్యేకవిశిష్ట స్వరూపమును దాల్చి దేశీయ చ్ఛందస్సులుగానే పరిగణితము లగుచున్నవి. ఇంత యేల? తెనుగుభాషలోగల యతి ప్రాసలు సంస్కృతభాషలో లేవు. వృత్తము సంస్కృతమే యైనను, యతిప్రాసలక్షణము కలిగి యుండుటచే దానిని తెనుఁగు పద్యముగానే మనము పరిగణింతుము. అక్షరగణ ప్రధానము లగువృత్తములే పై లక్షణములచే తెలుఁగు అనిపించుకొనుచుండఁగా మాత్రాగణ ప్రధానములగు సీసము, తరువోజ, ద్విపద మొదలగు జాతివృత్తములు దేశీయము లని దేశిచ్ఛందస్సు లని పూర్వులు వ్యవహరించుట సమంజసమే కాక శాస్త్రీయ మై యున్నది.

పై కారణముచేతనే పేరు సంస్కృతమైనను యతిప్రాసలను నాంధ్రభాషా లక్షణము నది గలిగి యుండుటచే దేశీయచ్ఛందస్సుగానే పరిగణిత మైనది. తెలుఁగు ప్రత్యయముల మూలమున, యతిప్రాసలమూలమున సంస్కృతపదము లేవిధముగా తెలుగుభాషగా వ్యవహృతము లైనవో, ఆవిధముగానే కేవలము సంస్కృతీయము లగు ఛందస్సులు కూడ తెలుగుభాషాలక్షణలక్షితము లై, కేవలదేశీయము లగుఛందస్సులతో సమ్మేళముఁ జెంది తెలుగుచ్ఛందస్సుగా వ్యవహృతము లైనవి.

ఇఁక నాంధ్రచ్ఛందస్సునకు ద్విపద ప్రాతిపదిక. రెండుపాదములు కల ద్విపద నొకదానితో నొకటి కలిపిన నది తరువోజపాద మగును. తరువోజయందు నాల్గుపాదములుండును. ఆ తరువోజయే తరువాత సీసరూపమును దాల్చినది. నాల్గుపాదములు గల ఛందస్సునుండి నాల్గుపాదములు గల చంపకోత్పల మాలికాది వృత్తరచన లేర్పడినది. ఈవిధముగా ద్విపద నిశ్చితముగా దేశిఛందస్సు కాఁగా డ్సాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు ద్విపద దేశిఛందస్సు కా దనియు, నిది ప్రాకృతమునుండి యెరవు తెచ్చుకొనినది యనియు నిట్లు వ్రాసి యున్నారు.

ప్రాచీనయక్షగానములందు ప్రధానముగా గానవచ్చు ఛందస్సు ద్విపద. ప్రారంభదశయం దిది సంపూర్ణముగ ద్విపద రచనమై యుండిన నుండవచ్చును. మనవా రనుకొనునట్లు ద్విపద దేశిఛందస్సు కాదు. అది ప్రాకృతమునుండి యెరవు తెచ్చుకొనినది. ద్విపద యన రెండుపాదముల బుక్కనియుఁ గలదు. మఱియు మహాకవి కాళిదాసుఁడు విక్రమోర్వశీయమందు చతుర్థాంకప్రారంభమున –

*తతః ప్రవిశతి సహజన్యా చిత్రలేఖాచ*
*చిత్రలేఖా – (ప్రవేశానంతరమ్ **ద్విపదికయా** దిశోఽవలోక్య)*

దీనిఁగూర్చి వ్యాఖ్యాత యిట్లు వివరణము వ్రాయుచున్నాఁడు. 'ద్విపదికయా దిశోఽవలోక్యేతి. ద్విపదికాఖ్యగీతవిశేషేణ దిగవలోకనం విధా యాగ్రిమాం గాథాం పరతీత్యర్థః దిశోఽవలోక్య ద్విపదికాఖ్య గీత్యా వదతీ త్యర్థో వా.'

ఇందువలన కాళిదాసుఁడు ద్విపదిక యనుగీతము నీసందర్భమునఁ బేర్కొనె ననుట తెల్లము. ఈద్విపదిక లక్షణమును వ్యాఖ్యాత యిట్లు వివరించి యున్నాఁడు.

*'తల్లక్షణం చాహ భగవాన్ భరతమునిః*
*శుద్ధా ఖండా చ మాత్రా చ సంపూర్ణేతి చతుర్విధా*
*ద్విపదీ కరణాఖ్యేన తాలేన పరిగీయతే*
*పాదే చ షట్పభాగోఽన్తే న జౌ షష్ఠద్వితీయకౌ*
*చతుర్భి రీదృశైః పాదైః శుద్ధద్విపది కోచ్యతే*
*అర్థాంతేఽన్యే స్వరా నాహుః ఖణ్డాస్యాచ్ఛుద్ధయార్యయా*
*షష్ఠేనైకేన గురుణా మాత్రా ద్విపదికా మతా*
*జ్ఞేయా శుద్ధేవ సంపూర్ణా గురుణాన్తేధికేన తు.'*

పైని చెప్పిన ద్విపదికయే మన ద్విపద యైనది.[౧]

*౧. యక్షగానము– తంజాపూరు* ***1951–52*** *ఖర సంవత్సరాది సంచిక* ***17–32*** *పుటలు.*

అందును ద్విపద దేశీయ మగునప్పుడు ప్రాకృతమునుండి యెరవు తెచ్చుకొనుట యేమో దురూహావముగ నున్నది. ఎరవు తెచ్చుకొన్న యాఛందస్సునకు 'ద్విపద' యను సంస్కృతనామ మెట్లు స్థిరమైనదో వారు చెప్పలేదు. 'దోహా' యను ప్రాకృతభాషానామముతోనే యాంధ్రలక్షణకారుఁడును దీనిని పేర్కొన లేదు. ఆ ఛందస్సునకును దీనికిని సంబంధము లేదు. ఇంతే కాక వారు ద్విపదిక యైన దని వేఱొకసిద్ధాంతము చేసినారు. ఇది యాపాత రమణీయము. వా రుదాహరించిన ద్విపదిక నాలుగుపాదములు గలది. నాలుగుపాదములు కల ద్విపదికనుండి రెండు పాదములద్విపద పుట్టిన దని వారి యాశయము.

అట్లయిన నింతకంటె ఛందస్సంప్రదాయవిరుద్ధ మగునంశము వేఱొకటి లేదు. తెలుఁగున రెండుపాదములు గలఛందస్సులనుండి నాలుగుపాదములు కల ఛందస్సు లేర్పడినవి కాని, నాలుగుపాదములు కల ఛందస్సునుండి రెండు పాదములు కల ఛందస్సు లేర్పడ లేదు. తెలుఁగుఛందఃప్రస్తారము, ఛందఃపరిణామ వ్యవస్థ తెలిసినవారెవ్వరును నిట్టి సిద్ధాంతములను చేయరు –''[౧]

ఇందు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు ద్విపద ప్రాకృతమునుండి యెరవు తెచ్చుకొనిన ఛందస్సు – కాదనియు, నచ్చమైన దేశిచ్ఛందస్సనియుఁ దమనిశ్చితాభిప్రాయమును వెల్లడించిరి. డాక్టరు నేలటూరు వెంకటరమణయ్య గారొక్కరు మాత్రమిదిదేశిచ్ఛందస్సు కా దనియుఁ బ్రాకృతమునుండి యెరవు తెచ్చుకొన్నది యనియు నభిప్రాయపడుచున్నారు. 'పరిశోధన' సంపాదకులు పేర్కొనినట్లు 'నేడు ద్విపద' అని వ్యవహృత మవుతున్న అనూచానఛందస్సుకు ద్విపద అని పేరు పెట్టి ప్రాచుర్యం పొందించినవాడు పాల్కురికి సోమనాథుడు. ఆంధ్రావళినాలుకపై నాట్యమాడుతున్న ఈ ఛందస్సు వేదంలోని ద్విపదులెవవిత్రమైనది, ప్రాచీనమైనది సుమా అన్నట్టు ఈ ద్విపదకు ప్రాకృతంలోని ద్విపదితోను, హిందీలోని దోహాతోను పొత్తులేదు. ఇదొక స్వతంత్రమైన దేశి ఛందస్సు.[౨]

జాతీయచ్ఛందోవిశేష మగుద్విపదలోఁ గావ్యములు విరచించి పాల్కుఱికి సోమనాథుఁడు ఛందోవిషయమున సాధించిన దేశీయత యెట్టిదో యిందు సిద్ధాంతిత మయినది.

---

౧. పరిశోధన – పాల్కురికిసోమనాథ ప్రత్యేకసంచిక. ఆగస్టు – నవంబరు, పుటలు 58-60.

౨. పరిశోధన – ఆగస్టు – నవంబరు 1956 : పుట 57.

ద్విపదకుఁ దరువాత సోమనాథుఁ డెక్కువగా నభిమానించినదేశిచ్ఛందము రగడ. అతని లఘుకృతులలో నీఛందోవిశేషముగాఁ బ్రచలిత మయినది. వాని యందలి యీఛందఃప్రయోగమును ముత్తెఱంగులుగా వింగడింప వచ్చును. అవి. – ౧. గద్యకృతులలోని రగడలు, ౨. రగడ లను పేరుతోనే వ్యవహరింపఁబడు లఘుకృతులు, ౩. ఉదాహరణకృతులయందలి రగడలు. ఈరగడ లీతని యాంధ్రకృతులవఱకు మాత్రమే పరిమితములు కావు. కన్నడమున రచితము లయినయీతనిలఘుకృతులలోను నీరగడ కొన్నిటఁ బ్రయుక్తమై యున్నది. తొలుదొలుత నీతని గద్యకృతులలోని రగడలను గూర్చి పరిశీలింతము.

ఆంధ్రభాషలో గద్యమనఁగాఁ గేవలము వచనము అనువ్యవహారమే చిరకాలము గా నేర్పడి యున్నది. విన్నకోట పెద్దన, అనంతామాత్యుఁడు, కాకునూరి అప్పకవి మొదలగునాంధ్రలాక్షణికులు కూడ నిందుల కనుగుణముగానే పాదనియతి లేనిది గద్యమనియుఁ, బాదనియతి గలది పద్య మనియుఁ దమలక్షణగ్రంథములలోఁ దెలిపి యున్నారు. అందుచేతఁ గూడ గద్యమనఁగా వచన మనుభావమే మనలో రూఢియయిపోయినది. కాని, సోమనాథుని గద్యకృతులను బరిశీలించినప్పుడు పాదనియతిని గూడఁ గొంతవఱకుఁ గలిగి మాత్రాగణబద్ధములయిన వచనములను గూడ నాతఁడు గద్యము లనియే వ్యవహరించినట్లు తోఁచును. అవి అనంతుఁడు, అప్పకవి మొదలగు లాక్షణికులు తమగ్రంథములలో గద్యమునకు లక్ష్యముగాఁ జూపిన రచనములకంటె భిన్నముగా, విలక్షణముగా నున్నవి. అవి పాదనియతిని గలిగి యుండక, సంస్కృత పదభూయిష్ఠములుగా నతిదీర్ఘ సమాసములతోఁ గూడి యున్నది.

కన్నడమునఁ గవిరాజమార్గమనుప్రాచీనలక్షణగ్రంథమును రచించిన నృపతుంగుఁ డనులాక్షణికుఁడు కూడ సోమనాథునివలెనే పూర్వకవికృతులు గద్యపద్య సమ్మిశ్రితములనియే పేర్కొనెను. కాని, యాతని యభిప్రాయమున గద్యకృతు లనఁగా నెట్టివో నిర్ణయించుటకు వీలు లేకున్నది. నాగవర్మ యనుకవి కన్నడమున 'ఛందోఽంబుధి' యను నొకలక్షణగ్రంథమున వివరించెను. అతఁడు కూడ నాంధ్రలాక్షణికులవలెనే గద్య మనఁగా వచన మనియే నిర్వచించి యున్నాఁడు. కాని రఘటా ( రగడ) లక్షణమునుదెలుపుచు నతఁడు –

కః గణనియమవిపర్యాసదొ
ళెణెవడె దొర్వెసెదు మాత్రె సమనాగె గుణా
గ్రణియమత దిందె తాళద
గణనె గొడుబట్టు దదుపె రఘటాబంధమ్.

అని వ్రాసి సమానమాత్రలు గల కొన్ని నియతగణములను చాలా నుగుణముగఁ గూర్చుట రగడలకుఁ జాల ముఖ్యమని వచించెను. మరియు నతఁడు కన్నడములో మూఁడు రఘటాభేదములు కలవని వానిలక్షణముల నిట్లు నిర్వచించెను.

కః మందానిల లలితోత్సవ
వెందేరగళె గళనామ మక్కుం క్రమదిం
దొందకె పదునాఱిర్ప
త్తొందకె యిర్పత్తునాల్కు మాత్రెగళ బలే.

కః ఇప్పత్తుమాత్రె లలితెగె
బప్పుదు పదునాఱుమాత్రె మందానిలకం
తప్పుదు వుత్సాహక్కుఱొ
యొప్పవు దిప్పత్తునాల్కుమాత్రెగళ బలే.

మందానిలము, లలితము, ఉత్సవము నని సాధారణముగా రగడలు మూఁడువిధములు. దీనికి వరుసగాఁ బదునాఱు, ఇరువది, యిరువదినాలుగు మాత్ర లుండును. మందానిలములోఁ బాదమునకు నాలుగుమాత్రలు గలగణములు నాలు గుండును. ఉత్సవమునందు మూఁడేసి మాత్రలు గలగణము లెనిమిది యుండును. మాత్రాగణఘటితము లైన సోమనాధుని గద్యకృతు లించుమించుగా నీ రగడ లక్షణములనే యనుసరించును. కావున, వానిని మనము రగడభేదములుగనే పరిగణింపఁ దగును. కన్నడమునందలి మలయానిలము, లలితము, ఉత్సవము ననురగడ భేదములు మాత్రాసంఖ్యలో వరుసగాఁ దెలుఁగునందలి మధురగతి, ద్విపదగతి, తురగవల్గనగతి రగడ లకు సరిపడి యుండును. ఇట్లు, సోమనాధుని గద్యకృతులు రగడభేదములే యని స్థూలముగాఁ దెలిసికొన్నపిదప నాతనిగద్యకృతులలో నేయేరగడలు ప్రయుక్తము లయ్యెనో పరిశీలింతము.

## పంచప్రకారగద్య

ఇం దయిదువిధము లయినగద్యలు కూర్పఁబడుటచే దీనికీ పేరు గలిగినది. ఇందలి ప్రథమప్రకారగద్య మాత్రము కేవలము వచనరూపమునఁ గలదు. అం దెనిమిది గద్యలు కలవు. అవి అనంతుఁడు, అప్పకవి యను

లాక్షణికులు తమ లక్షణ గ్రంథములలో గద్యమునకు దృష్టాంతములుగా నొసంగినగద్యలను బోలి యున్నది. ఇవి 'దేవ బసవ' మకుటముతో దీర్ఘసమాస భూయిష్ఠముగా, నంత్యానుప్రాసాలంకారశోభితము గా వచనము నందే రచింపఁ బడినది. ఇది తప్పఁ దక్కిన నాలుగుగద్యలును మాత్రాగణ బద్ధము లయి యున్నవి.

ద్వితీయప్రకారగద్యలోఁ బదునాఱుచరణములు కలవు. ప్రతి చరణమునకు నాలుగుమాత్రలు గలగణములు నాలుగు కలవు.

తృతీయప్రకారగద్యలో ముప్పదియొక్కచరణము లొక్కొక్కటి నాలుగేసి మాత్రలు గలగణములు నాల్గింటితోఁ గూర్పఁబడినవి.

ఇఁకఁ జతుర్థగద్యమునఁ బండ్రెండు చరణములు కలవు. ఒక్కొక్క చరణమునను నయిదేసి మాత్రలు గల గణములు రెండు కలవు.

పంచప్రకారగద్యము నాలుగుమాత్రలు గల గణములు రెండింటితో మొత్త మెనిమిదిచరణములతో రచిత మయినది.

ఇట్లీపంచప్రకారగద్యలోఁ బ్రథమగద్య తప్పఁ దక్కిన నాలుగువిధము లయిన గద్యలును మాత్రాగణబద్ధము లై రగడ భేదము లై యొప్పారుచున్నది.

## నమస్కారగద్య

ఇందలి ప్రతిపాదము సంస్కృతచతుర్థీవిభక్తిప్రత్యయముతోఁ గూడిన నమో వాకముతో నంత మగుచున్నది. అందుచేతనే దీనికి 'నమస్కార గద్య' యని పేరు గలిగినది. ఇందు మొత్తము నూటపదునెనిమిదిచరణములు గలవు. ఒక్కొక్క చరణమునను నాలుగేసి మాత్రలు గలగణములు నాలుగుచొప్పున నుండును. ఇందు ద్విపద యందువలె ద్విపాదప్రాసనియతి కూడఁ బాటింపఁ బడినది.

## అక్షరాంకగద్య

అకారము మొదలు క్షకారమువఱకు వర్ణసమామ్నాయమునఁ గలయేఁబది యక్షరములతో వరుసగా నీగద్యయందలి పాదప్రథమాక్షరములు కూర్పఁబడుటచే దీనికి 'అక్షరాంకగద్య' యనుసార్థకనామధేయము కలిగినది. గద్యప్రారంభము నందుఁ గూర్పఁబడిన సంస్కృతమాలినీవృత్తమునకుఁ దరువాతఁ బ్రతిపాదమును

నయిదేసి మాత్రలు గల రెండు గణములలోఁ గూర్పఁబడినది. ప్రతిపాదాంతము ప్రణవాంకిత మయి యొప్పుచున్నది.

## బసవలింగనామావళి లేక అష్టోత్తరశతనామావళి

ఇది కన్నడకృతి. కన్నడకందపద్యముతోఁ బ్రారంభమై యిది పాదమున కిరువదినాలుగుమాత్రలు చొప్పునఁ గలిగియున్నది. లక్షణమున నిది కన్నడము నందలియుత్సవ రగడకును, దెలుఁగునందలి తురగవల్గన రగడకును సరిపడి యున్నది. ఇందలి భాష కన్నడ మయినను తెనుఁగురగడయందువలె నిందుఁ బ్రతిపాదమునను యతి పాటింపఁబడినది. అందందుఁ బ్రాసయతి కూడఁ బ్రయుక్తమై యున్నది. ఇందు మొత్తము నూటయెనిమిది పాదములు కలవు. అందుచేత దీనికి 'అష్టోత్తర శతనామావళి' యని వ్యవహార మేర్పడినది.

## అష్టోత్తరశతనామగద్యము

ఇది యసమగ్రము. సమగ్రముగా లభింప లేదు. లభించినభాగమును బట్టి చూడఁగా నిందలిపాదములు కూడ నాలుగేసి మాత్రలు కల నాలుగుగణములలోఁ గూర్పఁబడినట్లు కానవచ్చుచున్నది.

ఇట్లీతని గద్యకృతులు చాలవఱకు మాత్రాగణబద్ధము లై రగడభేదములుగా గణింపఁదగి యున్నది.

గద్యకృతులయందలి రగడలను గూర్చి ప్రస్తావించిన పిదప రగడపేరితోనే యాతఁడు రచించిన లఘుకృతులనుగూర్చి యించుక తెలిసికొందము. ఇతఁడు రచించిన శరణుబసవరగడ, సద్గురురగడ, చెన్నబసవరగడ యనునవి యిట్టివి. దీనిలో శరణుబసవరగడ యాంధ్రకృతి. తక్కిన రెండును గన్నడకృతులు.

## శరణుబసవరగడ

ఇది 'శరణుబసవ' యనుమకుటముతోఁ గూర్పఁబడిన రగడకృతి. ఇది యిరువదినాలుగుమాత్రలు కలమాత్రాగణములలోఁ గూర్చఁబడినది. కన్నడమున లేని యతినియమమిందుఁ బ్రతిపాదమునను, బాటింపఁబడుటచే నిది యాంధ్రభాషా కృతిగనే పరిగణింపఁబడుచున్నది. ఈరగడప్రారంభమున నొక యుత్సాహవృత్తము రచింపఁబడినది. అనంతరము రచింపఁబడిన రగడపాదము

తొక్కొక్కటియు నెనిమిది సూర్యగణములను గలిగి యుండి, యయిదవగణము మొదటి యక్షరము యతిగాఁ గలిగి యున్నది. ఇది తెలుఁగు నందలి తురగవల్గనలక్షణమునకును, గన్నడమునందలి యుత్సవరగడలక్షణమునకును సరిపోవుచున్నది. చివరను గన్నడభాషలో రచిత మయిన కందపద్యమునుబట్టి దీనికిఁ గూడ బసవాష్టోత్తరశతనామములను వ్యవహారమున్నట్లు తోఁచును. అనంతుఁడు రగడ లక్షణము నిట్లు తెలిపి యున్నాఁడు.

క॥ ఆద్యంతప్రాసంబులు
హృద్యంబుగ రెంట రెంట నిడి పాదములు
ద్వద్యతులఁ గూర్పఁ దగు నన
వద్యంబుగ రగడలందు వారిజనాభా.

అప్పకవి చెప్పినలక్షణము కూడ నిట్లే యున్నది. కాని, సోమనాథుని యీ శరణుబసవరగడ కొంత వైలక్షణ్యము కలిగి యున్నది. ఇందలి తొలి డెబ్బది యెనిమిది (78) పాదములవఱకు మాత్రమే ద్విపాదప్రాస నియమమును, బాటింపఁబడినది. తరువాతి పాదములలో ద్విపదలోవలెఁ గొన్నిచోట్లఁ బ్రాసనియతిని కూడ నుపయోగించుచుఁ బదునాలుగు పాదములవఱకు నేపాదమున కాపాదమునందే పాదమున కొక్కప్రాసముచొప్పున నంత్యప్రాస నియమము పాటించినట్లును, నటు తరువాత మఱి యెనిమిదిపాదములలో నిట్టినియమమునే మఱికొంత విలక్షణముగాఁ బచరించినట్లును గోచరించుచున్నది.

## సద్గురురగడ

ఇది యయిదేసి మాత్రలు గల నాలుగుగణములతో – మొత్త మిరువది మాత్రలు గల పాదములతోఁ గూర్పఁబడినట్లు తోఁచును. అందుచే నిది కన్నడము నందలి లలితరగడలక్షణమునకు సరిపడుచున్నది. ఇది యసమగ్రము.

## చెన్నబసవరగడ

ఇది కన్నడమునందలి యుత్సవరగడ లక్షణమునకు సరిపడునట్లు – మూఁడేసి మాత్రలు గల యెనిమిదిగణములతో – మొత్త మిరువదినాలుగు మాత్రలు కలపాదములతోఁ గూర్పఁబడినట్లు కాన నగును. ఇదియు సమగ్రముగా లభించుట లేదు.

ఇట్లీతని రగడకృతులనుగూర్చి తెలిసికొన్నపిదప నితని యుదాహరణకృతుల యందలి రగడలనుగూర్చి యించుక యరయుదము.

సోమనాధుఁడు సంస్కృతమున బసవస్తుత్యాత్మక మగు బసవోదాహరణము ఒండు రచించెను. తెలుఁగున నితఁడు రచించిన యుదాహరణకృతులు రెండు వ్వు. అవి బసవోదాహరణము, పండితారాధ్యోదాహరణము. ఇతని ండితారాధ్యోదాహరణ మిటీవలనే డ్క్టరు బిరుదురాజు రామరాజుగారి కృషి వన లభించినది. ఉదాహరణ మనునది మార్గదేశిసమ్మేళనము కల ద్రకావ్యము. ఇందుఁ బ్రథమాదు లగు నెనిమిది విభక్తులలో నెనిమిది ద్యములును - వాని ననుసరించి వెనువెంటనే యావిభక్తుల యందే యొక కయు, నొకయుత్కళికయు రచింపఁబడును. ఇది సాధారణముగా దేవ,రాజ, హాపురుషస్తుతిపూర్వకముగా నుండును. చివర సార్వవిభక్తి మగుపద్య మొకటి ్రఁబడును. ఉత్కళిక, యర్ధకళిక యని నామాంతరము గలిగి యుండి కపాదములో నర్ధముండును. ఇట్టి పాదము లెనిమిది యుండును. కళికలును, కళిక లనఁబడు నుత్కళికలును మాత్రాగణబద్ధము లై రగడలక్షణములనే ిగి యుండును. సంస్కృతాంధ్ర బసవోదాహరణములలోని, ండితారాధ్యోదాహరణములోని కళికోత్కళిక లేయే రగడలలో రచితము య్యనో యీదిగువ వివరింపఁ బడినది.

**స్కృతబసవోదాహరణము**

| | |
|---|---|
| ప్రథమావిభక్తి .. | హరిగతిరగడ. |
| ద్వితీయావిభక్తి .. | ద్విరదగతిరగడ. |
| తృతీయావిభక్తి .. | తురగవల్గనరగడ. |
| చతుర్థీవిభక్తి ... | హరిగతిరగడ. |
| పంచమీవిభక్తి ... | హరిగతిరగడ. |
| షష్ఠీవిభక్తి ... | హరిగతిరగడ, ద్విరదగతిరగడ. |
| సప్తమీవిభక్తి ... | మధురగతిరగడ. |
| సంబోధనప్రథమావిభక్తి .. | ద్విరదగతిరగడ. |

తెనుఁగు బసవోదాహరణము -

| | |
|---|---|
| ప్రథమావిభక్తి ... | మధురగతిరగడ. |
| ద్వితీయావిభక్తి ... | ద్విరదగతిరగడ. |
| తృతీయావిభక్తి ... | ద్విరదగతిరగడ. |
| చతుర్థీవిభక్తి ... | ద్విరదగతిరగడ. |
| పంచమీవిభక్తి ... | ద్విరదగతిరగడ. |
| షష్ఠీవిభక్తి ... | తురగవల్గనరగడ. |
| సప్తమీవిభక్తి ... | హయప్రచారరగడ. |
| సంబోధనప్రథమావిభక్తి ... | తురగవల్గనరగడ. |

పండితారాధ్యోదాహరణము -

| | |
|---|---|
| ప్రథమావిభక్తి ... | మధురగతిరగడ. |
| ద్వితీయావిభక్తి ... | మధురగతిరగడ. |
| తృతీయావిభక్తి ... | ద్విరదగతిరగడ. |
| చతుర్థీవిభక్తి ... | ద్విరదగతిరగడ. |
| పంచమీవిభక్తి ... | ద్విరదగతిరగడ. |
| షష్ఠీవిభక్తి ... | తురగవల్గనరగడ. |
| సప్తమీవిభక్తి ... | మధురగతిరగడ. |
| సంబోధనప్రథమావిభక్తి ... | తురగవల్గనరగడ. |

ఇట్లు, పాల్కుఱికి సోమనాథుని లఘుకృతులలో రగడ యనుదేశిచ్ఛందము విశేషముగాఁ బ్రయుక్తమయినది. గద్యకృతులలోను, రగడకృతులలోను, నుదాహరణత్రయమునందును నతఁడీ రగడచ్ఛందోభేదములలోఁ గవిత చెప్పి ద్విపదకుఁ దరువాతఁ దనకు నచ్చినఛందము రగడ యనువిషయమును స్ఫురింపఁ జేయుచున్నాఁడు. ఇతని రచనములందు రగడ యెంత విస్తారముగాఁ బ్రయుక్త మయ్యెనో వివరముగా నెఱింగిన పిదప ద్విపదనువలెనే రగడను గూడ నుద్ధరించి యాతఁడు ఛందోవిషయమునఁ దనకుఁ గలదేశీయాభిమానము నెట్లు ప్రదర్శించెనో కొంత పరిశీలింతము.

రగడ వమాత్రాగణబద్ధ మగుటచేత నిది యొక దేశీయచ్ఛందో విశేషముగాఁ బరిగణింపఁదగి యున్నది. సంస్కృతమునం దీ రగడకుఁ బ్రచారము లేదు. సంస్కృతమునం దయినను నిది దాక్షిణాత్యసంస్కృతకవులచే మాత్రము ప్రయుక్తమై యుండుటచే నిది దక్షిణదేశీయవాఙ్మయప్రభావమువలన నేర్పడియుండునని భావింపనగును. కొందఱు సంస్కృతకవులు దేశీయ చ్ఛందములతో సుపరిచయము కలవారగుటచే సంస్కృత భాషలోనే కవిత్వము చెప్పినను నందు దేశీయచ్ఛందములను, దేశీయసంప్రదాయములను బ్రవేశపెట్టి యుండిరి. క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దికిఁ జెందిన సోమదేవసూరి యను కవీశ్వరుఁడు తన యశస్తిలకచంపు వనుకావ్యమునఁ గొన్ని రగడలను రచించెను. అందలి –

*వికచకర్ణోత్పలస్ఫూర్తి తరలేక్షణాః*
*కేలి తాళక్వణత్కనకమయకంకణాః –*

ఇత్యాది యగురగడ తెలుఁగునందలి ద్విరదగతిరగడకు సరిపోవుచున్నది. తద్గ్రంథవ్యాఖ్యాతకు దేశీయచ్ఛందములతోఁ బరిచయము లేక పోవుటచేతను, గేవల సాంస్కృతికుఁ డగుటచేతను నాతఁడు దేశీయచ్ఛందోభేద మయిన యీరగడ యొక్క వైలక్షణ్యమును గుర్తింపఁజాలక పోయెను. అందది పాదభేదవిరహిత మై, వచనప్రాయముగా వ్రాయఁబడి యుండుటచే నాతఁడు దానిని గద్యముగా భావించెనే కాని, రగడ యనుఛందోభేద మని గుర్తింపఁజాలక పోయెను.

**క్రీస్తుశకము 1022వ సంవత్సరమున – రాజరాజనరేంద్రుని పట్టాభిషేకా నంతరము బేతనభట్టు వ్రాసిన 'కోరుమిల్లి' శాసన మీసందర్భమున స్మరింపఁదగి** యున్నది. అందుఁ బ్రారంభమున గొన్ని సంస్కృతశ్లోకములును, గొంత గద్యభాగమును నయినపిమ్మట నొకరగడ కానవచ్చుచున్నది. ఇం దిరువది యెనిమిది పాదములు కలవు. వానిలో మొదటి యిరువదినాలుగు **పాదములందును నంత్యానుప్రాస మున్నది. మొదటినాలుగు పాదములలోను, తుది నాలుగుపాదములలోను నాదిప్రాసనియమము పాటింపఁబడ లేదు.** ఈరగడకు విజయభద్రరగడ యని పేరు. ఇం దొక్కొక్క పాదమునను నయిదేసిమాత్రలు గలనాలుగుగణములు కలవు. ఇట్లు, కోరుమిల్లి శాసనము నందలి సంస్కృతభాషాగ్రథితమైన రగడలోఁ దెలుఁగురగడలక్షణము కొంత

లోపించినను - దానిని రచించిన కవీశ్వరునికి మాత్రము తెనుఁగురగడతోఁ జక్కనిపరిచయము కల దని మాత్రము నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. నన్నయ భట్టారకునికిఁ బూర్వము రగడలు వ్రాయఁబడుచుండె ననుట కిది చక్కని తార్కాణ మగుచున్నది. నన్నయ కాని, నన్నెచోడుఁడు కాని, రగడను వాడి యుండ లేదు.

తెలుఁగున దీని యునికినిగూర్చి పరిశీలించినపిమ్మటఁ గన్నడమున నీ ఛందము నకుఁ గల ప్రచారప్రయోగప్రాచీనతలను గూర్చి చర్చింతము.

కన్నడమున నృపతుంగుఁ డనుమహారాజు రచించిన కవిరాజమార్గము అను ప్రాచీనలక్షణగ్రంథములో నీ రఘటాచ్ఛందము పేర్కొనఁబడి యుండుటచే నంతకుఁ బూర్వమే యనఁగా క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దమునకుఁ బూర్వమే - నృపతుంగుని కాలము క్రీ.శ. 840 - యది కన్నడములోఁ బ్రచార మంది యుండు నని యూహింప వీలగుచున్నది. పంపమహాకవి తన విక్రమార్జున విజయమను నామాంతరము కల పంపభారతమున లలితరగడ, మందానిలరగడ యనురగడభేదములను వాడి యుండెను. క్రీస్తుశకము పదియవశతాబ్ది చివర కన్నడమున ఛందోఽంబుధి యనుపేర నొకఛందోగ్రంధమును రచించిన నాగవర్మ అవజీ, పాఱగె, ఫుట్టువ, మాలావృత్త, దండక, రఘట, మాత్రార్య, త్రిపది, చతుష్పది, షట్పది, అష్టపది, శంఖా (సంఖ్యా) వృత్త, తాళవృత్తా దులు జాతు లనియు, అక్కర, చౌపది, గీతికె, ఏళె, ఉత్సాహ, షట్పది మొదలగునవి దేశీయజాతు లనియుఁ బేర్కొని యుండెను. అతఁడు పేర్కొనిన పట్టికలో జాతిచ్ఛందోభేదముగా రఘట (రగడ) పేర్కొనఁబడినది. నాగవర్మ పేర్కొనిన యీజాతిభేదము లన్నియుఁ గన్నడమునందు వలెనే తెలుఁగునందును నన్నయకుఁ బూర్వకాలమునం దుండి యుండును. జాతిభేదములలో నొకటి యని పేర్కొనుటయే కాక నాగవర్మ రగడ లక్షణమును, రగడభేదములను గూడఁ దనగ్రంథమునందుఁ దెలిపి యుండెను. ఛందోఽంబుధియందలి యీక్రింది పద్యములు చూడుఁడు:

*క॥ గణనియమవిపర్యాస దొ*
*ళెణెయాదె దొర్బెనయె మాత్రె సమవాగి గుణా*
*గ్రణియ మతదిందె తాళద*
*గణవె గొడు బట్టె దదులె రఘటాబంధం.*

క॥ మందానిల లలితోత్సవ
వెందేరగళె గళసామ మక్కుం క్రమదిం
దొందదె పదునాలిర్ప
త్తొందదె యిర్పత్తునాల్కుమాత్రెగళబలే.

క॥ ఇప్పత్తు మాత్రె లలితెగె
బప్పుదు పదునాఱుమాత్రె మందానిలకం
తప్పుదు వుత్సాహక్కఱొ
యొప్పవు దిప్పత్తునాల్కు మాత్రెగళ బలే.

ఇందు మందానిలము, లలితము, ఉత్సవము నను మూఁడువిధములయిన రగడభేదముల లక్షణములు తెలుపఁబడినవి. ఇవి మూఁడును దెలుఁగునందలి మధురగతి, ద్విరదగతి, తురగవల్గనగతి రగడలకు సరిపోవును.

ఉపలబ్ధము లయిన యాంధ్రఛ్ఛందోగ్రంధములలో మొట్టమొదటి దయిన కవిజనాశ్రయమున రగడలక్షణము చెప్పఁబడ లేదు. క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దికిఁ జెందినవాఁ డైన విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణి యందుఁ జతుర్థోల్లాసమున ముక్తకాదు లగుచాటుప్రబంధములను గూర్చి చెప్పుచు రగడను గూడఁ బేర్కొనెను. అందుఁ దెలుపఁడిన రగడలక్షణ మిట్లు కలదు.

క॥ సరి యా పదిరేకులచేఁ
బరువడి నుత్సాహవృత్తపద యుగళముచే
నిరవుగ వడి ప్రాసంబుల
నరుదుగ రచియింప రగడ యగుఁ దగువృత్తిన్.

**– 4 ఉల్లా. 40 ప.**

ఇం దుత్సాహద్వితయముతోఁ గూడిన రగడ యొక్కటే పేర్కొనఁ బడినది. ఈలక్షణము సమగ్ర మయినది కాదు. అనంతుఁడు మాత్రము రగడలనుగూర్చి సమగ్రముగాఁ జెప్పుచుఁ దొమ్మిది విధము లగురగడ భేదములను వివరించెను. అప్పకవి రగడలను వైతాళీయములలోఁ జేర్చి, యవి యనేకవిధములుగా నుండు నని సూచించి, యందు నవవిధరగడలకు మాత్రమే లక్షణము చెప్పెను.

నన్నయకుఁ బూర్వకాలమున బహుళప్రచారమందుండినను నన్నయాదు లగు శిష్టకవులు వాడనికారణమునఁ గాఁబోలుఁ గవిజనాశ్రయమునఁ దల్లక్షణము

నిర్వచింపఁ బడలేదు. తరువాతి లక్షణగ్రంథములలో దానికిఁ గొలంది కొలఁదిగాఁ బ్రవేశము లభించుచు వచ్చుచుండినహేతువుచేతఁ గాలముగడిచిన కొలఁది నీరగడకుఁ గ్రమముగాఁ బ్రచార మధికమగుచు వచ్చెనని యూహింప నగుచున్నది.

నన్నయకుఁ బూర్వమందుఁ దెలుఁగునను, గన్నడమునను బాగుగా వ్యాప్తిలో నుండి, నన్నయకాలమున నాతని సంస్కృతవృత్తస్వీకారప్రభావముచే మఱుఁగుపడిపోయి యుండిన యీదేశిచ్ఛందోభేదమును పాల్కుఱికి సోమనాథుఁడు చేపట్టి, దానిని దనబహుకృతులందు విశేషముగా వాడి, తెలుగులోఁ గూడఁ దానికిఁ గవిత్వోపయోగిత యను మహాభాగ్యమును గల్పించెను. అతఁడు చేపట్టి దానికిఁ బ్రచారప్రాభవములు గల్పించిన పిదపనే యది తెలుఁగులో నొక ఛందోభేదముగా నిలువఁద్రొక్కుకొని నిలువఁ గలిగెను. రంగనాథాదు లగునితరకవులును నాఛందమును జేపట్టి కవితలు వెలయించిరి. రంగనాథుని శివకవిత్వములో భాగవంగు నయునరగడ, నవంశ్శివాయురగడ, యునంరగడకృతులు సోమనాథునిప్రభావముచే రచితము లయినవే. అట్లు కవీశ్వరులు దానిని జేపట్టి కవితలు వెలయించినపిదపఁ బెద్దనాదు లగులాక్షణికులకుఁ గూడ దానికి లక్షణాదులు నిర్దేశింపక యుండుటకు వీలుకాక పోయెను.

ఇట్లు, పాల్కుఱికి సోమనాథుఁడు దేశీయచ్ఛందోభేదమగు రగడకుఁ గావ్యత్వ యోగ్యతను బరికల్పించి తన దేశీయాభిమానమును బ్రదర్శించెను. ద్విపదకుఁ దరువాత నాతనికిఁ బ్రీతిపాత్ర మయిన దేశిచ్ఛందము రగడ. ఈరెండును నన్నయభట్టారకుని గ్రంథమునఁ గాన రాకుండుటయు – సోమనాథుఁడు వానిని జేపట్టి యుండుటయు ఛందోవిషయమునఁ గూడ నాతని దేశీయాభిమానము నకుఁ బ్రబల మయిన నిదర్శనముగాఁ బరిగణింపఁ దగి యున్నది.

## సీస పద్యము

సోమనాథుఁ డభిమానించి చేపట్టిన ఛందములలో సీసపద్య మొకటి. చతుర్వేద సారము, చెన్నమల్లు సీసములు అను కృతుల నీతఁడు సీసపద్యములతోనే రచించెను. చతుర్వేద సారము నందలి సీస పద్యము లన్నియుఁ దేటగీతులతోను, నాటవెలఁదులతోను వెలయుచున్నవి. అందలి యా యెత్తుగీతులు 'బసవలింగ' యను మకుటమును గలిగి యున్నవి. ఇందు రమారమి నాలుగు వందలసీస పద్యము లుండి యుండు నని తలఁపబడుచున్నది. వానిలో మూఁడు వందల యొక్కటి మాత్రమే నేఁడు పలబ్ధములై ముద్రణ భాగ్యము నంది యున్నవి.

చెన్నమల్లు సీసములు అను లఘుకృతియందు వీరశైవమత విహితము లగు భక్త, మాహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యము లను షట్ స్థలముల విజ్ఞాన స్వరూపము వరుసగాఁ బదుమూఁడు, అయిదు, మూఁడు, నాలుగు, అయిదు, రెండు – మొత్తము ముప్పది రెండు సీసపద్యములలో వర్ణింపఁబడినది. ప్రతిపద్యము చివరను 'చెన్నమల్లు' అనుమకుటము కూర్పఁబడినది. ఇది సోమనాథుని యిష్టదైవమగు శ్రీశైల మల్లికార్జునస్వామి సంబోధన మయి యుండునని యూహింపఁ బడుచున్నది. చెన్నమల్లు అనునది చెన్నమల్లికార్జునుఁడనుటకు సంగ్రహ రూపము. ఇందలి పద్యము లన్నియు సీస పద్యము లని యా గ్రంథనామమే తెలుపుచున్నది. ఇది కాక యీతని ప్రాథమిక కృతి యగు ననుభవసారమునఁ గూడ నటనటఁ గొన్ని సీసపద్యములు గలవు. తొలుత నితఁడు నన్నయ, నన్నెచోడుల వలె సీసపద్యము నొక ఛందో భేదముగా గణించి తక్కిన ఛందములతో సమాన మయిన ప్రతిపత్తినే యొసఁగి వాడి యుండినను చతుర్వేద సారమునాఁటి కాతని కీ దేశీయచ్ఛందముపైఁ బ్రత్యేకాభిమాన మేర్పడి యుండును. అందుచేతనే యాతఁడా గ్రంథమును, నా గ్రంథమునకుఁ గొంచెము ముందు వెనుకలుగా రచింపఁబడిన చెన్నమల్లు సీసములను నాతఁడు ప్రత్యేకించి సీసపద్యములందే రచించి తన దేశీయాభిమానమును బ్రకటించెను. ఇతఁడు తన చతుర్వేద సారమును బద్యప్రబంధ మని –

*'భాషఁ బ్రకటింతుఁ బద్య ప్రబంధముగను*
*వసుధ సత్కావి సమ్మతి బసవలింగ'*

అను నెత్తుగీతియందుఁ బేర్కొని యున్నను నిందలి పద్యము లన్నియు 'బసవలింగ' యను నేకమకుటముతోఁ గూర్పఁబడుటచే దీనిని గణములో గణించుటయే సమంజసముగాఁ గాన్పించును. ఇతనికిఁ దరువాత నాంధ్ర భాషలో శతకములు రచించినవారు కొందఱు తమ శతకములను సీసపద్య ఘటితములుగా రచించుట కీతనియీ చతుర్వేద సారరచనమే యుద్బోధక మయ్యెననిపించును. తాళ్లపాక పెదతిరుమాలాచార్యుని నీతి సీసపద్యశతకమును, నింకను మఱికొన్ని సీస శతకములును దీని ననుసరించినవే. సంస్కృత కావ్యములలో నొక్కొక్క సర్గయు నొక ప్రత్యేక చ్ఛందమున రచింపఁబడినట్లుగా – తెలుఁగున నొక ప్రత్యేక చ్ఛందమును గ్రహించి కడదాఁక నదే ఛందమున రచింపఁబడినట్లుగా – తెలుఁగున నొక ప్రత్యేక చ్ఛందమును గ్రహించి కడదాఁక నదే ఛందములో నిర్వహింపఁబడిన

గ్రంథములు ఇతని చతుర్వేదసారము, చెన్నమల్లు సీసములు అనునవి. సీసపద్యములలో నితఁడు రచించిన గ్రంథములను గూర్చియు, నితర గ్రంధములలో నితఁ డందందుఁ గూర్చిన సీసములను గూర్చియుఁ దెలిసికొన్న పిదప నతఁడీ సీసపద్యమును జేపట్టుటలో నాతని దేశీయాభిమాన మె ట్లభివ్యక్త మయ్యెనో పరిశీలించుట కర్తవ్యము.

సంస్కృత ప్రాకృత లాక్షణికులచే మాత్రాచ్ఛందములుగా గ్రహింపఁబడిన దేశీయ సంప్రదాయ సిద్ధములగు గేయ రచనలో శీర్షక మనునది యొకటి. ఇది దాక్షిణాత్య రచనా విశేష మయిన సీసమునకుఁ బూర్వ రూపము. భరతుఁడు శీర్షక మను పేర నొప్పు నొకగేయ విశేషమును దన నాట్య శాస్త్రమునఁ బేర్కొని యుండెను. అతఁ డందు దానికి మాత్రల సంఖ్యతోను, నక్షరముల సంఖ్యతోను లక్షణమును దెలిపి యుండుటచేత నది దేశీయ రచనమే యనియు, నతని కాలమునఁ గూడ నది బాగుగాఁ బ్రచారమొంది యుండుననియుఁ దెలియు చున్నది. శీర్షితము – అను తాళ భేదముతోఁ గూడి యుండుటచే దాని కాతఁడు శీర్షక మని పేరు పెట్టెను. అదియే తరువాతఁ దెలుఁగులో 'సీస' మయినది. భరతుని నాట్య శాస్త్రమున శీర్షకలక్షణ మిట్లు కలదు.

*'చతుర్మాత్రాగణో జ్ఞేయః పూర్వ చ్ఛందోవికల్పకః*
*అర్ధాష్టమగణాః పాదాః శీర్షకస్య భవంతి హి*
*త్రింశన్మాత్రాశ్చ విజ్ఞేయా యుగ్మో జాక్షరజైః పదైః*
*శీర్షకే హ్యేక వింశత్యా షడ్వింశతి పర స్తథా*
*అక్షరాణాం భవే ద్వృందః పాదే హ్యేకత్ర నిర్దిశః'*

*– నాట్య శాస్త్రము, 32 అధ్యా. 250–252*

భరతుఁడు చెప్పిన యీ శీర్షక లక్షణము కొంచెం మించు మించుగాఁ దెలుఁగు నందలి యొక విధమయిన సీసపద్యముతో సరిపోవును.

ఒక విధముగాఁ జూచినచో సీసమును గూడ రగడ భేదమే యని చెప్పఁదగును. ఏల యనఁగా రగడలు వలె సీసము కూడ నాలుగేసి గణములు గల పాదములను రెట్టింపు చేయుటచే నేర్పడినదే యని లక్షణముఁబట్టి తెలియుచున్నది. కాని, రగడలలో గణములయందలి మాత్రల సంఖ్య యన్నిట సమానముగానే యుండును. కాని, సీసమున నింద్రగణములలోఁ గొన్ని

చతుర్మాత్రాకములును, మఱికొన్ని పంచమాత్రాకములును నగుట మాత్రమే కాక, చివర రెండు సూర్య గణము లుండుచో నియతముగా మూఁడేసి మాత్రల గణవులే వచ్చుట సంభవించునం. అట్లు కాక, పాదమునకు నాలుగేసి దేశీయగణములతోఁగూడిన దళములు రెండుండునని చెప్పినచో నప్పుడు సూర్యగణములు చివర నిలుపుటకును నవకాశ మేర్పడును. ఇట్లు చూచినచో సీసము కూడ నొక రగడ భేదమే యగుచున్నది.

తెలుఁగున నన్నయకుఁ బూర్వ కాలమందే యీ సీసపద్యము ప్రచారములో నుండి నట్లు శాసనాధారముల వలనఁ దెలియవచ్చు చున్నది. కందుకూరు శాసనమందొక సీసపద్యమును, ధర్మవరము శాసనమందొక సీసపద్యమును గానవచ్చుచున్నవి. ఇవికాక పద్మకవి జినేంద్ర పురాణమునుండియు, సర్వదేవుని విరాటపర్వమునుండియుఁ బ్రబంధ రత్నావళియందుదాహరింపఁబడిన పద్యములలో రెండు సీస పద్యము లున్నవి. కందుకూరు శాసనమునందలి సీసము సమసీసము. ధర్మవరము శాసనమునందలి సీస మువకలి ప్రాస సీసము. జినేంద్రపురాణ, విరాటపర్వములందలి సీసములు కూడ సమసీసములే. అందలి యెత్తుగీతులను బట్టి యా కాలము నందు సీసముల చివర నాటవెలఁదులును, దేటగీతులును రెండును జేర్పఁబడుచుండినట్లు తలఁపఁ దగి యున్నది.

ఇట్లు నన్నయకుఁ బూర్వకాలమందుఁ బ్రచలితమై యుండిన సీస పద్యమునకు నన్నయ కవితలోఁ గూడ సముచిత స్థానమే లభించినది. అతఁడు సీసపద్యముల నొకకొన్ని నియమములతో రచించెను. ఇఁక నన్నెచోడుఁడు తన కుమార సంభవమునందు సీసపద్యముల ననేక విధములగు పోకడలతోనడపించి యందుఁ దన కవితా సామర్థ్యమును బ్రకటించెను. తరువాతి కవుల పోకడలు - ముఖ్యముగా శ్రీనాథుని పోకడల నీతని రచనమునఁ గాంచవచ్చును. నన్నయ పాటించిన నియమముల నీతఁడు పాటింప లేదు. కాని, యలంకారార్థము కాఁబోలు నితఁడు సర్వతః ప్రాసము నొకచోఁ బాటించినాఁడు. నన్నయ నన్నెచోడు లిరువురును నీ సీసపద్యమునకు సామాన్య ప్రతిపత్తిని మాత్రమే యొసఁగి తద్రచనమునందు మాత్రము కొన్ని వన్నె చిన్నెలు పచరింపఁ సోమనాథుఁడు తొలుత వారినే యనుసరించినను బిదప సంస్కృత కవుల యనుకరణముచేతఁ గాఁబోలును దానికిఁ గూడ - ద్విపదకును, రగడకును నిచ్చినట్లే ప్రత్యేక ప్రతిపత్తిని గల్పింప నెంచినాఁడు. తత్సంకల్ప ఫలమే యాతని చతుర్వేద సారము, చెన్న మల్లు సీ సములు, అను వాతని గ్రంథములు. సీస పద్యరచనమున నన్నయ

పాటించిన నియమములనే సోమనాథుఁడును దన యనుభవసార, చతుర్వేదసారము లందుఁ బాటించె నని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు తమ బసవపురాణ పీఠికయందు వ్రాసిరి. [1] కాని శివశ్రీ బండారు తమ్మయ్యగారు మాత్రము ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక రజతోత్సవ సంచికలో నన్నయ సీస పద్య నియమమును సోమనాథుఁడు పాటింప లేదనియు, శ్రీ ప్రభాకర శాస్త్రిగారి వాక్యములు సత్యసమ్మతములు కావనియు వ్రాసిరి. [2] స్వతంత్ర ప్రవృత్తి కలవాఁడగు సోమనాథుఁడు నన్నయ సీసపద్య నియమములను బాటించెననుట విశ్వాస్యము కాదు. అందును నన్నయ సీసపద్య నియమములు నన్నెచోడుని కాలమునాఁటికే సడలి పోయినవి. అట్టిచో సోమనాథుఁడు వానినే యనుసరించె ననుట సత్యదూరము. ఏది యేమయినను దేశీయ వృత్త మయిన సీసపద్యము నభిమానము తోఁ జేపట్టి – దాని కొక ప్రత్యేక ప్రతిపత్తి కూడఁ గల్పించి – సోమనాథుఁడుతన దేశీయాభిమానమును బ్రదర్శించినవాఁ డయ్యెను.

ఆంధ్రవాఙ్మయమున నన్నయభట్టారకునికిఁ దరువాత సీసపద్యమున కొక ప్రత్యేక విశిష్టతను జేకూర్చినవాఁడు పాల్కుఱికి సోమనాథుఁ డని తెలిసికొంటిమి. సోమనాథునికిఁ దరువాతఁ బ్రసిద్ధులయిన తిక్కన సోమయాజి, శ్రీనాథుఁడు, పోతన మొదలగు మహాకవు లీ సోమనాథుని సీసములనే యనుకరించిరని చెప్పఁదగును. అందు ముఖ్యముగా శ్రీనాథుని సీస పద్యములకుఁ గల సమత, తూఁగు, ప్రసన్నత యను గుణములకు మూలము సోమనాథుని సీసములే యనినను నతిశయోక్తికాదు. సోమనాథుని చతుర్వేద సారమునందలి కొన్ని సీసపద్యములు మంచి పోకడలను గలిగి యున్నవి. అతఁడు తన సీసపద్యముల చివరఁ జాలవఱకు నాటవెలఁదులనే పొందుపఱచి యున్నాఁడు. శ్రీనాథుఁడు సోమనాథుని సీస పద్యపు టెత్తుగడల నట్లే యనుకరించి యున్నాఁడు. ఈ క్రింది పద్యములు చూడుఁడు:

*సీ॥ హరి వీరశైవుఁ డన్నందుకు మఱియు గర్భాధాన ఖండమే ప్రథమ సాక్షి*
*హరి వీరశైవుఁ డన్నందుకుఁ దన నేత్రకమల మొసంగిన క్రమము సాక్షి*
*హరి వీరశైవుఁ డన్నందుకు శంకరు చేతఁ బొందిన శివగీత సాక్షి*
*హరివీరశైవుఁడన్నందుకు శ్రీ సాంబుఁడనెడి పుత్త్రునిఁ బడసినదె సాక్షి*

---

1. చూ. పుట. **89**, ఆంధ్ర గ్రంథమాల వారిచేఁ బ్రకటితము.
2. చూ. పుట **171**.

గీ॥ ఇన్ని సాక్షులు గాకను వన్నుగాను
ధ్యేయుఁడని శంభుఁ బూజించు తెలివి సాక్షి
గాన సద్ధర్మములను నిక్కంబటంచుఁ
బలుక నొల్లరు కూళలో బసవ లింగ – చతు. 86 ప.

సీ॥ కలహంస సంపద కలకల క్రేంకార కలకలం బైన యీ కొలను సాక్షి
ప్రసవ సౌరభసట ధ్భుంభరం బైన యీవలని లతామండపంబు సాక్షి
ప్రచ్ఛాయ శీతలోపరి భాగ మైన యీ శశికాంతమణి శిలాస్థలము సాక్షి
తరులతాగుల్మ సంతత పిధానాతప వ్యాపారమైన యీ వనము సాక్షి

గీ॥ మకర కేతను పాద పద్మములు సాక్షి
రతి మహా దేవి జఘన భారమ్ము సాక్షి
సత్య మెన్నఁడు నినుఁ బాయ సమ్మతించి
కౌఁగ లింపఁగ నీఁ గదే కమల వదన: – శివరాత్రి 3 – 81

సీ॥ పరవాది మదగజ ప్రబల పంచాస్యుండు పరవాది భూధర స్ఫార యశని
పరవాది మేఘనిర్భర పవమానంబు పరవాది భూరుహప్రథిత పరశు
పరవాది తస్కర పటుతర శూలంబు పరవాది జలనిధి, బాడబాగ్ని
పరవాదిలతలకు భాస్వల్లవిత్రంబు పరవాది భేకి భీకరముఖాహి

గీ॥ దండనాయక బసవఁ డుద్దండ శౌర్యు
డాది పరవాది నిర్వారణార్థబుద్ధి
మతములాటించుఁ జర్చించి మహిత సూక్తు
లొనఁగగడియుంతు ననుమతి బసవలింగ – చతు 16 ప.

సీ॥ పరవాది మత్తేభ పంచననాఖ్యుండు పరవాది మందూక పన్నగుండు
పరవాది నవ మేఘ పవమాన ధీరుండు పరవాది సాగర బాడబుండు
పరవాది కుత్కీల భాసుర దంభోళి పరవాది కేం ధన పావకుండు
పరవాది చయతమః పటలోగ్రభానుండు పరవాది భోగి సుపర్ణుఁ డనఁగఁ

గీ॥ జటుల జైన కోలాహల సమరబిరుద
ఘనుఁడు సంగ్రామపార్థుఁడు వినుత యశుఁడు
శుభుఁడు ముమ్మడి దేవయ్య సుతుఁడనంగ
వెలసె శాంతయ్య విక్రమ వీరవరుఁడు – శివ 1 – 36 ప.

**కందము**

సోమనాథుని గ్రంథములలో ననుభవసార మనుగ్రంథము నందు మాత్రము కంద పద్యములు కానవచ్చుచున్నవి. అందింకను త్రిభంగి, క్రౌంచపదము, తరువోజ, వనమయూరము, మొదలగు విశేష వృత్తములు కూడ రచింపఁబడినవి. చతుర్విధ కందమను పేరఁ జిత్ర కవిత్వమును గూడ సోమనాథుఁ డిందుఁ బొందుపఱచెను. నన్నెచోడుని కుమారసంభవమునఁ గూడ నొక చతుర్విధకందము రచిత మయినది. సోమనాథుని చతుర్విధ కందము దాని కనుసరణము కావచ్చును. ఇదికాక యీతని కందములలో ద్వంద్వ ప్రాస, త్రిప్రాస కలవి కలవు. ఇతని లఘుకృతులలో నక్షరాంకపద్యములు అనుకృతియందు నాద్యంతములలో రెండు కంద పద్యములు కన్నడ భాషలో రచిత మయినవి కలవు. శరణు బసవరగడ యను లఘు కృతి తుదిని గూడ నొక కందము కలదు. అదియుఁ గన్నడ భాషావిరచితమే. కన్నడ ఛ్ఛందమున కనుగుణముగానే యీ మూఁడు కంద పద్యముల యందును బ్రాస మైత్రియే కాని యతిమైత్రి నియమము చూపట్టదు. ఇట్లు చూచినచో సోమనాథుని రచనలలోఁ గందపద్య మంతగాఁ బ్రాముఖ్యము వహింప లేదనియే యూహింపఁ దగి యున్నది. అనఁగా ద్విపద, రగడ, సీసము అను ఛందములు వహించినంత ప్రాముఖ్యము నిది వహింప లేదని తాత్పర్యము. కాని, నన్నెచోడునివలెఁ జతుర్విధ కందమును, ద్విప్రాస, త్రిప్రాస కందములను రచించి యుండుటచే నీ పద్యము విషయమై యీతఁడు తన దృష్టిని బ్రసరింపక పోలేదు. అయ్యు దీని కంతగాఁ బ్రాముఖ్య మీయక పోవుటకు బహుశః కారణ మిది కావచ్చును.

తెలుఁగున నన్నయకుఁ బూర్వమందుఁ గూడఁ గందములు రచింపఁబడు చుండెను. క్రీస్తు శకము 958 సంవత్సరప్రాంతము వాఁడగు సర్వదేవుని యాది పురాణములోనిదిగాఁ బ్రబంధ రత్నావళిలో నొక కందపద్య ముదాహృత మయినది. ఆ పద్యమిది:

*కII హరి నీలమణి విరాజిత*
*సురుచిర గోపురము దగిలి చూచి తమిస్రా*
*కరుఁడు విధుంతుదమండల*
*పరిశంకం జేసి పురముపైఁ జన నోడున్*

క్రీస్తుశకము 980 సంవత్సర ప్రాంతమునం దుండిన అయ్యనభట్టు రచించిన 'అరుంబాకొ' శాసనములో సంస్కృత భాషావిరచిత మయిన యొక కందపద్యము

గలదు. అది తెలుఁగునకు నిసర్గములయిన యతిప్రాస లక్షణములను గలిగి యున్నది, ఆ పద్యమిది:

*క॥ ధవల గుణో ధవళ యశో*
*ధవళిత దిఙ్మండలో ప దమితారాతిః*
*భువభక్తో భువకరుణో*
*ధ్రువభువ భోగాన్వితో విభాతి సుకీర్తిః* – ***22*వ శ్లోకము**

ఇది సంస్కృత భాషలో రచిత మయిన తెలుఁగు కందము. దీనినిబట్టి అయ్యన భట్టు తెలుఁగులోఁ గూడఁ గవియై యుండు ననియుఁ గందపద్య మానాఁడు బాగుగాఁ బ్రచారమందుండి యుండు ననియుఁ జెప్పఁదగును. పయి రెండు సందర్భములను బట్టియు నన్నయకుఁ బూర్వ కాలమునందే యీ కందములు ప్రచారమందుండె నని గ్రహింపఁదగును.

కన్నడమున బ్రాచీన రచనము లయిన చెత్తాణె, బెదండె యను కావ్య భేదములలోఁ గందపద్య బాహుళ్య ముండినట్లు తెలియుచున్నది. ఒక కంద పద్యము తరువాత నొక వృత్తమును రచించి యచ్చటచ్చట జాతులను బొదిగినచో నది 'బెదండె' కావ్య మగును, ఇఁక 'చెత్తాణె' కావ్యమును గందపద్య బహుళముగాఁ జేసి యక్కడక్కడ సుందర వృత్తములను అక్కర, చౌపది, గీతిక, త్రిపది మొదలగు వాని నందముగాఁ జేర్పవలయును. ఈ లక్షణములు కవి రాజ మార్గమున దెలుపఁబడినవి. ఇఁకఁ గన్నడమునందలి ప్రాచీన లక్షణ గ్రంథమగు కవిరాజ మార్గమునందుఁ గొన్ని వృత్తములును, గీతికలును నున్నను నందుఁ గందపద్యములే యధికముగాఁ గలవు. పంపాదుల రచనములలో నివి యచ్చటచ్చట మాత్రమే కానవచ్చుచున్నవి. దీనిని బట్టి కన్నడ భాషలోఁ గందపద్యమునకుఁ బ్రాచీనకాలములో నుండిన ప్రాముఖ్యము క్రమక్రమముగాఁ దగ్గుచు వచ్చెనని తెలియుచున్నది.

తెలుఁగున నన్నయకుఁ బూర్వపు సంగతి యెట్టిదో తెలిసికొంటిమి. అతని భారతభాగములో గూడఁ గంద పద్యము లధిక సంఖ్యలోనేకలవు. కాని యాతని కవితలోఁ గన్నడమునందలి పంపభారతమునందు వలెనే సంస్కృత వృత్తములకుఁ బ్రాముఖ్యము హెచ్చుగా నొసఁగఁబడినది. అతనికి సుమారొక శతాబ్దకాలము తరువాతివాఁ డయిన మల్లికార్జున పండితారాధ్యుఁడు తన శివతత్త్వ

సారమును గందపద్యమయముగా రచించెను. అతఁడు మఱొక ఛందములోఁ బద్యమును విరచింపలేదు. నన్నెచోడుఁడు తన కుమార సంభవమునం దితర పద్యములతోఁబాటు కందపద్యములను గూడ బాగుగా వాడి యుండెను. కాని యాతని పద్యములలోఁ గందపద్యముల సంఖ్యయే యధికము. అతని కుమార సంభవమున మొత్తము 534 కందపద్యములు కలవు. ఈ సంఖ్యనుబట్టియే కాక, యితర పద్యముల కంటె నీ పద్యమున కితఁడిచ్చిన ప్రాముఖ్యమును బట్టి కూడ నన్నెచోడునికిని నీపద్యమనిన విశేషాభిమానమని తెల్లమగుచున్నది. ఇట్లు శివకవులయిన మల్లికార్జున పండితుఁడును, నన్నెచోడుఁ డును గందపద్యము నభిమానించి యాదరింపఁగా వారి ననుసరించి యాపద్యమునందే యధికముగాఁ గవిత్వము చెప్పవలసినవాఁ డగు సోమనాథుఁడు ద్విపద, రగడ, యను వానికిఁ గల గానానుకూలత యను యోగ్యతను బట్టియో - లేక వారికంటె విలక్షణముగా మఱొక దేశిచ్ఛందమును ప్రచారమునకుఁ దేవలయు నను సంకల్పము చేతనో కంద పద్యము నంతగా నభిమానింపక ద్విపదాదుల నభిమానించుట జరిగిన దని యూహించుటలోఁ దప్పులేదు.

కందము జాతులలోఁ జేరిన పద్యము. దక్షిణ దేశ భాషా సంప్రదాయములకు సరిపచ్చు మాత్రాగణ చ్ఛందములోని యార్యాజాతి భేదమే యీ కందపద్యము. ప్రాచీన దేశీయ కవిత్వములో దీనికత్యంత ప్రాధాన్యము కలిగి యుండవచ్చును. ఆర్యా గీతియే ప్రాకృత భాషలో 'ఖండిసీ' యను పేరుతో వ్యవహరింప బడుచుండెను. అదియే ప్రాకృతము మూలముగా దక్షిణ దేశభాషలలోఁ బ్రవేశించి యుండవచ్చును. ఈ భాషలలోఁ బ్రవేశించిన వెంటనేవానికి సహజము లయిన యితర లక్షణములను గూడ నది స్వీకరింపక తప్పలేదు. కన్నడములోఁ బ్రాస నియమమును, దెలుఁగున యతిప్రాస నియమమును, నుభయ భాషల యందును బ్రాస పూర్వాక్షర నియమమును నది స్వీకరించిన నూతన లక్షణములు. ఇట్లీ కందపద్యమొక దేశి చ్ఛందోభేదము. పూర్వ కవ్యనురోధమున నైనను నా ఛందమున గొన్ని పద్యములు విరచించి యు, నందుఁ జిత్రకవిత్వ మును వెలయించియు సోమనాథుఁడు తన దేశీయాభిమానమును బ్రదర్శించెను. అనుభవసారము నందాతఁడు రచించిన చతుర్విధ కందమును, ద్విప్రాస, కందములను దిలకింపుఁడు.

## చతుర్విధ కందము :

### ప్రథమ కందము:

క॥ శ్రీ రుద్రు నీలగళుఁ ద్రిపు
రారిం గొలువంగ భవ భయాదులఁ దెలియున్
దా రుద్రుఁడైన త్రిపురవి
దారిం దలఁపంగఁ దలఁపు దానై కలియున్ (234)

### ద్వితీయకందము

క॥ కొలువంగ భవ భయాదులఁ
దెలియున్ దా రుద్రుఁ డైన త్రిపుర విదారిం
దలఁపంగఁ దలఁపు దానై
కలియున్ శ్రీ రుద్రు నీలగళుఁ ద్రిపురారిన్ (235)

### తృతీయ కందము

క॥ తా రుద్రుఁ డైన త్రిపు రవి
దారిం దలఁపంగఁ దలఁపు దానై కలియున్
శ్రీరుద్రు నీలగళుఁ ద్రిపు
రారిం గొలువంగ భవ భయాదులఁ దెలియున్ (236)

### చతుర్థకందము

క॥ తలఁపంగఁ దలపు దా నై
కలియున్ శ్రీరుద్ర నీలగళుఁ ద్రిపురవిదారిం
గొలువంగ భవ భయాదులఁ
దెలియున్ దా రుద్రుఁ డైన త్రిపురవిదారిన్ (237)

## ద్వంద్వ ప్రాస కందములు :

క॥ క న్నిడునే పదుపతులకుఁ
దన్నిడునే భక్తుఁ డన్య దైవంబులకున్
వె న్నిడునే భవములకును
మున్నిడునేమనము విషయములకు మహాత్మా! (118)

కll చేరునె మానవ సంగతిc
గోరునె దుర్వ్యసన సుఖముc గుటిలాత్ముండై
పాఱునె సుఖ గోష్ఠి యెడం
గోరునె పరధన నిషక్తి గుణ రత్న నిధీ! (119)

కll కొనునే నిషిద్ధ పాకము
వినునే శివదూషణంబు వే ఱొక త్రోవం
జనునే సద్భక్తుcడ నే
ననుచే గర్వించి భక్తి యందు మహాత్మా! (120)

కll కూడునె యుపాధి గుణముల
నోడునె వంచించి యవసరోచితముల రెం
డాడునె సద్భక్తుcడు గొం
డాడునె భవ విపినముల మహానందాత్మా ! (121)

కll జాఱునె నియమవ్రతముల
మీఱునె శివునాజ్ఞ నెందు మితి గడవక మున్
పాఱునె పలు త్రోవలకును
దా ఱునె భక్తుండు భక్తతతిc ద్రిపురారీ ! (122)

కll పెట్టునె భక్తుcడు భవికిని
మెట్టునె ము న్నన్య పదము మెయ్యెఱుపులcదా
ముట్టునె లింగానర్పిత
మెట్టైనను బ్రతుకc దలcచునే త్రిపురారీ ! (123)

ద్విపద, తరువోజ, రగడ, సీసము, కందము - అను దేశిచ్ఛందో భేదములలోc గవిత్వము చెప్పి సోమనాథుcడు ఛందో విషయమున సాధించిన దేశీయత యెట్టిదో యీ ప్రకరణమునందుc బరిశీలించితిమి. ఈ క్రిందిపట్టికలో నాతcడు వాడిన యీ ఛందముల విస్తృతి స్వరూపము ప్రదర్శింపcబడినది. చూడుడు:

| ఛందోభేదము | బసవ పురాణము | పండితారాధ్య చరిత్రము | అనుభవ సారము | చతుర్వేద సారము | వృషాధిప శతకము | సోమనాథ స్తవము | చెన్నమల్లు సీసములు | ఉదాహరణ గ్రంథములు | ఇతరలఘు కృతులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ద్విపద | 12,609 పంక్తులు | 22,252 పంక్తులు | | | | 254 పంక్తులు | | | | 35,115 పంక్తులు |
| రగడ | | | | | | | | 384 పంక్తులు (128 (బస సం) 128 (బస తె) 128 (పండి)) | 67 (పంచ) 118 (సోమ) 50 (లక్ష) 108 (శరణు) 121 (చెన్న) 464 పంక్తులు | 848 పంక్తులు |
| తరువోజ | | | 2 పద్యములు | | | | | | | 2 పద్యములు |
| సీసము | | | 23 పద్యములు | 301 పద్యములు | | | 34 పద్యములు | | | 358 పద్యములు |
| కందము | | | 162 పద్యములు | | | | | | 2 (లక్ష) 1 (బస. కన్న) 1 (శరణు. కన్న) 3 (చెన్న. కన్న) | 169 పద్యములు |
| ఉత్పలమాల | | | 14 పద్యములు | | 76 పద్యములు | | | 4 (బస తెను) | 3 (లక్ష) | 97 పద్యములు |
| చంపకమాల | | | 23 పద్యములు | | 33 పద్యములు | | | 5 (బస.తెను) | 35 (లక్ష) | 96 పద్యములు |
| మత్తేభము | | | 5 పద్యములు | | | | | | | 5 పద్యములు |
| శార్దూలము | | | 5 పద్యములు | | | | | 8 (బస. సం) 10 (పండి) | 1 (పంచ) 1 (సోమ.సం) | 25 పద్యములు |

223 పద్యములు సంస్కృత వృత్తములు (ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము, శార్దూలము)

| ఛందోభేదము | బసవ పురాణము | పండితారాధ్య చరిత్రము | అనుభవ సారము | చతుర్వేదసారము | వృషాధిప శతకము | సోమనాధ స్తవము | చెన్నమల్లు సీసములు | ఉదాహరణ గ్రంధములు | ఇతరలఘు కృతులు | మొత్తము | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మహాస్రగ్ధర | | | 1 | | | | | | | 1 పద్యము | 14 పద్యములు విశేష వృత్తములు |
| త్రిభంగి | | | 1 | | | | | | | 1 పద్యము | |
| క్రౌంచపదము | | | 1 | | | | | | | 1 పద్యము | |
| మాలిని | | | 1 | | | | | 1 (సం బస) | 6 (బసవపంచ)<br>1 (లక్షరాంక) | 9 పద్యములు | |
| వనమయూరము | | | 1 | | | | | | | 1 పద్యము | |
| మానిని | | | 1 | | | | | | | 1 పద్యము | |
| ఆర్యా | | | | | | | | 1 (సం. బస) | | 1 శ్లోకము | 86 సంస్కృత శ్లోకములు |
| వసంత తిలకము | | | | | | | | | 8(వృషభాష్టకము) | 8 శ్లోకములు | |
| సంస్కృతశ్లోకములు | | | | | | | | | 1 (బసవపంచ)<br>1 (వృషభాష్ట)<br>24 (త్రివిధ లింగాష్ట) | 26 శ్లోకములు | |

## (iii) దేశి వర్ణనలు

సోమనాథుని దేశికవిత్వములో నాతఁ డందందుఁ జేసిన వర్ణనలును నొక విశిష్ట విభాగముగా బరిగణింపఁదగి యున్నది. భాషాంతరీకరణ కర్తలు సాధారణముగా మూలమునందలి భావమునే గ్రహింతురుగాన వారికి మూల గ్రంథము మార్గదర్శకముగా నుండి విశేష సహాయ మొనర్చును. ఒకవేళ ప్రతిభావంతులయిన కవీశ్వరులు మూలమునకుఁ గొంత మెఱుఁగు వెట్టినను గూడ నందుఁ గవియొక్క యుత్పాద్యశక్తియుఁ బ్రతిభయు విశేషముగా వ్యక్తమగుటకు నంతగా నవకాశము లేదు. కవియొక్క కల్పనాశక్తియు, భావనా పటిమయు నుత్పాద్య కావ్యములందలి వర్ణనవైచిత్రి, యలంకారరచనము, ఔచితీ పరిపోషణము, రసనిర్వహణము, పాత్రచిత్రణము, శైలి మొదలయిన యంశములందుఁ బ్రస్ఫుట మగుచుండును. సోమనాథునిరచితము లగు గ్రంథములలో బసవ పురాణము, పండితారాధ్యచరిత్రము అను రెండు గ్రంథములు తప్పఁ దక్కిన వానిలోఁ గొన్ని శైవ మత ధర్మ ప్రతిపాదకములును, గొన్ని కేవలము స్తోత్రరూపములగు రచనలను నయియున్నవి. ఆ గ్రంథములలోఁ గవిత్వాంగములగు పయివానిని బ్రదర్శించుట కవకాశము లేదు. బసవపురాణ, పండితారాధ్య చరిత్రములు రెండును స్వతంత్ర కావ్యములు, ఆంధ్రీకరణములో, యనుసరణములో కావు. కావ్య నాయకు లయిన బసవేశ్వర, పండితారాధ్యుల జీవిత చరిత్రముతోఁ బాటు కావ్యములలోఁ బెక్కురు పురాతన నూతన భక్తుల భక్తి చరితములును నభివర్ణింపఁబడినవి. అందుచే వాని యందు వర్ణనాదులగు కావ్యాంగములకు నవకాశము మిక్కుటము, ఇదియును గాక యవి సంస్కృతమూలకములు కాక స్వతంత్ర కావ్యము లగుటచే నందలి వర్ణనాదులు సోమనాథుని స్వకపోలకల్పితములు, అవి యాతని కావ్యనిర్మాణశక్తికిని, భావుకత్వ ప్రతిభకును బ్రబలతార్కాణములు. ఉత్పాద్య కావ్యములే యయినను నా కావ్యములను రచించిన కవీశ్వరుఁడు సంప్రదాయవిధేయుఁడును, సంస్కృత మార్గ ప్రభావముచేఁ బ్రభావితుఁడును నగుచో నందలి వర్ణనాదు లివివిధాంశములు పేరునకు స్వతంత్రము లయినను నొకే మూసలోఁ గరఁగిన యచ్చుదిమ్మల వలె వైవిధ్యమును, వైలక్షణ్యమును లేక యేకాకారములై యేవపుట్టించును. సోమనాథుఁడు తన పండితారాధ్య చరిత్రమునందలి యవతారికలో కావ్యకలాను క్రమణిక యను కవితాప్రశంసలోఁ దన కావ్య నిర్మాణాశయములను వెల్లడించుచు నిట్లు పేర్కొనెను:

'సత్కృతి యన నూత్న సంగతి దనరఁ
దొమ్మిది రసములు దులకాడ, దాని
యిమ్మడి వర్ణన లెసఁగంగ, ద్విగుణ
మగు నలంకారంబు లనలార, దాని
ద్విగుణార్థ భావముల్ దీటుకొనంగఁ
దేట తెనుంగున ద్విపద రచింతు' – పండి (౧) 18 పు.

ఇతని కించుక పూర్వుఁ డగు నన్నె చోడుఁడు కూడ తన కుమార సంభవమునందలి కృత్యవతరణికలోఁ దన కవితాశయముల నిట్లు ప్రస్ఫుటముగావించెను. చూడుఁడు:

కII వన జలకేళీ రవి శశి
తనయోదయ మంత్రగతి రతక్షితి వరణాం
బునిధి మధు బుతుపురోద్వా
హన గవిరహ దూత్య వర్ణనాష్టాదశమున్ – 1 ఆ. 44 ప.

వII పరిపూర్ణంబై దశ ప్రాణంబుల సప్రాణంబై నవరస భావ భరితంబై షట్త్రింశదలంకారా లంకృతంబై రమణీయంబైన దివ్య కథారంభంబున కభిముఖుండనై. – 1 ఆ. 45 ప.

నన్నెచోడుని యవతారిక ననుసరించి సోమనాథుఁడును దన యవతారికలో నవరస భరితముగను, నష్టాదశవర్ణన సముపేతముగను, షట్త్రింశదలంకార యుక్తముగను, దానికి ద్విగుణ మగు వివిధ భావ సంపన్నముగను దేటతెనుఁగునఁ దాను దన కావ్యమును బరికల్పింతు ననెను. సంప్రదాయము ననుసరించి యాతఁ డట్లష్టాదశవర్ణనము లొనరింతు నని ప్రతిజ్ఞ గావించినను నాతని ప్రకృతిని బట్టి యాతఁడట్టి లాక్షణిక నియమములకు లోఁబడునట్టి ఘటము కాదు. కావ్యములో నివ్వి వర్ణనలే, యీవర్ణనలే యుండవలె ననుట కావ్యకళ క్షీణదశ నొందిన నాఁటి సంప్రదాయము. అష్టాదశవర్ణనలు మాత్రమే యుండవలె ననుట యేమి అంత కింకను నెక్కువ వర్ణనలు కూడఁ జేయవచ్చును. కావ్యము యొక్క యవసరమునుబట్టి యావర్ణనము లుండవలెను కాని, వర్ణనము లను వనిగట్టుకొని యవసరము లేనియపుడును చొప్పించుట యస్వతంత్రుని, యసమర్థుని లక్షణము. అందుచేతనే కావ్య నిర్మాణ విషయమున స్వతంత్ర ప్రవృత్తి కల

సోమనాథుఁడీ పదునెనిమిది విధము లయిన వర్ణనలనేకాక వానికి మున్మడి, నలుమడి వర్ణనలను కూడఁ గావించెను, అతఁడు తన కావ్యములందుఁ జేసిన వర్ణనలలో నీ పదునెనిమిది విధములయిన వర్ణనములు కూడఁ గలవు. కావ్యమున నష్టాదశ వర్ణన లుండవలెనని యాతఁడు జెప్పిన దానికిఁ దాత్పర్యము కావ్యములో వర్ణింపఁదగు వర్ణన లాసంఖ్యకుఁ దక్కువ పడఁగూడదు. కావ్యము వర్ణన బహుళముగా నుండవలెను – అని.

దీనినిఁబట్టి యతని కావ్యములలో నష్టాదశవర్ణనములు మాత్రమే కాక యింకను బెక్కు తెఱఁగు లయిన వర్ణనలు కలవని తెలియుచున్నది. కావ్యములందు వర్ణింపఁదగు నీ యష్టా దశవర్ణనములనుగూడ నీవర్ణన మిట్లు చేయవలయునని లాక్షణికానుశాసనము కలదు. ప్రాచీన లాక్షణికులు తమ లక్షణ గ్రంథములలో నీ యష్టాదశవర్ణనల లక్షణములను లక్ష్యయుక్తముగాఁ బ్రదర్శించి యున్నారు. కాని, వారు పేర్కొనిన యష్టాదశవర్ణనములలోఁ గొన్నింటిని దన కావ్యము లందు వర్ణించు పట్టులలోఁ గూడ సోమనాథుఁ డా లాక్షణికుల నియమమునకుఁ గట్టుపడినట్లు కానరాదు. ఆవేశపరవశుఁడై యాయావర్ణనములను దాను స్వతంత్రముగాఁ దన బుద్ధికి గోచరించిన తెఱఁగున నభివర్ణించినాడు. ఇతని తరువాత వెలసిన యితర కవులెవ్వరును గూడ నీ విషయమున నితని ననుసరించినట్లు కానవచ్చుట లేదు. వారెల్లరును సంప్రదాయ విధేయులయి యే, యాయాయి వర్ణన ఘట్టములను దీర్చిదిద్దిరి. అందుచే వర్ణనల విషయమున నీతఁడవలంబించిన పద్ధతి వినూతనము, విలక్షణము. అది మార్గపద్ధతికి విరుద్ధము. అందుచే భిన్నము. కనుకనే యాతని వర్ణనలచ్చుముగా దేశివర్ణనలు – అనుట.

ఇతని వర్ణనములలో మఱొక విశేషము కూడఁ గలదు, సోమనాథుఁ డష్టవిధకవిత్వములను చెప్పఁగలవాఁడయినను నతఁడు వారిలో ముఖ్యముగా వాచకుఁడను తెగకుఁ జెందును. వర్ణనలు చేయునప్పుడతఁ డొకటి రెండు విషయములను మాత్రము చెప్పి తక్కిన వానిని వ్యంగ్యార్థ్వనులకు విడిచిపెట్టక తాను జేపట్టిన విషయమును సంపూర్ణముగా, సవిస్తరముగా వర్ణించినఁగాని యతనికిఁ దృప్తి యుండదు. ఈ విషయమున నాచన సోమనాథుఁ డితనికి శిష్యుఁడగు. అతఁడును నితని వలెనే వర్ణ్యమును బహుభంగులఁ బ్రదర్శించును.

సోమనాథుని సర్వజ్ఞతాశక్తి యాతని కృతులలోఁ బలు తావులందు బహుభంగులఁ బ్రస్ఫుటముగాఁ గానవచ్చుచుండును. కాని యపరిచితములును, ననుభవ దూరములును నగు చౌర్యము, ద్యూతము, విటత్వము, రసవాదము, వైద్యము మున్నగు నసాధారణ విషయము లను వర్ణించునపుడు కూడ సోమనాథుఁడు ప్రకటించు ప్రతిభఁ బొడగన్న నాశ్చర్యము కలుగక మానదు.

ఇతని వర్ణనలు దేశితనము తురంగలించునవి. సంపూర్ణములు, వాచ్యములు. ధ్వనివలె వ్యజ్యమానములు కావు. మఱియునవి సర్వజ్ఞతా స్ఫోరకము. ఇవి యాతని వర్ణనలప్రత్యేక లక్షణములు.

సోమనాథుఁడు తన కావ్యములందు వెలయించిన వర్ణనలను 1. సంప్రదాయసిద్ధము లగు వర్ణనలు, 2. స్థిరరూపవర్ణనములు, 3. చలరూపవర్ణనములు, 4. సహజ వర్ణనములు, 5. అద్వితీయ వర్ణనములు (unique discriptions) నవి ప్రధానముగా నయిదు విభాగముల క్రింద వర్గీకరింపవచ్చును.

**1. సంప్రదాయ సిద్ధములగువర్ణనములు:**

లాక్షణికులు పేర్కొనిన యష్టాదశవర్ణనములలో సూర్యోదయవర్ణనము, సూర్యాస్తమయవర్ణనము, చంద్రోదయవర్ణనము, పుత్రజననము, పర్వత వర్ణనము అనునవి సోమనాథుని కావ్యములలోఁగూడఁ గానవచ్చుచున్నవి. వానిలో నాతఁడు కావించిన ప్రభాతవర్ణన మిది చూడుఁడు :

'అంత వెండియుఁ బండితారాధ్య దేవుఁ
డంతకాలమూర్తి య ట్లొక్కనాఁడు
శ్రీపదంబు తాను శిష్యవర్గంబు
సుప్రభాతమున నుత్సుకత మేల్కాంచి
మసలి చుక్కలు కాంతి మాయక మున్న
యమునాంబుధ్వాన మలరక మున్న
శోభాలయంబుల సెలయు దీపములు
ప్రబల వెడ వెలువెల్లఁ బాఱక మున్న
వరలు వెన్నెల వరవర గాక మున్న
సరసిజంబులు మొగి విరియక మున్న

జిగి సెడి కలువలు మొగుడక మున్న
మొగిఁ జకోరములు నోర్మూయక మున్న
చొక్కి యొక్కొక యెడ సుఖియింపఁదలఁచి
జక్కవల్ గవఁగూడఁ జరకట మున్న
దినమణి దన పూర్వ దిక్పతిమీఁద
మనసెత్తి పదపాటి మఱవక మున్న
తొలుకోడి కనువిచ్చి నిలిచి మై వెంచి
జలజల ఱెక్కలు సడలించి నీల్గి
ముక్కున నీఁకలు సక్కొల్పి కడుపు
వెక్కించి మెడ సాఁచి నిక్కి మున్ సూచి
కుక్కుఱో కో యని కూయక మున్న
ప్రబ్బతనాథ ప్రబ్బతనాథ యనుచు
నుబ్బి నీర్కోళ్లు గూ యుడుగక మున్న
ననురాగ లీల నాత్మారామమునకుఁ
జని పుష్పములు గోయు సమయంబునందు'

– పండి *1–261, 262,* పుటలు

ఇందుఁ ప్రభాత కాలమున నీరుకోళ్లు కూయుటను దెలుపుచు నవి పర్వతనాథ, పర్వతనాథ యని కూ యిడునట్లు వర్ణించి సోమనాథుఁడీ ప్రభాతవర్ణనమునకు శైవకవిత్వ ధర్మము సోఁకునట్లు చేయుట గమనింపఁ దగి యున్నది.

చంద్రోదయ, సూర్యాస్తమయాదివర్ణనములలో సోమనాథుఁడు తక్కిన కవులవలెఁ గాకవానిని గేవలము కథాసందర్భముల కనుగుణముగమేళవించిన విన్నాణ మెన్నఁదగి యున్నది. బసవపురాణములోని యీ సూర్యాస్తమయ వర్ణనమును దిలకింపుఁడు:

'బసవని భక్తి ప్రభాపటలంబు
దెసల్వసుంధర దివి దీటుకొనఁగ
దినకరుఁ డాత్మీయ తేజంబు దఱుఁగు
డును మది లజ్జించి చని యపరాబ్ధిఁ
బడియెనో యన్నట్లు భానుండు గ్రుంకె'     – బస. *3–131*

బసవేశ్వరుని భక్తి ప్రభావటలమంతటను బర్వంగా సూర్యుఁడు తన తేజము తఱుఁగుటకు సిగ్గుపడి యపరాబ్ధి యందుఁ గ్రుంకెనో యన్నట్లుగా సూర్యుఁడస్తమించె నఁట! అందే యతఁడు గావించిన చంద్రోదయవర్ణనమిది:

'మలసంహరుఁడు జటామకుటంబు మీఁద
నిలిపియు నాకందు నెఱిఁబుచ్చ లేఁడు
భక్తుల పాదసంస్పర్శనంబునను
వ్యక్తిగా నిర్మల త్వంబుఁ బొందుదును
అని యాత్మఁ దలపోసి యరుదెంచు మాడ్కి
వనజారి ప్రాఙ్ముఖంబున నుదయించె
బసవని సితకీర్తి పర్వెనా, శివుని
భసితాంతరాగప్రభలు పర్వె నాఁగ,
నారుద్రునట్టహాసాంశులు దనరె
నా, రజతాచల చారు దీధితులు
విలిసిల్లె నా, నభోవీధి నెల్లెడల
నెలకొని యచ్చ వెన్నెల వెల్లి విరియ' —3-140 పుట.

పరమేశ్వరుఁడు తన జటామకుటము మీఁద నిలిపియు నాలోని మచ్చను మాప లేదు. భక్తుల పాద సంస్పర్శచేతనైనను నేను నిర్మలత్వమును బొందుదును గాక యని తలపోసి చంద్రుఁడు ప్రాగ్దిశ యందుదయించెనఁట; బసవేశ్వరుని సితకీర్తి పర్వెనో యనునట్లుగాను, శివుఁడు తన శరీరము పై నలఁదికొనిన భసితాంగరాగముయొక్క కాంతులు వ్యాపించెనో యనునట్లును, రుద్రుని యొక్క యట్టహాసకాంతులు తనరెనో యనునట్లును, రజతాచలము యొక్క చారు దీధితులు విల సిల్లెనో యనునట్లును నచ్చ వెన్నెల వెల్లివిరిసినదఁట:

ఇందలి చంద్రోదయ చంద్రికావర్ణనలు హృదయంగమములు, కావ్యగతము లయిన వర్ణనములను గథాసందర్భముతో జోడించి కూర్చు నీ పద్ధతి విలక్షణము.

సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనముల నిట్లు కథా సందర్భముతోఁ గలిపి రచించు నీ విధానము నన్నె చోడుని కుమారసంభవమునందును గలదు. కుమారసంభవములోని యష్టమాశ్వాసమునందలి యీ సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనములను దిలకింపుఁడు:

క॥ ఈ హారుఁ డగుసుత నేఁడు వి
వాహంబై పడయు మాకు వల్లభు నని యు
త్సాహమునఁ జెలఁగుగతిఁ బురి
గేహంబులఁ జెలఁగెఁ గలయఁ గృకవాకంబుల్ 8–183

గీ॥ హరు వివాహమునకుఁ గర మనురక్తుఁ డై
వరుస జగములెల్ల వసుమయంబు
సేసెనో రయమునఁ జిత్రభానుఁ డనంగ
వసుసమూహిఁగప్పె వసుధ యెల్ల 8–191

స్తమయవర్ణనము:

క॥ మృదుబలము లుర్వి గ్రక్కిన
విడిసిన దశశతకరుఁడు విడియఁగఁ దన కె
య్యెడ నెడసొలక యరిగిన
పడువున నపరాద్రి సందనవనమున కరిగెన్ 8–86

కావర్ణనము:

తే॥ ఈశు నుద్వాహమున కమరేంద్ర దిగ్వి
లాసవతిపైఁడి పాళియఁబోసి తెచ్చు
జాదరలొ నాఁగ రాగపూర్ణోదయేందు
బింబమునఁ బొండు కిరణాంకురంబు లెసఁగె 8–112

ర్ణనమునం దీ యిరువురుఁ ద్రొక్కినయీ త్రోవ తిక్కనకును ననుసరణీయ ట గమనార్హము. తిక్కన సోమయాజియు నిట్లేకథాసందర్భముతో జోడించి ము నొనరించి యున్నాఁడు. చూడుఁడు:

గీ॥ ద్రుపదనందన పరిభవదుఃఖమునకు
నుల్లమున దురపిల్లుచు నున్న నరసి
వేఁడి నిట్టూరుపో యన వెడలెఁ గ్రొత్త
తావి మూతులు విచ్చు నెత్తమ్మి విరుల

– భార. విరా. 2–236 వ.

ఉద్యోగపర్వమునందలి ప్రాతఃకాలవర్ణన పద్యమిది:

గీ॥ తన కులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రు
లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట
కుమ్మలించి వివర్ణత నొందినట్లు
గంది యెంతయుఁ జెలు వేదెఁ జందురుండు

– భార. ఉద్యో. 2–107 ప.

ఇతఁడు బసవపురాణమునఁ గావించిన గర్భధారణ, పుత్రోదయ వర్ణనములు మనోజ్ఞములు, విలక్షణములు. చూడుఁడు:

'మగువ కంతట నెలమసలెఁ దోడ్తోన
తగు గర్భ చిహ్నముల్ దా నంకురించె
నమృతాంశుఁ డగుపుత్త్రుఁడతివ గర్భమున
నమరి యుండుట నొక్కొ యాఁకలి గాదు,
జలజాక్షి కడుపున సద్భక్తి రుచికుఁ
డలరుటనో రుచు లరుచు లై తోఁచెఁ
బాండురాంగుని మూర్తి పడఁతి గర్భమున
నుండుటనో వెలఁ బొందె మైఁదీఁగ,
పడఁతి శీలవుఁ జూలు భవపాకములకు
నోడఁబడకునికినో యోకిళ్లు పుట్టెఁ,
గ్రాలుచు సుతునిరాకకు నోరు దెఱచు
లీలనో నతి కావులింతలు పుట్టె,
శివమూర్తి దనకు లోనవుటనో తవిలె
శివయోగనిద్ర నాఁ జెలువకు నిద్ర,
కాలకంధరుమూర్తి గడుపున నునికి
నో లలితాంగి చన్మొనలు నల్లొక్కొ,
బెనుపుగ శివమూర్తి వనిత గర్భమునఁ
దనరనో నడుము పేదఱిమి దోనాడె,
యోగీంద్ర హంసుఁడయ్యువిద గర్భమున
దాగిల్లుటనొ నడ వేగంబు వదలె,
ననఁగ మానిని గర్భ మంతకంతకును

వినుపారి తనుపారి పెనుపారి పొదలి
నవమాసములు నిండ నందీశమూర్తి
నవకమై కడుపులోనన మవ్వ మొలచె,
... ... ...
... ... ...
''గోమలి యుదరంబులోన
నున్న మహాత్ముని హృన్నలినంబు
దాన యై వెలిఁగెడు తత్పరంజ్యోతి
వానిఁ బ్రబోధించి 'వచ్చిన పనులు
మఱచితే' యనవుడు నెఱిఁగి సద్భక్తి
యఱుకువ గాకుండ సాష్టాంగ మెఱఁగి
ప్రీతిఁ బుత్రుఁడు మోడ్పుఁజేతులతోడ
నా తల్లిగర్భంబునం దుదయించె:

– బస 1–31, 36 పుటలు

ఇతఁడు బసవపురాణముననుు, బండితారాధ్య చరిత్రమునను పర్వత వర్ణనము గావించి యున్నాఁడు' బసవపురాణమున సకలేశ్వర మాదిరాజయ్య గారి కథలోను, పండితారాధ్య చరిత్రమునఁ బర్వత ప్రకరణమునందును శ్రీశైలము మిక్కిలి మనోహరముగా వర్ణింపఁబడినది. ఈ యుభయ స్థలములందును నతఁడు కావించిన పర్వత వర్ణనము లాక్షణికులు విధించిన వర్ణనాంగములతోఁగూడినది కాదు. స్వతంత్రమై చెలువారుచున్నది. భక్త్యావేశపూరితుఁడయి యాతఁడు చేసిన శ్రీశైల వర్ణనము – అది యొకపర్వత మాత్రముగాఁ గాక – వర్ణనము చదివినంతనే దానిపై నెనలేని పవిత్ర భావమునం, భక్తిప్రపత్తులును, గౌరవాదరములను గలిగించుటయే కాక యెట్టయెదుట నా పర్వత రాజము నిలిచి పొలుచుచున్నట్లే తోఁచును. బసవపురాణములోని శ్రీశైలవర్ణన సందర్భమునందలి కతిపయ ద్విపదపంక్తులను గాంచుఁడు:

'చనుదెంచి చనుదెంచి యనుపమ బిల్వ
వన సమీపంబున ఘనతరంబైన
రుద్రాక్షశైలముల్ రుద్రాక్షతరులు
రుద్రాక్ష గనులును రుద్రాక్ష నదులు

భసితంపు గిరులును భసితంపుఁదరులు
భసితంపు గనులును భసితంపు నదులు
లింగ పర్వతములు లింగ వృక్షములు
లింగాకరంబులు లింగ తీర్థములు
జంగమ శైలముల్ జంగమతరులు
జంగమగుల్మముల్ జంగమలతలు
సల్లాప శైలముల్ సల్లాపతరులు
సల్లాప గుల్మముల్ సల్లాప లతలు
గాయక శైలముల్ గాయక తరులు
గాయక గుల్మముల్ గాక లతలు
గాయక మృగములు గాయకాలులును
గాయకపక్షులు గాయక ఫణులు
నాట్య పర్వతములు నాట్య వృక్షములు
నాట్య గుల్మంబులు నాట్య వల్లరులు
నాట్య మృగంబులు నాట్య పక్షులును
నాట్యోరగంబులు నాట్య వానరులు
జలపర్వతంబులు జలవృక్షములును
జల విహంగంబులు జల మృగావలులు
బహువర వృక్షముల్ బహువర్ణశిలలు
బహువర్ణ గుల్మముల్ బహువర్ణలతలు
బహురూప వృక్షముల్ బహూరూపశిలలు
బహురూప గుల్మముల్ బహురూపలతలు
ఖేచర వృక్షముల్ ఖేచర గిరులు
ఖేచర గుల్మముల్ ఖేచర లతలు
హర్మ్య పర్వతములు హర్మ్య వృక్షములు
హర్మ్య గుల్మంబులు హర్మ్య వల్లరులు
మృగరూప వృక్షముల్ మృగ రూపశిలలు
మృగ రూప గుల్మముల్ మృగ రూపలతలు

... ... ...
ఒకగొమ్మశోకంబు నొకగొమ్మ సురభి
యొక గొమ్మ న్యగ్రోధ మొకగొమ్మ సింత
యొకగొమ్మ గురవంక మొకగొమ్మ గ్రముక
మొకగొమ్మ ఘనసార మొకగొమ్మ సెరకు
నొకగొమ్మ నందనం బొక గొమ్మ దిలక
మొకగొమ్మ సంపకం బొక గొమ్మ గ్రోవి
యొక గొమ్మ మందార మొకగొమ్మ వకుళ
మొకగొమ్మ మారేడ నొకగొమ్మ పొన్న
యొక పువ్వు విరవాది యొక పువ్వు మల్లె
యొక పువ్వు సేవంతి యొక పువ్వు గోఁగు
యొక పువ్వు గరవీర మొక పువ్వు గలువ
యొక పువ్వు దామర యొక పువ్వు మొల్ల
యొక పువ్వు సెంగల్వ యొక పువ్వు మొగలి
... ...
... ...

*(బస 3-211, 212, 217 పుటలు)*

అష్టాదశ వర్ణనలలో ఋతు వర్ణన మొకటి. ఈ ఋతువర్ణనమును బెక్కురు కవులతి వేలముగాఁ దమకావ్యములయందు నెక్కొలిపిరి. ఆయా ఋతువుల నొక నిర్దిష్ట విధానమున నభివర్ణింప వలయునని లాక్షణికుల యనుశాసనము కలదు. అట్టి సంప్రదాయమును దేనిని గాని పాటించక వినూత్నముగా సోమనాథుఁడు గావించిన యీ నిదాఘ వర్ణనమును దిలకింపుఁడు:

*"మేదినిఁ దలమోపి మీఁదికి రెండు*
*పాదంబులను నెత్తి పంచాగ్ని నడుమఁ*
*దలఁచిన డెందంబు దాపంబుఁ బొందఁ*
*బలికిన నోర్లెల్లఁ బటుపటు పగులఁ*
*జూచిన కొప్పులు నుఱుముఱఁ గమర*
*నేచిన యెండల నెడపక నిలిచి"*

*- బస 1-20 పు.*

తిక్కన సోమయాజి తన విజయసేనమునందీ నిదాఘవర్ణనము ననుకరించెను. ఎత్తుగీతి:

తలఁపఁ దడవ మనము దరికానుఁ జూచిన
జెప్ప తెల్లఁగమరి యొప్పు దఱుగు,
నరులఁ బేరికొన్న నాలుక వొక్కు, ని
దాఘకాల తపన తాప మడరె

ఈ రెండు పద్యములకును నన్నెచోడుని కుమార సంభవములోని యీ క్రింది పద్యము మూలమై యుండును:

కll తలఁచిన డెందము గందును
బలికిన నోరెల్లఁ బొక్కు, బ్రభ నూచిన తె
ప్పలు గమరు నసఁగఁ బటుతర
విలయానలభాతి నెండ మేసవిఁ గాచెన్

*6–135* ప.

బసవ పురాణమునందలి యీ క్రింది వర్ణనమును అల్లసాని పెద్దనాదు లగు ప్రబంధ కవులు తమతమ ప్రబంధములయందుఁ గావించిన పురవర్ణనముతోఁ బోల్చి చూచినపుడు సోమనాథుఁ డీ వర్ణనము చేయుట యందును నవలంబించిన దేశి విధానము గోచరించును:

'అప్పురి మహిమ దా నది యెట్టి దనినఁ
జెప్పఁగ నలవియే శేషున కైనఁ
బురియేఱు లన్నియుఁ బుణ్య తీర్థములు
వరఁగంగ గుహ లెల్ల హరు నివాసములు
గిరు లన్నియును హేమగిరులు దలంపఁ
దరు లెల్ల రుద్రాక్ష తరువులు గలయ
వనము లన్నియుఁ బుష్పవాటిక లచటి
గను లన్నియును భూతిగనులుఁ దెల్పారఁ
గొలఁకు లన్నియు నొప్పు జలజాకరములు
కలగోవు లన్నియుఁ గామ ధేనువులు
గోడె లన్నియు నందికుల్లా లావురము
వాడ లన్నియు రంగవల్లి వేదికలు

నరు లెల్ల భక్తులు చిర జీవులెల్లఁ
బరికింపఁ గారణ పురుష రూపములు
స్త్రీలెల్లఁ బరమపతివ్రతామణులు
నే లెల్ల నవిముక్త నిధి సమానంబు
పలుకు లెల్లను దత్త్వభాషలు జనుల
యులి వెల్ల గీతావాద్యోత్సవరవము
కల్లరి పతితుండు ఖలుఁడు దుర్జనుఁడు
ప్రల్లదుఁ డఱజాతి భక్తి హీనుండు
వికలుండు గొండీఁడు వెదకిన నైన
నొకఁడు మందునకైన నూరిలో లేఁడు'

–బస. 1–53, 54 పుటలు

పద్రము, అగడ్త, కోట బురుజులు, పురవీధులు, మేడలు, చాతర్వర్ణ్యము ననువాని ప్రసక్తియే లేకశైవ సమయానుగుణముగాఁజేయబడిన యీపురవర్ణనము సంప్రదాయసిద్ధము లయిన వర్ణనముల విషయమునను నాతనికిఁ గల స్వతంత్ర ప్రవృత్తిని జాటు ననుటలో నెట్టి సందియమును లేదు.

ఇట్లు సూర్యోదయ, సూర్యాస్తమయవర్ణనములు, చంద్రోదయవర్ణనము, గర్భధారణ, పుత్త్రోదయ వర్ణనములు, పర్వత వర్ణనము, గ్రీష్మ కాలవర్ణనము, పురవర్ణనము అను మొదలగు నష్టాదశవర్ణనములలోఁ గొన్ని సంప్రదాయ సిద్ధము లగువర్ణనములను గావించుటలో సోమనాథుఁడాయావర్ణనములను జేయుటలోఁ బ్రాచీను లనుసరించు చుండిన యాచారములకు భిన్నముగా,స్వతంత్రప్రవృత్తిని బ్రదర్శించి శైవ సమయానురోధమయిన దేశి విధానము నెక్కొలిపి కృతార్థుఁడయ్యెను.

ఇఁక నీతని వర్ణనలలోద్వితీయ విభాగముగా నెన్నఁదగిన స్థిరరూప వర్ణనములు అను తెగకుఁ జెందిన వర్ణనములను బరిశీలింతము. ఇతఁడు తన కావ్యగతము లయిన వివిధ పాత్రముల బాహ్యాకారరేఖలను – స్థిరరూపములను బహుస్వభావసిద్ధముగ వర్ణించును. అట్లు చిత్రించుటలో నే యొక్క యంశమును గూడ విడిచి పుచ్చక ప్రతి సూక్ష్మాంశమును గడు జాగరూకతతోఁ బేర్కొని యావర్ణన మన్నివిధముల సంపూర్ణమయిన దనియు నందుఁ బరిహృతమో,

విస్మృతమే యగు వర్ణ్యాంశ మొక్కటిగాని యుండదనియు నొకసంతృప్తి భావము పఠితృజనుల హృదయములలో మొలకెత్తునట్లు గావించును. అయా వ్యక్తుల వేషములను సంపూర్ణముగాఁ దనివి దీర వర్ణించినఁగాని యాతనికి వారిని జక్కఁగా వర్ణించిన తృప్తి యలవడదు. అట్టి చిత్రణము లాయాయావ్యక్తుల బాహ్యాకారములు మన కన్నుల యెదుట నిలుచునట్లు దోఁపఁ జేయును.

పరమేశ్వరుఁడు గొల్లని వేషమున సకలేశ్వర మాదిరాజయ్యకు దర్శన మిచ్చు నీ క్రింది ఘట్టమున సోమనాథుని స్థిరరూప చిత్రణ ప్రాగల్భ్యమును గాంచుఁడు:

*'ఇట యుండు మీ పని యట యేఁగి తాను*
*గుటిల వేషంబున గొల్లని భాతి*
*బఱపు వ్రేళ్ళను మొద్దు పాదముల్ గుజ్జు*
*చిఱుతొడలును దొప్ప చెవులును బరడు*
*ప్రక్కలు బీరసరములును జిదుక*
*ముక్కును ముడి బొమల్ మొగి దోని కడుపుఁ*
*బొక్కిళ్లు వోయిన చెక్కిళ్లు వలుద*
*బొక్కిఱొమ్మును బెద్ద నిక్కిన మెడయుఁ*
*బల్లమీసములు నేర్పడు కాయకన్నుఁ*
*బిల్లగడ్డంబును నల్లని మేనుఁ*
*బ్రాఁకు వట్టిన పండ్లు బ్రద్ద చేతులును*
*వీఁక కాళ్లను నడ్డి వీఁపును దనర*
*ములుగత్తి యుచ్చుఁగోకలు c జూడుఁ గోడువు*
*మొలతిత్తి నిడి దొడ్డ మొలకచ్చ గట్టి*
*గాలి దప్పువు వెంద్రుకల్ దూలి యాడ*
*నీలవెట్టుచు నుఱి మెట్టఁజూచుచును*
*గుక్కలఁబిలుచుచు ఱిక్క వెట్టుచును*
*నెక్కొన నొరగాల నిలుచుచుఁ జనుచు*
*గొడ్డలి బరిగమ్మి గూటి కుండయును*
*దుడ్డుఁగోల యుఁ బట్టి తొడిఁ దొడిఁ గొన్ని*
*మేఁకపిల్లలఁ దనచాఁకిట నిఱికి*
*వీఁక దబ్బఱ వాట్ల విసరి వ్రేయుచును*

గొన్ని మేఁకల రొప్పికొని వచ్చి తుమ్మ
నున్నకాయలు రాల్చియును నంతఁ బోక'

– బస. 3–224, 225 పుటలు

ఇట్లే పండితారాధ్య చరిత్రములోని దీక్షా ప్రకరణమునందలి సూరసాని కథలోఁ బరమేశ్వరుఁడు ధరించిన చండాల వేష మిట్లభివర్ణింపఁబడినది. చూడుడు:

'ముద్దు మొగంబును వలుద చేతులును
బ్రద్ద చిఱుదొడలు బరడుఁ బ్రక్కలును
గాయ గాచిన యఱచేయి నెందోళ్లు
గోయఁ దాఁకిన యసిగోఁత డాచేయి
మట్టె పాదంబులు మలినంపు మేను
మిట్ట నుదురు మ్రక్కి మెడయును బ్రాకు
పట్టిన యరవిరి పండ్లుఁ బొక్కింపుఁ
బొట్టయు వాడ గ్రుక్కు వోయిన వీఁపు
బొడ్డికన్నులు ముడిబొమలు వ్రేల్పావులు
దొడ్డముక్కును గుజ్జు డొదలును బరటి
వ్రేళ్లను గమలిన గోళ్లు లోవంక
కాళ్లను గందిన కటుములు సమరఁ
దెలుపారు బూది నొసల నిండ మెత్తి
కలయఁ జేతులఁ బెండెకట్లుగాఁ బూసి
నలి దొడ్డరుద్రాక్షములు వల్లపటిక
ములు సాలమాని పూసల పేర్లుఁ దాల్చి
కుఱు వెంద్రుకల వెడగొప్పులోపలను
గఱకంఠ గద్దెనగరు గానుపింప
బలువుగా శివసూత్ర మలవడఁ గట్టి
మొల నరమణి దూటి తల నర సుట్టి
యూరెయుఁ గత్తియు నట్టల మోవు
వారెసల్ మ్రోకులు వలచేత నొక్క
సెంబలి గోలయుఁ జెన్నొంది శివుఁడు

పంచిన యంత్యజాభావంబు దాల్చి
యచ్చుగాఁ జనుదెంచి యగ్రహారంబు
సొచ్చి యల్లంత భూసురులు రాఁజూచి
చెంగుచు 'సెంబలి సెంబలి' యనుచు
వంగుచుఁ దొలఁగుచు వాడవాడలను
ఘోరన 'మ్రోకులు గోరె వారెసలు
గోరె వారెసలు మ్రోకులుఁ గోరె' యనుచు
నమ్మ్రుచుఁ జనుచు నంతంత నిల్చుచును
గ్రమ్మన వచ్చిన క్రంత వచ్చుచును
గలయంగ నింటింటఁ బిలుపించుకొనుచు
వెలయెంతయనిన వెగ్గలము చెప్పుచును
వెడజప్పి సూపుచు విప్రుల యిండ్ల
కెడనెడఁ బలుమాఱు నేఁగుచుఁ జనుచుఁ
గఱకంఠ భక్తులఁ గన్నంత నవ్వ
'సరణార్తి! సరణార్తి! సరణార్తి! యనుచుఁ
గరమర్థి వారిచేఁ గాల్గట్టి గొనుచుఁ
బొరిఁ బొరిఁ బ్రాఁత చెప్పులు ముడుచుచును
వెనువెంట మును వొంచికొని యున్న విప్రు
లను నెఱింగియు నెఱుంగని యట్లు గూడ
న ప్రొటు నూరెల్ల ముప్పెట్లు వెట్టు
చొప్పెరు వడి యుండ సూరసానమ్మ
యింటికి నేతెర నింతియుఁ గాంచి
వంటింప కెదురుగాఁ బఱతెంచి మ్రొక్కి-'

—పండి. దీక్షా. *7. 117, 118* పుటలు

పండితారాధ్య చరిత్రమునందలి దీక్షా ప్రకరణమున సామవేది కథలోఁ బార్వతి ధరించిన చండాల స్త్రీ వేష మిట్లభివర్ణింపఁ బడినది. చూడుడు:

'ఆ మహా దేవుండ యట్లును గాక
సామ వేదుల జన్న సాలలోపలకిఁ

నచ్చుగా మెడ నిడి యరుగు దేరంగఁ
గుఱుచ మట్టు పొడవు గురుజఘనంబు
వఱికి వెంద్రుకలును గొఱఁగుఁ బావటయు
వద్దంపు ముక్కర యసి.యాడు నడుము
దొడ్డుఁగట్టుల చీర దూఁగుఁ బయ్యెదయు
నలరుఁ గెమ్మోవియు నన్నువ నుదురుఁ
గలికి క్రొల్లన్నులు గఱివంక బొమలు
నల్లని మైఁదీఁగ దెల్లఁబల్వరుస
దెల్లని భసితంపుఁ దిలకంబు దెల్ల
గద్దె నగరు దోఁచుగనయంబు కీలు
నిద్దంపుఁ జాయయు నిండుఁ బాలిండ్లు
గ్రంగు క్రంగనుకాళ్లఁగంచుమట్టియలు
నుంగరంబులు వల్లయూరులు నల్ల
గాజులుఁ దగరంపుఁ గడియముల్ పచ్చ
గాజుఁ బూసలును సంకంపుఁ బూసలును
నులిగొన్న నల్లఁ బూసల బన్నసరము
గలయ లోయఱతి నాల్కల మిన్కు లమర
గంప సొఁకిట నిడి గౌరియు వెనుక
నింపారఁ జనుదేర నిరువురఁగాంచి
సామవేదులు వచ్చి సతియును దాను
భూమి సర్వాంగముల్ పొందంగ మ్రొక్కి
... ... ...'

– పండి. దీక్షా, **133, 134** పు.

సోమనాథుని కాలమునాఁటి జంగమ వేషమెట్టిదో యీ క్రింది వర్ణనమున బూర్ణముగాఁ దెలియును. చూడుఁడు:

'ముడిచిన మడుపుఁ గెంజడ ముడి నడుమ
మ్పుదుని చందంబులు వెడ వెడఁ దోఁపఁ
గట్టిన వెలిపొత్తి కచ్చడం బొందుఁ
బుట్టిని రుద్రాక్ష భూషణంబులును

*రాగి కుండలములు రత్నకంబళియు*
*యోగదండంబును నొకచేత గొడుగు*
*బూది బొక్కసమును బొలుపార మేని*
*బూదిపై నొప్పు త్రిపుండ్ర రేఖలును*
*దళతళ మను మెర్గుపలువరుసయును*
*గలయ నొత్తిన వాలుగడ్డంబుఁ దనరఁ*
*దపసులరా జొక్క తపసిచందమున'*

– *బస, 1–37 పుట.*

సోమనాథుని కాలమునాఁటి కలకేత వేష మీక్రింది వర్ణనమునఁ గాంచఁదగును:

*'తగిలి గిల్కయు దుఘ తలకొమ్మువోలెఁ*
*దగరు కొమ్మును బట్టి తన వేష మమరఁ*
*గోరి త్రివిక్రమ కోరెమ్ము వోలె*
*నారంగ నొకగుదియయుఁ జేతఁబట్టి*
*కలకేత వేష మింపలరంగఁ దాల్చి*
*నలువొప్ప భక్తుల నగళుల కేఁగి–'*

– *బస, 5–347 పుట*

పండితారాధ్య చరిత్రములోని పర్వత ప్రకరణమున జంగముకోళ్ల నడకలు, వృద్ధ తపోధనుల నడకలు, మిండజంగముల నడకలు, శీలవంతుల నడలు, విరక్తుల నడలు, శివ యోగుల నడకలు, అభ్యాస యోగుల నడలు, పుణ్యాంగనల నడకలు, జోగుల నడకలు, పిచ్చుకుంటుల నడకలు, చెంచు ధర్మాత్ముల నడకలు, మొదలగు ఘట్టములయ దిట్టి వర్ణనములు పెక్కులు గానవచ్చును.

ఉత్తర హరివంశములో నాచన సోమనాథుఁడు గావించిన బాహ్యాకార చిత్రణము లివి పాల్కురికి సోమనాథుని రచనముల యొక్క ప్రభావమును దెలుపును. చూడుఁడు:

*సీ॥ వికృతాననంబులు విరళదంతంబులు నిడు పైన దౌడలు నిక్క మెడలు*
*ముడి వడ్డ బొమలును ముమ్మూలముక్కులుఁ బల్ల వెండ్రుకలును బరికెతలలు*
*బొక్కి జొమ్ములు లోఁతుఁబొట్టలు మిడిగ్రుడ్లు గూని వీవులు నిడుఁ గొంకి వ్రేళ్లు*
*బూరకాళులు నీచఁబోయిన చేతులుఁ గోల మూఁపులు గుది గొన్న తొడలు*

గీ॥ నతి భయంకరగతి నూప నట్టహాస
కహ కహో కారములతోడఁ గాన నయ్యె
దావపావకఘనశిఖాదగ్ధతాల
సాల సంకాశ మగు పిశాచద్వయంబు

వ॥ అందు నొక్కరుండు

చ॥ పిరిగొని దాల్కు నెట్టెమగుఁ బ్రేవులు చుట్టి కపాల పాత్రలో
విరియఁ గలంచుఁ గ్రొమ్మెదడు వెంట్రుకలేజి తొలంగ వైచు నె
త్తురు చవి సూచుఁ గండలు తుథూ యని క్రాయుఁ ద్రిశూల ధారలం
జెరిపిన ప్రేతమాలికలఁ జిమ్ముఁ బిశాచ విభుండు వేడుకన్

వ॥ మఱి యొక్కరుండు

చ॥ కఱచిన పీనుఁగు న్వెడఁదకప్పెరయు న్మొలఁ బచ్చి తోళులున్
బుఱియల పేరులున్ మెదడు పూఁతల ఝుమ్మని మూఁగు నీఁగలుం
బెఱికిన వాలు జొమ్ముమయిఁ బేరిన నెత్తురు ప్రేవుడుం గడుం
బిఱుముల చూపులుం దఱచు బీరనరంబులుఁ గల్గురూపమై
– *2–122* మొదలు *126* వఱకు

### *3.* చలరూప వర్ణనములు

శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారు తమ 'సాహిత్య శిల్ప సమీక్ష' లోఁ గవిత్వ కళయొక్క యౌత్కృష్ట్యమును గూర్చి చర్చించుచు నిట్లు వ్రాసి యున్నారు. 'కళ లన్నియు సౌందర్యద్యోతకములే. కాని, ఏకళయందు ఆ సౌందర్యము చలించునో అది గుణాతి శాయి అని చెప్ప నొప్పును. చలనము సౌందర్యమునకు మోహనత్వ మాపాదించును. నిశ్చల జలపూర్ణమైన ఒక సరస్సు, విచ్చిన తామర పూలతో నిండి చూచుట కెంతో సుందరముగా నుండును. తలవని తలంపుగా ఒక సన్నని మందవాయువు వీచి ఆ సరస్సులో చిన్ని చిన్ని తరఁగలు పుట్టింపఁగా, ఆ నీటి కదలికతో తామరలు కూడ ఊఁగుచుండగా ఆ సరోవర సౌందర్య మంతయు చలితమై అంతకు ముందు లేచి మోహనత్వమును తాల్చును. ... ఈ అతిశయానంద మునకు కారణము ఆ సౌందర్యచలనము ... కవిత్వమునందును ఇంత ప్రస్ఫుటమైన చలనము కలదు. కథాత్మకమైన కావ్య మగుచో ఆ కథాగమనమే కాక, అందలి పాత్రల శారీరక మైన అవయవ విశేషవర్ణనలును, మానసికములైన భావ వివర్తన వర్ణనలును ఈ చలన కార్యమునకు చెందినవే.' – పుట. **15, 16**

సోమనాథుని గ్రంధములో నీ యుభయ విధములకుఁ జెందిన చల రూప చిత్రములును బెక్కు గానవచ్చును. వానిలో నెల్లఁ దలమానికము పండితారాధ్య చరిత్రమునఁ బ్రభాత వర్ణన సందర్భమునఁ గోడికూఁతను వర్ణించు ఘట్టము. చూడుఁడు:

'తొలికోడి కనువిచ్చి నిలిచి మై వెంచి
జలజలఁ జెక్కలు సడలించి నీల్గి
గ్రక్కునఁ గాలార్చి కంఠంబు విచ్చి
ముక్కునఁ నీఁకెలు చక్కొల్పి కడుపు
వెక్కించి మెడ సాఁచి నిక్కి మిన్సూచి
కొక్కొరో కుఱ్ఱని కూయక మున్న' – పండి. పురా. 262 పుట

ఇందుఁ దెల్లవారుజామునఁ గూయు కోడి యొక్క వివిధావయవ విశేషములను వర్ణించి కన్నులకుఁ గట్టునట్లు చేసినాఁడు, సోమనాథుఁడు. కోడికూఁతను వర్ణించుచు అల్లసాని పెద్దన, రామరాజభూషణుఁడు, పింగళి సూరన యను కవీశ్వరు లుత్ప్రేక్షా ద్యలంకారముల నాదరించి రచించిన యీ క్రింది పద్యము లాంధ్ర వాఙ్మయమున సుప్రసిద్ధములు:

మ॥ సకలాశాగతి నర్మకోప విరతి శ్రౌత క్రియారంభణా
త్మక వర్గత్రయికిన్ మదుచ్చరిత శబ్ద జ్ఞానమే మూల మిం
తకుఁ బోలన్ వినుఁడంచుఁ దెల్పుగతిఁ జెంతన్ గొండపైఁ బల్లిలన్
గృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ ద్రిభంగిన్ భుగ్నకంఠ ధ్వనిన్
– మనుచరిత్రము.

మ॥ ఒకనాఁ డింద్రుని యంత వేలుపు మదీయోక్తిన్ విడంబించి తా
నొక కాలం బెటిఁగింప లేక ముని శాపోద్వృత్తి పాలయ్యె మా
మక శబ్దం బిది యల్పమే త్రిముని సంభావ్య త్రికాలీ విబో
ధక మన్ రీతిఁ ద్రిభంగిగా మొరసెఁ జెంతం దామ్రచూడాఘముల్
– వసుచరిత్రము

మ॥ సమయాభిజ్ఞతఁ గుక్కుటంబు 'వివిధచ్ఛంద స్త్రియామాంతరం
బిమ యామో భగవాన్ బుషిః కుసుమధన్వీదేవతా మానినీ
రమణాయాం వినియోగ' యంచు నిది యారంభించెఁ గాఁబోలు నా
నమరెం దద్ధ్వని మానినుల్ దమకుఁ దామై నాధులం బైకొనన్
– ప్రభావతీ ప్రద్యుమ్నము

తమ ప్రజ్ఞా ప్రాభవముల నెల్లఁ బ్రదర్శించి యా కవివతంసులు రచియించిన పయి పద్యముల కంటెఁ దొలుసంజవేళ యందుఁ గుక్కుటములు మేలుకాంచి కొక్కొరొకో కుఱ్ఱని కూయునపుడు మునుముందు వాని యవయవములందుఁ గలుగు వివిధ చలనావస్థలను, గాత్ర విక్షేపములను గన్నులఁ గట్టునట్లుగా జిలిబిలి పలుకులతో సోమనాథుఁడు వెలయించిన యీ చలరూప వర్ణన మత్యంత మనోహర మనుట కెట్టి సందేహమును లేదు.

## 4. సహజ వర్ణనములు

సోమనాథుని వర్ణనములు కొన్ని యతి సహజములై యలరారును. ఇట్టి స్వభావ సిద్ధములగు వర్ణనములు చేయుట యతనికి మంచి నీళ్ల ప్రాయము. ఇట్టి పట్టులలో నితఁడితరాలంకారముల కంటె స్వభావోక్తినే సంభావించును. ఉత్ప్రేక్షాద్యలంకారములతో నేలవిడిచిన సాముగా నుండక యితని యీ సహజ వర్ణన లచ్చమయిన దేశివర్ణనలుగా మనసున కుల్లాసము గొలుపును. అట్టి వర్ణనలను గొన్నిటిని దిలకింతము.

తల్లులు తమ పసిపిల్లలను గాళ్లపైఁ బరుండఁబెట్టుకొని స్నానము చేయించుటను సోమనాథుఁ డెంత స్వభావసిద్ధముగాఁ దీర్చి దిద్దెనో యీ క్రింది ద్విపద పంక్తుల యందుఁ బరికింపుఁడు:

*'అనయంబు బెజ్జమహాదేవి దాన*
*జననియై పరమేశుఁ దనయుఁ గావించి*
*తొంగిళ్లపై నిడి లింగమూర్తికిని*
*నంగన గావించు నభ్యంజనంబు*
*ముక్కొత్తుఁజెక్కొత్తు ముక్కున్నుఁ బులుము*
*నక్కొత్తుఁ గడుపొత్తు నట వీఁపు నివురుఁ*
*బెరుగంగ వలె నని తరుణి వీడ్వడఁగఁ*
*జరణముల్ కరములుఁ జాఁగంగఁ దిగురు*
*నలుఁగులు నలుచు నర్మిలిగట్టి పెట్టి*
*జలములు వీఁపునఁ జఱచు నంతంత*
*వెగచి బెగడకుండ వెన్ను వ్రేయుచును*
*నాగి మస్తకమున నీరొత్తు దోయిటను*

వదనంబు సొచ్చునో యుదకంబు లనుచు
నదుముఁబొట్టను నోరికడ్డంబు వట్టుఁ
జెన్నుగాఁ బసుపార్చి చేయు మజ్జనము
గన్నులుఁ జెవులును గాడంగ నూఁదు
నంగిటముల్లొత్తు నందంద వ్రేలఁ
దొంగిళ్లఁ గార్నీరు దోనెత్తి మిడుచు
బడఁతి చేనీరఁ దూపాడిచి బొట్టెడును
మడఁది యంగుష్ఠంబుమన్నింత మెదిచి
కడవ నంపిన యట్టె పిడుక విభూతి
యడరఁ బుత్త్రుని నొసలారంగఁ బూయు
నెత్తుగ్రుంగెడు నని యెత్తంగ వెఱచి
యత్తన్వి ఱొమ్మున నక్కున నదుముఁ
గాటుక యిడ నింత గన్నగు ననుచుఁ
గాటుక యిడు మూఁడుగన్నులఁ గలయుఁ
జన్నిచ్చుఁ బక్షులఁ జన నీదు మీఁద
నన్నాతి గొండొకవెన్న యుఁబెట్టుఁ
జెక్కిలి గీఁటుడుఁ జెలఁగి యేడ్వంగ
నొక్కి వే లిడి పోయు నొకకొన్ని పాలు
ఉగ్గులు వోసియు నువిద సంప్రీతి
నగ్గించు సొగియిందు నటు బుజ్జగించు
ముద్దాడు నగియించు ముద్దులు వేఁడు
'నద్దికాశ్ వీరెవ్వరయ్యరో' యనుచుఁ
బన్నుగా నుదరంబుఁ బాన్పుగాఁ జేసి
కున్న జోసఱచుచు నున్నతిఁ బాడు'

– *బస. 3–153, 154, 155* పుటలు

పిల్లలకు స్నానము చేయించుట, బొట్టు కాటుక పెట్టి, పాలుపట్టి నిద్రపుచ్చుట యను శిశుపోషణ విధానము నేఁటికిని నిట్లే సాఁగుచున్నదికదా! ఆ కార్యక్రమ మంతయుఁ గన్నులకుఁ గట్టునట్లుగా నతిసహజముగా వర్ణించిన యీ విధానము మఱొక కవీశ్వరుని కవితలో మనకుఁ గానరాదు. సహజ సుందరమై శోభిల్లు నీ వర్ణన మచ్చముగా దేశి వర్ణనయే.

కంటిలో నలుసు పడినప్పుడు ఆ నలుసును తీసివైచి నొప్పిని బోఁగొట్టుటకు సాధారణముగా పిల్లలు - పెద్దవారుకూడ - నేమేమి చేయుదురో యా వివరముల నెల్ల మిక్కిలి సూక్ష్మముగాఁ బరిశీలించి తిక్కన్నఁడు శివునికంట నీరు కాఱుచుండినపుడు అతఁడాతనికన్నును శోధించిన విధము నభివర్ణించు ఘట్టమున మిక్కిలి స్వభావ సిద్ధముగా వర్ణించి యున్నాఁడు. ఈ క్రింది ద్విపద పంక్తులను దిలకింపుఁడు:

*'కరతలాంగుళములఁ గనుఱెప్ప లెత్తి*
*నెర సున్న దని పాఱ నిక్షించి యూఁదుఁ*
*బరఁగ నాలుక గ్రుడ్డుపైఁ ద్రిప్పి ద్రిప్పి*
*యొరయుచు నొరయుచు నొయ్యనఁ జూచుఁ*
*జీరాచిఁగొని కంటఁ జేర్చి హత్తించి*
*చీరెల్లఁ దడిసినఁ జిక్కు వెండియును*
*నీ కడకంట వ్రేలిడి యొత్తి నొత్తి*
*నా కడకంట ధారావలి పర్వె*
*నాకడకంట వ్రే లదుమ నట్లదుమ*
*నీ కడకంట నీ రెంతయుఁదొరిగెఁ*
*గొలుకులు రెండు నంగుళముల నదుమఁ*
*గలయంగఁ గన్నెల్ల గొలఁకు లై కాఱె*
*నక్కన్నుఁ గొలుకులు నరచేత మూయఁ*
*బక్కిల్లఁ బిండించి పాఱంగఁ దొడఁగె*
*నెట్టును నేత్రాశ్రు లెడలెగ కున్న*
*నెట్టణ దుఃఖించి బిట్టు వాపోఱుచు*
*నడుగులఁ బడి మ్రొక్కి నంజలి యొగ్గి*
*నడలు నిల్చును నిల్వఁబడు లేచుఁ జూచు'*

– *బస **3–193, 194*** పుటలు

కంట నలుసు పడినప్పుడు కంటిలో నోరుంచి యుప్పని యూఁదుట, నాలుకను గ్రుడ్డుపైఁ ద్రిప్పి నలుసును దీయుటకుఁ బ్రయత్నించుట, నోటిలో గుడ్డనుంచి వేఁడియావిరిపట్టిదానితోఁ గంటిపై నదుముట మొదలగు సూక్ష్మాంశముల నెంత దేశీయముగా, మనోహరముగా వర్ణించెనో చెప్పఁ దరము గాదు.

బసవపురాణమునందలి సప్త మాశ్వాసమున గుడ్డవ్వగారి కథలో నతఁడు చేసిన కుష్ఠు రోగి వర్ణన మతి స్వాభావికమై, రమణీయ మై యొప్పుచున్నది. స్త్రీ జనముయొక్క సౌందర్యమునువర్ణించుటలోఁ బెక్కురు కవీశ్వరులు తమ శక్తి సామర్థ్యము లెల్లఁ బ్రదర్శించి యొకరిని మించి మఱొకరు రచించుటకుఁ బ్రయత్నించిన విషయ మేకావ్యమునఁ జూచినను మనకు గోచరించును, చూచినంతనే రోఁత పుట్టు కుష్ఠ రోగపీడిత నితఁ డిందు సహజాతిసహజ ముగాఁ జిత్రించుట యాతని లోకజ్ఞతకును, విశిష్టమయిన కవితాదృష్టికిని దార్కాణ మగు చున్నది.

*'నరనాథ! గుడ్డవ్వ నాఁగ వెండియును*
*బరు లెల్లఁ దనుఁ బెద్ద భక్తురా లనఁగఁ*
*బట్టినంతన తెగి పడియెడు కుష్ఠు*
*వట్టి రూపఱి యున్న నట్టిచో నొక్క-*
*నాఁడు ... ...*
*... ...*
*ముదిత సౌరాష్ట్రాభిముఖి యౌచుఁ బోవఁ*
*బదయుగము విరిసి కదలి రాకున్న*
*మోఁకరించుచు వంగి మొగి నేఁగ నేఁగ*
*మోఁకాళ్లుఁ జేతులు మురియ నిల్వకయు*
*గ్రక్కునఁ ద్రోవఁ బొరలి పార్శ్వ పోవ*
*ప్రక్కలై మేనెల్ల విక్కన విరియ*
*నంతలో నధిక దయార్ద్ర భావమునఁ*
*గంతు సంహరుఁడు స్వాకారంబుఁ దాల్చి'*

– బస. *7–528* పుట.

పండితారాధ్య చరిత్రమునందలి మహిమ ప్రకరణమునఁ బలనాటి చోళుని 'పుండు' సెలవేసి రోఁత గొలుపుటనువర్ణించిన యీ ఘట్టమును దిలకింపుఁడు:

*'... ... అంత*
*నొదవుచు నొకనాఁటి కొకనాఁడు పుండుఁ*
*బొదలుచు, రంధ్రముల్ వోవుచుఁ, జుట్లు*
*సెలయుచుఁ బ్రేవులు సెదరుచు, ముఱికి*

వలచుచు, వాచుచు, వ్రయ్యుచుఁ, గూడఁ
గ్రుళ్లుచుఁ, గెరలుచుఁ, గూలుచు, నూర్పు
లొల్లన యూర్చుచు, నూరుచు, రసిక
సిలసిల నెత్తురుఁ జీము గాఱుచును
విలివిలి యనఁ బుచ్చి విదిలి చూపఱకు
నేవంబు దోఁపంగ నిది యెంత పెద్ద
శైవాపరాధికి సర్వ పాపునకు
ఘన శివ ద్రోహికి ఖలునకుఁ దనకు
ననుచు నంతకు పురి కరిగెఁ జోడండు
... ...' — పండి. మహి. 68 పు.

పండితారాధ్య చరిత్రములోని పురాతన ప్రకరణమునఁ జేయఁబడిన యీ శవ వర్ణనముఁ జూడుఁడు:

'జనపతిశవముఁ దెండని పంప నదియుఁ
దిరిగిన వెలిగ్రుడ్లు దెఱచిన నోరు
నర మొగిడ్చిన జెప్పు లురుతరోష్ఠములుఁ
గ్రుంగిన కటము లెక్కుడ మొత్త మగుచు
బొంగి దూలము విర్గి వంగిన ముక్కుఁ
బచ్చని పండ్లు వెల్వడి తీగ చొల్లు
విచ్చిన రంధ్రముల్ వీడిన కొప్పు
నంగవిచ్ఛాయముఁ బొంగిన కడుపు
వంగిన వీపును వ్రాలిన శిరము
వొందఱి నగ్గొంట్లు వోయిన నందు
నందుల నెత్తురు నచ్చిన తోలు
గళ దప్పి బలసి దుర్గంధంపుఁ బ్రాయి
వలదుచుఁ దనుపెక్కి వాచిన మేను
మూఁగుచు జుమ్మని వీఁగుచు మఱియు
మూఁగుచు మునరు నయ్యాఁగలుఁ జూడఁ

*గటకటా! యనుచు నెక్కడి దీక ననుచుఁ*
*దోటుకున నుమియుచుఁ దొలఁగి పోవంగ*
*ననుపమ భక్త సభాభ్యంతరమున*
*జనులు దజ్జననాథు శపముఁ దెచ్చుటయు'*

*- పండి. పురా. 444*

బసవ పురాణములోని పంచమాశ్వాసమునఁ గల ముసిఁడి చౌడయ్య కథలో బసవని మట్టి మొలచిన చోటినుండి యంతకు మున్నెన్నఁడో ఁ ప్రదేశమున నసువులు వాసిన వృషభరాజ మెగసి వచ్చిన విధమిందెంత సహజవ నభివర్ణింపఁబడినదో పరికింపుడు. మార్గకవు లేవేవో యితర వర్ణనములయం దము ప్రాగల్భ్యములను బ్రదర్శించి యుండిరి గాని యిట్టి దేశీయమైన వర్ణనవ గావించి యుండలేదు. పల్లెపట్టులలో నాలపోతుల యతి సహజ మయిన ప్ర పాటిందుఁ గనులకుఁ గట్టునట్లు వర్ణింపఁబడినది. చూడుఁడు:

*'అందఱు నతి విస్మయాక్రాంతులుగను*
*నందుండి యూఁకించి యవనికి నుఱికి*
*నిలిచి నిట్టించి ఘణిల్లిణిల్లనఁగ*
*నలరుచు అంకె లందంద వైచుచును*
*వాల మల్లార్చుచుఁ గాలఁ ద్రవ్వుచును*
*నేలఁ గోరాడుచు నీడ కుర్కుచును*
*నుడువీథి కెగయుచు నొడలు వెంపుచును*
*వడిగొని వఱచుచు నిడు జంగ లిడుచుఁ*
*దగిలి గర్జించుచుఁ దలఁకుచు మూతి*
*యిగిలించుకొని మొగం బెత్తి చూచుచును*
*జిఱు పెండ వెట్టుచుఁ జిఱులు వొడ్చుచును*
*గుఱుజంగ లిడుచు దిక్కులు సూచికొనుచుఁ*
*గెలఁకులఁ దన్నుచుఁ గ్రేళ్లు వాఱుచును*
*బులు గఱచుమియుచు మలఁగి నాకుచును*
*బోరన నెగయుచుఁ బొంగుచు గొమ్ము*
*లోరగించుచు మలయుచు వంగి కొనుచు*
*నూఁకరల్ వెట్టుచు నురవడింపుచును*

మూఁకకు నెగయుచు మున్ను మున్నుచుఁ
జవుడయ్యఁ జూచుచు సంతసిల్లుచును
దవులంబు సేయుచుఁ దవసి వెన్నొనుచు
బాసికంబును నాఁటి పసపుటక్షతలు
నాసమంచిత సుగంధాను లేపనము
లొసరంగ వింత చ న్నొలయంగ గంట
లును మువ్వలును గజ్జెలును మ్రోయుచుండ
నంతంతఁ దనరారి యాలజేఁ డుండ.'

– *5–374, 375* పుటలు

అందే సప్తమాశ్వాసమునందలి ఏలేశ్వరు కేతయ్యగారి కథలోఁ జోరులు పశువులను దొంగలించుకొని పోయినపుడును దరువాత కేతయ్యను దర్శించి యథాపూర్వము వర్తించుటయు నెంత హృదయంగమముగా వర్ణింపఁబడినదో యీ ఘట్టమునందుఁ బరికింపుడు. పశువుల వర్తనముల నిట్లు కావ్యస్థము చేసి వర్ణించిన కవులెందరో లేరు. అట్టి వారిలో పాల్కురికి సోమనాథుఁడు ప్రథముఁడు:

'తలద కొక్కటియును దప్పక యుండఁ
బొలమునఁ బసులను బొలమున వెడల
నటు గొని పోవుచో నరుగుచు నుండి
యిట ప్రాణనాథుఁ డుండుటఁ జేసి పసులు
పండిన పొలములఁ బదువయి మొలవ
నిండిన చెలికల నీర్గల చోట
మఱచి యైనను బులు గఱవక నీరు
దఱియుచో మూతులు దడియంగ నీక
యేడునాళ్లును గూడ నిటు నునుచుండఁ
జూడ నక్కజ మైనఁ జోరు లూహించి
యిది యేమి చోద్యమో యిట వట్టి తెచ్చి
నది యాదిగా మేయ వంటవు నీళ్లు
నుండిన ఫలమేమి? రెండు మూన్నాళ్లు
లుండినఁజచ్చు నొక్కండును మనదు
వట్టి కర్మం బేల కట్టి కొనంగ
నిట్టున్న భంగిఁ బోనిండని విడువ

గ్రక్కున మగిడి యుబ్బెక్కి యంతంత
నెక్కడ నిలువకయెగసి దాటుచును
తోఁకలు వీఁపులతోఁ గీలు కొలిపి
వీఁక వచ్చిన దారి విడువక పట్టి
యేడునాళ్లకు మును పేతెంచు తెరువు
నేడు జాలకుఁ గూడ నేఁగుడు నిచట
నేలేశు కేతయ్య యెడ దవ్వులందుఁ
గేలరుఁ బోడగాంచి కినియుచు దొడ్డిఁ
బలుగాఁడు లిడి వ్రత భ్రష్టులదిక్కు
పలుకుట సూచుట పాతకం బనుచుఁ
జోరనీక సూకుడుఁ జొప్పయుఁ గసువు
పరులు పాపం బంచుఁ బడిగొని వైవఁ
జొప్ప దిక్కున నంత సూడక వ్రతము
తప్ప మయ్యా! యని తా రర్చునట్లు
నెలుఁగెత్తి కూడి యంజే యని యఱచుఁ
దలలెత్తి వందు నాల్కలు వెడలించుఁ
దెట్టుపై మూతులు పెట్టి యన్నగము
చుట్టును వాచర్చు శోకంబు లడర
దొడ్డిలోపలఁ దారు దొల్లి భజించు
దొడ్డ లింగముఁ దొంగి తొంగి చూచుచును
దాఁటఁగఁ దలపోయు దర్పంబు పేర్మి
దాఁటఁగ నోడుఁ గేతయ్య రమ్మనక
యా పసు లిబ్బంగి నలమట పడఁగ
లోపలఁ గట్టిన క్రేపు లిట్లెఱిఁగి
తప్పెనోతము తమ తల్లులు నియమ
మప్పాట నని యర్వ కాలింపకున్న
లేఁగలఁ బుడుకుచు లీలఁ గేతయ్య
మూఁగి యర్చుచు మేఁత ముట్టకుండుటయు
శీలముల్లప్పమి దోలఁగా నెఱిఁగి
యాలోకు లత్యద్భుతాక్రాంతులుగను

బలుగాఁ డ్లు దెఱపింప నలరుచుఁ బసులు
వలివేగమున వచ్చి వచ్చి యొండొండ
నూఁకర ల్గొట్టుచు నుత్తలపడుచు
వీఁకఁ గన్నులు విచ్చి విచ్చి చూచుచును
దలలు లింగంబుతో దాకించికొనుచు
వలగొని వచ్చుచు పడి మూరుకొనుచు
నిట లింగ విముఖులై యేఁగుటఁ గొలె
నట పూరి కబ్బియు నంటకుండుటకు
సత్యమీలింగంబు సాక్ష్య మన్నట్లు
నిత్య లింగస్పర్శ నియమముల్ సలిపి
గ్రక్కునఁ గేతయ్యగారి పాదముల
కొక్కింత వంగుచు మ్రొక్కి తక్షణమ
ముప్పిరిగొని పాఱి చొప్పయుఁ గసువు
నప్పుడు దమ కడుపార మేయుచును
నెడ నెడ నుదకంబు లేఁగి త్రావుచును
వడి నాకుచును జొగఁబడుచు లేచుచును
బొదుగులు సేపంగఁ బొదలి నెయ్యమున
మొదవులంబేయని మునుకొని యఱచఁ
బసులఁ గేతయ్య సేపట్టుట యెఱిఁగి
పసిగొని క్రేపులు వారకర్చుచును
విడువఁ దల్లుల డాసి కుడువఁగ నియతి
నడరంగ నఱచెఁ దారట్లు కావునను'

***7–565*** నుండి ***568*** వరకు

వాల్మీకేశుఁడు సాకారుఁడై మిఱుమిండఁ డను శైవ భక్తునకు వెఱచి యొడయనంబితోఁ జాటుగాఁ బాఱిపోవుటను సోమనాథుఁడు తన బసవ పురాణమునం దెంత మనోజ్ఞముగా, స్వాభావికముగాఁ జిత్రించెనో యీ ఘట్టమునందుఁ దిలకింపుఁడు:

'వడవడ వడఁకుచు వాల్మీకి దేవుఁ
డొడయ నంబిని దన పెడకప్పుఁ జక్కఁ
బట్టించుకొనుచు సద్భక్త సమూహి

కట్టెదురఁ జనంగఁ గడు భయం బంది
చప్పుడు గాకుండ జలహారి దెసకు
నప్పుడ తొలఁగి యొయ్యన నడ్గు లిడుచు
మదుకుచు దీపముల్ మఱుఁగు వెట్టుచును
నొదుగుంచు మూలల కోసరించుచును
గాలిన న్నడఁపుచుఁ గరముల గోడ
ఱా లూఁదికొనుచు ను ల్యాలించుకొంచు
లాలిత నవపుష్ప మాలా విలంబి
కీలన పంక్తుల క్రేవలఁ దారి
తలఁకున డెందంబు తటతట నుదర
నలఁగుచు గర్భ గృహాంతంబు వెడలి
మెల్లన మెల్లన మెట్టుచుఁ దొలఁగి
యల్లనల్లనఁ దల్పులండకుఁ జేరి
సంగతి జాలక సమితులఁదొంగి
తొంగి చూచుచు నెడఁ దొలఁగి నిల్చుచును
బోవకుండఁగ నోడి పోవంగ నోడి
యూవాలుమీకేశుఁ డాత్మఁ గలంగ
నందులు ప్రిదుల సంచలనంబు వొదల
నందడి దొఱఁగి పూజారుల మొఱఁగి
ఘన భక్తి నిచయంబుఁ గనుఁగొన వెఱచు
చును గరాగ్రములు దృష్టులకడ్డ మిడుచు
స్రుక్కుచు సరగున నొకనాసి వెడలి
చక్కన గుడినెక్క దిక్కున కరిగి
యెగుదుదురో యని వగవడి వెనుక
మగిడి యాలించుచు బెగడుచుఁ జనుచుఁ
జొక్కాకు గాలికి స్రుక్కుచు నిక్కి
నిక్కి చూచుచు నలుదిక్కు లరయుచుఁ
జెంగి చెంగి చనుచుఁ బొంగఱి వంగి
వంగి పాఱుచుఁ దొంగి దొంగి తాఱుచును
నట మున్న కలుకోటయం దొక్క ఱాయి
స్ఫుట పదాంగుళమున భువిఁ బడ నూఁకి

కడు భయంబున గండికను దూఱి వెడలి
వడిగొని కుఱుజంగ నిడుజంగ గునుకు
పరువు బాటయఁ బెట్టి పఱవ ముందటను
ధర నొప్పి క్రోశమాత్రంబున నొక్క
వరవిచిత్రోద్యానవన మున్నఁ జూచి'

– బస. 4–302, 303, 304 పుటలు

పండితారాధ్య చరిత్రమునందలి మహిమ ప్రకరణమున సుందర నంబెన్న ఫలోనంబి యుపనయనము జరుగు సందర్భమున వృద్ధబ్రాహ్మణుని వేషమున వ్చిన పరమేశ్వరుని యాగడముచే బ్రాహ్మణులు పాఱిపోవుట యెంత హృదయంగమముగా వర్ణింపఁబడినదో యీ ఘట్టమునఁ దిలకింపుఁడు:

'.... ఇట్టి వి యెందుఁ గలుగునే యంచుఁ
జెచ్చెర నేతెంచి చే నుల్చి చాఁపి
పుచ్చుచు నటు ద్విజుఁ బొమ్మని త్రోవ
సొడ సొడ ల్వోవుచు సోలుచుఁ బాఱి
పడి పూజకుండలు పగులఁ దన్నుచును
వడి లేచి మఱి పట్ట వచ్చుడు ద్విజులు
వెడకేలుగాఁ బట్టి బిట్టు ద్రోచుడును
వడఁకుచుఁ దిరుగుచు వచ్చి యాగడియ
కుడక పైఁ బడి నీరు గూలఁ ద్రోయుచును
మఱివచ్చి పట్టు బ్రాహ్మణునిఁ గోపించి
యఱిముఱి మెడఁబట్టి యవుల నూఁకుడును
బడిఁబడి మఱి యంతఁ బందిరి ర్లాళ్ల
నడుగులు పెనగొల్పి యడుగున నూఁప
దందడి నగ్నిహోత్రముమీఁదఁ బడుడుఁ
బందిరి గుబ్బునఁ బడి మంట లెగయ
దిగ్గున లేచి నల్దెసలను గాల
నగ్గిలోనను పడి యరిగెడు వారు
యిందులపై నెక్కి టు యేఁగువారు
గండులఁ దూఱి వేగమ పాఱువారుఁ

జప్పరంబులు నూఁకి చనియెడువారు
నెప్పటఁ జన లేక యొాగ్గెడువారు
గోడలు వడఁ ద్రోసికొని పాఱువారు
గూడ ముట్టిన యగ్గిఁగొని కాలువారుఁ
గనుకని యొండొండటఁ గడవంగ విప్ర
జను లివ్విధంబునఁ జక్కన నరుగ
......... ....'

– పండి. మహి. పుట *126, 127*

ఆంధ్రవాఙ్మయమున భోజన వర్ణనమును గావించిన కవులు కొందఱు లేక పోలేదు. శ్రీనాథుఁడు శృంగారనైషధమున దమయంతీ వివాహ సందర్భమున జరిగిన బువ్వముబంతిని మిక్కిలి మనోజ్ఞముగాఁ జిత్రించినాఁడు. కాశీ ఖండములోఁ గూడ నన్నపూర్ణ వ్యాసభగవానునికిని, నతని శిష్యులకును భోజనము పెట్టుట వర్ణింపఁబడినది. క్రీడాభిరామమునఁ బూటకూటియింట నా కాలముననెట్టి భోజనము పెట్టుచుండిరో యొకపద్యమునఁ దెలుపఁబడినది. భోజన వచన మనుపేరఁ బ్రత్యేకముగా నొకరచనమే కలదు. శృంగార నైషధమునందలి బువ్వముబంతి యెంత మనోజ్ఞముగా, హాస్యరసభరితముగా నున్నను నందుఁ జాలవఱకు మాతృకయైన శ్రీహర్షుని నైషధము ననుసరించిన దగుటచే నందు శ్రీనాథుని యుపజ్ఞా కల్పితము చాలఁ దక్కువే యని చెప్ప నొప్పును. కాశీఖండము నందు భోజనము పెట్టు అన్నపూర్ణ వర్ణనమునఁ జూపఁబడిన నైపుణ్యము పంక్తి భోజన వర్ణనమునఁ బ్రదర్శింపఁబడ లేదు. సాధారణముగాఁ బంక్తి భోజనములు జరుగునపుడు సలుపఁబడు చమత్కార సంభాషణములో, వడ్డించువారి హాస్యోక్తులు, భోజనము చేయుచున్నవా రొండొరులను బరిహసించుకొను తీరులు మిక్కిలి హృదంగమములుగా నుండును. అట్టి హాస్యోక్తులతోఁ గూడిన భోజన ఘట్టమును సహజముగా వర్ణించిన కవిత యొక్క పాలకుఱికి సోమనాథుని బసవపురాణమునఁ దప్ప మఱియెచ్చటను మనకుఁ గానరాదనినచో నతిశయోక్తి కాదు. బసవపురాణము నందలి సప్తమాశ్వాసమున బసవేశ్వరుఁడును, శివభక్తులును విషాన్న మారగించుటను సోమనాథుఁడు వర్ణించిన విధానము మిక్కిలి ప్రశంసనీయము. ఇంత సహజముగా, ఇంత స్వభావ రమణీయముగా, ఇంత హాస్యరసభరితముగా

పఁబడిన రచన మొండుండుట యరుదు. ఉండుటయే కాదు. అట్టి రచనము వలయునన్నను నితరులకు సుకరముకాదు. ఆంధ్రుల గృహములలో నకాలమునందు జరుఁగు చమత్కార సంభాషణములకు హాస్యజనకములగు కు నీ విషయువడ్డించు ఘట్ట మొక మణిదర్పణ తుల్యమై యాంధ్రుల హాస్య త్తిని, భోజన విధానమును బ్రతిబింబించును. బసవపురాణమునందలి యీ మును జదువుడు:

'చిదక క్రోలుము సిక్కయ్యదేవ
నందడి సేయకు సంగయ్యదేవ
తెచ్చెదఁ జుమ్మయ్య త్రిపురారి దేవ
విచ్చేసి కూర్చుండు విమలాత్మదేవ
కాలకంఠయ్యకుఁ జాలదు దెండు
చాలుఁ బో నీకు సిరాళ దేవయ్య
వేగ మింతేలయ్య విరూపాక్ష దేవ
యీగరిటెఁడుఁ జాలు భోగయ్యకింకఁ
జాలదో తెత్తునా శంకరాచార్య
ఫాలలోచన! పట్టుపట్టు మీసారె
యెంతైన నాస్వాదమే పురాతయ్య
చింతింప లేదు వో శివదేవుఁడింక
మిగిలిన నాక చూ జగదేవ తండె!
నగవులఁ బోదు వో గగనేశ్వరుండ!
కొంకకు గొంకకు శంకర దేవ!
యింకను దెత్తునా లెంక మంచయ్య!
పాడియే వలదనఁ బర్వత దేవ!
కూడ వడ్డింపుఁడీ గురుదేవనికిని
శివశివ! తనియండు సిన్నదేవుండు
ప్రవిమల దేవుండు బాన సెల్లించె
ముద్దు లాడక పట్టు మూర్తి దేవయ్య!
దొడ్డయే యెంతైన ధూర్జటి దేవ!
కెంబావి భోగయ్య! గేలియే నీకు
నీకాలఁ దెలుఁగయే నిజబావదేవ!

మా కేమి వట్టుము మహాలింగ దేవ!
సంతసంబే నీకుఁ జంద్ర శేఖరుఁడ!
మంతసం బేల నిర్మలదేవ! నీకు
నుసులకు నుసులకు కుసుమేశ్వరుండ!
కసి మసంగెద వేల కల్లిదేవయ్య!
సద్ద లిం తేలయ్య పొడ్డల దేవ!
వడ్డింతుమే నీకు దొడ్డ లింగయ్య!
మీసలు దీర్పకు మిండ సంగయ్య!
బాసలు వలుకకు బల్లాణ దేవ!
కడుపారఁ గ్రోలుమా కల్యాణ దేవ!
గుడికెఁడు దెత్తునా గొల్లవరాయ!
చిక్కంగ నీకుమా శ్రీగిరినాథ!
మొక్కలం బిది యేల ముదునూరి దాసి!
గ్రక్కునఁ గ్రోలుమీ కఱకంఠ దేవ
వెక్కసం బిదియేల విమలాత్మదేవ
... ...

... ...
కేతల దేవి! పురాతన్న! మీర
లేతెంచి కూర్చుండుఁ డీ బంతి ననుచు
నల్లీల వెండియుఁ జతురతానోన్య
నల్లాపసూక్తులు సరసమై తనర
నిట్టి సందడి యెన్నఁ డెఱుఁగమే యనుచు
దట్టుఁడు బసవన దా నెర్గు ననుచుఁ
దమ్మయ్య కడుపారెఁదడవకు మనుచు
నిమ్మాటికిని మిక్కి లింకఁ దే ననుచు
నో యన సడలింపు మొడ్డాణ మనుచు
నీ యాన నా పొట్ట నిండెరా యనుచుఁ
గడుపు దిగ్గెడిని నీళ్లకుము నీ వనుభుఁ
గడుపు వెర్గినఁ దెత్తుఁ గాకేమి యనుచు
నయ్యకుఁ దలమున్కలయ్యెఁ బొమ్మనుచు
నియ్యయ్య కింతటు నే మయ్యె ననుచు

నిది పెద్ద గాదు వో యీ యయ్య కనుచు
వదలింపు కట్టిన వలువ నీవనుచుఁ
బోనిత్తునే నుస్లి పోయిన ననుచు
మానుఁడా సరసముల్ మా తోడ ననుచు
నాయయ్యఁ జూడుఁడీ యాస్వాద మనుచు
నీయందు నేమేనిఁ బోమెనే యనుచు
నుత్తమాంగమున నోరున్నఁ గా కనుచుఁ
జిత్తము నున్నట్లుచెప్పెఁ బోమ్మనుచు
గప్పెర నిండినఁ గాని పోవనుచు
గుప్పునఁ దెమ్ము పేర్కొని గ్రుక్కఁ డనుచు
తలయూఁపులకు రాకు తండ్రి! నీ వనుచు
వలె నటె మాతోడ వాగ్వాద మనుచుఁ
గడుపు దా మాయయ్య వడసెరా యనుచు
బడుగు మాట లవేల బంతిలో ననుచుఁ
దప్పి పోవునె యూఁది త్రావిన ననుచుఁ
గొప్పెరకును గంతు గొందుఁగా కనుచుఁ
గ్రేళ్లు వాఱక యారగింపు రమ్మనుచు
నల్లవో బలిసెరా నాయయ్య యనుచు
నేల తెచ్చెదు తేకు మిచ్చుటి కనుచు
మేలుబంతికి నీవ చాలుదే యనుచు
నోయయ్యఁ దెత్తునా యొక్కింత యనుచు
నాయయ్య చాలురా నాకింక ననుచుఁ
ద్రేప్పక పోదునే దేవ యే ననుచుఁ
ద్రేప్పఁగ నైనను దెఱపి లే దనుచుఁ
బ్లెరం బలుఁగులు వాఱెరా యనుచుఁ
బెల్లు వడ్డించితి వ్రేలెద వనుచు
నాలుకఁ బోయకు మఱి యోయయ్య యనుచు
నాలికీన బసవని కుండఁ గా కనుచుఁ
దెరలోని కొప్పెరల్ దెండు దెండనుచు
హర హర! దాఁచెద మయ్య నీ కనుచుఁ

గొనితెచ్చి వడ్డింపఁ గ్రోలుచు భక్త
జనులఁ దోతెండయ ననురాగలీల
శివున కర్పింపుచు శివశివ యనుచు
నవధానవంతులై యారగింపుచును
జొబ్బు జొబ్బునఁగొని సొగయుచు గబ్బు
గబ్బునఁ ద్రేన్పుచుఁ గాళ్లు సాచుచును
నిక్కుచు నీల్గుచు నక్కిలింపుచును
జొక్కుచు సోలుచుఁ జక్కిలింపుచును
నక్కిలిపడి తెప్పలల్ల మోదుచును
గ్రుక్కిళ్లు మ్రింగుచుఁ గుత్తుకబంటిఁ
గ్రోలుచు నలరుచుఁ గ్రాలుచు నాత్మ
సోలుచు సుఖవార్ధిఁ దేలుచు వేడ్క
వ్రాలుచు మెఱయుచు వక్షంబులందు
నోలిఁ బళ్లెరము దిక్కొయ్యన మరలి
చూచుచు నిందుకించుక వుచ్చికొనుచు
లేచుచుఁ జెలఁగుచు లీలఁ దలిర్చ
నాడుచుఁ దగప్పెర లఱచేత నొలయఁ
బాడుచు నుఱుకుచుఁ బరువు వెట్టుచును
మురియుచుఁ గునియుచు ముఱకటింపుచును
నొరగాల నిలుచుచు నరసమాడుచును
నేతెంచి మ్రొక్కుచుఁ జేతులు సాచి
ప్రీతిఁ బ్రసాదంబుఁ బెట్టించికొనుచుఁ
గర మనురక్తిమైఁ గౌగిలింపుచును
నరుదొందఁ బొత్తుల నారగింపుచును
నొండొరు ముందట నున్న పళ్లెరము
లొండొరు లొడియుచు నుర్వి యార్చుచును
విషమాక్ష సద్భక్త వితతి యుబ్బుంగి
విషమ విక్రమ లీల విషకేలి సలుప
... ...
... ...'

– బస. 7–549, 550, 551, 552, 553, 554, 559

## 5. అద్వితీయ వర్ణనములు (UNIQUE DESCRIPTIONS)

సోమనాథుని కావ్యముల యందుఁ గొన్ని స్వతంత్ర వర్ణనములు గూడఁ గలవు. అవి యాతని భావనాశక్తిని జాటును. సహజ వర్ణనములు లోకమునందున్న వస్తుజాతమును సహజముగా, స్వభావ రమణీయముగా వర్ణించునవి. స్వతంత్రవర్ణనము లట్టివికావు. వానికి నాధార భూతములగు మహాల పదార్థముండదు. భావ గమ్యము లయిన యట్టి వానికిఁ దమ బుద్ధి మహిమచే నక్షరరూప మొసఁగబడిన స్వకపోలకల్పితము లగు రమణీయ రూప కల్పనములే స్వతంత్ర వర్ణనములు. కైలాస వర్ణనమును, శివతాండవవర్ణనమును నట్టివి. కైలాస మిట్లుండునని యెవ్వరెఱుఁగరు. శివతాండవము నెవ్వరును జూచి యుండలేదు, వానినెవరు వర్ణించినను దమ యూహామీద నాధారపడవలసినదే. సోమనాథుని బసవ పురాణమున నొకచోటఁ గైలాసవర్ణనమును, మఱొకచోట శివతాండవవర్ణనమునుగలవు. అవి రెండును సోమనాథునిచే స్వతంత్రముగాఁ దీర్చి దిద్దఁబడినవి. అనువదించుట కయినను నతనికి ముందట్టి వర్ణనముల నెవ్వరును గావించి యుండలేదు. మౌలికము లయిన యిట్టి వర్ణనము లను గావించుటలో సోమనాథుఁ డద్భుత మయిన ప్రజ్ఞను బ్రదర్శించి యవి యట్లే యుండును గాఁబోలు నన్న యభిప్రాయమును గలుగఁజేయును. అతఁడు గావించిన కైలాసవర్ణన మిది. సిద్ధరామయ్య యను శివభక్తుఁడు కైలాసమునఁ బ్రమథగణములో బసవేశ్వరుఁడు కలడేమో యరసి వచ్చెద నని శివభక్తతతితోఁ బలికి కైలాసమున కేఁగెనని తెలుపు సందర్భమున నీ కైలాస వర్ణనము గావింపఁబడినది:

*'అజకాలబుద్ధక్ష యాంతరజ్యోతి*
*నిజ బలా ప్రియ యామ్య నీలరుద్రేశ్వ*
*రీశాన శర్వ సర్వేశ భర్గప్ర*
*కాశ సురాధీశ గౌరీశ ధన్య*
*వామదేవ భవోద్భవ ప్రచండధర*
*వామదేవోగ్రసంహారాపినాకి*
*ధాతృవిధాతృప్రశాంతాశన శివ మ*
*హా తేజ సూక్ష్మలయ క్రూర దంష్ట్ర*
*క్షేమేశ వికరణార్చిష్మంత దమన*
*భీమాభిధానోగ్ర పింగాక్ష కర్త*

విషధరానంతనివృత్తి నిధీశ
వృషభ గణాధ్యక్ష విభు వాయు వేగ
హర రత్నకర బభ్రు హంతాగ్ని దుఃఖ
కరసుఖకర సుదుంబర కాల రుద్ర
హరి హర బ్రహ్మ సౌమ్యస్వామి మృత్యు
హర భయానక హాలాహాల పరంధామ
వజ్ర దేహోవ్యయవటురుద్ర దీర్ఘ
వజ్ర దంత వియోక్త్ర వట విరూపాక్ష
సహనేశ శంభు పంచ శిఖ నియోక్త్ర
గుహ దుద్ర బాధక గోపతీశాన
పింగళాసాధ్య మాతంగ రోహిత సు
రంగ కపాల ధర స్థూలరుద్ర
శాశ్వతేశోర్ధ్వకేశత్రిదశేశ
విశ్వేశ చండేశ విత్తేశ వృషధ
రాక్షయరుద్రకాలాగ్ని రుద్రత్రి
యక్ష ఫణీంద్ర విచక్షు లాదిగను
రుద్ర చిహ్నాలు గ్రాల రుద్రాత్ములైన
రుద్ర గణాధీశ్వరుల్ సేరి కొలువ
శ్రీ నంది నందినాథానంద వృషభ
సానంద గోముఖ హయముఖాభంగ
దండ పాణీశాన చండీశ రుద్ర
రుండాభరణ రుద్ర పుండరీకేశ
పర్వతాభరణ దర్ప సుభద్ర శర్వ
సర్వజ్ఞ సర్వాత్మ సర్వ సంహరణ
దారు క రేణుక ధవళాక్ష వీర
వీరక వీరభ ద్రా రూఢ భద్ర
త్రిజటి ధూర్జటి లోక విజయాట్టహాస
నిజ బల విషబల నీల నిశ్శంక
నీలలోహిత నిత్య నిష్కల శాంత
కాల మహాకాల కాల కాలోగ్ర

రూప నిరూప విరూపాక్ష విశ్వ
రూప వృష్కల శాంతరూప వృషాంక
ఉగ్రాక్ష భర్గాసిత గ్రీవసింగ
ళోగ్ర కాయాతి కాయోత్తుంగ విముఖ
కరిముఖ నరముఖ కపిముఖ ద్విముఖ
శరభ ముఖాముఖోష్ట్రముఖ శార్దూల
ముఖ చతుర్ముఖ పంచముఖ సుముఖాష్ట
ముఖ నవముఖ దశముఖ షణ్ముఖైక
ముఖ సహస్రముఖ దుర్ముఖ వికటాక్ష
ముఖ హార విషహరి మలహర మృత్యు
హరి యమహర గజాసురహర సకల
సుర హ రాసురహర పురహర భృంగి
గజకర్ణ శార్దూలకర్ణాశ్వకర్ణ
విజయ ఘంటాకర్ణ వీరగోకర్ణు
లాదిగా బలసి సదైశ్వర్య లీల
నాది ప్రమథ గజేంద్రావలి గొలువ
సనకసనందన సన్మునీశ్వరులు
సముగులై తమ హృదయాబ్జముల్ పూన్ప
సుపమన్యు వామదేవ పవిత్ర పాణి
కపిల కణ్వాగస్త్య కౌశిక సబల
శ్వేత దధీచి వసిష్ఠ కణ్వాత్రి
గౌతమ కశ్యప సూతానిలాత్మ
మాండవ్య హరిత మార్కండేయ పులహ
శాండిల్య వత్స కుత్స పులస్తి శక్తి
బాదరాయణ, భృగు, బక, దాల్భ్య రురు, శి
లాద, మౌద్గల్య, వర్ణాద, శాకల్య,
గర్గ, శౌనక, చతుష్కర్ణ, మృకండు,
భార్గవాంగిరస, విభాండక, శునక,
మైత్రేయ, బల్లకి, మంకణ, చ్యవన,
మిత్రావరుణ, నారదాత్రి, శౌష్కర్ణ,

పైల, సుమంతు, సుబ్రహ్మణ్య, మంద
పాల, సుమిత్ర, రైభక, సత్య సుమహా,
పర్వత, జైమిని, పౌలస్త్య, గార్గ్య,
దుర్వాసు, లాదిగా సర్వ సన్మునులు
వెలుఁగ నాశీర్వాద వేదనాదముల
నలరుచు నందంద యనుకీర్తి సేయ
సుర నర దనుజ ఖేచర సిద్ధ సాధ్య
గరుడ గంధర్వోరగ ప్రకరంబు
ద్వాదశాదిత్యులేకాదశరుద్రు
లాది నవ బ్రహ్మ లష్టవసువులు
సురపాగ్ని యమదైత్య వరుణగంధవహ
నరవాహ హరదిశానాధ యూథంబు
శ్రీవాగ్వధూనాధ జిష్ణులు నవిక
లావరణస్థులైయుభయముల్ వేఁడఁ
దుంబురు నారదులు సంగీతామృ
తంబున నెయ్యంబు దనర నోలార్ప
నంబికా సహితుఁడై యాస్థానమంట
పంబునఁ బేరోలగంబున నున్న -'

– బస. *2-111* నుండి *115* వఱకు.

బసవపురాణములోని నాట్య నమిత్తండి కథలో శివతాండవము మహోద్భుతముగా నభివర్ణింపఁబడినది. చూడుడు:

'ఇది దాండవాకార మెట్టు లంటేని
ముదమున నాట్యాభిముఖుఁడ నైనిలిచి
హోయని డమరుకం బొగి నొక్కమాటు
వాయింపఁ దడవ సర్వము లయంబొందఁ
జరణంబు దొంగలి చలనఁ గాఁజేసి
పరఁగంగ నక్షత్ర పంక్తులు డుల్ల
వినుత మహోద్రేక వీక్షణాటోప
మున నజాచ్యుత దేవముఖ్యులడంగ

మూవల గంటమ్రోఁతకు వెఱచి
దేవి యున్న నగంబు ధృతిఁ దన్నుఁ గలయ
ఖ్యాత మహోద్ధతకరతాడనముల
నాతత దిక్తతి యవలఁ జనంగ
వడి మహోచ్ఛ్వాస నిశ్వాసోపనిహతి
బడబానలంబాఱ జడనిధులింక
గతిని మెట్టెడు పాద ఘట్టన చేత
నతుల ధాత్రీతలం బది ధూళి గాఁగ
నురవడిమై జిట్టఁ దిరిగి నిల్చుడును
బొరిమాలి దిగ్గజంబులు వొడ వడఁగ
గ్రక్కున జాఱి టంకారంబు చేత
నెక్కొన్న కులగిరుల్ నెఱఁబొడి గాఁగ
నొందంగఁ బాదాగ్ర మూఁది నటింపఁ
గ్రిందటి కూర్మంబు గిజి గిజి గాఁగ
మహిత జటాచ్ఛటావిహతి నజాండ
బహుల కటాహంబు పఱియలు గాఁగ
నురు కిరీట విఘాతనోద్వృత్తిఁ జేసి
పొరి దత్త్వసందోహములు వెల్లగిలఁగఁ
దాండవోద్ధతిఁ జేసి ధరియింపఁబడిన
దండి ఫణీంద్రుండు దలరి రోజంగ
నిటు రోఁజుచున్న ఫణీంద్రు నూర్పులకు
స్ఫుట ఫాల నేత్రాగ్ని భుగులన నెగయ
వడి నెగసెడి నేత్రవహ్ని రోచులకు
జడలపైఁ జంద్రుఁడానగమును గరఁగ
గలయ సుధాసూతి గరఁగినకతన
బలువిడి నమృతంబు దలడిగి పఱువ
దలడిగి పఱతెంచు తత్సుధాపూర
మలరి ముంచుడు జీవములు వచ్చి యంత
నురమున శిరమున నొగి గళంబునను
గరముల భూషణోత్కరము లై వెలిఁగి

వరంగు సురాసుర బ్రహ్మోచ్యుతాది
వరకపాలవళుల్ శరణు వేడుచును
బొబ్బలు వొడవంగఁ బొంగి యార్వంగ
నుబ్బి యాళతి సేయ నొగిఁ దాళగింపఁ
గ్రీడ వట్రిల జతిగీతముల్ వాడ
నాడుదుఁ బ్రమథులు సూడఁ దాండవము
కావునఁ దాండవాకార మత్యర్థి
భావించి కొలుతురు భక్తు లెప్పుడును –'

– బస. 3–178, 179 పుటలు

అతిశయోక్తి కలితమై యున్నను సమాధిస్థుఁడయిన మునీశ్వరుని వర్ణించు సందర్భమున సోమనాథుఁ డెంతటి ప్రజ్ఞను ప్రదర్శించెనో హృదయంగమ మయిన యీ వర్ణనమునఁ దిలకింపఁ గలము.

'శ్రీశైలమున సమంచిత నిర్ఝర ప్ర
దేశంబునను సమాధిస్థుఁడై యుండఁ
బదనఖంబులు భువిఁ బర్వి వెల్గుచును
విదిత మై క్రిందికి వేళులు వాఱ
నలిఁ గర్షతలి నఖములు వెలుంగుచును
దెలుపారి మీఁది తీఁగల భాతిఁ బ్రబల
నురుముక్త కేశంబు లొడలు గప్పంగ
ధర నీలగిరి మాడ్కి గురుమూర్తి దనర'

– బస – 5–390 పుట

బసవేశ్వరుఁడు కల్యాణ కటకమును బ్రవేశించు సందర్భమునఁ బురకాంతలు పొందిన సంభ్రమమును, బడసిన యానందోత్సాహములను సోమనాథుఁడీ క్రింది ద్విపదలలోఁ గడుంగడు హృద్యముగా వర్ణించి తరువాతి కవుల ప్రబంధములలోని యిట్టి రచనలకు మార్గదర్శకుఁడయ్యెను.

'పుణ్యాపణ్యాంగనల్ పురవీథులందుఁ
బుణ్యాత్ము బసవ ప్రభునిఁ జూచు వేడ్కఁ
జూడఁగ వచ్చెద సుదతి నే ననుచు

వేడుక చెఱుపక వేగ రమ్మనుచు
గొలి దొసఁగు గాక క్రమ్మఱు మనుచు
నేలమ్మ వచ్చిన నేమి నీ కనుచు
నేకతం బొకతెవ యేఁగు మీ వనుచు
నీకాళ్ల సదచెద నే కాంత; యనుచుఁ
బతిగన్న సైఁచునే పడఁతి ని న్ననుచుఁ
బతిగని యెట్టైనఁ బదర నిమ్మనుచు
బసవన్నఁ జూడక పడఁతి పోననుచు
మునుఁగిడి వేగ రాముఁడీయక యనుచు
దోఁకొని పోయిన దోసమే యనుచు
మూఁక లోనికి బోకు ముగ్ధ వీ వనుచు
దిక్కులు చూడక చక్కఁ రమ్మనుచు
నెక్కడి తరువమ్మ; యింతి నీ కనుచు
మానిని; బసవన్న మహిమ యిదనుచు
మానుగా భక్తుల మఱి చూత మనుచు
నిట్టి సందడి గలదే యెందు ననుచు
దట్టాడ కిటు వేగ తరుణి; రమ్మనుచుఁ
గంటివే బసవయ్యఁ గమలాయతాక్షి
గంటివే మోక్షంబుఁ గంటిఁగా కనుచు
జూచితే; పోదమా సుకుమారి; యనుచుఁ
జూచుచుండఁగఁ బోవ సొగయునే యనుచు
వచ్చువారును జూచువారును గట్టు
నిచ్చువారును జూచి యేఁగెడువారుఁ
బోరిఁ బోరిఁ దెచ్చి విభూతి వీడ్యంబు
లరుదొంద బసవయ్యకర్పించువారు
నంగనల్ వివిధ పుష్పాంజలు లిచ్చి
మంగళారతులెత్తి మహి మ్రొక్కువారు

ధీరు సద్భక్తి శృంగారు నేకాంగ
వీరు నా బసవ కుమారుఁ జూచితిరె
యనవుడు నందఱు గని యట్లు మ్రొక్కి
వనితకు మఱియొక్క వనిత యిట్లనియె
'నలినాక్షి' యీతఁడే నందీశమూర్తి
పొలఁతి యీతండె త్రిభువన పావనుఁడు
వనిత; యీతఁడె భాగవాడ మాదవ్వ
మును నోమి పడసిన యనుఁగుఁ బుత్త్రుండు
పడఁతి; యీతఁడె మన బలదేవమంత్రి
కడుఁగూర్చి యిచ్చిన కన్యక మగఁడు
సన్నుతాంగి యితండె సంగయ్యదేవు
మొన్నఁ బల్కించిన మున్లోక నుతుఁడు
మడఁది; యీతండె యిమ్మనుజోసువేతఁ
గడు నొప్పు మన్నన వడసిన యతఁడు
కన్నుల పండు వీయన్నఁ జూచినను
బన్నుగా జిహ్వాల పండువు వొగడ
యిట్టి ధన్యుల మొదుమే నేఁడు మనల
పుట్టువు సఫలతఁ బొందె నెంతయును
అని యిట్లు చెప్పుచు నరుగుచు జనులు
వినుతింపఁగాఁ బురి వెసఁ జొచ్చు నెడను –'

– బస. *2–64, 65–68* పుటలు

బసవ పురాణ, పండితారాధ్య చరిత్రముల యందు సోమనాథుఁడు కావించిన వివిధ వర్ణనములలో నాతఁడు ప్రవేశపెట్టిన దేశితనమును బెక్కు దృష్టాంతముల యందుఁ గాంచితిమి. వానిలోఁగొన్నిటిని దరువాతి కవులు కొంద ఱనుకరించిరి. కొన్ని మౌలికములై యాతని ప్రతిభను జాటుచున్నవి. కొన్ని సహజ సుందరములై యచ్చమయిన దేశి వర్ణనము లనిపించుకొనఁ జాలి యున్నవి. సంప్రదాయసిద్ధము లయిన కొన్ని వర్ణనముల విషయమున నీతఁడు స్వతంత్ర ప్రవృత్తిని బ్రదర్శించి వానికి దేశీయత్వగుణ మలవడునట్లు చేసెను.

# (IV) దేశిరచనావిధానము

ఇతివృత్తము, ఛందస్సు, వర్ణనలు మొదలగు విషయముల యందే కాక సోమనాథుఁడు తనకావ్యములయం దవలంబించినరచనా విధానమునందుఁ గూడ దేశీయతను బాటించి యుండుట యొకముఖ్యవిశేషము. మార్గకవిత్వము నందలి రచనావిధానమున కిది పూర్తిగా భిన్నము. దేశిసారస్వతమునకుఁ జెందిన వీరగాథల (Ballads) రచనమునందుఁ గానవచ్చు సామాన్యలక్షణములలోఁ గొన్ని యాతని కావ్యములయందుఁ గానవచ్చును. రచనమునకు సంబంధించిన యాలక్షణములే యాకావ్యములను దేశిసారస్వతమునకు సన్నిహితము చేయుచున్నవి. వీరగాథా రచనమునందు సాధారణముగాఁ బునరావృత్తి లేక దరువు (Refrain), అభివర్ధిత పునరుక్తి (Incremental Repetition), వారానువర్తనము (Ballad common-places) అనుమూఁడులక్షణములు ప్రధానముగా నుండు నని పాశ్చాత్య పండితులు చెప్పుదురు. ఈమూఁడులక్షణములును బాశ్చాత్యవీరగాథలయందు వలెనే భారతీయభాషాగ్రథితము లయినవీరగాథల యందును గలవు. వీరగాథా రచనము లోఁ బునరావృత్తి (Refrain) యొకప్రధాన లక్షణము. ప్రాచీన కాలము నందలి పాశ్చాత్యవీరగాథలలోఁ బ్రధానగాయకుఁడు వీరగాథాచరణములను గానము చేయుచుండఁగా నతనికి సహాయభూతు లయినతక్కినగాయకు లీపునరావృత్తితో నాతనితో గొంతులు కలిపి పాడెడివారు. ఇది వీరగాథల (Ballads)లో విరళముగను, వీర గాథానికల (Balladlings)లోఁ దఱచుగను గాన వచ్చును. వీరగాథాచక్రముల (Ballad cycles)లో నిది త్యజింపఁబడినది. తెలుఁగునఁ దుమ్మెదపదములు, వెన్నెలపదములు మొదలగుగేయరచనలలో నీ పునరావృత్తి కాన వచ్చును. తందానతాన, భళిభళీ, మేలు భళీ, భళానోయి భాయి తమ్ముఁడా, మొదలగుపునరావృత్తములు వీరగాథలలో నేఁటికిని గాన వచ్చును. పలనాటి వీరచరిత్ర, కాటమరాజుకథ యను వీర గాథాచక్రములలో నీ పునరావృత్తిలక్షణము స్ఫుగ్యము.

పునరావృత్తిపదమున కర్థ ముండ వలయు నను నియమము లేదు. తఱచుగా నిది యర్థరహితముగనే యుండును. ఒక్కొక్కప్పు డది యన్యభాషలనుండి యెరవు తెచ్చుకొన్నది కూడఁ గావచ్చును. ఇది బహుశః సంగీతవాద్యములవలన నుత్పన్న మగు మధురశబ్దమునకుఁ బర్యాయముగా వాడుకలోనికి వచ్చియుండును. ఆంగ్లవిమర్శకులు దీనిఁగూర్చి తెలిపిన యీవాక్యములు తిలకింపుఁడు :

'This refrain often appears to be non-sense, but it probably had some sense originally-it was perhaps meant to represent the sound of musical instruments or some action on the part of the dancers'

*- Mrs. Margaret L. Woods: Essays by Diverse hands, vol 6, p 27*

సుదీర్ఘము లయిన వీరగాధలలో నీపునరావృత్తి పూర్తిగాఁ ద్యజింపఁబడి యాఖ్యానకథనము మాత్రమే ప్రాధాన్యము వహించును. సోమనాధుని బసవ పురాణ పండితారాధ్యచరిత్రములు ద్విపదచ్ఛందమున నిబంధింపఁబడుటచేత - సుదీర్ఘ మయినయితివృత్తములు కలవి యగుటచేత వీరగాధాచక్రములందువలెనే యిందును బునరావృత్తికి నవకాశము లేక పోయినది. కాని, యిట్టిపునరావృత్తిని బాదాంతముల యందుఁ జేర్చి పఠించిన నవియు వీరగాధలవలె గానానుకూలమ్మై, వీరగాధాగానమునఁ గలుగునానందావేశముల నొసంగజాలి యుండును. బసవపురాణమునందలి యీ క్రింది పంక్తులను 'తందాన' యనియో, భళిభళీయనియో పునరావృత్తిని జేర్చి పఠించిన వీరగాధాగానానుభవము కలుగును. చూడుఁడు:

*'శివరాత్రి నిత్యంబు చెల్లించు బాన - తందానతాన*
*శివభక్తు లెల్లను శివుఁ డనుబాన - తందానతాన*
*భక్తుల యెగ్గులు పట్టని బాన - తందానతాన*
*భక్తుల కుల మెత్తి పలుకని బాన - తందానతాన*
*మృడుఁడైన నొకమాటి యడుగనిబాన - తందానతాన*
*యడిగినయర్థంబు గడవనిబాన - తందానతాన'*

- బస. *2-70* పుట.

ఇట్లే యీఘట్టమున నెన్నిపంక్తుల నయినను బాడుటకు వీలగును. కనుక నిందలి రచనావిధాన మచ్చటచ్చట దేశిసారస్వతమునకుఁ జెందిన వీరగాధారచనమును బోలియున్న దనుటకు సందేహము లేదు.

వీరగాధారచనమునఁ గానవచ్చు మఱొకలక్షణ మభివర్ధత పునరుక్తి (Incremental Repetition). వీరగాధలలోని కధాకధన మొకవిచిత్రపద్ధతిలోఁ గొనసాఁగుచుండును. మునుపు పాడిన ఖండికనే మఱల నెత్తుకొని పాడి, తత్సంబంధమగు నూతన ఖండికను జేర్చుకొనుచుఁ బోవుటవలనఁ గథ ముందునకు నడచుచుండును. పాశ్చాత్యవీరగాధలలోను, భారతీయభాషల

యందలి వీరగాథలలోను గూడ నీ పద్ధతి కలదు. ఆంగ్లవిమర్శకుల యీ క్రింది వాక్యములను దిలకింపుఁడు :

'The main structural feature of popular ballads is simple repetition with incremental changes, utterly void of metaphor which advance the statement of fact and help narrative, however slowly, on its way'.

*- F.B. Gummere. The Popular Ballad, p 42*

'The successive addition of new bits of fact as the bits already familiar are repeated' -

*- Bliss Perry A study of Poetry. p 280*

ఇట్టి యభివర్ధితపునరుక్తి కల క్రింది యాంగ్లగేయరచనలను గాంచుఁడు:

I started up the trial October twenty third

I started up the trial with 2 - U herd

ఇది యమెరికాలోని 'Cowboy Ballads' లోని రచనాపద్ధతి. అట్లే మఱొకటి.

Christine, Christine, tread a measure for me

A silken sark I will give thee

A silken sark I can get me here

But I'll not dance with the prince this year

*- Bliss Perry : A study of Poetry, p 280*

కన్నడభాషయందలి 'కెరగెహార'[1] యను జానపదగేయమునందుఁ గూడ నీ యభివర్ధితపునరుక్తి కానవచ్చుచున్నది. చూడుఁడు:

'కల్లనకేరి మల్లనగౌడ కెరె యొంద కట్టిస్యాను

కెరె యొంద కట్టిస్యానుసెరెముక్క నీ రిల్ల

---

౧. *'కెరగెహార' – కన్నడజానపదగేయము. 'కన్నడదబావుట' యను సంకలనమున కన్నడసాహిత్యపరిషత్తు, బెంగుళూరు వారిచేఁ బ్రకటితము. దీనినిగూర్చి శ్రీ రాళ్లపల్లి జయంతగారు సాహిత్యసమితి వ్యాసావళిలో నొకవ్యాసము వ్రాసిరి. ప్రమరణ: తిరుపతి సాహిత్య సమితి – **1967**.*

సెరె ముక్క నీ ర్లిల్ల హొత్తిగి తగ స్యారు
హొత్తిగ తగ స్యారు జోయిను కేళ్యారు'

'నణ్ణసొసి భాగీరతి జళకన మాడ్యాళు
జళకన మాడ్యాళు బంగారబుట్టె తుంబ్యాళు
బంగారబుట్టె తుంబ్యాళు సింగారసింబి మాడ్యాళు
సింగారసింబి మాద్యాళు ముంద ముంద హొంటాళ.'

'గండమాదేవరాయ దండిన్నాగైదాను
దండిన్నాగైదాను కండను కెట్టైకనన'

తెలుఁగులోని వీరగాథలలోను, వీరగాథానికలలోను, గొన్ని గేయ రచనములలోను గూడ నిట్టి యభివర్ధితపునరుక్తి కలదు. బొబ్బిలి యుద్ధము అనువీరగాథ (Ballad) యందలి యీయభివర్ధితపునరుక్తులను జూడుఁడు:

మొదటి రకము :

నూటికి పొడిచి సెల గంటాడు భూపతిరాయడు
నూటికి పొడిచి సెల గంటాడు మల్లరాయడు
నూటికి పొడిచి సెల గంటాడు ధర్మారాయడు
నూటికి పొడిచి సెల గంటాడు పదాలరాయుడు
నూటికి పొడిచి సెల గంటాడు గుమ్మళ్ల బుచ్చయ్య
... ... ...
నూటికి పొడిచి సెల గంటాడు ముహ్మాదు ఖాసీము
నూటికి పొడిచి సెల గంటాడు తులసీరా మైతే...

– బొబ్బిలికథ. పుట **81.**

రెండవ రకము :

గోలకొండ యెఱ్ఱభూపతికే జాబు లంపినారు
కిమిడి నున్న నారాయణదేవుకు జాబులంపినారు
అట్టగడ్డ హరిచంద్రునికైన జాబు లంపినారు
మారువు లేలే లింగారావుకు జాబు లంపినారు
మన్న మ్మేలే మన్యభూపతికి జాబు లంపినారు
కోయ నున్న కోయభూపతికి జాబు లంపినారు

దొంటిమీసపు భూపతిరాజుకు జాబు లంపినారు
కొప్పాడ రామయ్యగారికి జాబు లంపినారు
దూసరి వెంకప్పారావుకు జాబు లంపినారు
బొగ్గులూరి మరి జగ్గిరెడ్డికి జాబు లంపినారు
హసన్‌బేగుకు భైరవరాజుకు జాబు లంపినారు
ప్రత్తిపాటి పావయ్యరాజుకు జాబు లంపినారు
సూర్యరాజుకు చంద్రరాజుకు జాబు లంపినారు
కడపాలబుచ్చయ్యగారికి జాబు లంపినారు
చిత్తాడ సూరయ్యగారికి జాబు లంపినారు
అనకాపల్లి పాపరావుకు జాబు లంపినారు
రాజశ్రీ రామమూర్తి నీలాద్రిరావుకు జాబు లంపినారు

– బొబ్బిలికథ – పుటలు ***23, 24.***

మూఁడవ రకము :

పూలతోట మజిలీ లన్నా భీమసింగిలోను
భీమసింగి మజిలీ లన్నా అలమండాలోను
అలమండ మజిలీ లన్నా కసిమికోటలోను
కసిమికోట మజిలీ లన్నా యెలమంచిలిలోను
ఎలమంచిలి మజిలీ లన్నా యేటికొప్పాకోయి
ఏటికొప్పాక మజిలీ లన్నా గుడిచెర్లాలోను
గుడిచెర్లా మజిలీ లన్నా సబ్బారములోను
సబ్బారము మజిలీ లన్నా సబ్బారములోను
సబ్బారము మజిలీ లన్నా చోడారములోను
చోడారము మజిలీ లన్నా అలవెల్లిలోను
అలవెల్లి మజిలీ లన్నా పిఠాపురములోను
పిఠాపురము మజిలీ లన్నా పెద్దాపురములోను
పెద్దాపురము మజిలీ లన్నా రావులచెరు వేమి
రావులచెరువు మజిలీ లన్నా నల్లచెరువుకాడ
నల్లచెరువుమజిలీ లన్నా రాజానగరము
రాజానగరులో దిగి వున్నాడు కళింగమహారాజు

– బొబ్బిలికథ. పుట ***27.***

'కరగెహోర' యనుకన్నడజానపదగేయమునుండి యభివర్ధితపునరుక్తి కింతకు మును పుదాహృతము లయినపంక్తు లీమూఁడవరకమునకుఁ జెందును.

'రాముల పాట' యను జానపదగేయరచనమునందలి యీాయభివర్ధిత పునరుక్తిని గుర్తింపుఁడు :

*'నారసీరలు గట్టి ఎలియబానము తొడిగి*
*అడవులకు పయన మయిరీ*
*ముందరా రాములూ ఎనక జానకిదేవి*
*ఆరెనుక లచ్చుమన్నా*
*ముందరా రాములూ ఎనక జానకిదేవి*
*ఆరెనుక లచ్చుమన్నా*
*అడుగడుగు వెడలాడు అటు మల్లి సూత్తాడు*
*ఆగ్రకోపము జేయునూ –'*

ఇట్టి యభివర్ధితపునరుక్తి వీరగాధలం దంతటను గాన రాదు. అచ్చటచ్చట నీ పద్ధతి కొనసాఁగును. ఇది వాగ్రూపప్రచారము మాత్రమే కలవీరగాధలను గానము చేయుగాయకులకుఁ దరువాతిపంక్తులు జ్ఞాపకము వచ్చుటకును – గానము చేయఁబడు వీరగాధయందలికథయందలి యానుపూర్వి శ్రోతలకు బాగుగా గోచరించునట్లు చేయుటకును దద్రచయిత లవలంబించినవిధాన మయి యుండును. ప్రౌఢకవిత్వము నందును – బార్యకావ్యములయందును నిట్టి యభివర్ధితపునరుక్తి కవకాశము లేదు. అవి విషయప్రధానములుగా మాత్రమే సాగును. గాన ప్రధాన మయిన వీరగాధల యందు విషయ మల్పము; పునరుక్తి యధికము. ఈవాక్యములు తిలకింపుఁడు:

'The maturer the stage of Poetry the less repetition and more facts, Reversed the fewer facts the greater amount of repetition'

*- F.B. Gummere· The popular Ballad, p. 86.*

వీరగాధారచనావిధానమునకు సంబంధించిన యీాయభివర్ధితపునరుక్తి సోమనాథుని బసవపురాణ, పండితారాధ్యచరిత్రములయందుఁ గానవచ్చుచున్నది. బసవపురాణము ప్రథమాశ్వాసములోని యీాక్రింది పంక్తులను దిలకింపుఁడు:

*'బసవని శరణన్నఁ బాపక్షయంబు*
*బసవని శరణన్నఁ బరమపావనము*

బసవని శర ణన్నఁ బ్రత్యక్ష సుఖము
బసవని శర ణన్నఁ భవరోగహరము
బసవని శర ణన్నఁ భక్తి సేకూరు
బసవని శర ణన్నఁ బంధము ల్వాయు
బసవని శర ణన్నఁ భాగ్యము ల్వొందు
బసవని శర ణన్నఁ బరఁగు శీలంబు
బసవని శర ణన్నఁ బాయు నాపదలు
బసవని శర ణన్నఁ బ్రబలు సంపదలు
బసవని శర ణన్నఁ నసలారుఁ గీర్తి
బసవని శర ణన్నఁ ఫలియించుఁ గోర్కి
బసవని శర ణన్న నెసఁగు వాక్సిద్ధి
బసవని శర ణన్నఁ భ్రాజిల్లు బుద్ధి'

బస. *1–10* పుట.

... ... ...
... ... ...
'బసవా యనఁగ విన్నఁ బాస లోం డేల?
పసులకు నైనను బ్రబలదే భక్తి
బసవా యనఁగ విన్నఁ బాస లోం డేల?
పసిబాలురకు నైన నెసఁగదే భక్తి
బసవా యనఁగ విన్నఁ బాస లోం డేల?
యసమూఢునకు నైన నలరదే భక్తి?
బసవా యనినఁ జాలుఁ బాస లోం డేల?
యసలార విషమైన నమృతంబు గాదె
బసవా యనినఁ జాలుఁ బాస లోం డేల?
పసిగ మైఁ గులిశంబు గుసుమంబు గాదె?
బసవా యనినఁ జాలుఁబాస లోం డేల?
వసుధ శత్రులు మిత్రవర్గంబు గారె?
బసవా యనినఁ జాలుఁ బాస లోం డేల?
వెసఁ గాలు కార్చిచ్చు వెన్నెల గాదె'

– బస. *2–87* పుట.

పండితారాధ్యచరిత్రమునందలి యీక్రిందిపంక్తులలోని యభివర్ధిత పునరుక్తిని దిలకింపుఁడు:

'పండితారాధ్యులఁ బ్రస్తుతించినను
నిండారు శివభక్తి నియతి వర్ధిల్లుఁ
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
దండతండములుపాతకములు వొలియుఁ
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
బండినసద్భక్తి భాగ్యంబు వొందుఁ
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
మండెడిదావాగ్ని మం చయి పోవుఁ
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
జండోరగాది విషంబులు గ్రాఁగుఁ
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
దుండగంబులు బహుదుఃఖముల్ వాయుఁ
బండితారాధ్యులఁ బ్రస్తుతించినను
దండి భవాంబుధి దరతర మింకుఁ
బండితారాధ్యులఁ బ్రస్తుతించిన న
ఖండితైశ్వర్యప్రకాశత దనరు.'

పండి. *1–4* పుట.

అందే మఱొక్కస్థలమునందలి యీయభివర్ధితపునరుక్తిని జిత్తగింపుఁడు:

'వారక దాసయ్య వస్త్రంబు గట్టి
యారగింపక పోయినట్ల పోరాదు
కోరి చిర్తొండని కొడుకుఁ జంపించి
యారగింపక పోయినట్ల పోరాదు
ఆరయ బల్లహు నాలంబు సేసి
యారగింపక పోయినట్ల పోరాదు
కూరంగ జలములఁ గుండయ్య ముంచి
యారగింపక పోయినట్ల పోరాదు
కూరిమి నంబెన కొడు కని పట్టి

యారగింపక పోయినట్లు పోరాదు
చేరమముందఱఁ జెలువుగా నాడి
యారగింపక పోయినట్లు పోరాదు
సొరంపుటణుమూర్తి నందనం బలఁది
యారగింపక పోయినట్లు పోరాదు
ఆర నోహీళుని ధూపావసరమున
నారగింపక పోయినట్లు పోరాదు
ధీరుఁ డా నమినంది దీపముల్ సూచి
యారగింపక పోయినట్లు పోరాదు
చేరి పిళ్లయినారిచే ఘూతిఁ గొంచు
నారగింపక పోయినట్లు పోరాదు'

- పండి. *1-137, 138* పుటలు.

బసవపురాణములో మఱొక రకమైన యభివర్ధితపునరుక్తి యిది:

'రుద్రాక్షశైలముల్ రుద్రాక్షతరులు
రుద్రాక్ష గనులును రుద్రాక్షనదులు
భసితంపు గిరులును భసితంపుఁ దరులు
భసితంపు గనులును భసితంపు నదులు
లింగపర్వతములు లింగవృక్షములు
లింగాకరంబులు లింగ తీర్థములు
జంగమశైలముల్ జంగమతరులు
జంగమగుల్మముల్ జంగమ లతలు
సల్లాపశైలముల్ సల్లాపతరులు
సల్లాపగుల్మముల్ సల్లాప లతలు
గాయకశైలముల్ గాయకతరులు
గాయక గుల్మముల్ గాయకలతలు'

– బస. *3-211* పుట.

ఇందు గిరులు, తరులు, గనులు, నదులు – గిరులు, తరులు, గుల్మములు, లతలు ననువరుసను నభివర్ధితపునరుక్తి సాధింపఁ బడినది. తరువాతి

పంక్తులలోఁ గడపటి నాలుగింటికిఁ దోడు మఱి నాలుగు చేర్పఁబడినవి. అవి మృగములు, అలులు, పక్షులు, ఫణులు. ఇప్పుడు చూడుఁడు:

'గాయకశైలముల్ గాయకతరులు
గాయకగుల్మముల్ గాయకలతలు
గాయకమృగములు గాయకాలులును
గాయకపక్షులు గాయకఫణులు
నాట్యపర్వతములు నాట్యవృక్షములు
నాట్యగుల్మంబులు నాట్యవల్లరులు
నాట్యమృగంబులు నాట్యపక్షులును
నాట్యోరగంబులు నాట్యవానరులు'

బస. *3–212* పుట.

తొలి యెనిమిదింటిలోని 'యలుల'కు దరువాతి యెనిమిదింటిలో 'వానరులు' నిలుపఁబడినది. తక్కినని యట్లే యున్నవి. తొలి యెనిమిదింటి లోని 'గాయక'కు మాఱుగాఁ దరువాతి యెనిమిదింటిలో 'నాట్య' నిలుపఁబడినది.

'ఎక్కి వీక్షింప నీరేడులోకములు
నక్కజంబుగఁ గాచునట్టి శైలములు
ఎక్కి వీక్షింప నీరేడులోకములు
నక్కజంబుగఁ గాంచునట్టి వృక్షములు
ఎక్కి యూఁగించిన నెక్కడికైనఁ
జక్కనఁ గొనిపోవఁ జాలు శైలములు
ఎక్కి యూఁగించిన నెక్కడికైనఁ
జక్కనఁ గొనిపోవఁ జాలు వృక్షములు
ఎక్కి తలంచిన నేరూప మయిన
గ్రక్కున నప్పుడ కాఁజేయు గిరులు
ఎక్కి తలంచిన నేరూప మైనఁ
గ్రక్కున నప్పుడ కాఁజేయు తరులు'

బస. *3–214* పుట.

ఇందు వీక్షింప, ఊహించిన, తలంచిన యనుపదములు నాలుగేసి పాదముల కొకమాఱు మార్పఁబడినవి. తక్కినపాదభాగములట్లే పునరుక్తము లైనవి. ఒకేవిషయము, ఒకే రకమయినరచనయుతో – నటనటఁ జిఱుమార్పులతోఁ గ్రామాభివృద్ధిని సాధించుచుఁ బ్రతిపాదింపఁ బడినది.

ఒక్కొకచోఁ బాటకుఁ బల్లవివలెఁ గథాసందర్భములలో మొదటఁ జెప్పిన ద్విపదచరణములనే కథాంతమునఁ జేర్చుచు మూలకథాసూత్రమునకు సమన్వయించు విధానము చూపట్టును.

పండితారాధ్యచరిత్రమునందలి పురాతనప్రకరణమున వెల్లగొండ మహాదేవయ్య యనుభక్తుఁడు శివోపకరణములు తాఁకినకారణముచేఁ దనపాదములను ఖండించుకొనఁగా నాతనికి మరల నాపాదములను బండితారాధ్యుఁడు పరమేశ్వరుని కరుణచే నిప్పించెను. ఆ సందర్భమున నట్టివే యగుమఱికొందఱు శివభక్తులకథల ననుసంధించెను. ప్రతికథాంతము నను నవేద్విపదపంక్తులు పునరుక్తములు చేయఁబడి యుండుట యీ సందర్భమునందు గుఱుతింపఁదగి యున్నది. చూడుఁడు:

*కళియంబ పిళ్లనైనారుల కథ :*

*అప్పాట నీపండితారాధ్యదేవుఁ*
*డిప్పించెఁ బాదంబు లీశుచే నేఁడు*
*తెల్లంబుగా మహాదేవయ్యగారి*
*కెల్లవారును జూడ నిల నట్లు గాక*

*పండి. **2-295***

*దసరయ్య కథ :*

*'అప్పాట దసరయ్య యాయయ్య కిచ్చెఁ*
*జెప్పఁ జిత్రము గాఁగఁ జేతులు రెండు*
*నచ్చుగా నీ పండితారాధ్యదేవుఁ*
*డిచ్చెఁ బాదములు దా నిప్డు దొప్పారఁ*
*దెల్లంబుగా మహాదేవయ్యగారి*
*కెల్లవారును జూడ నిల నట్లు గాక'*

*పండి. **2-314** పుట.*

గురుభక్తయ్య కథ :

'పడసె నీక్రియ గురుభక్తయ్య నాఁడు
ఖండేందుధరభక్తమండలి పొగడఁ
బండితేంద్రుఁడు నేఁడు వడసెఁ బాదములు
తెల్లంబుగా మహాదేవయ్య గారి
కెల్లవారును జూడ నిల నట్లు గాక'

పండి. *2-331* పుట.

గురుభక్తాండారి కథ :

'దండియయ్య గురుభక్తాండారి కొసఁగె
రెండుగన్నులు నాఁడు ప్రీతితో నేఁడు
పాదముల్ గృప సేసెఁ బండితారాధ్యుఁ
డాదట భక్తిమహత్త్వంబు వెలయఁ
దెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్ల వారును జూడ నిల నట్లు గాక'

పండి. *2-429* పు.

బెలిదేవి వేమనారాధ్యుల కథ :

'వినుతింప బెలిదేవి వేమయ్యగారు
నచ్చినన్నపునకు నరగునఁ బ్రాణ
మిచ్చె నచ్చెరువుగా నీడితమహిమ
నప్పాట నీ పండితారాధ్యదేవుఁ
డొప్పారఁ గరుణ నేఁ డొసఁగెఁ బాదములు
తెల్లంబుగా మహాదేవయ్య గారి
కెల్లవారును జూడ నిల నట్లు గాక'

పండి. *2-449* పుట.

సకలేశుమాదిరాజయ్య కథ :

'మాదిరాజయ్య సమ్మదలీలఁ జిక్క-
మాదయ్యప్రాణంబు మఱి నెత్తినాఁడు
అరుదదరు దనఁగ దయామతి నేఁడు
గరుణించెఁ బండితఘనుఁడు పాదములు

తెల్లంబుగా మహాదేవయ్య గారి
కెల్లవారును జూడ నిల నట్లు గాక'

పండి. *2–467* పుట.

కదిరె రేమయ్య కథ :

'కదిరె రేమయ్య ప్రకాశితభక్తి
విదితంబుగా నాఁడు వెలయంగ నేఁడు
నదమలదృఢభక్తి సంపద మెఱసి
పదములు గృపసేసెఁ బండితేశ్వరుఁడు
తెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్లవారును జూడ నిల నట్లు గాక'

పండి. *2–474* పుట.

చేటల వేమయ్య కథ :

'..... చేటలవేమయ్యసన్నిధిని
బాలుండు షోడశప్రాణంబు వడసె
నాఁడు, పండితమల్లినాథదేవుండు
నేఁ డిచ్చెఁ గృపఁ బాదనీరజాతములు
తెల్లంబుగా మహాదేవయ్యగారి
కెల్లవారును జూడ నెలమి దుల్కాడ'

పండి. *2–498* పుట.

ఈ కథలయం దన్నిటఁ గడపట – 'తెల్లంబుగా మహాదేవయ్యగారి, కెల్లవారును జూడ నిల నట్లు గాక' యను ద్విపదచరణములు పునరావృత్తము లై ప్రధానకథతో సమన్వయము కుదుర్చుకొనుచు మఱొకకథ కుపక్రమణము గలిగి యున్నది. చేటల వేమయ్య కథలో మాత్రము దాని తరువాత మఱొక కథ యేదియుఁజెప్పఁబడక పోవుటచే 'అట్లుగాక' యనుటకు మాఱుగా 'ఎలమి దుల్కాడ' యని మార్పఁ బడి యున్నది. ఇదియు నొకవిధ మయిన యభివర్ధిత పునరుక్తియే యగును.

వీరగాథాసహజ మయిన యిట్టి యభివర్ధితపునరుక్తి బసవపురాణ, పండితారాధ్యచరిత్రములయందుఁ బెక్కుస్థలములలో వివిధరీతులఁ బ్రదర్శింపఁ

బడినవి. దేశి సారస్వతలక్షణ మయిన యీరచనావిధానము సోమనాథుని కృతులయం దతివేలముగాఁ బ్రదర్శింపఁబడి యుండుటచేత నతని రచనావిధానము దేశిలక్షణలక్షిత మనుట నిరూపిత ముగుచున్నది.

వీరగాథలలోఁ గానవచ్చు మూఁడవగుణవిశేషము వారానువర్తనము (Ballad common-places) అనఁగా వీరగాథలలో నాయారసముల కనుగుణముగాఁ గొన్ని పడికట్టుపదములును, వాక్యములును మాటిమాటికిఁ బ్రయోగింపఁ బడుచుండును. ఆంగ్లేయవీరగాథలలో నిట్లు మాటిమాటికిని నాయా సందర్భములలోఁ బ్రయోగింపఁబడు పదములను, బలుకుబళ్లను, వాక్యములను "Ballad Common-places' అందురు. తెలుఁగువీరగాథలలోఁ గూడ నిట్టి వారోక్తులు లేకసాధారణప్రయోగములు పదింబదిగాఁ గానవచ్చుచుండును. అవి యాయాకవీశ్వరులకు మిక్కిలి ప్రీతిపాత్రము లయిన వానిగా మనము భావింప వచ్చును. ఆయాసందరర్భానుగుణముగా నవి యాతని నోట సర్వసాధారణముగా – నప్రయత్నముగా – వెలువడుచుండును. ఒకవీరగాథలోనే కాక – యొకేకవి రచించిన పెక్కు వీరగాథలలోను నతని కిష్టము లయిన పద, జాతీయ, వాక్యప్రయోగము లుండును. ఇట్లు కాక, భిన్నకవి విరచితము లయినను వీర గాథాకవులు సర్వసాధారణముగా నాయాసందర్భముల కథనములోను, వర్ణనములోను నొకేరక మయినపదాదులను బ్రయోగించుటయుఁ గలదు. తెలుఁగువీరగాథలలోఁ గోపమును వర్ణించునపుడు తఱచుగా 'ఉగ్రుఁడై మండి', 'తెల్లనిగుడ్లకు తెచ్చె రకతంబు' 'ఎఱ్ఱనిగుడ్లకు ఎక్కె రకతంబు' అని వర్ణింతురు. శోకమును వర్ణించునపుడు –

'కుడికంటి వుదకాలు కుంబవరుషము లాయె
ఎడమకంటి వుదకాలు ఏరులై పాఱె'

అని వ్రాయుట, పాడుట పరిపాటి. గళ్లున నవ్వుట, కిలకిలారించుట అనుజాతీయములు పెక్కుచోటులఁ గాన నగును. 'వినుము కాటమరాజ, విశదంబుగాను' – 'వినుము కాటమరాజ, విన్నపం బొకటి' – ఇత్యాది వాక్యములు వీరగాథలలోఁ గోకొల్లలు.

ఆంగ్లవిమర్శకు లీ వారానువర్తనలక్షణమును గూర్చి యిట్లు నుడివి యున్నారు. చూడుఁడు :

*'They make shameless use of 'common-places', that is, stock phrases, lines or stanzes which are conveniently held by the memory and which may appear in dozens of different places'*

*'They also contain many words and phrases such as 'gay lady' and 'proud porter' which are used again and again and are called ballad common-places'*

*- G.F. Whicher, the World Book Encyclopaedia, vol. 2, p. 616*

ప్రపంచమునందలి వీరగాథ లన్నిటియందును సర్వసాధారణముగాఁ గాన వచ్చునీ 'వారానువర్తన లక్షణము' సోమనాథుని రచనలందును గానవచ్చుచుండుట గమనింపఁ దగి యున్నది. ఇవి చూడుఁడు:

*ఇది యెంత వెద్ద?*
*నీ ప్రాప్తియై?*
*కల గని మేల్కొన్నకరణి*
*పూసలలోన దారంబుక్రియ*
*కన్నుల నవ్వి*
*మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లు వోవ*
*వీరమాహేశ్వరాచారవ్రతుండు*
*తత్ప్రస్తవమున*
*వరిచ్ఛేది య్యై*
*మందున కైన*
*ముంజేతి కంకణంబున కద్ద మేల?*
*కన్నుల వీక్షించు*
*నిలుకాల నిలువ నేరక*
*కల నైన.*

ఇందు మాటిమాటికి నతనిరచనలలోఁ గానవచ్చుపదములు, పద బంధములు, జాతీయములు, ఉపమానములు, వాక్యములు కలవు. అతని బసవపురాణ, పండితారాధ్య చరిత్రవములు రెంటను నివి తఱచుగాఁ బ్రయోగింపఁబడి యున్నవి. ఇందుచే వీర గాథాసహజమగు నీవారానువర్తన లక్షణము సోమనాథునిగ్రంథములలో గూడ నుండుట సిద్ధాంతిత మయినది.

వీరగాథలు దేశిసారస్వతశాఖకుఁ జెందినరచనములు గనుక వాని యందుఁ దద్రచయితలు పాటించు రచనావిధానము సోమనాథునిగ్రంథములయందుఁ గానవచ్చుచుండుటచే వీనియందలి రచనావిధానము దేశిలక్షణలక్షితమని చెప్పక తప్పదు. ప్రౌఢులగుమార్గకవుల కృతులయం దిట్టిరచనము గాన రాదు. అందుచే నిది దేశికవుల ప్రత్యేకత యని యెన్నఁదగి యున్నది. నన్నెచోడుని కుమారసంభవములోఁ గూడ నిట్టి వారోక్తులు విశేషముగాఁ గలవు. అది కూడ దేశిలక్షణము ననుసరించుటవలనఁ గలిగినదే.

ఇట్లు, సోమనాథుఁడు వీరగాథాసహజము లగు నభివర్ధితపునరుక్తి, వారాను వర్తనము అనులక్షణములను దనకావ్యములలోఁజాలవఱకుఁ బాటించి యుండుటచేతను – పునరావృత్తిలక్షణము వీరగాథలలో విసర్జింపఁబడినను – నది చేర్చినపుడు వీరగాథలవలెనే బసవపురాణాదులు పఠింపనగుచుండుటవలనను నాతని రచనావిధానము సంపూర్ణముగా దేశి లక్షణలక్షిత మనియు, మార్గకవిత్వరచనావిధానమున కిది పూర్తిగా భిన్న మనియు నిర్ధారిత మగుచున్నది.[౨]

## (V) ఉపమానాదులలోని దేశితనము

ఇతివృత్తము, ఛందస్సు, వర్ణనలు, రచనావిధానము, యనువిషయముల యందే కాక పాల్కురికి సోమనాథుఁడు తనగ్రంథములయందుఁ బ్రయోగించిన కొన్ని యుపమానములయందును, బాటించినకవిసమయములయందును గూడ దేశితనము గానవచ్చుచుండుట యొకవిశేషము. ఉపమానముల ప్రయోగ మునందు సంస్కృతమున నొకనిర్దిష్టవిధానముకలదు. ప్రాచీనకవీశ్వరు లొకానొకవస్తువు యొక్క జ్ఞానము సుగమ మగుటకుఁ బరిచిత మగునొక వస్తువుతోఁ బోల్చి చెప్పుట యాచారమై యున్నది. తత్తద్వస్తువర్ణనమున నాయాయిరూఢవస్తువులతోనే పోల్చుట యొక సంప్రదాయముగా నేర్పడి యా సంప్రదాయమునే చాలవఱకుఁ దెలుఁగు కవీశ్వరు లందఱును ననుసరించుట జరగినది. కవిసమయముల విషయము కూడ నట్లే. సంస్కృతకవులు పాటించినకవిసమయములనే యాంధ్రకవీశ్వరులును జాలవఱకు ననుసరించిరి.

---

౨. వీరగాథాలక్షణములను, దల్లక్ష్యములను దనసేకరమునుండి యొసఁగిన పరిశోధకవిద్యార్థి చిరంజీవి శ్రీ తంగిరాల వెంకటసుబ్బారావుగారికిఁ గృత జ్ఞుఁడను.

పాల్కురికికి సోమనాథుఁడు పూర్వకవీశ్వరులు తమకావ్యములయందుఁ బ్రయోగించిన యుపమానసామగ్రిని దనకావ్యములయందుఁ గూడ విస్తారముగానే యుపయోగించుకొనెను. కాని, దేశితనమును బ్రయోగించుటలో నభినివేశము కల యాతఁ డందందు సంస్కృతకావ్యములందుఁ గానరాని యుపమానములను, గవిసమయములను గ్రహించి, తన స్వతంత్రప్రవృత్తిని, దేశీయాభిమానమును జాటుకొనెను. అతఁడు వాడిన యుపమానములు కొన్ని స్వతంత్రములు, స్వకపోలకల్పితములు కాఁగా మఱికొన్ని దక్షిణదేశభాషలగు తమిళము, కన్నడము మొదలగు భాషలలోఁ గానవచ్చుచుండుట గమనింపఁ దగిన విషయము. అతఁడట్లు మార్గపద్ధతికి భిన్నముగాఁ దనకావ్యములయందుఁ బ్రయోగించిన యుపమానములను, గవిసమయములను – దక్షిణదేశభాషలలో వాని యునికిని, వాని దేశీయతను నిందుఁ బరిశీలింతము.

బసవపురాణమునందలి సప్తమాశ్వాసములో బోయల తగవునుగూర్చి వర్ణించు సందర్భమున నిట్లు కలదు.

*'దొడ్డ వో బసవయ్య తోడి వాదంబు*
*వడిఁ గొఱకున కేఁగి బడిగంటఁ జావఁ*
*బడినమూషకములభంగి వ్రట్లైౖ*
*నేటి కొల్లకుఁ బోయి యెదురెదుర్గాను*
*బైచీర గొల్వడ్డభావన దోఁచు*
*జాలిఁ బడి కనకసాములు దమక*
*వేలిచికొన్న యావిధ మగుఁ దమకు'*

*బస. 7–545 పుట.*

బసవేశ్వరునికిఁ బూర్వమును, నాతనికాలమునను శివాలయములలో దేవునికి నైవేద్యము చేసినయన్నాదికమును నర్చకులక్కడి బోయలకుఁ బంచిపెట్టుట యాచారము. కాని, బసవేశ్వరుఁ డాయాచారమును మాన్పించి యానివేదితాన్నము గ్రహించునధికారము నర్చకులకే కల్పించెను. వంశ పారంపర్యముగాఁ జెల్లుచుండిన యా 'మడిగూటివృత్తి' తమచేతులనుండి లాగుకొనినందులకు బోయలకుఁ గోపము వచ్చి వారు తగవు సాఁగించిరి. అపుడు బసవేశ్వరుఁడు వారితో 'శివునకు మేము నైవేద్యము పెట్టుదుము. దానిని మీ

రారగింపఁ గలరా? ఈపరీక్షకు మీ రాఁగఁ గల్గినచో నా ప్రసాదవము భుజించునధికారమును మీకే సాఁగునట్లు చేయుదును' అనెను. అంత నాబోయలు 'ప్రసాదము దిని బ్రదుకఁ గోరుదుము గాని, యా ప్రసాదము విష మయినచో దానిని దిని చత్తుము కదా' యని పలికిరి. ఆసందర్భమున బోయలు బసవేశ్వరునితో వాదమునకు దిగుటవలనఁ దమ కెట్టిసంకటస్థితి యేర్పడెనో తల పోయుచుఁ బలికినపలుకు లివి. ఇందు మూఁ డుపమానములు కలవు. బసవయ్యతో వాదము మేఁతకుఁ బోయి బోనులోఁజిక్కుపడిన యెలుకలపరిస్థితి వలెను – కొల్లగొట్టుట కని తరలి పోయి యుత్తరీయమునే కోలుపోయిన విధమునను – కనక సాములు దమనే వేలిచికొన్నతెఱంగునను లాభము లేక పోఁగాఁ బైపెచ్చు అనర్థకారి కూడ నయినది – అని యాపంక్తుల కర్థము. ఇందుఁ దొలి రెండుపమానములును సంస్కృతమూలకములు కావు. స్వతంత్రములు. తనకాలమునఁ దదర్థకము లగు నుపమానములు కాని సామెతలు కాని వ్యవహారములో నుండఁగా వానిని లోకము నుండి స్వీకరించి కావ్యస్థము చేసెనో – లేక స్వతంత్రముగాఁ దానే కల్పించెనో మనము నిర్ధరించి చెప్పఁ జాలము. మొత్తముమీఁద నవి దేశీయము లగుట మాత్రము యథార్థము. మూఁడవ యుపమానము కొంత వినూతనము. కనకస్వాములు అనఁగా రసవాదవిద్య (బంగారము తయారుచేయు విద్య) తెలిసినవా రనియు – బంగారమును దయారు చేయఁబోయి తత్ప్రయత్నములో నాప్రక్రియను సరిగా నెఱుఁగక ప్రయోగించుటచేఁ దమ శరీరములే కాలిపోవు పరిస్థితి యేర్పడినట్లు – అని యాయుపమానమున కర్థముగాఁ దొలుత నూహింపఁ బడినది. కాని యీయుపమానమున కాధార మయినకథ యొకటి కన్నడములోని పంపభారతమునఁ గలదు. భారతమునందలి యరణ్యపర్వమున యక్షప్రశ్నల ఘట్టమున భీమాదు లగునలుగురు సోదరులును యక్షుని యాజ్ఞ మిఱి తటాకములోని నీరు త్రావి మృతప్రాయు లైపడియుండిరి. అప్పుడు దుర్యోధనుని పురోహితుఁ డగుకనకస్వామి యనునాతఁడు పాండవులను జంపుటకై యాభిచారికహోమము చేసి కృత్య యనుదేవతను బాండవుల మీఁదికిఁ బంపెను. భీమాదులు పడి యున్నయాచెఱువుదగ్గఱకు వచ్చినకృత్యకు యక్షదేవత (యమధర్మరాజు) ప్రత్యక్షమై 'నీ వుత్తమదేవత వయినచో నాచే నిప్పుడు మూర్ఛాగతు లై యెంగిలి పడి యున్నయీ నలువురను నీ వారగింప రాదు.

ఎంగిలితిండి తిన్నచో నీవు క్షుద్రదేవత వగుదువు. అపుడు నాముందు నీ క్షుద్రవిద్య లక్కుఱకు రాకపోవును' అని గద్దింపఁగాఁ గృత్యాదేవత చేయునది లేక 'అయ్యో, నాకు విపరీతముగా నాఁకలి వేయుచున్నది. నాకాహారము కావలయును. ఏమి చేయుదును?' అని పలుకఁగా యక్షదేవత దానిఁ జూచి 'ని న్నిట్లన్యాయముగాఁ బాండవులమీఁదికిఁ బంపిన యాకనకస్వామినే భక్షింపుము' అని యుపదేశించెను. అట్లే యాకృత్యాదేవతయుఁ దన్నుఁ బ్రయోగించిన దుర్యోధనుని పురోహితుఁ డగుకనకస్వామినే భక్షించి తనయాఁకలిని బోకార్చుకొనెను. ఈ సందర్భమునఁ బంపభారతమునం దీపద్యము కలదు. చూడుఁడు:

క॥ కనకన బేళ్వ తగుళ్దుదు
కనకనెం బొందుమాతు ధర గెసెయ సుయో
ధనపురోహిత నప్పా
కనకస్వామి యనె మునిదు కృత్తిగె దిందళ్.

పంప. భార. *8-44* ప.

కనకనివేల్మి కనకనికే తగిలిన దనుసామెత సార్థక మగునట్లుగా దుర్యోధనుని పురోహితుఁ డగుకనకస్వామిని కృత్యభక్షించినది - యని యాపద్యముయొక్క భావము. ఈవృత్తాంతము సంస్కృతములోఁ గాని యాంధ్రభారతములోఁ గాని కానరాదు. కన్నడభాషలోఁ బంపభారతము రచింపఁబడుటకుఁ బూర్వమే 'కనకనివేల్మి కనకనికే తగిలిన' దనునర్థము కలసామెత వ్యవహారములో నుండినట్లు దీనినిబట్టి తెలియుచున్నది. అనువాదకారునిఁ బట్టి తొలుత నాభాషలో నీసామెత ఏర్పడఁగాఁ బంపకవి దానిని గ్రహించి, దుర్యోధనుని పురోహితుఁడుగాఁ గనకస్వామియనువానిని సృష్టించి యాకథను భారతమున జరగినట్లు కల్పించి యుండవచ్చును.

పాల్కుఱికి సోమనాథుఁడు తనకాలమునఁ గూడ నట్టిసామెత జనవ్యవహార ములో నుండఁగా దానిని లోకమునుండి గ్రహించియో - పంపభారతమున నీవృత్తాంతమును జదివి యుండిన - లేదా - వినియుండిన సంస్కారముచేతనో - యీయుపమానము నాసందర్భమునఁ బ్రయోగించి యుండును. సంస్కృతభారతములో నీ వృత్తాంతము స్పృశింపఁబడనందునను - మార్గకవుల గ్రంథములయం దెచ్చటను నీయుపమాన మన్యత్ర ప్రయోగింపఁబడనందునను

– నిది కన్నడ భాషనుండియో – లోకము నుండియో పరిగ్రహించిన దేశీయోపమానమని మనము గ్రహింప వలసి యున్నది.[౧]

గురుకరస్పర్శచే నెల్లవారును నేకకులజులే యగుదురనియు, శివదీక్షను బొందినయంత్యజుఁడును, బ్రాహ్మణుఁడును నొకేశివకులమునకుఁ జెందినవా రగుదు రనియుఁ జెప్పుసందర్భమున బసవపురాణమునందలి సప్తమాశ్వాసములో నిట్లు కలదు.

'మేదినీవల్లభ, మేరువు సోఁకి
కాదె తచ్ఛాయన కాకి వ(ట్రిల్లు'

బస. *7–531* పుట.

కాకి మేరుపర్వతమును సోఁకి తననీలిమను గోలుపోయి సువర్ణచ్ఛాయను బొందునట్లే – చండాలకులజుఁడును గురుకరస్పర్శచే నుత్తముఁ డగును – అని భావము.

'కనకాద్రి యరయునే కాకిగుణంబు'

– బస. *5–360* పుట.

'మేరువు సోఁకుచో భేరుండ మనువాయ
నను పూనియే తనుచ్ఛాయ చేయు'

చెన్నమల్లు సీసములు *4* ప.

అనుష్టలములందును నీకవిసమయమే ప్రస్తావింపఁ బడినది. మేరుపర్వతమును సోఁకిన కాకికి సువర్ణచ్ఛాయ కలుగు ననుకవిసమయము ప్రసిద్ధము కాదు. మార్గకవు లెవరును నీవిషయమును బ్రస్తావింపలేదు. నన్నెచోడుని కుమారసంభవమున మాత్ర మీ కవిసమయము ప్రస్తావింపఁబడి యున్నది. ఈ క్రిందిపద్యము చూడుఁడు:

చ: ఇనుము రసంబులో నుడుగ కెప్పుడు నూనినఁ గాని కాదె కాం
చన మమరాద్రి నాయసము నంతతమున్ వసియించి కాని యే

---

౧. కనకస్వామినిగూర్చి తొలుత నాంధ్రలోకమునకుఁ దెలియఁబఱచిన వారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, చూ. వారివ్యాసము : గ్రంథగ్రంథులు : శ్రీవేంకటేశ్వరప్రాచ్యవిద్యాపరిశోధనాలయపత్రిక యందుఁ బ్రకటితము. పుట *115*.

కనకము చాయ గాదు చిరకాలముసేవనఁ గాని కాదె న
న్మనమున నిన్ దలంచు డొకమాత్రయచాలదె ముక్తి కీశ్వరా.

కుమా. *6-146* ప.

ఇనుము పాదరసములో క్షణకాలముండినఁ జాలును. చిరకాలము ముంచి యుండనక్కఱ లేకయే యది బంగారమగును. వాయసము మేరుపర్వతమున సంతతము వసింప నక్కఱలేదు. క్షణకాలము వసించిన జాలును. దానికిఁ గనకచ్ఛాయ కలుగును. అట్లేమోక్షప్రాప్తికై చిరకాలము నీకు సేవ చేయ నక్కఱ లేదు. మనస్సులో నిన్నొక్క క్షణకాలము తలఁచిన జాలును. ముక్తి లభించును గదా. అని యీపద్య భావము. మేరుపర్వతమున క్షణకాలము వసించినంతనే వాయసమునకు సువర్ణచ్ఛాయ కలుగు నన్నకవిసమయ మీపద్యమునందుఁ గూడఁ బేర్కొనఁ బడినది. సంస్కృతకవుల గ్రంథములోనుఁ, దాని ననుసరించిన యాంధ్రకవులలో మార్గపద్ధతినవలం బించినవారును నీకవిసమయమును బాటింప లేదు. కన్నడభాషలో నీకవిసమయము కలదు. 'మేరువం పొర్ద్ది దా కాగెపొన్నప్పవోల్'[౨] అని కన్నడమున దీనికిఁ బ్రయోగము. కనుక, నన్నెచోడుఁడు కన్నడమునుండి యీకవిసమయమును బరిగ్రహింపఁగా - కన్నడమునే యనుసరించియో, నన్నెచోడుని ననుసరించియో - పాల్కురికి సోమనాథుఁడును నీ కవిసమయమును దనకావ్యములలోఁ బాటించెను. ఇది సంస్కృతకవులును, మార్గకవులును బాటింపక - దేశికవులు మాత్రమే పాటించిన కవిసమయము.

బసవపురాణమునందలి షష్ఠాశ్వాసములో షోడ్డలదేవు బాచయ్యగారి కథలో నొకచోట నిట్లు కలదు.

'తవిలి నీయుడిగంబు దప్పించె నేని
బవరంబు ముట్టినఁ బాఱె నేనియును
దప్పని దండింపఁ దగ వగుఁ గాక
యిప్పరదైవంబు లిండ్లిండ్లకడకు
నేల రా వన వచ్చునే - పతి నీవు
జోళవాళిక కాక వేళవాళికెనె?
వత్తురే యన్యదైవంబులయిండ్లు
చొత్తురే .........'

బస. *6-462* పుట.

---

౨. చూ. కుమారసంభవము. యూని. ము. పాఠభేదములు - లఘువ్యాఖ్య.

పండితారాధ్యచరిత్రమునందుఁ గూడ నిట్లు కలదు.

'చోళవాలిక కాక క్షోణీతలేశ
వేళవాలికిఁ గర్తవే? .......'

పండి. *2-185* పుట.

ఇట్లు, బసవపురాణమునందును, బండితారాధ్యచరిత్రమునందునుగూడ చోళవాళి, వేళవాళి యనుపదములు ప్రయుక్తము లయియున్నవి. ఇవి రెండును రెండుగ్రంథములయందును నొకేరీతిని బ్రయోగింపఁబడి యుండుట గమనార్హము. రాజుతో నతని సేవకుఁడు పలికినట్లుగా నుభయస్థలములందును నీవాక్యము కలదు. 'నీవు చోళవాళికిఁ గర్తవు గాని వేళవాళికిఁ గర్తవా?' అని.

శివతత్త్వసారపీఠికలో శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులుగారు దీనిని గూర్చి ప్రస్తావించి యిట్లు వ్రాసిరి. 'చోళపాళి' = చోళవాళి = చోళరాజ్యము - వేవాళి = వేళపాళి = కాలపాళి = కాలుని రాజ్యము అని నే నర్థము చేసికొంటిని. కాని, యర్థము స్పష్టమనుటకు వీలు లేదు. -

కన్నడకవిచరిత ప్రథమసంపుటమున నీ 'చోళవాళి' నిగూర్చి కొంత చర్చకలదు. 'ఈ (చోళవాళి) శబ్దమును రైసుదొర చోళరాజ్య మని భ్రమించినట్లు తోఁచుచున్నది. ఈ శబ్దమునకు ఋణము లేక విశ్వాసము అని యర్థ మని యీక్రింది ప్రయోగములనుబట్టి స్పష్ట మగుచున్నది.'

'చోళదపాళి యంపగెదు దిల్లా ద్రోణనుం ద్రౌణియుం'

- రన్నకవి

'చోళదపాళి గెన్ననుచ నిత్తాఖ్యాతియం తాళ్దువెం'

- షడక్షరదేవుఁడు

'సలహి దొడయన చోళవాళిగె తలెయ మారువ దొండు పుణ్య'

- కుమారవ్యాసుఁడు

ఈప్రయోగములయాధారముతో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ బసవపురాణపీఠికలో దీనియర్థము నిట్లు తెలిపిరి. 'చోళవాళి = జొన్నల యినన్నిర్ణయము, వేళవళి = జీవితకాలమున కయిన న్నిర్ణయము' అనగా జీతము తిండికిజొన్నలు) ఇచ్చినందులకుఁ జేయవలసిన సేవకే నీ వధికారివి గాని

జీవితకాలపు విధానమునకెల్ల నధి కారివి కా వని యర్థము. చోళమనఁగా జొన్నలు. వాళి = వతను, ఏర్పాటు, నిర్ణయము. కన్నడమున 'చోళదవాళి' అని యుండుటచేత నది షష్ఠీసమాసము. ఆ కాలమున రాజసేవకులకు జీతముగా జొన్న లిచ్చుచుండి రనుటకు నన్నెచోడుని ప్రయోగము.

*'మునుమిది వైరివాహినుల ముట్టి బడల్పడ వ్రేసినట్టికైఁ*
*పునుఁ బయి కెత్తువాహకులపొంక మఱం దలగొంతగోసి ము*
*న్నొని వడిఁ బాఱు పందలను గోవుల నూ రెలఁ దోలినూర్చు పే*
*ర్చునఁ (బతికెత్తి) కేళ్ళలన జొన్నలు గొన్న ఋణంబు నీఁగెదన్.'*

కుమా. *11-42* ప.

శ్రీ బండారు తమ్మయ్యగారు వావిళ్లవారికొఱకై పరిష్కరించిన బసవపురాణము తుదిని నొసఁగిన యర్థవివరణపట్టికలో నీపదములనుగూర్చి యిట్లు వ్రాసిరి.

*'చోళవాళి = చోళ్లు (జీవనభృతి) పరిపాటిగాఁ గలది. ఐహికజీవనము.*
*వేళవాళి = జీవితావసానవేళకు వాళి యైనది. అముష్మికజీవనము.'*

డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు తమ పండితారాధ్యచరిత్ర పీఠికలో నీపదములయర్థవిచారము చేయుచు నిట్లు వ్రాసిరి.

'కన్నడములో జొన్నలు అనే అర్థంలో 'జోళ' అనే పదమున్నది. కాని 'చోళ' అని లేదు. చోళ అనేది అరవములయాళభాషలలో నున్నది. అయినా ఆకాలములో 'జోళ' శబ్దము కన్నడములో 'చోళ' అని ఉండేదేమో. మఱొక్క అర్థము నిర్ణయించ లేనప్పుడు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చెప్పిన అర్థమునే ఇప్పటి కంగీకరింప వలసి యున్నది.'

సేవకులకుఁ గూలికి మాఱుగా జొన్నలు కొలుచుట దేశీయాచారము. దానిఁబట్టి యేర్పడినపదము 'చోళవాళి' యనునది. కన్నడములో నీపదములు ప్రయుక్తము లయినవి. తెలుఁగులో శివకవులగ్రంథములయం దీపదములు కలవు. మార్గకవు లెవ్వరును నీపదములను బ్రయోగించి యుండలేదు. చోళవాళికే కాని వేళవాళికి నీవు కర్తవా? అనురీతి నర్థము కలసామెతయో, వ్యవహారమో నాఁటికాలమున దేశములో నుండి యుండును. అదియే కన్నడగ్రంథములోనికిని,

వానినిబట్టిశైవగ్రంథములలోనికిని నెక్కియుండును. ఈరీతి వాక్యవ్యవహారము దేశీయాచారగర్భితమగుట దేశీయమగుట స్పష్టము.

పండితారాధ్య చరిత్రము నందలి దీక్షాప్రకరణమున నీక్రింది యూపమానము కలదు.

*'జాతినాగులఁ జంపుచుండి - ప్రతిమనాగులకును బా ల్పోయునట్లు'*
— పండి. *1-202* పుట.

ఇది బసవేశ్వరుఁడు రచించిన యొక కన్నడవచనములోని వాక్యమున కనుకరణము. 'బసవవచనామృత' యనుగ్రంథమున దీనికి మూల మగు వచనభాగ మిట్లు కలదు. చూడుఁడు:

*'కల్లనాగర కండరె హాలనెరె యంబరు*
*దిటదనాగర కండరె (కోలెంబరయ్య) కొల్లెంబరయ్య*
*ఉంబజంగమ బందరె నడె ఎంబరు*
*ఉణ్ణద ఎంగక్కె బోనవ హిడి ఎంబ రయ్య'*
*బసవవచనామృత. 79* వచనము.

దానికి శ్రీ బాడాల రామయ్యగారు చేసిన యాంధ్రానువాద మిది. చూడుఁడు:

*'ఱాతినాగులఁ జూచినఁ బాల నిడు మందురు*
*జాతినాగులఁ జూడఁ జంపుఁ డందు రయ్య*
*తినెడిజంగము రాఁగ నడువుఁ డందురు*
*తినని లింగమునకు భోజన మిడు మందు రయ్యా.'*
*బసవవచనామృతము. 79వ గీతము.*

ఏతదర్థక మగునుపమానము సంస్కృతభాషలోఁ గాన రాదు. ఇది కన్నడమునుండి గ్రహించినది. ఇట్లు, దేశీయములే యనఁదగిన యుపమానములు కొన్ని యాతనిగ్రంథములయందుఁ బ్రయుక్తము లయినవి. చూడుఁడు:

1. అంకురించు మ్రానికి నీరు మాని వట్టికొయ్యకు నీ రెత్తినట్లు.
పండి. 1-202 పు.

2. అగ్గిలోపల మూత్ర మటిముటిc బోసి దగ్గటి వేల్పc దొడంగినయట్లు.
బస. 7-571 పు.

3. ఆవమునc గల్గనే రాగిముంత . బస. 7-360 పు.

4. ఆవులు దలంచినచోటc బూరి మొలచినట్లు.
బస. 1-387 పు.

5. ఇంత లింగసదర్థుc డయ్యు నీగకును దవు డింటిలో లేదు.
బస. 4-258, 259 పుటలు.

6. ఉప్పుముల్లియ సీర నుంచినయట్లు. బస. 2-95 పు.

7. ఎఱుcగునే యలదిగ్గజేంద్రంబుకొటమ యెఱపంది చను సీcక?
బస. 3-125 పు.

8. ఏనుcగు వ న్నగునే గాడిదలకు? బస. 7-543 పు.

9. కుంపటిలోనc దామరదుంప మొలచునే? బస. 5-360 పు.

10. కొఱుకున కేcగి బడిగంటc జావcబడిన మూషికములభంగి.
బస. 7-545 పు.

11. కొల్లకుc బోయి యెదురెదుర్గాను బైవీర గోల్పడ్డభావన.
బస. 7-545 పు.

12. చిక్కంబు చేర్లు దీసినమాడ్కి. పండి. 1-221 పు.

13. చిచ్చుఱుకంగc బోవుచుc జీరకొం గోసరించు వెన్వెంగలి యట్ల.

14. చూతఫలంబులc జుంబించుచిలుక బూరుగుమ్రాని పండ్లcగన్గొనునె?

15. తపరాజ మమరి ముందఱc బ్రోcక యుండc
దవుడు బొక్కుదు నని తలcచినయట్లు. బస. 7-570 పు.

16. తెల్కికి నూవ్వు పండినయట్టిపరుసు. పండి. 1-387 పు.

17. పాయసముపై నె య్యొల్కినట్టి యురవు. పండి. 7-387 పు.

18. పారిజాతంబుతోc బ్రబ్బళ్ల సరియె? బస. 7-496 పు.

19. భుజియించువదన ముండఁగఁ బెడతలఁ గుడుపుచందమున.
పండి. 1-202 పు.

20. మరువంబు జనియింప మరువంబుతోన పరిమళం బుదయించుభాతి.
పండి. 1-209 పు.

21. ముందటిశిరంబుండ మోఁకాలికి సేస వెట్టినట్లు. పండి. 1-202 పు.

22. ముల్లుచ్చిపెద్దవద రద్చినట్లు. బస. 7-500 పు.

23. మృగపతి యెద్దుఁ మేయునే పుల్లు? బస. 3-124 పు.

24. మేరువుతోఁ బెఱుమెట్టులు సరియె? బస. 7-496 పు.

25. వట్టేట నోడ యుండంగ వద రూఁడినట్లు. బస. 7-570 పు.

26. వెల్లవేఁగియుఁ దినికి చాబిడ్డఁ గనినచందము. బస. 7-519 పు.

27. వేయువిధంబుల వెలి గడ్డ వదరుఁగాయలోపలి చేఁదువాయనియట్లు.
పండి. 1-165 పు.

28. సన్న్యసింపఁ బోవుచును ని ల్లప్పగించునయ్యెబ్బందియట్ల.
బస. 3-227 పు.

ఉపమానాదుల ప్రయోగము, కవిసమయములు అనువిషయములందు మార్గకవులకు భిన్నముగా నితఁడు ప్రదర్శించిన దేశీయాభిమానము నిం దుదాహరణ పూర్వకముగాఁ దెలిసికొంటిమి.

## (VI) భాషా ప్రయోగము - దేశి

ఇతివృత్తము, ఛందస్సు, వర్ణనలు, రచనావిధానము, ఉపమానాదులు అనువానివిషయమున దేశీయతను సాధించి సోమనాథుఁడు తనదేశీయాభిమాన మును బ్రదర్శించినట్లే, భాషాప్రయోగమునందును దేశితనమును బ్రదర్శించి యుండుట యాతని దేశిరచనాప్రవణతను వ్యక్తము చేయుచున్నది. అతఁడు తన గ్రంథముల యందు - ముఖ్యముగా బసవపురాణము, పండితారాధ్య చరిత్రముల యందు - నెలకొలిపిన భాషను సామెతలు, జాతీయములు, తత్సమపద ప్రయోగము, తద్భవరూపములు, వైరిసమాసములు, సంజ్ఞా పదములు,

పదజాలము, వాక్యరచన లేక వ్యవహారానుగుణవాక్యరచనావిధానమున నాతఁడు భాషలో సాధింపఁదలఁచిన దేశీయతయొక్క స్వరూప మెట్టిదో విశదము కాఁగలదు. అతనిభాషలోఁ గానవచ్చు విశేషసంధిరూపములు కూడ నతని దేశిరచనాప్రవణతనే తెల్లము చేయును. నన్నయభట్టారకుని భారతభాగమున సామెతలప్రయోగము చాల విరళ మనియే చెప్పఁ దగును. పదిపంద్రెండు సామెతలకు మించి యాతనిరచనమున మనకు సామెతలు గాని లోకోక్తులు గాని కనరావు. తొలిసారిగా దేశికవిత్వమును రచింతునని సంకల్పించిన నన్నెచోడుని కుమారసంభవము నందు నన్నయయందుఁ గంటెఁ గొంత యెక్కువగానే సామెతలు కానవచ్చుచున్నను, సోమనాథుని రచనములలోఁ గానవచ్చునన్ని సామెత లాతని గ్రంథమునందు మనకుఁ గానవచ్చుట లేదు. మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునందును సామెత లధికముగా లేవు. తెలుఁగు నుడికారమును వెలార్చు జాతీయములప్రయోగము కూడ నన్నయ లోఁ జాల స్వల్పముగా మాత్రమే కలదు. నన్నెచోడునిలో నంతకంటెఁ గొంచె మెక్కువ గానే యున్నవి. మల్లికార్జునపండితుఁడును గొన్ని జాతీయములను వాడి యుండినను నవి యంత యధికము కావు. సోమనాథుఁడు వా రందరికంటెను నధికముగాఁ దన కవిత్వమునఁ దెలుఁగుజాతీయముల ప్రయోగమున కవకాశము కల్పించి తనకవిత్వమును సామాన్యప్రజాభాషకు మఱింత సన్నిహితము చేయఁ గలిగెను. తత్సమపదముల ప్రయోగమున సోమనాథుఁడు కొంత స్వాతంత్ర్యము వహించి తనకాలమునాఁటి శాసనము లందును, వ్యవహారమునందును గల రూపములను దనకావ్యములయందుఁ బ్రయోగించెను. వైరిసమాసములను నన్నయలో నతివిరళము. నన్నెచోడునిలో వైరిసమాస ముల ప్రయోగము కొంత యెక్కువగానే కానవచ్చును. సోమనాథుఁ డీ విషయమునఁ జాల ముందునకుఁ బోయి వ్యవహారభాషలో సర్వసామాన్యముగాఁ గనవచ్చు, వినవచ్చు వైరిసమాసములను బ్రయోగించుట కేవలమును వెనుదీయలేదు. ఈవైరిసమాసముల ప్రయోగ మాతని నియమోల్లంఘనశీలమును వ్యక్తము చేయు ననుటకన్న నాకాలము నాఁటి వ్యవహారభాషలో జను లట్టి వైరిసమాసములను విరివిగాఁ బ్రయోగించెడివా రనియుఁ దదనురోధముననే సోమనాథుఁడును వ్యవహారభాషా సన్నిహిత మగు భాషలోఁ గావ్యరచన ముఁ గావించి భాషావిషయమున దేశీయతను సాధింపఁ దలఁచినవాఁ డగుట నాయా

ప్రయోగముల నట్లట్లే ప్రయోగించి యుండు ననియు భావింపఁదగును. తనకాలమునఁ బ్రజలు తమ యనుదినవ్యవహారమునందుఁ గల్పించుకొనుచుండిన వైరిసమాసముల పద్ధతిలోనే యాతఁడును గొన్ని వైరిసమాసములను గల్పించి కూడ నెలకొలిపి యుండ వచ్చును. మొత్తముమీఁద నాతని యీ వైరిసమాసముల ప్రయోగమాతనికి వ్యవహార భాషాసన్నిహిత మయిన భాషా ప్రయోగమునందుఁ గల మక్కువనే తెలియఁ జేయును గాని, యాతని వ్యాకరణశాస్త్రానభిజ్ఞతను మాత్రము ప్రదర్శింపదని చెప్పినఁ దప్పు కాదు. అతని బసవపురాణ, పండితారాధ్యచరిత్రములలో మన కితరకవులకావ్యములలోఁ బరిచితములు కాని తద్భవరూపములు కాన నగును. వానిలోఁ గొన్ని సంజ్ఞావాచకములు కూడ. అవి యాతఁ డాయాపదములకు నూతనముగాఁ గల్పించిన తద్భవరూపము లనుటకంటె నాయాసంస్కృతపదముల నాతనికాలమున నారూపములతోనే ప్రజలు వ్యవహరించుచుండి రనియు, నట్లు వారి వ్యవహారమున నుండిన యా తద్భవరూపములనే యాతఁడు తనకావ్యములయందు గ్రహించి యుండు ననియు భావించుట యుక్తము. కావ్యభాషలో సంధికార్యములకు నియతప్రవృత్తి కల దని వైయాకరణులయనుశాసనము. నిజమునకు వ్యవహారభాషలో సంధివిధానమున కిట్టి నియతప్రవృత్తి లేదు. ఈవిషయము మనకు శాసనలేఖనములవలనను, గావ్యభాషకు భిన్న మయిన వ్యవహారభాషలో రచితము లయినగ్రంథములవలనను స్పష్టమగుచున్నది. వైయాకరణుల యనుశాసనములకు భిన్నము లయినసంధిరూపములు పాల్కురికి సోమనాథుని గ్రంథములందుఁ గాన వచ్చుచో నట్టి సందర్భము లానాఁటి వ్యావహారికభాషాస్థితిని నిరూపించుచున్నవని మన మూహింప వలెను. ఈ సందర్భమున శివశ్రీ బండారు తమ్మయ్యగారు తమ 'పాలకురికి సోమనాథకవి' యనుగ్రంథమున వ్రాసిన యీవాక్యములు గమనింపదగి యున్నవి. చూడుఁడు:

'ఛందోవిషయములందువలెనే వ్యాకరణవిషయములందుఁ గూడ సోమనాథుఁడు ప్రాచీనలక్షణములకు, సంప్రదాయములకు విరుద్ధముగ వర్తింప లే దనియే నా యభిప్రాయము. ఇదమిత్థముగ నాతనికాలమునాఁటికిఁ బ్రచారమునందున్న వని చెప్పఁదగు నాంధ్రవ్యాకరణగ్రంథము లింతదనుక మనకు లభింప లేదు. 'ప్రయోగశరణం వ్యాకరణమ్' అనుసూక్తి గీర్వాణవిషయముననే

వర్తించునప్పు డాంధ్రభాషావిషయమున వేఱ చెప్పఁదగినది లేదు ....
అసాధారణము లని మనము తలంచు సోమనాధుని బ్రయోగము లనేకము
లాతనికాలమునాఁటికి సాధారణములే యని ప్రాచీనశాసనములనుబట్టియు,
గ్రంధములఁ బట్టియు నిర్ణయింప నగును. సోమనాధునిఁ జూచి యేమి,
తత్పూర్వకవిప్రయోగముల ననుసరించి యేమి యితర భావికవులు గూడ
నట్టివానిని దమకృతులలో వాడి యున్నప్పుడు వాని వైశిష్ట్యమును బ్రత్యేకముగ
సోమనాధాదిశివకవులకృతులయెడనే నిర్ణయింపరా దని నా యభిప్రాయము.'

– పాలకుఱికి సోమనాధకవి. పుట 294.

సోమనాధుని గ్రంధములందు దేశీయపదజాలము విశేషముగాఁ గానవచ్చును. తెలుఁగుదేశమునఁ జాళుక్యయుగములో సంస్కృతభాషకుఁ గలగౌరవప్రాబల్యములను బట్టి తత్సమరూపములే విశేషముగా వ్యాపించి జనవ్యవహారమున నున్న దేశిపదజాలమును జాలవఱకు నెట్టి వేసినది. ఆకారణముచే మన కిప్పుడు ప్రాచీన దేశిపదజాలమెంతో యంతరించి పోయినది. ఆ పోయినదానిలోఁ గొంతభాగము మాత్రమే తిక్కనాదులవంటి దేశిప్రవణత గలమార్గకవులలోఁ గాన వచ్చును. అంతకంటె నెక్కువభాగము శివకవుల గ్రంధములలోఁ గనుపించును. శివకవులలోఁ గూడ ముఖ్యముగాఁ బాలకుఱికి సోమనాధుని గ్రంధములలో మనకు దేశిపదజాలము విశేషముగాఁ గాన వచ్చును. అతని గ్రంధముల నాధారముగాఁ జేసికొని మన కితరవిధముగాఁ గనరాని దేశిపదజాలమును, దేశిభాషాస్వరూపమును మనము కొంతకుఁ గొంత గ్రహింప వచ్చును. అతనిగ్రంధములలో నేఁటి వ్యవహారమునుండి తొలఁగి పోయి మన కిపుడు బొత్తిగా నర్థముకాని పదములు కోకొల్లలు. దేశిపదజాలముగా నాతనికాలమునందు గ్రహింపఁబడిన తద్భవరూపములు మన కిప్పుడు లేవు. కొన్నిపదములు నేఁడు రూపు మాఱి పోయి వేఱురూపములతో వ్యవహారమునందు నిలిచి యున్నవి. పద జాలమునకు సంబంధించిన యీవిశేషము లెల్ల నాతని దేశిరచనాప్రవణతనే వెల్లడించును. జాతీయములను, సామెతలను, దేశిపదజాలమును విశేషముగా వాడుటయే కాక సోమనాధుఁడు సంభాషణాదులలోవ్యవహారభాషకు నతిసన్నిహిత మయిన వాక్యరచనము మూలమున నాసంభాషణములకు, నందలి వాక్యనిర్మాణమునకు నొకసహజత్వమును సంతరించుకొనుచున్నాఁడు. కావ్యభాషాగ్రధితము లయినను

గొన్ని పట్టులయందలి వాక్యము లాతని మనములో నాతఁడు తొలుత నూహించిన వ్యావహారికవాక్యరూపమును బట్టి యిచ్చును. గ్రాంథికభాషలో నున్నను నవి వ్యావహారికభాషావాక్యములే యని యనిపింపఁ జాలినంతటి పద్ధతిలో నుండును. మార్గకవుల గ్రంథములలో సంజ్ఞా పదములు సాధారణముగాఁ బురాణవ్యక్తులను దెలియఁ జేయునవియగుటచేఁ దత్సమములుగా నుండును. కాని, సోమనాథుని కావ్యేతివృత్తములు పౌరాణికములు కాక చారిత్రకము లగుటచే – నాకావ్యముల యందభివర్ణితు లయిన కొందఱు భక్తులు కర్ణాటాంధ్రద్రవిడదేశములకు సంబంధించినవా రగుటచే – నవి తత్సమములుగాఁ గాక మనకు నిత్యపరిచితము లయిన తెలుఁగు, తమిళ, కన్నడ సంజ్ఞాపదములుగాఁ గాన వచ్చును. అందం దాతఁడు చేసినవర్ణనములలోను – నితరస్థలములలోను నాతఁడు పేర్కొనిన కొన్ని సంజ్ఞాపదములు సోమనాథునికాలమునందు దక్షిణదేశమున వ్యవహారమునం దుండిన మనుజుల యొక్క సంజ్ఞలనియు, వారిపేళ్లే యాతనికావ్యములయం దట్లుగా నెక్కొనిన వనియు మన మూహింప వచ్చును. సమకాలిక శాసనములందును నట్టి సంజ్ఞాపదములు లభించుచుండుట దీనిని మఱింత ధ్రువపఱుచుచున్నది. సోమనాథుఁడు తన కావ్యములయం దీవిధములుగా వింగడింపఁ దగిన శీర్షికలక్రిందఁ గావించినభాషాప్రయోగస్వరూపము నిప్పుడు మఱికొంత వివరముగాఁ దెలిసికొందము.

## ౮. సామెతలు

సామెతలు సాధారణముగా జనసామాన్యమునుండి పుట్టుకొని వచ్చును.[౧] వారి యనుభవములు, నభిరుచులు వానిలోఁ బ్రతిబింబించుచుండును. అన్నమునకు వ్యంజనములవలె సామెతలను జనులు తమ నిత్యవ్యవహారమునందుఁ బ్రసక్తానుప్రసక్తముగా వాడుచుందురు. ఇట్టి సామెతలప్రయోగమువలనఁ జెప్పఁదలఁచిన విషయమసందిగ్ధముగను, సవిస్తరముగను జెప్పుట జరగును. చమత్కారముకూడ సిద్ధించును. విషయము మనస్సులోఁ జక్కఁగా హత్తుకొని పోవును. అనిర్వచనీయ మయిన గుణమేదియో సామెతలో నుండి 'ఇది సామెత' యని దానిని సాధారణముగాఁ బట్టి యిచ్చుచుండును. ఆ నోట, నానోట నలఁగి యెక్కువ వాడుకలో నున్న జనోక్తియే సామెతగాఁ బరిగణింపఁ బడుచున్నది.

౧. తెలుఁగుసామెతలు : పీఠిక : పుట 3. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారిచేఁ బ్రకటితము.

సాధారణముగా నేభాషలో నయినను సామెతల యావిర్భావ మేరీతిగా జరుగునో యను విషయమునుగూర్చి 'బాహ్రి' (Bahri) యను హిందీభాషా పరిశోధకుఁడు తెలిపిన యీవిషయము లిట ననుసంధించుకొనఁ దగియున్నవి. చూడుఁడు:

'Some person, endowed with imagination, puts a thought into fanciful or apt words He does not do it purposely, but probably feels himself compelled to utter certain words instinctively The occasion, whatever it may have been, inspires him to use a certain ornamentation of speech We find a variety of ornamentations serving the purpose either of emphasizing the meaning or of making the idiom or proverb terse by some omission, or of enlivening it by way of animating lifeless things or by giving concrete forms to abstract attributes or by implying metaphorical sense An apt and concrete combination of ideas, or a profound truth, naturally makes a lasting impression on the listeners, who repeat it when a similar occasion arises If the utterance is capable of application to events and situations other than the one which originally evoked it, then its chances of preservation become much greater'[2]

సామెతకును, జాతీయమునకును సామాన్యము లగు లక్షణములు కొన్ని కలవు. జాతీయమునకుఁ గలధర్మము లెన్నో సామెతయందును నుండును. అయ్యు జాతీయము ప్రత్యేకలక్షణములను గొన్నిటిని గలిగి యుండి సామెతనుండి వే ఱగుచున్నది. జాతీయమునకును, సామెతకును గలసమాన ధర్మములను గూర్చి 'బాహ్రి' పండితుఁ డిట్లు వివరించి యున్నాఁడు. చూడుఁడు:[3]

'A proverb shares several characteristics of an idiom It is short and terse. It comes from the people and is actually used by them; like an idiom it results from the common, everyday, experiences of our village folk and particularly ladies. It's subject matter is also the same. The genesis of an idiom and a proverb is common . Concretion and generalisation are, then, the most prominent characteristics of a proverb as well as of an idiom'

---

*2. Hindi Semantics · Bahri · Page 292*

*3 Hindi Semantics Bahri Page 292*

సాధారణముగా సామెత యొకని జీవితమునకు సంబంధించిన యేదో యొక సంఘటనయో, సన్నివేశమో యాధారముగాఁ బుట్టుచుండును. ఒక్కొక్కప్పుడు జీవితములోని యొక సుదీర్ఘసన్నివేశముయొక్క సారముగాఁ గూడ సామెత యేర్పడుట కలదు. కొన్ని సామెతలు ఏదోయొక పుక్కిటికథనో, చిత్రాఖ్యానమునో, చారిత్రక సత్యమునో స్మరణకుఁ దెచ్చుచుండును. కాని, యవి యెల్ల నా ప్రత్యేక సన్నివేశమును గాక జీవితములోని యట్టిలక్షణములు కలమఱికొన్ని సన్నివేశములను స్ఫురింపఁజేయుచు నర్థవిస్తృతిని నప్పటికప్పుడాయాసందర్భములనుబట్టి పొందుచుండును. అప్పుడప్పుడు పండితవర్గమునఁ బుట్టినయభియుక్తోక్తులు కొన్ని జనసామాన్యములోనికి వచ్చుటయు సంభవించును. ప్రౌఢకవులు తమకావ్యములయందు రచించిన వాక్యములు కొన్ని లోకోక్తులుగా మాఱుటయుఁ గలదు. ప్రతిభాషలోను నిట్టి సామెతలు కోకొల్లలు. అవి జాతిసమష్టిస్వరూపమును దెలుపును. ప్రజలయాచారములు, సంప్రదాయములు, విశ్వాసములు, వారి జీవితవిధానము వానియందు వెల్లడియగును. ఆకార విశేషముచేతనే కాక యితరగుణములనుబట్టి చూచినను సామెతలు సంపూర్ణముగా దేశి సారస్వతము. ఇవి దేశిసారస్వతములో నొకప్రత్యేకశాఖ క్రిందికి వచ్చును. ప్రజల నిత్య వ్యవహారములో నున్న యీసామెతలను గవీశ్వరులు తమతమకావ్యములయందు యథేచ్ఛముగా వాడుకొనిరి. అట్లు వాడుకొనుటలో నవి యందలి ఛందోవ్యాకరణముల కనుగుణముగాఁ గొంతవఱకు రూపాంతరము నందినవి. అట్లు కొంత రూపము మాఱి నను నందలి యంతస్సత్త్వము, రచనాబంధము మాత్ర మది యాసామెతకు గ్రాంధిక రూప మనువిషయమును స్ఫురింపఁ జేయుచుండును. ఇట్టి సామెతలను బరిశోధకులు – ౧. అభిధాప్రధానములు (Literal proverbs), ౨. వ్యంజనాప్రధానములు లేక ఆలంకారికములు (Metaphorical or allegorical proverbs), 3. ఉభయములు (Metaphorico-Literal provebs). సామెతలలో నభిధార్థకము (Literal) లున్నట్లు జాతీయములలో నుండవు. అవి చాలవఱకు వ్యంగ్యార్థస్ఫోరకములే (Metaphorical).

నన్నయభట్టారకుఁడు తనభారతమున నీక్రింది సామెతలను బ్రయోగించి యున్నాఁడు.

౧. శూరులజన్మంబు సురలజన్మంబును నేఱుల జన్మంబు నెఱుఁగ నగునె?
(ఆది. 6–58 ప)

౨. లేడి కడుపునఁ బులి పుట్టునె? (ఆది. 6–58)

౩. విప్రులయలుకయుఁ దృణహుతాశనంబు దీర్ఘ మగునె? (ఆది. 6–90)

౪. వంటయిల్ గుందెలు సొచ్చె. (ఆది. 6–186)

౫. రోయుతీఁగ కాళ్లం బెనఁగెన్. (ఆది. 5–224)

ఇవి యెల్ల నన్నయభట్టు స్వయముగఁ గల్పించిన వనఁ జాలము. అతని కాలముననుు, నతనికిఁ బూర్వకాలమునందును జనవ్యవహారమునందున్న సామెతలకే యివి గ్రాంథికరూపము లనుట సంభావ్యము. ఇవిదప్ప నాతని రచనములో నెక్కువ సామెతలు కాన రావు. జనవ్యవహారమునం దింక నెన్నేని యుండి యుండ వచ్చును. అది వేఱుమాట. వానిలో నతఁడు కావ్యభాషలోని కెక్కించుటమూలమున మనకుఁ దెలియ వచ్చునని యివి మాత్రమే. ఇట్లతి స్వల్పముగా సామెతలను బ్రయోగించుటకుఁ గారణ మాతని మార్గ విధానావలంబనము కావచ్చును. వస్తువునుబట్టి యం దెక్కువగా సామెతలు కూర్చుటకు వీలు లేక పోయిన దని భావించుటకును వీలు లేక యున్నది. అదే భారతేతివృత్తమును రచించిన తిక్కన సోమయాజి తనభారతభాగమునందుఁ బెక్కు సామెతలను, జాతీయములను నభినివేశముతోఁ బనిగట్టుకొని చొప్పించినాఁడు. దేశికవిత్వరచనమునందాదారముకల నన్నెచోడుఁడు తన కుమారసంభవమునందు జనవ్యవహారమునం దుండు సామెతలకుఁ గొంత యెక్కువగానే ప్రవేశము కల్పించెను. సామెతలే కాక రుచికరము లయిన తెలుఁగు జాతీయములును నందుఁ గొంత విరివిగానే ప్రయోగింపఁబడినవి. అతఁడు తనకావ్యమునందుఁ బ్రయోగించిన సామెతలను – అందలి జాతీయములతోఁ గలిపి శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తాము మదరాసు విశ్వవిద్యాలయమువారికై పరిష్కరించిన కుమారసంభవగ్రంథము తుదిని 'పదములపట్టిక – అర్థాదుల'కుఁ దరువాత నొకపట్టికగాఁ గూర్చి ప్రకటించిరి. ఆ పట్టికనుబట్టి యాతఁడు నన్నయ భట్టారకునికంటె నధికముగనే తనకావ్యమునందు సామెతలను బ్రయోగించె నను విషయము స్పష్టము కాఁగలదు.

మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునఁ గూడ సామెతలంత యధికముగాఁ గాన రావు. మసిపాతను గట్టినమాణిక్యమువలె, ఓడునఁ బోసిననీళ్లవలె, బంగారమునకు దావి యబ్బినట్లు, పువ్వులవలన నారలు తల కెక్కినట్లు మొదలగు కొన్ని సామెతలు మాత్రమే యందుఁ జూపట్టును.

ఇఁక నూటికి నూఱుపాళ్లు తనకవితలో దేశితనమును సాధింపఁదలఁచిన పాల్కుఱికి సోమనాథుఁడు తన పూర్వులందఱికంటెను జాల నెక్కువగానే సామెతలను దనకావ్యములయందుఁ బ్రయోగించి యున్నాఁడు. అతని కావ్యేతివృత్తములు కూడ సామెతల ప్రయోగమున కినుమిక్కిలిగా దోహదము కల్పించి యుండుటకును నవకాశము లేక పోలేదు. పెక్కురు భక్తుల కథలతోను, మత విషయికములగువాగ్వాదములతోను, బరిహాసప్రసంగములు గల సన్నివేశములతోను గూడి యున్నయాతని బసవపురాణ, పండితారాధ్యచరిత్ర కావ్యములు సహజముగనే సంభాషణలధోరణిని దొరలి వచ్చు సామెతలకు, జాతీయములకు నాకరము లయినవి. అతని దేశీయతాభిమానమును, బండితజనులతో మాత్రమే కాక జనసామాన్యమునందలి యన్నితరగతులవారి తోను నిరంతరము నిష్టగోష్ఠి జరపుచు, సంభాషించుచు, సరసోక్తు లాడుచు, నాసంభాషణముల సందర్భమున నాతఁడలవఱుచుకొనిన వాక్చాతుర్యమును గూడ నీతనిసామెతల ప్రయోగమునకుఁ బ్రోద్బలకములుకావచ్చును. సోమనాథునికిఁ దరువాత నాంధ్ర సాహిత్యమునఁ బెక్కురుకవులాతనివలెనేసామెతల నెక్కువగాఁ దమతమకావ్యములయందుఁ బ్రయోగించినవారు కలరు. తిక్కన తనకావ్యములలో లోకోక్తులను, సామెతలను నెక్కువగా వాడెను. బద్దెన నీతిలోఁ గొన్ని చక్కనిసామెతలు గలవు. తెలుఁగు సాహిత్యములో వేమన సామెతలపుట్ట యనుట సర్వజనవిదితము. తాళ్లపాక కవుల అధ్యాత్మకీర్తనలలోను, శృంగార కీర్తనలలోను గలసామెతలను బండ్ల కెత్త వచ్చును. ప్రబంధ యుగమునకుఁ జెందినకవులు కూడ సామెతలను వాడిరి కాని, దక్షిణాంధ్రయుగము లోని కవులవలె నంత విరివిగా వాడలేదు. క్షేత్రయ్య పదములు, సారంగపాణిపదములు మొదలయినపదరచనములలోఁ బెక్కు సామెతలు కలవు. ఇట్లిందఱు కవులు సామెతలను దమతమ రచనములయందుఁ బ్రయోగించుటకుఁ గారణము దైనందిన జీవితమునం దొండొరులతోడి వ్యవహారమునందును, సంభాషణములందును వలెనే – కావ్యగతములయిన సంభాషణాదికమునందును సామెతలకున్న వ్యంగ్యార్థచమత్కృతిసంపాదనమే కావచ్చును.

సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య చరిత్రములందు వివిధ
థ్యములలోఁ బెక్కుసామెతలు ప్రయోగించఁ బడినవి. వానిలోఁ బెక్కు
మాన్యమునం దాకాలమున వాడుకలో నుండినట్టివిగానే తోఁచును.
ంరచనాబంధములో నవి గొంత రూపము గోల్పడినను వాని సహజ
ను బుద్ధికి గోచరమగుచునే యుండును. మఱి కొన్ని సోమనాథకవి
ము లయిన సూక్తులుగా నగపడును. ఒక యుపమానము వ్యవహారమున
కరూపములోఁ బ్రచారమం దుండఁగా సోమనాథుఁడు స్వయము గాఁ
వియుండు నని తోఁపఁజేయు మఱికొన్ని యట్టియుపమానములు కూడ
ంల లక్షణములతో సాక్షాత్కరించును.

డాక్టరు చిలుకూరి నారాయణరావు గారు పండితారాధ్యచరిత్రమునకుఁ
ం వెలయించినపీఠికలో సోమనాథుని బసవపురాణమునందును,
తారాధ్యచరిత్రమునందును గలసామెతల నకారాదిక్రమమునఁ గూర్చి
పట్టికరూపమునఁ బ్రకటించిరి. కాని యాపట్టిక సమగ్రమును,
మును గాదు. సామెతలు కాఁ జాలనివియు, గొన్ని జాతీయములను
ట్టికయందుఁ జేరినవి. అందుచే నూతనముగా నాయుభయ
ములందును గలసామెతలను సేకరించి యకారాదిక్రమమునఁ గూర్చి
ందిగువ నొసఁగఁబడుచున్నది. ఇందలిసామెతలు – ౧. అతనికాలమున
వహారములో నుండి యతనికావ్యములలోని కెక్కినది. ౨. సోమనాథ
ప్రతములుగాఁ దోఁచునవి. ౩. ఉపమానములు– అను మూఁడు
గములక్రింద వర్గీకరింపఁ దగియున్నవి. దీనిలోని ఉపమానములు
ర్థస్ఫోరకములు లేక యాలంకారికములు (Metaphorical or Allegorical
rbs) అనువిభాగము క్రిందికిఁ జేరునన వచ్చును. ఈ పట్టిక సోమనాథునికి
తల ప్రయోగమునందుఁ గల యభినివేశమును, నాతనిదేశి
భిమానమును బ్రకటించును. అతని దేశికవిత్వోద్యమములో
గమయిన భాషాప్రయోగమునకు సంబంధించి యాతని దేశితెనుఁగు
యభిమానము నిది వ్యక్తము చేయును.

ఱి) అంకురించుమ్రానికి నీరు మాని
వ వట్టికొఱటికి నీ రెత్తినట్లు పండి. 1–202 పు.

... ...న్య మడచఁగఁ గాక
... ... జీరలకల్గనే రజకుండు బస. 4-257 పు.

అగ్గి... ... మూాత్ర పఱిముఱిఁ బోసి
దగ్గఱి వేల్పఁ దొడంగినయట్లు. బస. 7-571 పు.

అచ్చుగా నర్ఘ్యపణ్యమ్ములు దెచ్చి
యిచ్చఁ గుక్కలకాళు లిలఁ బూన్చినట్టులు. బస. 7-571 పు.

అదె పులి ముందఱ నడ్డ మున్నదియు పండి. 2-486 పు.

..... అద్దంబులోపలినీడయట్లు (వెలుఁగు) బస. 6-432 పు.

అబ్జంబు పంకమున సంభవం బైనయట్లు. పండి. 1-209 పు.

అమృతంబునందు దివ్యం బగుచేగ
పుట్టిన యట్టులు.... బస. 2-85 పు.

.... అయస్కాంత తారాంతరములు
గలుగునే పరుసము గదిసినపిదప. పండి. 1-216 పు.

అఱిముఱిఁ జన్నుబా లర్థించియేడ్చు
చిఱుతచే నొకపిండికఱు డిచ్చి తల్లి
తనచన్ను మఱపించి కొనిపోయినట్లు. బస. 4-279 పు.

(నెఱి) అల్గి తన్నినఁ బఱపుపైఁ బడిన
తెఱఁగు (నా కయ్యె) పండి. 1-386 పు.

అనమభేకుండ వాయస తనుచ్ఛాయ
లెనఁగంగ నున్నవే హేమాద్రి సోఁక. పండి. 1-216 పు.

ఆకసమునఁ జిత్రరూపములు వ్రాయునట్లు. పండి. 1-359 పు.

(ఇచ్చమై) ఆడఁబోయిన తీర్థ మెదురు
వచ్చినట్లయ్యె.... పండి. 1-386 పు.

ఆవమునఁ గల్గనే రాగిముంత. బస. 1-360 పు.

(చెలఁగి) ఆవులు దలంచినచోటఁ బూరి
మొలచిన (ట్లయ్యె) పండి. 1-386 పు.

ఇంతింత గాఁ జేయ నిక్షుఖండంబు
నంతకంతకుఁ దీపు లధిక మౌఁ గాదె. బస. 4-257 పు.

ఇచ్చ రత్నపరీక్ష యెఱిఁగి చేపట్టు
బచ్చునుబోలె.... బస. 2-83 పు.

ఇనుముగుణ మరయునే పరుసంబు. బస.

ఇనుమంత బూడిద నొసలఁ బూసినను
మసలక కొండంత మరు లెత్తె ననుట తెల్లంబు... బస. 2-107 పు.

(ఇంత లింగసదర్థుఁ డయ్యె) ఈఁగకును
దవుఁ డింటిలోలేదు. బస. 4-259 పు.

(క్రచ్చఱ) ఈనంగఁ గాచి నక్కలకు నిచ్చినట్లయ్యె బస. 7-519 పు.

ఉడువీథియందుఁ దా విద్యుల్లత పుట్టి
యుండువీథియందుఁ దా నడఁగినయట్లు. బస. 7-583 పు.

..... ఉత్తమాధమనదులు
వట్టంబు దోఁచునే వారాశిఁ గలయ. పండి. 1-216 పు.

ఉప్పుముడియ నీర నున్న నందణఁగుచొప్పున పండి. 1-182 పు.

ఉప్పుముల్లియ నీర ముంచినయట్లు. బస. 2-95 పు.

(పుడమి) ఉప్పలికి యిమ్మడి యైనయట్టి
వడువు (నా కయ్యె) పండి. 1-386 పు.

ఊరు లేక పొలిమేర గల్గునే? పండి. 1-636 పు.

(పొరపొచ్చె ముడుగ) ఊసరవెల్లులట్ల. పండి. 1-348 పు.

ఎడపక పాలు దా నెన్ని వోసినను
విడుచునే సర్పంబు విస మొకిం తైన. బస. 7-571 పు.

ఎ ద్దీనె ననిన గొందిఁ గట్టు మనినచందము. పండి. 2-145 పు.

.... ఎ ద్దీనె ననుటయు గొందిఁ
గట్టుద మనువారు గల రెట్లు చెపుడు. బస. 5-339 పు.

ఎనయ దీవించువా రేం డ్లేల యిత్తురు? బస. 5-370 పు.

ఎన్నంగ వేడ్కకాఁ డెఱుఁగునే దోస మన్నట్లు. బప. 1-12 పు.

ఎన్నంగ వేమాఱు నెంత గాచినను
వన్నెక్కుఁ గాదె సువర్ణంబు మిగుల. బస. 4-257 పు.

ఎన్నఁడు గ్రోఁతి యయ్యేను వెక్కిరింప? బస. 4-252 పు.

(నెఱి) ఎన్నిమాఱులు నీళ్లలోపలను
గొఱుపడం బుదికిన మఱి తెల్ల నగునె? బస. 7-570 పు.

ఎఱుఁగునే యల దిగ్గజేంద్రంబుకొదమ
యెఱపంది చను సీఁక.... బస. 3-124 పు.

ఏనాఁట బ్రద్దల నెంత గట్టినను
శ్వానంబుతోఁక దాఁ జక్కన యగునె? బస. 7-570 పు.

.... ఏనుఁగుపండ్లు దాఁ బట్టి చూచు
మనుజుండు బ్రదుకునే మడియున కాక. బస. 4-260 పు.

ఏనుఁగు ప న్నగునే గాడిదలకు? బస. 7-543 పు.

ఒండొండ పొర లుచ్చి వైవ ననఁటి దా
లేకుండినట్టి చందమున .... పండి. 1-229 పు.

ఒడలికిఁ బ్రాణంబు నొదలుఁ బ్రాణమున
కొడఁబడి యున్నట్లు .... బస. 4-280 పు.

ఓడునఁ బోసిన యుదకంబులట్లు. బస. 7-571 పు.

కన్నమోహంబునకంటె నగ్గలము
ఎన్నఁ బెంచినమోహ మెందు (నటంద్రు) బస. 3-159 పు.

కనకపాములు దమక వేలిచికొన్న యావిధ మగు. బస. 7-545 పు.

(సరి) కప్ప లెఱుఁగునే జడనిధిలోఁతు. బస. 7-569 పు.

కప్పురంబున నగ్ని గప్పినయట్లు. బస. 2-95 పు.

కరితోడ గ్రామసూకరములు సరియె? బస. 7-495 పు.

కరివైరితోడఁ గుక్కలు వోల్ప నరియె? బస. 7-495 పు.

(లోలత) కలఁ గని మేల్కన్నయట్లు. పండి. 1-249 పు.

కలఁ గని మేల్కొన్నకరణి. పండి. 1-199 పు.

కలఁ గని మేల్కన్నగతి. పండి. 2-523 పు.

కలఁ గన్నచోటికిఁ గంపఁ గొంపోవ
ఫలసిద్ధి యగు టెల్ల భాగ్యంబు గాదె? బస. 3-181 పు.

కలియు నూనెయు రెండుఁ గలిసినయట్లు. పండి. 1-348 పు.

కసుగాయిఁ ద్రెంచినఁ గా యగుఁ గాక
పసనిపం డగునయ్య భ్రాంతి వొందినను. బస. 3-225 పు.

కాకులు వెంచినకోకిలపిల్ల
గాకులఁ బోలునే కావు కా వనుచు. బస.

కాన నేర్చునె రవిఁ గౌశికవితతి. బస. 7-569 పు.

కాష్ఠంబున నగ్ని సంభవం బైనట్లు. పండి. 1-209 పు.

.... కుంపటిలోనఁ దామరదుంప మొలచునే? బస. 5-360 పు.

కుక్క ముట్టినకడ్వకును విధి యేమి?
చక్కనఁ గాల్చినఁ జాలున కాదె? బస. 6-466 పు.

కుతిలుఁ డై జాతినాగులఁ జంపుచుండి
ప్రతిమనాగులకును బా లొవ్వియునట్టులు. పండి. 1-202 పు.

కులదీపకుఁడు పుట్టఁ గులము వర్ధిల్లుఁ
గులపాపకుఁడు పుట్ట గులమెల్లఁ ద్రుంచు. బస. 1-43 పు.

కూలిపేద దో డబ్బ నని యాడుమాట
నాయంద సంధిల్లె.... బస. 7-519 పు.

కూసి కుక్క దువ్వ దెచ్చికొనినయవ్విధం బయ్యె. బస. 6-488 పు.

కొంగనిఁ దిగిచి వంగని వ్రాలంగఁ దిగిచితిరి. బస.

(చడి) కొఱుకున కేఁగి బడిగంటఁ జావఁ
బడిన మూషకములభంగి వట్రిల్లె. బస. 7-545 పు.

.... కొల్లకుఁ బోయి యెదురెదుర్ గాను
-పై జీర గోల్పడ్డ భావన (దోఁచు) బస. 7-545 పు.

.... కోటికి బడ గెత్తినవానిఁ
బదివేలకాస వై (బదుకు మన్నట్టులు. బ. 1-12 పు.

క్షీరాబ్దిలోపలఁ (గ్రీడించుహంస
గోరునే పడియల నీరు (త్రావంగ? బస. 3-124 పు.

... గంగతో వెడ(వంతలు సరియె? బస. 7-495 పు.

గంధద్రవ్యములు దగుల్కొన్నపలువచందమున. పండి. 1-177 పు.

గజశాస్త్రవేత్తల కెట్లు వచ్చు గజాధిరోహణము సేయంగ
పండి. 1-570 పు.

గరిడికెక్కినయంకకాఁడునుబోలె. పండి. 1-520 పు.

గాలిలోపల సురగాలి నాఁ బుట్టి
గాలిలోనన వెండిఁ గలసినయట్టులు. బస. 7-583 పు.

గుండాడ గావునకును జన్నె? పండి. 1-470 పు.

.... (గ్రామో నాస్తి యనఁ గుత స్సీమ యన... పండి. 1-636 పు.

ఘనసారవృక్షముల్ ఖండించి వెల్గ
పెను జెముళ్లకుఁ జుట్టు (బెట్టిన యట్లు బస. 7-571 పు.

.... చం(దుతో నుడుపంక్తి సరియె? బస. 7-496 పు.

.... చదువఁ బెట్టినను
గలమతియును జెడ్డకారణం బయ్యె. బస.4-246 పు.

చిక్కంబు చేర్లు దీసినమాడ్కి. పండి. 1-221 పు.

.... చిచ్చులుకంగఁ బోవుచుఁ జీర
కొం గోసరించుపెన్వెంగలియట్లు. బస. 3-227 పు.

చూతఫలంబులు చుంబించుచిలుక
(బాఁతి బూరుగ(మానివండ్లఁ గన్గొనునె? బస. 3-124 పు.

చెప్పినఁ గొండె మాఁ జెప్పక యున్నఁ దప్పగు... బస. 3-123 పు.

తోలి తాఁకెడు పులివోలె. పండి. 2-547 పు.

త్రికాలమదగ్రస్త మైనకరియునుబోలెను
గడుఁగడుఁ గ్రొవ్వి .... పండి. 1-353 పు.

(పోల) దుర్జనుతోడి పొందున కంటెఁ
జాల మేలంద్రు సజ్జన విరోధంబు బ. 7-559 పు.

(పోల) దుర్జనుతోడి పొందునకంటె
జాల మేలంద్రు సజ్జన విరోధంబు పండి. 1-313 పు.

దుర్మేఘపటలంబు దూరఁ గప్పియును
నిర్మలకవి దివి నిలచినయట్లు పండి. 1-392 పు.

దృష్టిహీనుండు దా దీప మే మెఱుఁగు? బస. 4-569 పు.

దేవకార్యమునకుఁబొరుగునూరికిఁబోవునట్లు పండి. 1-416 పు.

దొడ్డిలో సురధేను వొడ్డుగాఁ గురియ
గొడ్డుఁ బిదుకఁ గుండఁ గొని యేఁగునట్లు బస. 7-570 పు.

నల్లవో, భామల యుల్లంబు లెఱిఁగి
గొల్లవాఁ డైనను గోరునే కవయ? పండి. 1-339 పు.

నష్టకర్ణునకును నార మేమిటికి? బస. 7-569 పు.

నిండంగ ముంచి యువియంగఁ ద్రోచు నవివేకి పగిది బస

నిర్ద్వంబుగా నీట నద్దుము పాల
నద్దుము మాకింత నన్యథా లేదు బస. 5-346 పు.

నినుపార నగ్ని సాన్నిధ్యతం గాక
యినుము ద్రావఁగ నేర్చునే యుదకముల? పండి. 1-201 పు.

నిప్పుఁ ద్రొక్కినయట్లు పండి. 1-418 పు.

నిప్పునఁ జెదలంటునే? బస. 3-158 పు.

(మిక్కుటంపు) నివురు మీఁదఁ గప్పియును
నక్కజం బై మించుననలంబు నట్లు పండి. 1-391 పు.

.... నిఱుపేద నిధానంబుఁ గాంచి
దిగ విడ్చి యేఁగునే మగిడి కూలికిని? బస. 3-224 పు.

నీడ మాలినధరణీరుహం బట్లు. బస. 5-571 పు.

.... నూతిలోఁ బడఁబోయి తావ
వెదకుచు మెట్టెడి వీఱిడియట్లు. బస. 3-227 పు.

(నెఱయ) పండించి యఱప డిగ్గినయట్టులు. బస. 7-519 పు.

పక్షికిఁ దొడ నేల పాశుపతంబు? బస. 4-251 పు.

పగఱఁగన్ పంతంబు బంటునుబోలె. పండి. 1-521 పు.

పట్టి కట్టాడుదుర్వడిఁ దీఁగలట్ల పండి. 1-348 పు.

పట్టినపద దైనఁబసిఁడి యై వెలుఁగునట్లు. పండి. 2-94 పు.

.... పట్టెమంచం బొండె నెక్కుఁ
డనియెద ర్కొట్టెక్కుఁ డనియెద రొండె. పండి. 1-326 పు.

పడయ రానిది భువిఁ బసిఁడియ కాదె? బస. 5-334 పు.

పన్నుగా నే లెంత ప్రామి కడిగిన
మన్ను దాఁ బోవునే? బస. 7-571 పు.

పలుగుఱాప్రతిమ గర్భంబులోపలను
వెలిఁగెడు దీపంబువిధమునుబోలె. బస. 1-33 పు.

పసనివం దుండుగఁ గసుగాయఁ ద్రెంచుట. పండి. 1-470 పు.

పసిఁడినాఁగటఁ బెక్కుభంగుల దున్ని
వెస ముల్కవిత్తులు వెదవెట్టినట్లు. బస. 7-571 పు.

పసిఁడిపుత్తళికిని బ్రాణంబు పుట్టినట్లు. బస.

పాటితూమునకును బాటి యౌ నేనిఁ
బాటింప సోలయుఁ బాటియ కాదె? బసు. 1-9 పు.

(నెఱయు) పాయసముపై నెయ్యొల్కినట్టి
యుఱవు (నా కయ్యె) పండి. 1-386 పు.

పారిజాతంబుతోఁ బ్రబ్బళ్లు సరియె? బస. 7-496 పు.

పాషాణానఁ బసిఁడి సంభవం బైనట్లు. పండి. 1-209 పు.

పిడికిటఁ గోమలిఁ బొడువంగ మఱియుఁ
బొడువుమా యనుక్రియ (బోవంగ రాదు) బస. 6-147 పు.

పీనుఁగు ప్రై సేయఁ బూనినయట్లు. పండి. 1-201 పు.

పూసలలోన దారంబుక్రియ. బస. 1-9 పు.

.... పూసలలోని దారంబునట్ల బస. 6-433 పు.

.... పెన్నిధి దొరకొని యుండ
జర గడుఁగఁగఁ బోవుపెరవిండ్లు గలరె? బస. 7-530 పు.

పెన్నిధి యుండంగ మన్నడుగుదురె? బస. 1-22 పు.

పేద దాఁ బెన్నిధి యింటఁ గన్నట్లు. పండి. 1-190 పు.

పైఁ గొసరఁ గుంచంబు గూలఁబడ్డ ట్లగు. బస. 7-544 పు.

పొట్టపొర్వునఁ గల్పభూరుహం బుండ
వట్టివృక్షమునకు వడి నేఁగునట్లు. బస. 5-750 పు.

పొరుగింటి చి చ్చైన దరికొనుఁ గాని
దరికొనదే యిట్లు దమ యింటిచిచ్చు. బస. 4-291 పు.

పొలమున నాఁబోతుఁ బులి గొన్నయట్టి పొలువు... బస.

పొలువుగాఁ దేనియఁ బోసి నూఱినను
నిలఁ దీయ నై యుండునే వేపనార? బస. 7-571 పు.

(కమియ మీఁదట) బ్రాచి గప్పి యుండియును
నమలినం బైన గంగాంబువులట్లు. పండి. 1-392 పు.

.... ప్రాణంబు గల్గినను
బలుసాకుఁ దిని యైన బ్రదుకంగ వచ్చు. బస. 7-545 పు.

బండు లొండొండఁ దాఁ బాయఁ బెట్టుఁడును
బండి లేకుండిన పగిదియుఁ బోలె. పండి. 1-229 పు.

బత్తులఁ జిదిమినఁ బాలు గాఱెడినె
నెత్తురు గాఱెడినే యొల్లఁ జిదుమ. బస. 7-532 పు.

(ఇరుదెసకొలుపు) బాలెంత లంజియపడునట్లు. బస 6-457 పు.

బిచ్చంబు మాన్చిన భక్తి సెడునె? గుండు
గల్లు దాఁచినఁ బెండ్లి సెడునె? పండి. **1–383** పు.

బెండ్లు దేలెడిఁ గాక పేరేటనైన గుండ్లు దేలునె? బస. **7–543** పు.

.... బ్రహ్మ నుదుట మున్ వ్రాసిన వ్రాలు
పెడ తల కేఁగునే? – పండి. **1–433** పు.

భాగ్యహీనుండు దాఁ బసిఁడిఁ బట్టిన న
యోగ్యంపులోష్టమై యున్నయట్లు. బస.

(వడిగొని) భుజియించు వదన ముండంగఁ
గడి సేసి పెడతలఁ గుడుపుచందమున పండి. **1–202** పు.

భృంగసంస్పర్శఁ బతంగంబు దొంటి
యంగంబునకుఁ బాయు టది దెల్ల గాదె? బస. **7–531** పు.

భ్రమరకీటన్యాయభావన. పండి. **1–225** పు.

(ఇల) మంగలమునఁ బ్రేలలు నిట్లు గొన్నపాలువున. బస. **7–548** పు.

(స్రుక్కక మును) మంచ మెక్కినయట్ల
యెక్కను గా కేమి యిక్కొట్టు ననుడు. పండి. **1–326** పు.

.... మరు ల్వోయె రోఁకలిఁ గొని రండు
తలఁ జుట్టుకొనియెదఁ దా నన్నయట్లు. బస. **3–227** పు.

మరువంబు జనియింప మరువంబుతోన
పరిమళం బుదయించుభాతి. పండి. **1–209** పు.

(భువి) మసికప్పడమునఁ గప్పఁబడియు
నివిడి వెలుంగుమాణిక్యంబునట్ల. పండి. **1–391** పు.

మహాబ్ధిలో వర్షోపలములు విసరినట్లు. పండి. **1–182** పు.

.... మాణిక్య మొకమసికోక
నెప్పాటఁ బొదివిన నిలఁ గాంతి సెడునె? బస. **7–531** పు.

మావిడిబీజంబు మహిమీఁద విత్తఁ గా నే మగునె? బస [illegible]–**46** ఖ

ముంజేతికంకణంబున కద్దమేల? బస [illegible]

ముంజేతికంకణంబున కద్ద మేల? పండి. 1-251 పు.

ముంజేతికంకణంబున కద్ద మేల? పండి. 1-620 పు.

(ఒనర) ముందటిశిరంబుండ మోకాలి
కిని సేస వెట్టంగc గ్రియగొనినట్లు. పండి. 1-202 పు.

మును వెల్లవేగియుc దినికి చాబిడ్డ
గనినచందం బయ్యె ... బస. 7-519 పు.

ము ల్లుచ్చి పెద్దపద రడ్చినట్లయ్యె. బస. 7-500 పు.

(వడి) మృగములc గన్నవ్యాధుcడుc బోలె. పండి. 1-521 పు.

మృగపతి యెద్దన మేయునే పుల్లు? బస. 3-124 పు.

మేరుపుతోc బెఱమెట్టలు సతియె? బస. 7-496 పు.

మేరువు సోcకి కాదె తచ్ఛాయన కాకి వన్నెటిల్లు. బస. 7-531 పు.

మొదలికి గుద్దలి గొంటి. బస. 7-500 పు.

రవితోడc గిరణముల్ భువి నస్తమించు పవిది .... పండి. 1-221 పు.

రాకామలజ్యోత్స్నc ద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీcకటిc ద్రావ. బస. 3-124 పు.

రాజితాంచిత రత్నరాజ ముండంగ
గాజుపెంచిక లేఱ గమియించినట్లు. బస. 7-570 పు.

రా నేర్చునే పుష్పరసమున కీcగ. బస. 7-569 పు.

రెండు నోళ్లను గుర్వకుండినc గుక్షి
నిండునే గండభేరుండంబునకును. పండి. 1-202 పు.

(వేదములు) రోcకటిపాటలట్లు. బస. 7-500 పు.

ఱంపానc గోసిన ఱాచిన సెఱయుc
గల పెక్కుc గాదె శ్రీగంధంబునకును. బస. 4-257 పు.

(అక్కజం బగుచు) వజ్రాయుధం బుండ
మొక్కలసురియకు మోహించినట్లు. బస. 7-570 పు.

వట్టియాకులు గాలి వడిఁ దూలుఁ గాక
మెట్టలు దూలునే యెట్టిగాడ్పునను. బస. 7-543 పు.

వడగల్లవర్షంబు వారాశిఁ గురియువడువున. బస. 2-95 పు.

(ఒదవంగ) వఱ్ఱేట నోడ యుండంగ
వద రూఁదినట్టులు ... బస. 7-570 పు.

వల దని వారింపఁ జలమున ముక్కు
వౌలియించుకొన్నట్టు... బస. 4-251 పు.

వానరం బెఱుంగునే వరరత్న మహిమ? బస. 7-569 పు.

వింజనగ్రోళ్లను బింజించినట్టులు. పండి. 1-392 పు.

విడిచినఁ బాఱుదుర్ వడి డేగలట్ల. పండి. 348 పు.

(ఎద) విడివడ్డమదేభంబుబోలె. పండి 1-521 పు.

విరిదమ్మివాసన విహరించుతేఁటి
పరిగొని సుడియునే ప్రబ్బలి విరుల? బస. 3-124 పు.

వెట్టికిఁ దెచ్చిన విధమున. పండి. 1-521 పు.

(మున్ను) వెనుకఁ గొఱ్ఱు ముందఱ నూయి. పండి. 2-486 పు.

వెలివాడఁ గలుగునే వేదఘోషంబు. బస. 5-360 పు.

వెలుపలిదుఃఖంబు వెలిఁ బోయె ననిన పాలు పయ్యె... బస. 4-291 పు.

వేయివిధంబుల వెలి గడ్డ వదరుఁ
గాయ లోపలి చేదు వాయనియట్లు. పండి. 1-165 పు.

(ప్రకటింప) చేయు నులకత్రాళ్లు గూడి
యొకమ్రో కగునె? పండి. 1-521 పు.

వ్రాలుదుర్ దలలట్ల వరిగింజ సూప. పండి. 1-349 పు.

శరనిధిఁ గడలు దాజనియించి వెండి
శరనిధిలోనన సమసినయట్లు. బస. 7-583 పు.

(పొనరంగ) శుక్తిచేఁ బొదవంగఁ బడియుఁ
దనరుననర్ఘ్య ముక్తాఫలంబట్లు. పండి. 1-391 పు.

శ్వానం బెఱుంగునే స్వర్గలోకంబు. బస. 7-569 పు.

సర్వసంగముల్ విడిచి తా నాశ్రమము, గోరు
తపసిచందము. బస.

సిద్ధరసస్పర్శఁ జేసి యౌఁ గాదె
శుద్ధసువర్ణంబు శుద్ధతామ్రంబు. బస. 7-531 పు.

స్ఫుటతులాయష్టిసంపుటభూషణాదు
లిటఁ గట్లె లేక యెత్తెఱుఁగంగ రాదు. పండి. 2-187 పు.

దీనిలో 'గ్రామో నాస్తి కుత స్సీమా' యనునది సంస్కృతలోకోక్తి. ఈ సంస్కృతలోకోక్తి యథాతథముగా నెట్టిమార్పును లేక యొకచోటఁ బ్రయోగింపఁ బడినది. మఱొకస్థలమునం దీలోకోక్తి యొక్కయనువాద మొకసామెతగాఁ బ్రయోగింపఁ బడినది. 'ఊరు లేక పొలిమేర గల్గునే' యనునది పయిలోకోక్తికి నాంధ్రానువాదము. పయి సంస్కృతలోకోక్తి కీ యనువాదము సోమనాథుఁడే చేసినదో లేక యనూదిత మయిన యాసామెతను జనవ్యవహారమునుండియే యాతఁడు గ్రహించెనో మనకుఁ దెలియ రాదు. అట్లే 'మృగపతి యెద్దెస మేయునే పుల్లు' అనునది భర్తృహరి సుభాషితములలోని తదర్థక మృగులోకోక్తి సంస్కారములో రచింపఁబడిన సామెత. భ్రమర కీటన్యాయభావన – యను మఱొక సంస్కృతలోకోక్తి కూడ నీతనిచేఁ బ్రయోగింపఁబడి యున్నది. అట్లే 'కనకసాములు దమకవేలిచికొన్న యావిధ మగు' – 'కుతిలుఁ డై జాతినాగులఁ జంపుచుండి, ప్రతిమనాగులకును బా ల్పోయు నట్టులు' – 'చోళవాలిక కాక వేళవాలికినె వత్తురే?' యనునవి కన్నడమునుండి తెలుఁగులోనికి వచ్చినది. దీనిఁ గూర్చిన వివరములు 'ఉపమానాదులలోని దేశీయత' యను ప్రకరణమునఁ బ్రత్యేకముగాఁ దెలుపఁబడినది. ఇందలి సామెతలలోఁ బెక్కు జనవ్యవహారమునుండి యితనికావ్యములలోని కెక్కినవిగాఁ దోఁచును. సోమనాథకవి కల్పితములుగాఁ దోఁచునవి కూడఁ గొన్ని దీనిలో లేక పోలేదు. కొన్ని సామెతలు ఉపమానములుగను, నర్థాంతరన్యాసములుగను నుండి ప్రకృతార్థమును స్ఫురింపఁ జేయుటో, సమర్థించుటో సాధారణముగా జరుగుచుండును. అట్టివి కూడఁ గొన్ని వీనిలోఁ గలవు. పయిని బేర్కొనిన యొండు రెండు సంస్కృతలోకోక్తుల విషయమును విస్మరించినచోఁ దక్కిన సామెత లన్నియు నాతని దేశి రచనా ప్రవణతను సూచించును.

# బి. జాతీయములు

పరస్పరభావవినిమయము ప్రధానలక్ష్యముగా నేర్పడిన భాష నానాఁటికిఁ బెంపొంది పదును దేరుచుండును. తనమనోభావముల నన్నిటిని దోడివారికిఁ జెప్పుకొనఁ గలచేవను దనభాషకు సంతరించుకొనుటలోఁ బ్రతిమానవుఁడును బ్రతికాలము లోను బయత్నపూర్వకముగానో, యప్రయత్నముగానో యెంతో కొంతకృషి చేయుచుండును. తత్ఫలితముగా నొకనాఁటికంటె మఱొకనాఁడు భాషలోఁ గ్రొత్త మాటలును, గ్రొత్త మాటలతేటలును, మాటలు క్రొత్తవి కానప్పుడు వానికే క్రొంగ్రొత్త భావచ్ఛాయలును నేర్పడుచుండును. సామాన్యముగా విడివిడిగా నున్నపాడిమాటలే వానియపూర్వసమ్మేళనముతో - విడివిడిగా నామాటలకు వేనికిని లేని యేదోయొక్క యపూర్వభావవ్యక్తీకరణమునకు మూలములై - విశిష్టపదబంధములుగా భాషలో నిలచి పోవును. ఇట్టిపద బంధములకే జాతీయము లనియుఁ, బలుకుబడు లనియుఁ బేరు. జాతీయములయావిర్భావమునుగూర్చినయీవిషయములు బాహ్రియను విద్వాంసుఁడు రచించిన Hindi Semantics అను గ్రంథమున సూత్రప్రాయముగాఁ దెలుపఁబడిన యీక్రిందివాక్యములతో సంవదించుచున్నవి. చూడుఁడు:

'At its early stage, a language is made up of words with simple and concrete meanings It has been noted that whenever a word is taken in a particular language it has but one meaning, concrete and fixed. The words first have expressive power (Abhidha Sakti) They attain suggestive or implied power as their usage develops. An Idiom of a language is a result of this implied power (Vyanjana Sakti) of words and consequent maturity of language which it achieves through economy, clearness and force'[1]

జాతీయములకల్పనమును, దదభివృద్ధియు సాధారణముగా నాభాషను వ్యవహరించు జనులసంస్కృతిపై నాధారపడి యుండును. ఒకానొక సంఘములోని ప్రజల కార్యకలాపములు, ననుభూతులు, ఆలోచనలు, సంబంధములు వృద్ధి యగుట తోఁబాటు ప్రజలభాషలోని పదజాలము కూడ వృద్ధి యగుచు నాపదములలోఁ బెక్కు వ్యంగ్యార్థస్ఫోరకత్వమును, నర్థవిస్తృతిని సంతరించుకొనుచుండును. ఆంగ్లభాషలో జాతీయ మనునర్థములో 'Idiom'

1 *Hindi Semantics P 249*

అను పదము వ్యవహారములో నున్నది. మన భాషలోని జాతీయ మనుపదమువలెనే యదియు మిక్కిలి యర్థవంతమై యలరారుచున్నది. గ్రీకుభాషలో 'Idioma' అనఁగా 'Peculiar Pharaseology' (విలక్షణ పదబంధము) అని యర్థము. అది 'Idios' అనుపదమునుండ యేర్పడినది. Idios అనఁగా Peculiar to one s self ఒక ప్రత్యేకవ్యక్తికి సంబంధించిన వైచిత్ర్యము) అని యర్థము. హిందీభాషలో జాతీయమునకు 'ముహావ్రా' (Muhavra) అని పేరు. అరబ్బీభాషలో నాపదమునకు 'సంభాషణము' (Dialogue or conversation) అని యర్థము. కాని, యాపద మంత యర్థవంతము కాదు. సంస్కృతమున నిట్టివానిని 'వాగ్ధార' యందురు. అదియు నర్థవంతము కా దని వేఱుగాఁ జెప్ప నక్కఱ లేదు. జాతీయము లొకానొకభాషకు సంబంధించిన విలక్షణపదబంధము లనియు, నితర భాషనుండి లేక భాషాకుటుంబమునుండి యొకానొకభాషకుఁ బ్రత్యేకతను, వైలక్షణ్యమును సమకూర్చు భాషాభాగము లనియుఁ దలంపఁ దగును. తన లోని యేదో యొక విశిష్టము, నుజ్జ్వలము, దీవ్రము నయినభావమును దెలుపుట కును, నెదుటివాని మనసున సూటిగా నంత తీవ్రముగాను నాటునట్లు చేయుటకును బ్రయత్నించుటలో నిట్టిజాతీయములను బ్రతిమానవుఁడును నెప్పటి కప్పుడు సృష్టించుచునే యుండును. తత్ఫలితముగా నాభాషలో జాతీయము లనేకములు ప్రవేశించును. ఏ జాతీయమును గాని, యందలిపదముల కున్నయర్థము, కారకము మొదలగు వానిని జూచి యట్లే మఱొకభాషలోని కనువదించినచో నాయర్థమెంత గింజుకొనినను రాదు. అదియే జాతీయముల కుండు విశిష్టత. జాతీయములకు భాషలోఁగల ప్రాముఖ్యమెట్టిదో తెలుపుచున్న యీ క్రిందివాక్యములను దిలకింపుఁడు.

'Idioms have a charm of their own They are the vitamins - little sparks of life and energy - in our speech. They are popular and national and made of durable and home-spun material. A nation's history and character are undoubtedly mirrored in its idioms and Phrases, and it can be said with certainity, of some typical idioms, that they could only be the expression of thought or feeling of one particular nation. Some idioms may be translations or adaptations but all of them come from the people and are accepted by them '[2]

---

2. *Hindi Semantics P. 255.*

'They are a sign of the youthful vigour and versatality of a language'[3]

ఏభాషలోఁగాని యీజాతీయములు రెండురకములుగా నుండును. మొదటిది స్వరూపమునకు సంబంధించినది. రెండవది విలక్షణార్థమునకు సంబంధించినది. ఆఙ్గ్లభాషలో మొదటిది Usage అనియు, రెండవది 'Idiom' అనియు వ్యవహరింపఁబడును. వాని రెంటికిని గలభేద మెట్టిదో యీక్రిందివాక్యములు చదివిన దెల్ల మగును.

'The term Idiom is used in two senses First it denoted the general structure of a language vis-a-vis it grammar and syntax, whereby it is distinguished from another language or family of languages and which give it a special character of its own. Secondly, the idiom denotes those combinations of words or phrases which have a metaphorical, marginal or suggestive than literal or prosaic meaning . . ... In one case, their is peculiarity of structure and use, the meaning being understood practically literally, though it may sometimes be untranslatable into a foreign language. We propose to designate such expressions as 'usages' In the other case, there is peculiarity of use as well as meaning We shall restrict the term idiom to this class of phrases .. '[4]

దీని ననుసరించి మనభాషయందు జాతీయము అనుపదమును Idiom అనుదానికి సమానార్థకముగాను, పలుకుబడి అనుదానిని usage అనుదానికి సమానార్థకముగాను గ్రహింపఁదగు ననితోఁచును. నాకుఁ జూడఁగా – రాత్రింబవళ్లు – కసువు గట్రు – ఇత్యాదులు పలుకుబడులు (usage) గను – అర్థవైలక్షణ్యము కల 'చెవితో నిల్లు కట్టుకొనిపోరు' – 'నోరు పాఱవేసికొను' – ఇత్యాదులు జాతీయములు (Idioms) గను మనము గ్రహింపఁదగును. ఇట్లు జాతీయముల యుత్పత్తివికాసములు, వాని భేదములు తెలిసికొన్న పిదప సోమనాథునికిఁ బూర్వ మిట్టిజాతీయములప్రయోగము నందాంధ్రకవీశ్వరు లెట్టి యాసక్తి కనుపఱచిరో తెలిసికొందము.

---

3 *Hindi Semantics P 255*

4 *Hindi Semantics P 257*

నన్నయభట్టారకుఁడు తన భారతమున 'వాలుపయి నడచునట్లు' అనునొక జాతీయమును బ్రయోగించెను. అది నన్నయభట్టు స్వయముగఁ గల్పించిన దనఁ జాలదు. జనవ్యవహారమున నున్న 'కత్తిమీఁద సాము' అనుజాతీయమునకే యది కావ్యభాషారూప మని భావించుట యుక్తము. అదియు 'అసిధారావ్రతము' అను సంస్కృతజాతీయమునకుఁ దెలుఁగురూప మనఁ దగును. ఇట్లు సంస్కృతానుకరణముగాఁ గాక యాకాలమున జనులనిత్యవ్యవహారమున నుండిన మఱికొన్ని జాతీయములు కూడ నాతనిగ్రంథమునఁ బ్రయుక్తము లయినవి. చూడుఁడు :

కుంతికడుపు సల్లఁగాఁ బుట్టిన ఘనభుజుండు (ఆది. 6-18)

ఱొమ్మున జేయిడి నిద్ర వోయె. (ఆది. 6-62)

వంటయిల్ గుందెలు సొచ్చె (ఆది. 6-186)

బూతు వొగడినట్లు వొగడెదు. (సభా. 2-48)

ఇందు 'కడుపు చల్లఁగాఁ బుట్టు', 'ఱొమ్ముపైఁ జేయి వైచుకొని నిద్రించు', 'వంటయింటి కుందేలు', 'బూతు పొగడినట్లు' అనుజాతీయము లాయాసందర్భముల కనుగుణముగా మహాభారతమునందుఁ బ్రయుక్తము లయినవి. కాని, యాతనిగ్రంథమునం దిట్టిజాతీయములు బహుస్వల్పము. నన్నెచోడుని కుమారసంభవమునం దింత కంటెఁ గొంచె మధికముగనే జాతీయములు ప్రయుక్తము లయినవి. అ య్యెల్ల నొక పట్టికరూపమునఁ గుమారసంభవముగ్రంథాంతమున సామెతలతోఁ గలిపి తత్పరిష్కర్తలగు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారిచేఁ బ్రదర్శింపఁబడినవి. దానిలో ఇనుమున గట్టు దాల్చు (8-135); ఎండమావులఁ బట్టు (8-135); ఏనుంగుపురు దోము (8-135); కలియుఁ ద్రచ్చి వెన్నగొను (8-135); గాలి గంటిడు (8-135); చట్రాతిపైఁ గ్రుంగు (8-135); తగరము వాడి చేయు (7-33); ఇడుపు లేక చిత్రము వ్రాయు (8-135); తా డిడి ఫలంబు గొను (1-12); నీరి నడుము ద్రెంపు (8-135); నేలయు నింగియుఁ తాళముల్ వాయించు (8-135); నెలను దెచ్చు (8-135); మొండిచేవేల్చు (8-135) బండతలయు మోఁకాలు ముడివెట్టు (8-135); మంగలములోని ప్రేలలభంగి (6-138); మంచు కుంచమునఁ గొలుచు (8-135); రా నార గొను (8-135); రోఁకటఁ జిగురులు గోయు (8-135); వేఁటకాని యిల్లు

వెఱవక కుందెలు సొచ్చినట్లు (12-83); శిఖిశిఖలమీఁద మిడుత నెనయు (4-66) మొదలగునవి యాతనికి జాతీయముల ప్రయోగమునఁ గలయభినివేశమును దెలుపును.

మల్లికార్జునపండితుని శివతత్త్వసారము మతధర్మములను, శివభక్తుల చరిత్రము లను దెలుపు స్తోత్రగ్రంథ మగుటచేత నందు జాతీయములప్రయోగమున కవకాశము తక్కువ. అయినను నాయున్నంతయవకాశములోనే యాతఁడొండు రెండు జాతీయములను బ్రయోగించి తన దేశీయాభిమానమును బ్రదర్శించెను. ఈక్రిందిపద్యమును జూడుఁడు:

క: భక్తుల దవ్వులఁ గని శివ
భక్తులు వచ్చి రని పొంగి బ్రతికితి నని పో
భక్తుల కెదురేఁగి యథా
శక్తిస్థితిఁ జేయ వలయు సత్క్రియలు శివా.

శివ. **140** ప.

ఇందు 'బ్రతికితిని' అనుజాతీయము ప్రయుక్తమయినది. నేఁటికిని బతికిపొయ్యాను' లేక 'బతికాను' అను రీతిని నీజాతీయము వినవచ్చు చున్నది. అతఁడు మఱొక పద్యములో 'అంటియు ముట్టని' (478 ప) అనుమఱొకజాతీయమును గూడఁ బ్రయోగించెను.

పాల్కుఱికి సోమనాథుని బసవపురాణ, పండితారాధ్యచరిత్రములలో నీయందఱికంటెను నధికముగా జాతీయముల ప్రయోగింపఁబడి యున్నవి. అందలి వాదసందర్భములును, భక్తులకథాఘట్టములయందలి సంభాషణాదికములును వాని వాని తీవ్రతనుబట్టి యిట్టిజాతీయముల ప్రయోగమున కాతనికత్యధికముగా నవకాశమేర్పఱిచియుండు నని మనము భావింపఁ దగును. వస్తువునుబట్టి యేర్పడినయావశ్యకమే కాక సహజముగా నాతనికి దేశీయము లగు జాతీయములను బ్రయోగించుటయందుఁ గలయుత్సాహము, మక్కువ కూడ నాతనిగ్రంథములలో నీజాతీయములు పెక్కు ప్రయోగింపఁబడుటకుఁ గారణ మయి యుండును. అతనిజాతీయములు కూడ usage, Idiom అను రెండు తెగలకును సంబంధించియున్నవి. కొన్ని స్వరూపము (structure) నకు సంబంధించి వైలక్షణ్యముకలిగి యుండఁగా మఱికొన్ని యర్థవైలక్షణ్యము

కలిగి జాతీయతా లక్షణపూర్ణములై చెలువారుచున్నవి. ఇట్లు రెండుతెగలు విభజింపఁ దగి యున్న యాతనియుభయగ్రంథములోని జాతీయములన నకారాదిగాఁ గూర్చి ప్రత్యేక ప్రత్యేకముగా నిందుఁ బట్టికలరూపమున ప్రదర్శింపఁబడినవి. ఇట్లధికసంఖ్యలోఁ బ్రయోగింపఁబడి యున్న యీజాతీయములు కూడ నాతనికిఁ గలదేశీయాభిమానము నే వ్యక్తపఱచు చున్న దనుటకు సందేహము లేదు.

**బసవపురాణము :**

## పండితారాధ్య చరిత్రము

ప్రాణంబు (ప్రమథాధిపులకెల్లఁ) – 2-210

సోమనాథుఁడు తనకావ్యములయందుఁ బ్రయోగించిన సామెతలును, జాతీయములును గొన్ని యాతని తరువాతికవీశ్వరుల రచనములయందును మనకుఁ గాన వచ్చును. ఇట్టి యీ సామెతలు మొదలగువానిని కావ్యములలోఁ బ్రయోగించి యొక యనితరసాధారణ మైనవైలక్షణ్యమును సాధించుటలో మన సోమనాథుఁడే యితరులకును మార్గదర్శకుఁ డయ్యెననవచ్చును. అతనివలె సామెతలను, జాతీయములను దమకావ్యములయందు నెక్కొలుపుటయే కాక యితఁడు తనకావ్యములందుఁ బ్రయోగించిన వానినే కొన్నింటిని వారును బ్రయోగించి యుండుట గమనింపఁదగి యున్నది. తమ కాలమునందును నాయా సామెతలకు, జాతీయములకు జనులలో బహుళవ్యవహార ముండుట

దానికిఁ గారణము కావచ్చును. లేదా యీతని గ్రంథములలోఁ బ్రయోగింపఁబడిన యాసామెతలను వారును దమకావ్యములలో ననుకరించి యుండవచ్చును. ఈయుభయవిధములును సంభావ్యములే యగును.

'బెండ్లు తేలెడిఁ గాక పేరేటనైన, గుండ్లు దేలునె? యని సోమనాథుఁడనఁగా తిక్కనసోమయాజి దానినే మరొకవిధముగా 'గుండ్లు దేలి బెండ్లు మునింగిన ట్లయ్యె'నని ప్రయోగించి సోమనాథుననుకరించెను. ఈతీరుననే నాచన సోమనాథుని రచనయుఁ గొన్నిచోట్ల పాల్కుఱికి వాని రచనమునకుఁ బ్రతిముద్ర యనిపించును. నాచనసోమన పాల్కుఱికి సోముని పలుకుబడిని చక్కఁగా గుఱుతించి తనకావ్యమునందు దాని నొక్కొలిపినాఁడు. 'ఆవమునఁ గల్గనే రాగిముంత', 'తుదినాలుక ముల్లు', ముంజేతికంకణమున కద్దమేల? – ఇత్యాదిగా పాల్కుఱికి సోమన ప్రయోగించిన లోకోక్తుల నెన్నిటినో నాచనసోమనాథుఁడు తనగ్రంథములో నిక్షిప్తపఱుచుకొనెను. పౌండ్రక వాసుదేవుఁడు సాత్యకినిజూచి 'కుమ్మరావమున రాగిముంత లేరంగఁ గలవె' (3–48) అని మనసోమనాథుని పలుకుబడితో శ్రీకృష్ణునిఁ బరిహసించును. దుర్వాసుఁడు శ్రీ కృష్ణునితోఁ దనభంగపాటునుగూర్చి చెప్పుకొనుచు 'కమలలోచన ముంజేతికంకణమున కద్దమేఁటి' (4–100) కనెను. అతనికప్పుడు 'మునులలోపల నాలుక ముల్లు విఱిగె' (4–102) నఁట. తెలుఁగుదేశమునందలి పలుకుబడులతో, జాతీయములతో, సామెతలతో వెల్లివెరియు పాల్కుఱికి సోమనాథుని రచన మిట్లే తరువాతికవుల రచనములపైఁ దన ప్రభావమును నెఱపినది. ప్రబంధకవులలోఁ బేరెన్నిక గన్నకవీశ్వరులపైఁ గూడ సోమనాథుని జాతీయప్రయోగప్రభావము కొన్ని పట్టులఁ గొట్టవచ్చినట్లు గానిపించును. 'పూసలలోన దారముక్రియ' అని సోమనాథుఁడు ప్రయోగింపఁగా దానిని పారిజాతాపహరణ కర్త యగు ముక్కు తిమ్మన 'కలకాలమొక్క గతిఁ బూసలలో దారంబు మాడ్కి' అను పద్యమున ననుకరించెను. తెనాలి రామకృష్ణుఁడు కూడ – ఒకప్పుడు రామలింగ మగుటచేఁ గాఁబోలును – తలలోపల నాలుక, పూసలలో దారంబు, పాలఁ జల్లిన నీరు అని ప్రయోగించి సోమనాథు ననుకరించెను. కిట్టి, బిమ్మట (త్రాట) గట్టి బోయలు, నోరితాళము మొదలగు ప్రయోగములలో నీతఁడు కొంత సోమనాథునిఁ దలఁపునకుఁ దెచ్చును.'

జాతీయములు, సామెతలు, లోకోక్తులు, మొదలగు వానివిషయమున శైవ వైష్ణవ కవుల కెంతేని సామ్యము కలదు. పాల్కుఱికి సోముని ప్రయోగము లెన్నో తాళ్లపాకవారి రచనలతోఁ గానవచ్చును. సోమనాథుఁడు బసవపురాణములోని కన్నప్ప కథలో –

కలఁ గన్నచోటికి గంపఁ గొంపోవ
ఫలసిద్ధి యగు టెల్ల భాగ్యంబు గాదె

అని యొక సామెతను సందర్భానుగుణముగాఁ బ్రయోగించినాఁడు. తాళ్లపాక అన్నమయ్య దాని నట్లే –

'కల గన్నచోటికి గంపయెత్తినయట్లు
నలవి మీఱిన దెల్ల నమ్మా'

అని యొకపదము నారంభించెను. ఇంకను 'ముంజేతికంకణమున కద్ద మేలరా, తంగేటి జున్ను, చెఱకు పండిన పండు, బెండ్లు ముంచి గుండ్లు తేలించేది, ముల్లుదీసి కొఱ్ఱడఁచుట, శిర సుండ మోకాల సేస పెట్టిన యట్లు, ఓడ విడిచి వదరు చే పట్టుకొని – ఇత్యాది లోకోక్తుల నన్నిటిని వీరు సోమనాథుని వలెనే సందర్భానుగుణముగాఁ బ్రయోగించి యౌచిత్యపోషణముఁ గావించుకొనిరి. ఇట్లు సోమనాథుని జాతీయాదిప్రయోగము తాళ్లపాక కవులలోఁ బరిపూర్ణవికాసముఁ బొందినది.'

బసవపురాణముచివర సప్తమాశ్వాసములో 'బోయల తగవు' అను కథాభాగ మొకటి కలదు. అందు బోయలయభియోగముపై బసవేశ్వరుఁడు కాలకూటమును వండి భక్తుల కందఱకును పంచిపెట్టును. భక్తులందఱును దానిని పాయసమువలె నారగింతురు. ఈ ఘట్టమున సోమనాథుఁడు తెలుఁగునుడికారమును, జాతీయమును మిక్కిలి యద్భుతముగా, స్వభావ మధురముగాఁ బ్రదర్శించినాఁడు. వడ్డన, వడ్డనలోని తీరులు, వడ్డన జరుగునపుడు నడుమహాస్యోక్తులు మున్నగునవి యీ ఘట్టమున మహాద్భుతముగా నభివర్ణింపఁ బడినవి. బసవపురాణమును పద్యకావ్యముగా సంతరించిన పిడుపర్తి సోమనాథుఁడు ఇందలి జాతీయమును పద్యములలో నిముడ్చుట దుర్ఘట మని తలఁచియే కాఁబోలు 'రగడ'లో నాఘట్టమును నిర్వహించి యాజాతీయ ప్రయోగముచేఁ దనకావ్యమును గూడ నలంకరించుకొనెను.

ఇట్లు సోమనాథుని జాతీయాదిప్రయోగము తరువాతికవులకును మార్గదర్శకమై యెందఱో యాతని నావిషయమున ననుకరించునట్లు చేసినది. కొందఱు వాని ననుకరించిరి. కొందఱు వానిని యథాతథముగనే స్వీకరించిరి. పిడుపర్తి సోమనాథుఁడు రెండవకోవకుఁ జెందినవాఁడు.

## తత్సమ పద ప్రయోగము

సోమనాథుని భాషలో నాతని తత్సమ పదప్రయోగము కూడఁ బ్రముఖ స్థానము నాక్రమించును. అతఁడు తన బసవపురాణ, పండితారాధ్య చరిత్రముల యందుఁ బ్రయోగించిన తత్సమ పదములు, చేసిన సమాస కల్పనములు కొన్ని వ్యాకరణ దుష్టములై యాతని స్వతంత్ర ప్రవృత్తిని జాటును. అట్టి స్వతంత్ర ప్రయోగమున కాతని స్వేచ్ఛా ప్రవృత్తి మాత్రమే కాక సమకాలమునాఁటి శాసన భాషయు, జన వ్యవహారమును దమ ప్రభావమును నెఱపుట కూడఁ గారణము గావచ్చును. అగుట నీతని తత్సమ పదప్రయోగము మార్గ కవుల భాషా ప్రయోగమునకు భిన్నమై దేశి ప్రభావసంపన్నమై వెలయుచున్నది. అట్టి యాతని తత్సమ పద ప్రయోగములోని ప్రత్యేకతలను, నసాధారణత్వమును నిందుఁ బరిశీలింతము.

1. సమకాలమునందలి శాసన భాషయొక్క ప్రభావ మీక్రింది ప్రయోగముల యందుఁ గాన నగును.

| | | |
|---|---|---|
| (ఎ) | అసంఖ్యాత మహేశ్వరులు | బస. 1-5 |
| | అసంఖ్యాతుల బసవ | బస. 2-86 |
| | అసంఖ్యాతులార | బస 3-146 |
| | అసంఖ్యాతులు | బస 4-292 |
| | అసంఖ్యాత భక్తావళి | బస 6-449 |
| | అసంఖ్యాత భక్తులు | బస 7-516 |
| | అసంఖ్యాతులు | బస 7-579 |

ఇందలి 'అసంఖ్యాత' పదము 'అసంఖ్యాక' యనున నర్థమునఁ బ్రయోగింపఁబడినది. శాసనములలో నిట్టి ప్రయోగము కలదు.

(బి) (మీ) దత్తి బస 4-328

దానము చేయఁబడినది అను నర్థమున 'దత్తి' యను ప్రయోగము శాసనములలోఁ గలదు.

(సి) సుఖ సంకథావినోదము బస 1-13

'సత్కథా' యనుటకు 'సంకథా' యనుట శాసనము లందుఁ గాననగును.

2 (ఎ) విశేషణములను విశేష్యములుగాఁ బ్రయోగించుట కొన్ని ప్రయోగముల యందుఁ గాననగును. అది వ్యావహారిక భాష ప్రభావముచేఁ గావచ్చును. ఉచితానుచితములు, కపటము తెలియనివాఁడు – ఇత్యాదులందు విశేషణములే విశేష్యములుగాఁ బ్రయోగింపఁబడినవి.

| | |
|---|---|
| అవసరోచితమున | బస 1-14 |
| సమయోచితము (ఎఱింగి) | బస 1-13 |
| అవసరోచితము | బస 7-577 |
| గద్గదములు | బస 1-40 |
| (నిజ) ఆప్తము (ఆప్తగణమను నర్థమున) | బస 2-61 |
| కమనీయము (ఒందు) | బస 2-79 |

(బి) కొన్ని ప్రయోగములు యథార్థ దృష్టితోఁ జూచినపుడు దుష్టము లయినను వ్యవహారానుగుణముగాఁ బ్రయోగింపఁబడినవి కలవు.

| | | |
|---|---|---|
| లోకాలోక చరితములు | బస 1-14 | (వివిధ లోకచరితములు) |
| లోక ప్రపంచంబు | బస 1-14 | (లోకము – ఇది భూప్రపంచము అను వ్యవహారమువంటిది) |
| పదపదార్థములు | బస 2-90 | (వివిధ పదార్థములు) |
| పదపదార్థములు | బస 2-94 | ” |
| పదపదార్థములు | బస 5-362 | ” |
| పదపదార్థములు | బస 5-386 | ” |
| పదపదార్థములు | బస 5-444 | ” |
| పదపదారథములు | బస 5-445 | ” |

3. కొన్ని తత్సమ పదముల నీతఁడు ప్రత్యేకార్థములయందుఁ గల్పించును. అట్టి కల్పనమునకు సాధారణముగా శైవ పరిభాషయు, సామ్యమును గారణము లగుచుండును.

ఇతర కవులలో నిట్టి రూపములాయా యర్థముల యందు గానరావు.

| | | |
|---|---|---|
| అంతర్వాసము | బస 3-131 | (అంతఃపురము) |
| అంతర్నివాసములు | బస 7-491 | (అంతఃపురము) |
| అంబకళము | బస 5-355 | (అంబలి) |
| అకులజుఁడు | బస 4-237 | (కులహీనుఁడు) |
| అతగులు | బస 6-435 | |
| అప్పులు (కంటి) | బస 3-193 | (కన్నీరు) |
| అమార్గము | బస 3-190 | (అపమార్గము) |
| అమార్గము | బస 5-366 | (అపమార్గము) |
| కాయకంబు | బస 4-267 | (పని, ఇది కన్నడ పదము) |
| కాయకంబు | బస 4-317 | |
| కాయకలబ్ధి | బస 4-248 | |
| కాయకలబ్ధి | బస 4-258 | |
| కాయకోద్యోగ లబ్ధము | బస 4-267 | |
| కార్యంశము | బస 5-339 | |
| కుమార్గంబులు | బస 7-563 | (దుష్టమార్గము) |
| కుమార్గము | బస -365 | |
| తంత్రంబు | బస 3-123 | (సైన్యము, కన్నడమునను, శివకవుల గ్రంథముల లోను నీ పద మీ యర్థమునఁ గలుద) |
| తంత్రంబు | బస 4-248 | |
| తవరాజము | బస 7-570 | (పంచదార - ఇదియుఁ గన్నడ పదము) |
| దృష్టప్రత్యయము | బస 7-528 | (ప్రత్యక్ష ప్రమాణము) |

| | | |
|---|---|---|
| (కటాక్ష) ప్రేక్షణము | బస **5-346** | (వీక్షణము) |
| (కటాక్ష) ప్రేక్షణము | బస **6-428** | (వీక్షణము) |
| (పదాబ్జ) ప్రేక్షణము | బస **7-529** | (వీక్షణము) |
| పరిచ్ఛేది (యగుడు) | బస **6-421** | (తెగించు, సాహసించు) |
| పరిచ్ఛేది (య్యై) | బస **3-150** | (తెగించు సాహసించు) |
| పరిచ్ఛేది (య్యై) | బస **3-189** | ,, (నన్నిచోడుండును దీనినీ యర్థమున బ్రయోగించెను. |
| ప్రణిపత్తి | బస **4-223** | (నమస్కారము) |
| ప్రతిపత్తి | బస **7-494** | ,, |
| ప్రస్తవమున (తత్) | బస **3-130** | (తదవసరమున – అనుటకు) |
| బ్రాహ్మ్యము | బస **1-44** | (బ్రాహ్మణత్వము) |
| భోగించి | బస **5-335** | (భుజించు–అనునర్థమున) |
| భోగించు | బస **2-77** | ,, |
| భోగింతుము | బస **7-541** | ,, |
| భోగింప | బస **2-120** | ,, |
| భోగింపఁగా | బస **2-103** | ,, (శైవ పరిభాషలో భోగము అనఁగా నైవేద్యము, భోగించు = నైవేద్యముచే |
| మహిసాక్షి | బస **4-315** | (సాంబ్రాణి) (మహిసాక్షము – సంస్కృతము) |
| యంత్రముల్ (పన్నుట) | బస **7-541** | (కుట్రలు అనునర్థమున) (కూటయంత్రము కుట్ర యనునర్థమునఁ గలదు. అందు 'కూట' విడిచి ప్రయోగము) |
| యాజ్ఞికంబులు | బస **1-44** | (వేదమంత్రములు) |
| వధ్య శృంగారము | బస **4-269** | (వధింపఁబడ నున్న దానికిఁ జేయు సెలంపెరణము) |

వ్యవహారము బస 2-97 (వ్యాపారము, బేహారము దీనినుండి పుట్టినది)

సభ్యుని (విధి) బస 7-491 (సభాయోగ్యుఁడు - సభాస్తారుఁడు అనుసర్గము తరువాత వచ్చినది)

సేకంబు బస 3-176 (స్నానము - అభిషేకములోని సేకమే యిది)

స్తవనము బస 4-236 (స్తోత్రము)

(పంచామృత) స్నపనము బస 3-187 (స్నానము)

4. వ్యాకరణ దుష్టములును, నపరూపములును నయిన యీక్రింది ప్రయోగములు శాసన భాషాప్రభావమును, నాఁటి వ్యావహారిక భాషా ప్రభావమును దెలుపును.

అంబుజ నేత్రి బస 1-16

అనుమతము బస 6-144 (అనుమతి యనుటకు)

అశ్వ సాహి బస 2-105

ఘటశాసి బస 7-510

తదియ్యవాక్యంబు బస 4-302

తవనిధి బస 4-259

తవరాజు బస 4-273

తవరాజు (శవము) బస 5-371

దృష్టాంతరము బస 4-312

నాసికంబు బస 4-282

నిరోగి బస 3-159 (నీరోగుఁడు అనవలయును)

(లింగ) పట్ట బద్ధుం బస 2-117 (పట్టభద్రుఁ డనుటకు)

(సద్భక్తి) పట్టబద్ధుండు బస 2-117 ''

భక్త సమూహి బస 2-120 (నన్నెచోడుని లోను నిట్టి ప్రయోగములు కలవు) సమూహము అనుటకు

| | | |
|---|---|---|
| భక్త సమూహి | బస 4-266 | |
| (సకల) భక్త సమూహి | బస 7-582 | |
| (స) ద్భక్త సమూహి | బస 4-302 | |
| భవ భవంబుల | బస 7-581 | (ప్రతిభవంబు – అనుటకు – జన్మ జన్మాలకు అనుదాని సామ్యముచేఁ గల్పింపఁబడినది) |
| మురహరార్చితుఁడు | బస 7-562 | (విష్ణు భక్తుఁడు అను నర్థమున) |
| [illegible] వనాంతర బిల్వసములు | బస 3-143 | |
| కదళీ దళానేకంబు | బస 4-306 | |
| పుత్త్రకళత్ర మిత్రగోత్రాది బలగంబు | బస 7-562 | |
| (శ్రీ) కలకంఠుఁడు | బస 3-145 | |
| కలకంఠ శ్రీపాదకమలాంతరంగ | బస 3-151 | |
| కలకంఠభక్తుఁడు | బస 7-523 | |
| సువిధాని | బస 2-105 | (సువిధానము – అని పలుకువాఁడు) |
| యావత్తు ధనమును | బస 3-168 | అవ్యయమునకు ఉగాగమ ద్విత్వములు. 'సకృత్తు' కూడ నిట్లే. |
| వర్షాఫలంబు | బస 7-583 | (వడగల్లు అను నర్థమున వర్షోపల మన వలెను గాని వర్షా ఫలము కాదు. కాని యిది యతి స్థానమున పొసఁగుదురని రీతిగాఁ బ్రయుక్తము) |
| విగుర్వణంబు | [illegible] 3 195 | (విగూర్వణము– అనుటకు) |
| హరిహర[illegible]ంచాది దేవతలు | [illegible]3 | ([illegible]ంచిః అను అకారాంత పదము కలదు) |
| (వాసవ) వాసి | [illegible] 105 | (వాసుఁడు– అనుటకు) |
| [illegible] | [illegible] | |

# డి. తద్భవరూపములు

సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య చరిత్రములలో మన కితర కవుల కావ్యములలోఁ బరిచితములు కాని, తద్భవ రూపములు కొన్ని కానవచ్చును. వానిలోఁ గొన్ని సంజ్ఞాపదములు కూడఁ గలవు. అవి యెల్ల నాతఁ డాయాపదములకు నూతనముగాఁ గల్పించిన తద్భవ రూపము లనుట కంటె నాయా సంస్కృత పదము లాతని కాలమున నారూపములతోనే ప్రజలు వ్యవహరించుచుండి రనియు, నట్లు వారివ్యవహారమున నున్న యా తద్భవ రూపములనే యాతఁడు తన కావ్యములయందు గ్రహించి యుండు ననియు భావించుట యుక్తము. అతఁడు ప్రయోగించిన తద్భవ రూపములను పెక్కింటిని కోశకారులు తమ కోశముల యందు గ్రహించి యుండలేదు. అతని గ్రంథములు తమ కోశ సంగ్రహణ కాలమునకు బయల్పడక పోవుట చేతనో - లేక యితర కవి ప్రయుక్తములు కామిని నప్రశస్తము లని భావించుట చేతనో వారు వానిని గ్రహింప రయిరి. శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తాము ఆంధ్రగ్రంథమాల వారు ప్రకటించిన బసవపురాణము ద్వితీయ ముద్రణ పీఠికలో బసవపురాణములోని యట్టి తద్భవ రూపములను గొన్నిటిని బ్రదర్శించిరి. ఇపుడిచట నాతని యుభయ గ్రంథములందును గల యట్టి తద్భవరూపముల నకారాదిగాఁ గూర్చి యొక పట్టికగా నొసఁగఁబడి యున్నది. వానికి మూలము లయిన సంస్కృతపదములు కూడ వాని కెదురుగాఁ బ్రదర్శింపఁబడినవి.

## బసవపురాణము

| | |
|---|---|
| అచ్చన (అర్చన) | 3-162 |
| అచ్చులు (అచ్చులు) | 2-160 |
| అరహాతమును (అర్హతముని) | 6-447 |
| అవిముగతయ్య (అవిముక్తయ్య) | 7-537 |
| అరోగణము (ఆహారము) | 5-387, 5-388 |
| ఈసరయ్య (ఈశ్వరయ్య) | 4-265 |
| ఉదుబటుఁడు (ఉద్భటుఁడు) | 7-517 |
| ఉద్దెసించిన ( ద్దేశించిన) | 3-165 |

| | |
|---|---|
| ఉద్దెసింఛు ( ఉద్దేశించు) | 3-165 |
| ఉద్భుట్టయ్య (ఉద్భటయ్య) | 7-517 |
| ఉపాద్దేలయ్య (ఉపాధ్యాయులయ్య) | 7-494 |
| కజ్జాంబు (కార్యంబు) | 4-250, 6-457 |
| ఘడి సాసి (ఘటశాసి) | 7-512 |
| చదురుండు (చతురుఁడు) | 5-334 |
| చపుదంతి తిలకంబు (చతుర్దంతి తిలకము) | 7-556 |
| చోద్దెము( చోద్యము) | 3-185, 4-235 |
| చౌదళము (చతుర్దళము) | 3-208 |
| జాత్ర (యాత్ర) | 3-162 |
| త్రేదులవారిల్లు (త్రివేదులవారిల్లు) | 7-150 |
| దట్టుఁడు (దక్షుఁడు) | 3-152, 7-532, 7-552 |
| దోరసముద్రము (ద్వారసముద్రము) | 6-484 |
| ధర్మపురులు (పము)? | 7-513 |
| నిజ్జీవి (నిర్జీవి) | 3-163 |
| పత్తిరి (పత్రము) | 5-392 |
| పదుమరుసు (పద్మరసు) | 7-537 |
| పరిసెనము (స్పర్శనము) | 2-104 |
| పాసెంబు (పాయసము) | 3-162, 3-186 |
| బగితి (భక్తి) | 4-302, 7-564 |
| బగుతుఁడు (భక్తుఁడు) | 3-124, 3-185 |
| బగుతులు (భక్తులు) | 1-51, 5-378 |
| బత్తుండు (భక్తుండు) | 4-234 |
| బత్తులు (భక్తులు) | 7-532 |

| | |
|---|---|
| బమ్మయ్య (బ్రహ్మయ్య) | 4-250 |
| బుద్దులు (బుద్ధులు) | 4-328 |
| భాగవాడ (భాగవాది) | 2-68 |
| మంతరకాటుక (మంత్రకజ్జలము) | 5-362 |
| (బెజ్జ) మహదేవి (మహాదేవి) | 3-151 |
| మాలకరి (మాలాకారుఁడు) | 2-103 |
| మిసిమింతుఁడు (విస్మితుఁడు) | 6-423 |
| రూడి (రూఢి) | 1-27, 2-102 |
| రూడిమై (రూఢిమై) | 6-441 |
| వసది (వసతి) | 6-401 |
| వాలుమీకి దేవదేవుం (వాల్మీకి దేవ దేవుండు) | 4-301 |
| వాలుమీకేశుఁడు (వాల్మీకేశుఁడు) | 4-300, 4-303 |
| విద్దెలు (విద్యలు) | 7-503, 7-508 |
| విస్సయ్య (విశ్వనాధయ్య) | 4-537 |
| సంబుండు (శంభుండు) | 4-302 |
| సరణార్తి (శరణార్థి) | 4-364 |
| సిరాళ దేవయ్య (సిరియాళ దేవయ్య) | 7-550 |
| సిరిగిరి (శ్రీగిరి) | 3-182 |
| సిరిమహాదేవుఁడు (శ్రీమహాదేవుఁడు) | 3-182 |
| సోమాదులు (సోమయాజులు) | 7-494 |

## పండితారాధ్య చరిత్రము

| | |
|---|---|
| ఉద్దెసించు (ఉద్దేశించు) | 1-140 |
| కామయగ్గెన (కామ యజ్ఞన్న) | 1-121 |

| | |
|---|---|
| ప్రబ్బుతనాధ (పర్వతనాథ) | 1-262 |
| ప్రబ్బుతనాధునికొడుక (పర్వతనాధునికొడుక) | 1-300 |
| బక్తురాలు (భక్తురాలు) | 1-149 |
| మంహాణుండు (మల్లణుండు) | 1-411 |
| కొగ్గెన్న (యజ్ఞన్న) | 1-120 |
| శరణార్త (శరణార్థి) | 1-118 |
| సుగ్గుండు (సుగుణుండు) | 1-168 |

## ౯. సమాసములు

సమాసకల్పనమునం గూడం బాల్కురికి సోమనాధుండు దేశీయతను బాటించి యున్నాండు. కేవలసంస్కృతశబ్దములకు దేశ్యశబ్దములతో సమాసము కూర్చుట 'వైరిసమాసము' అనుకావ్యదోషముగాం గర్ణాటాంధ్రలాక్షణికులు గణించిరి. క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్దమునందు నృపతుంగుం డను నామాంతరము గల యమోఘవర్షుం డనురాష్ట్రకూటచక్రవర్తి కన్నడమునం గవిరాజమార్గమను నొకలక్షణగ్రంథమును రచించెను. సంస్కృతపదములను గన్నడభాషలో నెట్లు వాడ వలెనో, యెట్టి రూపములను దేశభాషాపదములతోం గలిపివాడ రాదో నిర్ణయించుచు నృపతుంగుం డాగ్రంథమునం గన్నడభాషా ప్రయోగమున కొక వ్యవస్థ కల్పించెను. ఆనిర్ణయము ననుసరించియే తరువాతం బంపాదులు కన్నడమునం గావ్యరచనముం గావించిరి. అహరహః, ఉచ్చైః, నీచైః, ముహుర్ముహుః, ఇతస్తతః, అంతః, బహిః మొదలగు సంస్కృతావ్యయములను గన్నడమునం బ్రయోగింపం గూడదు. అట్లు చేసినచో గరడియు, మద్దెలయుం గలిపి వాయించినప్పుడు గలుగు జర్జరధ్వనిం బోలి యుండును. 'బహిరంతరుపవనంగళొళహరహ మాపరభృతంగ ళులివరడంగల్' అని చెప్పం గూడదు. 'బహిరుద్యానాంతరదొళ్ సహసోదితమత్తకోకిలోచ్చైర్ధ్వానం' అని సంస్కృతసమాసములుగాం జేసియే చెప్పవలయునంట. అరిసమాసములను బ్రయోగింప రాదని తెలుపుచు 'అరసకుమారం, అయుత తరకదెగణ్ణం' అనురీతిం గూర్చ రా దనియు 'నరపతితనయుం, అయుతపుం నాపాంగం'

అనువిధమున మాత్రమే ప్రయోగింప వలయు ననియుం దన కవిరాజమార్గమున నిట్లు తెలిపి యున్నాఁడు. చూడుఁడు:

**అరిసమాసదోషప్రకారం:**

కII తటిసందా సక్కదముమ
సటియుదె కన్నడముపుల సమాసోక్తిగళొళ్
కుటిలతు బెరసిదొడె విరసం
మఱుగున పొల్గళెయ పనిగళం బెరసిపవోల్. 58

**అరిసమాసదోషలక్ష్యం:**

కII అరసుకుమారన నాయత
తరకడె గణ్ణుం (దె నోడి) కెళదిసమేతం
పరిగతనగెయుం దిర్దెం
గురునాణ్భతదింద మెఱగి ముఖ (దా) వరెయుం. 59

**సమాసనిర్దోషలక్ష్యం :**

కII నరపతి తనయున నాయత
తరళాపాంగదొళె నోది కెళెదియ రొడనాం
పరిగతహాస్యదొళిర్దిం
గురులజ్జాభరది సెఱగి ముఖసరసిజమం. 60

కII ఎందింతు సమాసోక్తియొ
ళొందాగిరె సక్కదంగళుం కన్నడముం
సుందరమక్కుం కవిపద
మొందిదవోర్ కనకరచనయొళ్ మణినికరం.

ప్రదమ పరిచ్ఛేదము - దోషాదోషానువర్ణన నిర్ణయాము:

ఇట్లీవిషయమై యొక వ్యవస్థ కల్పించుట కాకాలముననే ... దట్టివికృతసమాసకల్పనము లుండి యుండవలయును ... నీరీతి సమాసకల్పనము ... [illegible]

[illegible]

క: దినకరకొడుకునకును సరి
యనిమిషమొదవునకు సాటి యని యిబ్బంగిన్
దెనిఁగింప సంస్కృతములు
దెనుఁగులు సంధించి రేనిఁ దెగడుదు రార్యుల్.

ఆంధ్రభాషా. 131 పద్యము.

తెలుఁగునఁ గూడ నట్టి వైరిసమాసములకల్పనము జనవ్యవహారము నందును, శాసనభాషయందును నుండి యుండుటచేతనే కేతన యట్టి వ్యవస్థ సొందదానిఁ గల్పించు నావశ్యక మేర్పడి యుండును. కేతనకుఁ బూర్వము వెలసిన నన్నెచోడ, పాల్కురికి సోమనాథులకావ్యజాతములందలి యట్టి ప్రయోగములు కూడ వ్యవహారములో నవి యున్నను గావ్యభాషలో మాత్ర మవి పనికి రాదని తెలుపవలసిన యావశ్యకము నాతనికిఁ గల్పించి యుండును. నన్నయకుఁ బూర్వకాలపు శాసనములలోను, నన్నయ కాలపుశాసనములలోను గూడ నీరీతి సమాసముల ప్రయోగము కానవచ్చుట యాయా కాలములందలి జనవ్యవహారములో నట్టిసమాసములు ప్రయుక్తము లగుచుండె ననుటను రూఢిపఱుచుచున్నది. ఈక్రిందిశాసనప్రయోగములు చూడుఁడు:

| | |
|---|---|
| త్రిపువణసింగంబు (త్రిభువనసింహము) | |
| చెయ్యేటి యొడ్డున | పాంటూరు శాసనము |
| అరివరజమున్ను | బూడిదగడ్డపల్లి శాసనము |
| సాసన బిదిగల్లు | కొసినేపల్లి S.I.I. Vol. X. 598 |
| అపిమనగొరవలు | బికిరాజుశాస. సం. 594 అభిమానగౌరవములు |
| అతిశయదట్టగుల్లు | విక్రమ చోళుని చిలుకూరుశాసనము. |
| త్రిరోణమణువు | No. C.P. 13 |
| నిడుంగటటటాకః | రెండవజయసింహుని వెణుకపట్టు శాసనము. |
| స్థాపితశిలాగుణ్ణ సీమ | అమ్మరాజు నమ్మూరుదానశాసనము |

ఇట్లే నన్నయకాలమునాఁటి శాసనములలోను నిట్టి వైరిసమాసములు కొన్ని కానవచ్చుచున్నవి. చూడుఁడు:

| | |
|---|---|
| ుడవత్తిక్ దివియ | (S.I.I IV 12, 13) |
| యకాంపులు | ( ,, 737 ) |
| ుపాల | ( ,, 65 ) |
| గంగ పేణ్ణి | ( ,, V 1038 ) |
| మానెండు | ( ,, V 63 ) |
| ాదణ్ణదివియ | (S.I.I. IV) |
| ిఅముదునకు | ( ,, V 66 ) |
| ్మడి భీమతూము | ( ,, V 65 ) |
| ుమాఱు | ( ,, IV 1015) |
| వదివియ | ( ,, IV ) |

ాసనములయందలి యీ ప్రయోగములనుబట్టి యిట్టి వైరిసమాసము ున జనవ్యవహారమునందుఁ బ్రాచుర్యము వహించియుండెనని ుసను. ఆనాఁటి శిష్టజనవ్యవహారము ననుసరించి కాఁబోలు నివి లయాదరమును గూడఁ బడసి యెడనెడఁ దత్కృతులయందుఁ ము లగుచు వచ్చినవి. నన్నయభారత మునందుఁ గూడ కలికంఠుఁడు, ష్టము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు అను ాసములు - లాక్షణికులదృష్టిలోఁ - గాన నగును. కాని ాక్షణికత్వమును దొలఁగించుటకై కొందఱు వైయాకరణులు ుపక పోలేదు. నన్నెచోడునికుమారసంభవములో నీరీతి సమాసములు లోకంటె నధికముగాఁ గలవు. పాల్కురికి సోమనాథుఁడు తన ుణ, పండితారాధ్యచరిత్రములలో నన్నెచోడునికంటెఁ గూడ నధికముగా ాసములను బ్రయోగించి యున్నాఁడు. తనకాలమునందు వహారమున నున్నయీరీతిసమాసముల బహుళ్యమే యాతని నట్టి ల్పనములకుఁ బ్రోత్సహించి యుండుననని భావింపనగును. ఈ ున శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు సోమనాధుని యలాక్షణికత్వమును లిపిన యీ క్రిందివాక్యముల నిట స్మరింపఁదగి యున్నది.

'నన్నయ' కఱకంఠుఁడు ప్రయోగింపఁగా తరువాతివారు తమకాలము లోని పుడమీశుఁడు, దీపకంభవములు, చౌదళాబ్జములు మొదలగువానిని బ్రయోగించినారు. ఒకదానిని లాక్షణిక మని సమర్థింప జూచుట, తక్కినవాని నలాక్షణికము లనుట యెట్లు పొసగును? మనకిప్పుడు అంత పరిపాటిలో లేక వికృతములుగా గనబడు రూపములను అభిలషణము, అనుజ్ఞానము, పాదనము, ప్రస్తవము, అవకర్ణించుట (దుర్యోధను) దూషించుట (విఘాతించు అను అర్థములో), ధారుణి, ఉపలంభించుట, మహాత్మత మొదలగువానిని నన్నయ ప్రయోగించినాడు. అతని జాతీయము, కారకము – ఇప్పుడు మన కర్థమగుటయే కష్టమగుచున్నది. కాని, అతనిని లాక్షణికునిగనే గ్రహించి, అట్లే తమకాలములో శిష్టుల వ్యవహారములోనే యుండుటచే గాబోలు నన్నెచోడాదులు ప్రయోగించిన సాన్నిధ్యత, మహదేవి, అలంకారించు, ఉత్సాహించు, రండ, పొండ, కన్న్వ, తర్గు, కుర్య – అను రూపములను, అట్లే భక్తులిండ్లు, కలిగుండు వంటి సంధులు మొదలగువానిని అలాక్షణికము లనుటలో న్యాయమే మున్నది?....కావున తొలికవుల కావ్యభాషను ఆయాకాలములందలి శాసనాదులందలి భాషలో బోల్చి సరిచూచి దానికి ప్రత్యేకలక్షణముల నేర్పరచుకొనవలసినదే గాని ఒకదానిని బట్టి మరియొకరిభాషయలాక్షణికమని యనుకొనుట యుక్తము కాదు.[౧]

కనుక సోమనాథుని గ్రంథములయందుఁ గాననగు కొన్ని సమాసముల ప్రయోగ మాతని నియమోల్లంఘనశీలమును వ్యక్తము చేయు ననుటకన్న నాకాలము నాఁటి వ్యవహారభాషలో జనుల ట్టి సమాసములను బ్రయోగించెడివా రనియుఁ, దదనురోధముననే సోమనాథుఁడును వ్యవహారభాషాసన్నిహిత మగుభాషలోఁ గావ్యరచనము గావించి, భాషావిషయమున దేశీయతను సాధింపఁ దలఁచినవాఁ డగుట నాయహాప్రయోగముల నట్లట్లే ప్రయోగించి యుండుననియు భావింప దగును. తనకాలముచఁ బ్రజలు తమదైనందిన వ్యవహారమునందుఁ గల్పించుకొనుచుండిన సమాసములపద్ధతిలోనే యాతఁడును గొన్ని సమాసములను – వైరిసమాసములను, సలాక్షణికము లగు మిశ్రసమాసములను గల్పించుకొనియుఁ బ్రయోగించి యుండవచ్చును. మొత్తముమీఁద నాతఁడు చేసిన కొన్ని సమాసములప్రయోగ మాతనికివ్యవహార

౧. చూ. పాల్కురికి సోమనాథునిభాష : శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు : పరిశోధన : ఆగస్టు – నవంబరు *1955* (పాల్కురికి సోమనాథ సంచిక.)

భాషా సన్నిహిత మయినభాషా ప్రయోగమునందుఁ గలమక్కువను దెలియఁ జేయును. అతనిగ్రంథములలోని యిట్టి సమాసముల నకారాదిగాఁ గూర్చి రెండు పట్టికలక్రింద నీ దిగువఁ బ్రదర్శింపఁ బడుచున్నవి.

## వైరి సమాసములు

**బసవపురాణము :**

| | |
|---|---|
| అభిమానకత్తె | 5-366 |
| అర్ఘ్య పణ్యముల్ | 3-139 |
| ఉరుగజ్జియలు | 1-29, 7-505 |
| కంభకట్లు | 3-104 |
| కనకదండె | 6-142 |
| కిన్నర బమ్మయ | 5-331 |
| కులనాపకుఁడు | 1-43 |
| జగదేవతండె | 7-550 |
| జలదారి | 7-525 |
| దీపకంభములు | 1-12 |
| ధర్మకవిలె | 4-328 |
| నిజలింగచిక్కదేవయ్య | 7-538 |
| నిత్యనేమము | 2-100, 4-268, 4-314 |
| నిత్యపడి | 3-126, 4-300, 5-352 |
| పరమనావమ్మ | 4-298 |
| ప్రతిజోకలు | 2-67 |
| బహురూపు | 1-44 |
| బహురూపులు | 4-280 |
| భక్తకూటువలు | 4-289 |
| భక్త బండారి | 1-12, 2-75 |
| భాగవాడ | 2-68 |
| భూరికోటారి | 2-106 |
| మంగళారతులు | 2-65, 2-84, 2-104 |
| మజ్జన బావి | 6-421 |
| మర్మమేలం | 4-310 |
| మలయజనిరి | 3-128 |
| ముగ్ధమిండఁడు | 3-134 |
| ముగ్ధసంగయ్య | 3-132 |
| మేఘువన్నె | 3-128 |
| శివమరులు | 1-50, 2-107 |
| శివముద్దుదేవుండు | 7-537 |
| శివలెంక | 6-467 |
| శూలకుట్టు | 6-405 |
| సకలేశ్వరమాదిరాజయ్య | 3-206 |
| సమకట్టు | 3-137 |
| సర్వాంగ కచ్చడము | 3-137, 3-143 |
| సాంఖ్య తొండఁడు | 6-422 |
| షోడశపండువు | 3-162 |

# సంధి విధానము

కావ్య భాషలో సంధి విధానమునకు నియత ప్రవృత్తి కలదు. వ్యవహార భాషలో సంధివిధానమున కిట్టి నియత ప్రవృత్తి లేదు. అది సాధారణముగా వక్తృవివక్షాధీనమై యుండును. ఈ విషయము మనకు శాసన లేఖనముల వలనను, గావ్య భాషకు భిన్నముగా వ్యవహార భాషలో రచితము లయిన ప్రాచీన రచనముల వలనను స్పష్టమగుచున్నది. నేఁటి కాలమునఁ గూడ వ్యావహారిక భాషా రచనములందీ సంధి విధానము నియత ప్రవృత్తి లేకయే ప్రవర్తిల్లుచుండుట కాననగును, మార్గకవుల కావ్యప్రయోగములకును, దదాధారమునఁ జేయఁబడిన వైయాకరణుల యనుశాసనమునకును భిన్నములయిన సంధిరూపములు పెక్కు పాల్కుఱికి సోమనాథుని గ్రంథములయందుఁ గానవచ్చుచున్నవి. అవి యెల్ల నాతని వ్యాకరణ శాస్త్రానభిజ్ఞతను, సంప్రదాయానుసరణ, వైముఖ్యమును వెల్లడించునని మనము తలంపరాదు. అట్టి సంధిరూపము లన్నియు సోమనాథునికి సమకాలము నాఁటి వ్యావహారిక భాషాస్వరూపమును బ్రదర్శించు వానిఁగానేమనవము భావింపవలసి యున్నది. సంధివిధానమునందాతఁడు ప్రదర్శించిన దేశీయత యెట్టిదో యెఱుఁగుట కాతఁడు తన గ్రంథమునందుఁ జేసిన వివిధ సంధిరూపముల నెల్ల నొక్కచోఁ గ్రోడీకరించుకొని పరిశీలింపవలసి యున్నది. మార్గకవుల కావ్య ప్రయోగములకు భిన్నముగా నాతని గ్రంథములయందుఁ గానవచ్చు సంధిరూపము లన్నియు దేశి భాషాప్రయోగము నందభినివేశము కల సోమనాథునికి సమకాలమునందలి శాసనముల యందును, వ్యవహార భాషయందును గానవగు సంధి విధానము యొక్క ప్రభావముచేఁ గావింపఁబడినవని మనము తలంపఁదగును. బసవపురాణమునను, పండితారాధ్య చరిత్రమునను నాతని సంధివిధానమునకు సంబంధించిన రూపము లెల్లఁ బ్రత్యేకవర్గములక్రింద విభాగింపఁబడి యిటఁ బ్రదర్శింపఁబడును. ఈ సందర్భమున శివశ్రీ బండారు తమ్మయ్య గారు తమ 'పాల కుఱికి సోమనాథకవి' యను గ్రంథమునందు వ్రాసిన యీ క్రింది వాక్యముల నిట ననుసంధించు కొనఁదగి యున్నవి. చూడుడు:

'ఏతెంచారగించె', 'కలిగున్న దనుచు' మొదలయిన క్త్వార్థకేకార సంధులు, వెండీల్గువారు, కంచేడు వాడలు, వావెఱుంగని, మున్నగు ఇకార సంధులు, సత్య మాహేశ్వరు లిండ్ల, జినభక్తులిండ్లు, బడుగులాదరువ మున్నగు షష్ఠీ సమాసాకార

సంధులు, కంతుసంహరుకైన, కరికాలవోడుకు వంటి కువష్ఠికి ముందలి నుగాగమ లోపములు సోమనాథుని గ్రంథములలోఁ బెక్కులు కానవగును. ఇట్టివి యితరప్రామాణిక కవుల కృతులలోఁ గూడ ననేకములుగఁ గన వచ్చును. కావున నిట్టి వానికి సోమనాథుని కృతుల యందే విశిష్టత చూప నవసరము లేదు. అసాధారణములే యని ప్రాచీన శాసనములను బట్టియు, గ్రంథములను బట్టియు నిర్ణయింప నగును. సోమనాథునిఁ జూచి యేమి, తత్పూర్వ కవుల ప్రయోగముల ననుసరించి యేమి యితర భావికవులు గూడ నట్టి వానిని దమ కృతులలో వాడి యున్నప్పుడు వాని వైశిష్ట్యమును బ్రత్యేకముగ సోమనాథాది శివకవుల కృతుల యెడనే నిర్ణయింప రాదని నా యభిప్రాయము

ఈ వాక్యములు కూడ సోమనాథుని గ్రంథములలోని యసాధారణ సంధిప్రయోగములు వ్యవహారానుగుణముగాఁ జేయఁబడి యుండు నను విషయమును సూచించుచున్నవి. ఇప్పుడాతని యుభయ గ్రంథముల యందలి సంధి విధానమును సమగ్రముగాఁ బరిశీలింతము.

## బసవపురాణము

**అకార సంధి:**

| | |
|---|---|
| ఓలాడుచు | 1-4 |
| అల్లాడక | 1-20 |
| నేలెల్ల | 1-54 |
| వెల్లెల్లులు | 2-66 |
| పొట్టార | 2-97 |
| కడవెత్తుమాడికి | 2-107 |
| ఒక్కయ్య | 3-126 |
| ఒక్కయ్య | 3-135 |
| (త్రావ) ఏ లిచ్చు | 3-146 |
| చలుపుచున్నెడను | 3-149 |
| ఏ లిచ్చు | 3-152 |
| నీడై | 3-225 |
| కా యగుఁ గాక | 3-228 |
| కల్లచ్చులు | 4-238 |
| పదుమూఁడ వేఁటి | 4-298 |
| ఒక్కనుమానంబు | 4-314 |
| ఎంతర్థమైనను | 4-323 |
| బొబ్బిడు | 6-403 |

**(2) క్రియావిశేషణములమీఁద:**

| | |
|---|---|
| కట్టినలవు | 2-72 |
| దాఁచినచ్చోట | 4-322 |
| పాతినర్థంబు | 5-353 |

(3) స్త్రీవాచకములమీఁద:

ఇండె దేకవ్వ ఖండదీపంబువాఁడుగా 2-103

దుగ్గళవ్వనియె 4-259

(4) సంజ్ఞావాచకములమీఁద:

మారుడిగసుపురి 6-440

నావిందెగనుపురంబు 6-459

(5) ఆర్యార్థకశబ్దముపరమయినపుడు:

మల్లికార్జునయ్య గారు 3-223

(6) షష్ఠీ బహువచనాకారముమీఁద:

కులపర్వతంబులలతలు 2-91

సత్యమాహేశ్వరులిండ్లు 2-102

వెదురుఁ బ్రాలోగిరములు 3-183

బడగులాదరువ 4-264

హర భక్తులిండ్లకు 4-267

గతిహీనులిండ్లకు 4-267

మా భక్తు లెడకు 4-293

తల్పులండకు 4-303

రాజనంబు ప్రాలోగిరము 4-316

ఇతరులిండ్లైన 5-362

వేల్పులొడయుడు 6-401

పరవాదు లమమతంబునను 6-48

పరదైవంబు లిండ్లిండ్లకడకు 6-462

భక్తులింటి కుక్కలు 7-499

కులహీను లెంగిళ్లు 7-507

మృడు భక్తులిండ్లు 7-511

పంద్రెండు వేలేండ్లు 7-519

హరభక్తులిండులు 7-525

వీర మహేశ్వరులిండ్లు 7-544

భక్తులొద్ద 7-569

(7) సంబోధనాంతముల మీఁద:

అమ్మలారక్కలారని 5-348

జైనులా రెన్నఁడు 6-435

ఓడులా రేటికి 7-509

(8) ఎక్కడ దేవరో 2-75

## ఇకార సంధి:

(1) అబార్థకశబ్దము పరమయినపుడు:

శ్రియాదేవియమ్మ 1-ఇ3

(2) కుయ్యాలించుభాతి 1-39

తోడెలుకులు 3-180

కాకలుపులకు 4-237

చాకి చాకని 4-237

అనతీఁదగునె 4-270

కంచేడువాడలు 4-275

చెయ్యాడదు 4-278

చిలుతొండనతివ 4-295

నంబెన్న 4-301

వెయ్యేఁడులు 7-581

**(4) క్త్వార్థకేకారసంధి:**



**(5) సంబోధనాంతముమీఁదః**



## ఉకారసంధి

(2) కూడడుకులు

జిల్లేడాకులు

(3) తనదునఖిలరాజ్యము

(ఇట్టి నుగాగమప్రయోగ మితర స్థలములఁగానరాదు)

(4) తద్ధర్మార్థకవిశేషణముల మీఁద:

పదమూఁడ వేటి

| | |
|---|---|
| కొల్చు తగసంఘములు | 3-220 |

## ఎకార సంధి

| | |
|---|---|
| పన్నెక్కుఁ గాదె | 4-257 |

## పుంప్వా దేశ సంధి

| | |
|---|---|
| శీలపుఁజాలు | 1-31 |
| భసితంపు నెఱపూఁత | 1-50 |
| నిక్కంపు భక్తి | 1-56 |
| నిక్కంపు భక్తి | 2-76 |
| పట్టంపు దేవి | 3-127 |
| పట్టంపుదేవి | 3-127 |
| గహనంపుదుర్భిక్షకాలము | 3-130 |
| సన్నంపు జడలు | 3-136 |
| కనకంపుగుల్మముల్....ఇత్యాది | 3-216 |
| భసితంపుగిరి | 3-222 |
| పాపపుగొల్ల | 3-226 |
| కుటిలంపు నతులు | 4-254 |
| గుజ్జపు గాడిదల్ | 4-254 |
| ఏటంపుసంపదలు | 4-265 |
| నామ్యపుఘంటలు | 4-274 |
| అందంపు సంబవులు | 4-300 |
| మానంపు గుడి | 4-306 |
| శూన్యంపుగొల్ల | 5-335 |
| కన్నంపుముట్లు | 5-363 |
| కన్నంపుముట్లులు | 5-367 |
| కృతకంపుశవము | 5-282 |

(2) పుంప్వాదేశము చేయని స్థలములు:

| | |
|---|---|
| శీలంబు భక్తులు | 1-11 |
| కర్మంబు త్రాళ్లు | 1-41 |
| కులముపురులు | 1-43 |
| ధీరంబుకట్టు | 2-72 |
| గంభీరంబుతిట్టు | 2-72 |
| వైరాగ్యంబుపెంట | 2-72 |
| సత్యంబుకలను | 2-72 |
| ప్రసాదంబుకొలను | 2-72 |
| కృత్యంబుతాప | 2-72 |
| నాదంబు క్రోలు | 2-72 |
| సమ్మోదంబు కీలు | 2-72 |
| వినయంబు తేట | 2-72 |
| సత్త్వంబు తిఁగ | 2-72 |
| మహత్త్వంబు చేఁగ | 2-72 |
| సత్త్వంబు వెన్ను | 2-72 |

అస్థానంబుచెన్ను 2-72
పహొత్రంబుపడువునను 2-83
తత్త్వంబువాని 2-84
ప్రసాదంబు బసర..ఇత్యాది 2-86
తోరంబుగణములు 2-92
జలకంబువాఁడు 2-103
ధూపంబువాఁడు 2-103
అడపంబువాఁడు 2-104
అంకంబువాఁడు 2-105
పాలమునక్కలు 3-125
క్షీరోదంబుపట్టు 3-128
రత్నంబుపట్టు 3-128
నేత్రంబుపట్టు 3-128
గుజరాష్ట్రంబుపట్టు 3-128
ప్రమధలోకంబుకన్యకయొ 3-133
అండజము పాన్పు 3-134
గురు సంప్రదాయంబువారు 3-137
అంగుష్ఠంబుమన్ను 3-154
తీగ దీపంబు పాలువు 3-171
అంత్యకాలంబువాఁడు 3-200
జ్ఞానంబు సొంపా...ఇత్యాది 3-206
ఆస్థానంబు జ్యోతి 4-232
గర్వంబు పెల్లు 4-328
మానంబు మనికి...ఇత్యాది 5-341
ప్రమథ వయము యుద్దు 5-348
పెసముకాఁక 6-467
రాష్ట్రంబు పాపము 7-492
అధ్యయనంబు సేఁత 7-502
అగ్రహారంబు భూసురులు 7-524

## టుగాగమ సంధి

(1) వినోదంపుటాటప్రాయము 1-40
నిక్కంపుటాఁకలి 3-161
హర్షంపు టెల్ల 5-341
పసపుటక్షతలు 5-375
సన్నపుటేడ్పు 6-419
సన్నపుటెముకలు 7-494
(2) ప్రక్కటెముకలు 7-494

## నుగాగమసంధి

(1) సుతునీగి 1-34
తనదు నఖిలరాజ్యము 2-64
బానసమునది 2-104
గుజ్జునోగిరము 3-162
ఆర్వ్నాఁబు నేఁదియేండ్లు 3-229
పట్టునాలవట్టము 4-306
....గదమునౌషధము 5-356
(2) కరమీగి 2-94
శివతత్త్వమనువు 2-95
సామజంబెదుర 4-244

## ద్విరుక్త టకారసంధి



## గసడదవాదేశము

## లోప సంధి

## స్వరలోప సంధి



## సుగాగమసంధి



## పాదేశసంధి

### ఆమ్రేడితసంధి



### రాగమసంధి



### మాగమసంధి



### పేర్వాదిసంధి



### త్రికసంధి



### అనుకరణ సంధి



### విసంధి



### విశేష సంధులు

# జి. పదజాలము

ఇతివృత్తము, ఛందస్సు, వర్ణనలు, రచనావిధానము ఇత్యాదు లన్నింటను దేశీయతను విశేషముగాఁ బాటించిన సోమనాథుని గ్రంథములలో దేశిపదజాలము విశేషముగాఁ గానవచ్చుటలో నాశ్చర్యము లేదు. సాధారణముగా మార్గకవులలోఁ దత్సమ పదజాలము హెచ్చుగా నుండును. అట్టి భాషాప్రయోగమునకు మార్గదర్శకుఁడు నన్నయభట్టారకుఁడు. సంస్కృతమహాభారతమును దెలుఁగులోని కనువదించుటకుఁ బూనుకొనిన యాతనిభాషలో సంస్కృతపద జాలమును, దద్రచనాసంప్రదాయములును దొరలుట యాశ్చర్యము కాదు. ఇంతియు కాక నన్నయకు సహజముగనే సంస్కృత శబ్దప్రయోగముపై మక్కువ యెక్కువగాఁ గనుపించును. నన్నయకుఁ దరువాత మహాభారతము నాంధ్రీకరించిన తిక్కనలో దేశిపదజాలము నన్నయ్యలోకంటె నెక్కువయే చేరినది. ఇందులకుఁ గారణములు రెండు. ఒకటి యామహాకవు లిరువురికిని నడుమ వెలసిన నన్నెచోడ, పాల్కురికి సోమనాథుల గ్రంథముల ప్రభావము. ఆంధ్రావళి మోదము బొరయునట్లుగా రచింతు నని యాతఁడు సంకల్పించుటలోని యుద్దేశ మదియే. తిక్కన తత్సమపదజాలమును వాడుచునే దేశితెలుఁగునందు విశేషాదరమును బ్రకటించెను. అదినుండియు నీ సంస్కృతాంధ్రపదములప్రయోగమువిషయమై యాయాకవీశ్వరుల కుఁ గొంత యభినివేశ మున్నట్లు కానుపించును. కొఱవి గోపరాజు తన సింహాసన ద్వాత్రింశికయందలి యవతారికలోఁ దా నెట్టిభాషకుఁ బ్రాధాన్య మిచ్చి తన కావ్యమును రచింపఁదలచెనో యీ క్రిందిపద్యమునందు వ్యక్తము చేసి యున్నాఁడు. చూడుఁడు:

*చ:* *తెనుఁగున దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందు లేదు, మె*
*త్తన, పస చాలదం(డ్రు, విశదంబుగ సంస్కృతశబ్దమూఁదఁ జె*
*ప్పిన నవి దర్భముం డ్లనుచుఁ బెట్టరు వీనుల, గావునన్ రుచుల్*
*దనరఁ దెనుంగు దేశియును దత్సమముం గలయంగఁ జెప్పెదన్.*

*సింహా. ప్రథమభా.* ***1–32*** *ప.*

నిర్వచనోత్తరరామాయణమునందుఁ దిక్కనయు, మహాభాగవతమునందు బమ్మెర పోతనామాత్యుఁడును దమకావ్యములందు బ్రయుక్తము కాఁదగిన

భాషాస్వరూపమును గూర్చి తమయభిప్రాయములను, నభినివేశమును వ్యక్తము చేసి యుండుట సాహిత్య పరులకెల్లరకును సువిదితము.

పాల్కుఱికి సోమనాథుఁడు పాండిత్యములో నితరమార్గకవుల కెందును దీసి పోవువాఁడు కాఁడు. సంస్కృతాంధ్రములు రెంటియందును నాతఁడు సిద్ధహస్తుఁడు. కాని, యతనికిదేశియందాదరము హెచ్చు. శైవమతవ్యాపనోద్దేశమే యాతని సర్వసాహిత్య సృష్టికిని లక్ష్యమును, నాదర్శమును నగుట కూడ నొకకారణ మ్మై యాతని యభిరుచిని మఱింతగా నుద్దీపింపఁ జేసి దేశిపదజాలమును విశేషముగా గ్రంథముల యందుఁ బ్రయోగింపఁ జేసినది. తన కవిత ప్రసన్నమై సర్వసామాన్యము కావలయునని – అనఁగా సర్వజనులకును సుబోధము కావలయు ననియు, శైవమతధర్మములు, ఆచారములు, సంప్రదాయములు మఱియు శైవమతావలంబకు లగు పురాతననూతన భక్తులచరిత్రములు సర్వజనులకును సువిదితము కావలయు ననియు నభిలషించి యాతఁడు తనకాలమున నిత్యవ్యవహారములోని పదజాలమును విశేషముగా సమాదరించి వాడుచునే తనరచనమును జాలవఱకు సాఁగించినాఁడు. అచ్చటచ్చట నతఁడు సంస్కృత పదజాలమును గూడ విశేషముగా వాడిన సందర్భములు లేకపోలేదు. అవి సన్నివేశముల లోని తీవ్రతనుబట్టియు, భావావేశమునుబట్టియు రచింపఁబడిన సందర్భములు. శైవ మతపారమ్యసిద్ధాంతమును బ్రతిష్ఠాపించుటకై యాతఁడు వేదములనుండియు, స్మృతి, శ్రుతి, పురాణేతిహాసాదులనుండియు నుద్ధరించినసందర్భములు కూడఁ గొన్ని సంస్కృత భూయిష్ఠము లయి యున్నవి. పండితారాధ్య చరిత్రమునందలి దీక్షాప్రకరణము నందును, వాదప్రకరణమునందును నిట్టిసందర్భములు విశేషముగాఁ గానవచ్చును.

తెలుఁగుదేశమునందుఁ జాళుక్యయుగములో సంస్కృతభాషకుఁ గల గౌరవప్రాభవములనుబట్టియుఁ, బ్రాహ్మణ్యమునుబట్టియుఁ దత్స్వరూపములే కవిత్వమున విశేషముగా వ్యాపించి దేశిపదజాలమును వెనుకకు నెట్టి వేసినది. ఆకాలము నందుఁబ్రాచీన మగుదేశిపదజాల మెంతో యంతరించి పోయినది. అట్లు పోయినదానిలోఁ గొంత మాత్రమే దేశిప్రవణతగల నన్నెచోడుని కుమారసంభవములోఁ గాన నగును. నన్నెచోడుఁడు దేశి కవిత్వోద్యమమును సుదూరమునుండియే లక్షించి యాయాదర్శమునకై

కొంత ప్రాకులాడినను నతఁడుందుఁ బూర్ణముగాఁ గృతార్థుఁడు కాఁజాలఁడయ్యెను. పాల్కుఱికి సోమన దేశిభాషోద్యమమునకు మూలస్తంభముగా నిలిచినవాఁడు. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు చెప్పినట్లు, ''అచ్చతెనుగుమాటలలో సోమనాథుడుపయోగించినన్ని పదములు మరి యే తెలుగుకవి న్ని ఉపయోగించ లేదు. ఇతడు వాడిన వందలకొద్దీ పదములు నిఘంటువులలోని కెక్కలేదు.''౧ సోమనాథుని బసవపురాణము, పండితారాధ్యచరిత్రము అనుగ్రంథముల నాధారముగాఁ జేసికొని మనకితరవిధముగాఁ దెలియ రాని దేశితెనుఁగు యొక్క స్వరూపమును గొంత యైనను గ్రహింప వచ్చును.

పాల్కుఱికి సోమనాథుని గ్రంథములలోని దేశిపదజాలమును గూర్చియు, నాదేశిపదజాలమునయొక్క వైలక్షణ్యమును గూర్చియు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, డాక్టరు చిలుకూరి నారాయణరావు, శివశ్రీ బండారు తమ్మయ్య, శ్రీ నిడుదవోలు వెంకటరావు మొదలగువిద్వాంసులు సోమనాథుని గ్రంథములకుఁ దాముగ్రాసిన పీఠికలలోఁ గొంతవఱకు విపులముగానే చర్చించి యున్నారు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు శబ్దవిశేషములు, ప్రాంతపలుకుబళ్లు అనుశీర్షికలక్రింద సోమనపదజాలమునుగూర్చి కొంత చర్చించిరి. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్యచరిత్రమునకుఁ దాము రచించినయుపోద్ఘాతమున సోమనాథుని భాష యనునధ్యాయములో పద జాలము, ఊఁతపదములు, ఆమ్రేడితము అనుశీర్షికలక్రింద దేశిపదజాలము యొక్క ప్రయోగవైలక్షణ్యమును బ్రదర్శించిరి. ఇది కాక వారు వయిగ్రంథము తుదిని పండితారాధ్యచరిత్రములోని యాచ్ఛికపదముల నెల్ల సంగ్రహించి, యకారాదిగాఁ గూర్చి యొకపట్టికరూపమున నొసఁగిరి. శివశ్రీ బండారు తమ్మయ్యగారు తమ 'పాలకుఱికి సోమనాథకవి' యనుగ్రంథములో 'ఛందోవ్యాకరణ -అసాధారణ ప్రయోగములు' అనునధ్యాయమునఁ గొంత వివర్శనము నెఱపిరి. ఇది కాక వారు శ్రీ వావిళ్లవారికై పరిష్కరించిన బసవపురాణము తుదిని 'కఠినపదములకు, సాంకేతికపదములకు అర్థవివరణము (Glossary)' అనుపేరుతోఁ గొన్నిదేశిపదములకు నర్థవివరణము గావించిరి. శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు ఆంధ్రగ్రంథమాలవారు ప్రకటించిన

౧. పండితారాధ్యచరితము – ఉపోద్ఘాతము : పుట *261*
డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు.

బసవపురాణము – ద్వితీయ ముద్రణమునకుఁ దాము వెలయించినపీఠికలో తద్భవపదములు, దేశిపదములు, కొన్ని పదములు – వాని యర్థములు అను శీర్షికలక్రింద నందలి దేశిపదజాలమునకు సంబంధించి కొంత కృషి సలిపిరి. ఇట్లు పయివిద్వాంసులు చేసిన పరిశ్రమము సోమనాథునిగ్రంథముల నన్నిటిని దృష్టిలోఁ బెట్టుకొని చేసినది కాక యొకపరిమితపరిధికి మాత్రమే లోఁబడి యసమగ్రముగా నున్నది. వారు వారు తాము పరిష్కరించుచున్నగ్రంథములనుగూర్చి మాత్రమే తెలుప వలసినవా రగుట నంతకు మించి యాతని గ్రంథములలోని దేశిపద జాలము నెల్ల సమీక్షించుట వారికిఁ గాఁబట్టనిపని యగుటలో దోషము లేదు. కాని, యాతఁడు తనగ్రంథములయందుఁ బ్రయోగించిన దేశిపదజాలమునెల్ల చర్చింప వలయు నన్నచో నాతనిగ్రంథముల కొక 'పదప్రయోగసూచిక' తయారు కావలసి యున్నది. అప్పుడు కాని యాతఁడు ప్రయోగించిన దేశిపదజాలము యొక్క వైలక్షణ్యమును, విస్తృతియు నెఱుఁగ రాదు. నిఘంటువులలోనికి నూతనముగా నెక్కవలసిన పదజాల మెంత యున్నదో బోధపడదు. ఆయాపదములకాతని ప్రయోగములనుబట్టి యెట్టియర్థములను జెప్పుకొన వలసియుండునో యవగతము కాదు. అట్టి పదప్రయోగసూచికను తయారుచేయుట యొక బృహత్ప్రయత్నమువలనఁ గాని సాధ్యముకానిపని. అట్టిసూచిక యొకటి లేని సందర్భమున నాతఁడు తనగ్రంథములయందుఁ బ్రయోగించిన పదజాలమునుగూర్చి కొన్ని సూత్రములను గల్పించుట యొక్కటే శరణ్య మయి యున్నది. పయి విద్వాంసుల పరిశ్రమము నాధారముగాఁ జేసికొని సోమనాథుని గ్రంథములను బరిశీలించి చూడఁగా నాతని పదజాలమును గూర్చి యీక్రింది విశేషములను వింగడించి చెప్ప వచ్చును.

౧. నేఁటి వ్యవహారమున లుప్తము లై బొత్తిగా నర్థముగాని శబ్దములు.

౨. దేశిపదజాలముగా గ్రహింపఁబడిన తద్భవరూపములు.

౩. శివకవులకావ్యములలోఁ దప్ప నితరప్రాచీనమార్గకవులరచనములందుఁ గానఁబడని విశేషరూపములు, దేశిపదజాలము, పలుకుబడులు. అనఁగా నిది నిత్యవ్యవహారములో నుండి మార్గకవులు గ్రహింపనివి యై శివకవులు మాత్రమే గ్రహించినవిగా నుండును. వ్యాకరణ రూపములకు సంబంధించిన విశేషములును నీవిభాగముక్రిందకే వచ్చును.

౪. నేఁడు రూపము మాఱి రూపాంతరము పొందిన శబ్దములు.

౫. అర్థవిపరిణామ మేర్పడినశబ్దములు.

౬. నేఁటి సామాన్యజనులవ్యవహారమునందుండి దేశిపదములని కొట్టి వచ్చినట్లు కనఁబడు శబ్దములు.

౭. సోమనాథునికాలమున వ్యవహారమునందుండినయన్యదేశ్యశబ్దములు.

౮. తమిళమునందును, గన్నడమునందును బ్రచురముగా నుండి తెలుఁగున నుత్పన్నము లయినశబ్దములు. వానియర్థాదికమాయాభాషలనుబట్టి తెలిసికొన వలసి యుండును.

౯. వీరశైవపరిభాషకు సంబంధించిన సాంకేతికశబ్దములు.

౧౦. ప్రాచీనశాసనభాషయందు మాత్రమే కానవచ్చునుఁ గావ్యవ్యవహారమునఁ గానరాని శబ్దములు.

ఇట్లుగా దశవిధముల వింగడింపఁదగిన యాతని దేశిపదజాలము యొక్క సమగ్ర స్వరూపము నాతని బసవపురాణ, పండితారాధ్యచరిత్రములనుబట్టి యెఱుఁగఁ దగును.

## హెచ్. సంజ్ఞా పదములు - దేశి

సోమనాథుని బసవపురాణమునందును, పండితారాధ్యచరిత్రమునందును సంజ్ఞాపదములు పదింబదిగాఁ గానవచ్చును. అందలి యితివృత్తములు పౌరాణికములు కాక చారిత్రకవ్యక్తులకు సంబంధించినవి. యగుటచేఁ బ్రధానేతివృత్తమునకు సంబంధించిన మనుజసంజ్ఞలు కొన్ని కాన వచ్చును. మఱియు నందుఁ బ్రసక్తానుప్రసక్తముగాఁ బెక్కురు పురాతననూతనభక్తుల చరిత్రములును నభివర్ణింపఁ బడినది. పురాణప్రసిద్ధులగు కొందఱు శివభక్తులు తప్ప నించుమించుగా వా రెల్లరును దక్షిణదేశమును దొక్కప్పుడు వర్ధిల్లినవారే. ఆభక్తులు కూడ భిన్నభిన్నజాతులకుఁ జెందినవారు. ఆయాయిభక్తుల చరిత్రముల నభివర్ణించుసందర్భముననను - వారిని స్తోత్రపాఠములలోను, నితరస్థలము లందును బేర్కొనుసందర్భములందును భక్తులపేళ్లు పెక్కుస్థలముల యందుఁ గానవచ్చును. ఇవి కాక సోమనాథుఁడు ఆ గ్రంథములలోని కొన్ని

ఘట్టములను వర్ణించుసందర్భమున నాయాసన్నివేశములను గన్నులకుఁ గట్టినట్లు చేసి సహజ మయినవాతావరణమును గల్పించి యథార్థభ్రమను గలిగించునుద్దేశముతో నావశ్యకము లగుపట్టులఁ గొందఱు వ్యక్తులను వారినామధేయములలోఁ బేర్కొనును. తనకు సమకాలమునందలి సమాజములోని వ్యక్తుల నామధేయములను - వానివంటివానిని నతఁ డందు నెలకొల్పె ననవచ్చును. అతని వృషాధిపశతకమునందును, బసవోదాహరణ పండితారాధ్యోదాహరణము లను లఘుకృతులందునుగూడఁ గొందఱుభక్తుల పేళ్లు ప్రస్తావింపఁ బడినవి. ఇట్లీమూఁడు కారణములచేతను సోమనాథుని గ్రంథములలోఁ బెక్కుమనుజసంజ్ఞలు పదింబదిగాఁ గానవచ్చుపరిస్థితి యేర్పడినది.

బసవపురాణకథానాయకుఁ డగుటబసవేశ్వరుఁడు పుట్టి వర్ధిల్లినది కర్ణాటకదేశము నందు. పండితారాధ్యచరిత్ర కథానాయకుఁ డగు మల్లికార్జున పండితారాధ్యుడు ఆంధ్ర దేశీయుఁడు. ఆంధ్రదేశమునందలి శ్రీశైలము వీరశైవులకుఁ బరమపవిత్ర మయిన యాత్రాస్థలము. అతని గ్రంథములయందు వర్ణింపఁబడిన పురాతననూతనభక్తులు చాల వఱకు దక్షిణదేశమునకుఁ జెందినవారే. కనుక నాతని ప్రధానగ్రంథము లగుబసవపురాణ పండితారాధ్య చరిత్రములయందుఁ బ్రసక్తము లయినన యాస్థలము లన్నియు దక్షిణదేశమునందలివై మన కత్యంతము సన్నిహితము లనుస్ఫూర్తి గలిగించును.

నన్నయాదు లగుమార్గకవులగ్రంథములు ప్రాయికముగాఁ బురాణ గ్రంథము లగుటవలన వారిగ్రంథములలోని సంజ్ఞాపదములును బౌరాణిక వ్యక్తులదే యయి యుండును. అం దభివర్ణింపఁబడిన స్థలములును భారతదేశములోనివే యయినను మార్గకావ్యసాధారణము లగు హస్తినా పురము,అయోధ్య, మగధ, మథుర, ద్వారక మొదలగు నుత్తరహిందూస్థానము నందలి స్థలములు. ఇట్లు సంజ్ఞాపదములవిషయమునఁ గూడ మార్గ సంప్రదాయమే యాగ్రంథములందు గోచరించును. దేశివాతావరణము మనకు వానియం దంతగాఁ గానరాదు. సోమనాథునికిఁ బూర్వము రచితము లయిన గ్రంథములలో నొక్క శివతత్త్వసారమున మాత్రమే యాయాశివభక్తుల చరితములను బేర్కొని స్తుతించుసందర్భమున దేశీయము లయినవారిపేళ్లు

వినవచ్చుచున్నవి. సోమనాథునికిఁ దరువాతికాలమునఁ గూడ నింత విస్తారముగా సంజ్ఞాపదములను గలిగినకావ్యము మఱొండు గానరాదు.

ప్రాచీనాంధ్రశాసనములలో నాసమకాలమునందలి స్త్రీపురుష నామములు, స్థలనామములు దానప్రస్తావనముల సందర్భముననను - సీమా న్నిర్ణయము చేయుసందర్భములందును గానవచ్చును. అదియు నొక్కొక్కశాసనము నందును రెండు మూఁడు చొప్పునఁ జాల స్వల్పముగనే యుండును. క్వాచిత్కముగాఁ గొన్నిశాసనముల యం దిట్టిపే ళ్లధికముగాఁ గానరావచ్చును. ఆ శాసనములందలి యానామధేయములనుబట్టి యాకాలమునందలి జను లెట్టి పేళ్లను గలిగి యుండెడివారో మన మూహింపవలసియున్నది. మనప్రాచీన కావ్యములయందుఁ గావ్యావతారికలలోని కృతికర్త, కృతి పతి వంశాభివర్ణనముల యందును - షష్ఠ్యంతములయందును - అశ్వాసాద్యంతపద్యములయందును - ఆశ్వాసాంతగద్యలలోను మనుజసంజ్ఞలును -స్థలనామములును గొన్ని గానవచ్చును. ఇంతకు మించి యాకావ్యములయందు మఱెచ్చటను నిట్టిసంజ్ఞలు కానవచ్చునవకాశము లేదు. ఇట్టిచో సోమనాథుఁడు ఒక్కచోటనే యిన్ని నామధేయములను - తనసమకాలమునందు జనవ్యవహారమున నున్నదానిని దనకావ్యములయందు నెలకొలిపి యావిషయమునఁ గూడఁ దన దేశీయాభిమానమును బ్రదర్శించినాఁడు. అందలి వ్యక్తులనామధేయములు మనతో ననుదినముఁజరించు వారిపేళ్లుగాఁ దోఁచుచుండుట చేతను - అందలిస్థలములు దక్షిణదేశమునందలి గ్రామములుగాఁ బురములుగా స్ఫురించు చుండుటచేతను - పురాణగ్రంథములను జదువునప్పటివలెఁ గాక - యొక యాత్మీయ భావమును బాఠకుఁడు పొంది తన్మూలమున రసానుభవము నందుట కీసంజ్ఞాపదములు మిక్కిలిగా నుపకరించుచున్నవి. అతని యుభయ గ్రంథములయందును లభించుచున్న సంజ్ఞాపదములను - పురుషులపేళ్లు, స్త్రీలపేళ్లు, స్థలములపేళ్లు అని మూఁడువిధములుగా విభజించి అకారాదిగాఁ గూర్చి పట్టికలరూపమున కూర్పవచ్చును. ఆ సంజ్ఞాపదములను బరిశీలించిన మీఁదట నీక్రింది యంశములు తేలుచున్నవి.

౧. సంస్కృతనామధేయములను గొందఱు పెట్టుకొనుచుండినను - నాకాల మున వివిధజాతులవారు - సంస్కృతాభిమాను లగు బ్రాహ్మణులు కూడ

– దేశీయములగుపేళ్లనే పెట్టుకొనుచుండిరి. పేళ్లచివర 'గారు' అను పూజ్యార్థవాచకము చేర్చు సంప్రదాయ మాకాలమునందే యుండినది. స్త్రీలకుఁ గూడఁ బూజ్యార్థమున 'గారు' వాడఁబడుచుండెను. ఉదా : కామలదేవిగారు. (2–85)

౨. ఇంటిపేరుతోఁ గలిసిన పేళ్లతో వ్యవహరించునాచార మానాఁడు కూడ నుండినది.

౩. స్త్రీలపేళ్లకుఁ జివర 'అమ్మ' యనుపదముకన్న 'అవ్వ' యనుపదమే యానాళ్లలోఁ బ్రచురమై యుండెను.

౪. ఆయావ్యక్తులు నివసించుచున్న ఊరు, వారి వంశపురుషులు నివసించుచుండిన యూరు, వంశపురుషుల పేరు, తండ్రిపేరు, బిరుదము, వ్యక్తిలోని వైలక్షణ్యము నాధారముగా నింటిపేరులు కల్పింపఁబడుచుండెను.

ఇట్లు, సోమనాథుఁడు తనగ్రంథములయందు సంజ్ఞాపదములను విస్తారముగాఁ బ్రయోగించి తనకు సమకాలమునాఁటి వ్యక్తులయొక్కయు, దక్షిణదేశమునందలి పెక్కు స్థలములయొక్కయు నామధేయములను దొలిసారిగా మన కెఱుకపఱుచుచున్నాఁడు. ఈవిషయమునఁ గూడ నతఁడు చూపిన దేశీయాభిమానము ప్రస్తుతిపాత్రము. మనుజుల పేళ్లు, ఇంటిపేర్లు, స్థలముల పేళ్లు అనువానినిగూర్చి పరిశోధింపఁ దలఁచువారికి శాసనముల తరువాత – కావ్యావతారికలతరువాత నీతని బసవపురాణమును, పండితారాధ్య చరిత్రమును మిక్కిలిగా నుపకరించునవనుటకు సందియము లేదు.

## ఐ. వాక్యరచనలో దేశి

"భరతఖండమున ప్రాకృతభాష యెంతో వివిధముగా, విస్తరముగా చాలా కాలము వెలసినది. సంస్కృతము గూడ దాని భేదములలో నొకటే. కాని సార్వజనీనముగా, సార్వకాలికముగా లోకప్రబోధమును గోరినమహనీయు లెందరో దానిని సంస్కరించిరి. అనఁగా దిక్కు కొకటిగా నున్న దానియనంత శబ్దరూపరాశిలో కొన్ని యెక్కువ వ్యాప్తిలో నున్నది మాత్రము పరిగ్రహించి, శాసించి తక్కినవానిని వదలి రన్నమాట. అది 'సంస్కృత' మాయెను. శాసకులు విడిచినరూపములను శిష్టులు వదలినను సామాన్యలోకము విడువలేదు.

సహజముగా దేశీదేశీ దినేదినే ఆశబ్ద ప్రవాహము జాతి, మతము, దేశము, వ్యక్తి మొదలయినవానిమూలమున పలుమార్పులు చెందినది. సందర్భానుగుణముగా ఎన్నో క్రొత్తశబ్దములు, పలుకుబడులును అందు కలసిపోయినవి. సంస్కృతశాస్త్ర మెంత ప్రబలముగా నున్నను ప్రజలవ్యవహార సిద్ధము లైనప్రాతశబ్దరూపము లెన్నో మరల సంస్కృతభాషలోనికి చొచ్చి వ్యాప్తికెక్కి నిలబడినవి.''

పూజ్యులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తమ 'గాథాసప్తశతి' పీఠికలో సంస్కృతప్రాకృతభాషల యుత్పత్తి వికాసములనుగూర్చి చెప్పినవాక్యము లివి. తెలుఁగు నందలి కావ్యభాషకును, వ్యావహారికభాషకును గూడ నివి చక్కఁగా నన్వయించును. వివిధమండలములలో, వివిధజాతులలో వాడుకయందుండు తెలుఁగునే తీర్చి దిద్ది కావ్య భాషోపయోగిగా సంస్కృతీకరింపఁబడినదే గ్రాంథిక భాష లేక కావ్యభాష. వ్యవహారవశమునఁ గావ్యభాషలోఁగూడ నొక్కొక్కప్పుడు వ్యావహారికరూపములు కొన్ని ప్రవేశించు చుండును. అసాధువు లయినను వానిని ననింద్యగ్రామ్యములుఁగాఁ బరిగ్రహింపఁదగునని లాక్షణికుల యాదేశము కూడఁ గలదు. వ్యావహారికభాషలోని వాక్యవిన్యాసవైఖరు లనంతములు. వానిలోఁ గొన్ని మాత్రమే కావ్యభాషలోని కెక్కినవి. కావ్య భాషలో వాక్యవిన్యాస మొక నిర్ణీతపద్ధతి (Set Pattern)లో నుండును. ఛందోఽనుగుణముగాఁ గొన్నిపదము లటునిటుగా సర్దుబాటు చేయఁబడినను మొత్తముమీఁద వాక్యవిన్యాసపద్ధతి మాత్రము లక్షణానురోధి యై మార్పు లేక యొకేపద్ధతిలో నుండును. తెలుఁగుపై సంస్కృతభాషాప్రభావ మధిక మగుటచేఁ గొంతవఱకుఁ గావ్యభాషావాక్యములు తద్భాషావ్యాకరణానుసారముగా నియమితములగుట కూడ సంభవించి యుండును. కాని, యిట్టివాక్యవిన్యాసములల్పము లనియే చెప్పఁదగును. వ్యావహారికభాషలోని పెక్కువాక్యవిన్యాసవైఖరులు గావ్యభాషలోని కెక్కలేదు. దానికిఁ గారణములు రెండు. ఒకటి నన్నయ తన భారతమునందుఁ బ్రచారమునకుఁ దెచ్చిన వాక్యవిన్యాసవైఖరులయొక్క ప్రభావము. ఆప్రభావముచేఁ దరువాతికవులు కూడ నట్టి విధముగానే వాక్యవిన్యాసములు గొంతవఱకుఁ గావ్యభాషకు నదుగక పోవుట. ఈ రెండుకారణములచేతను వ్యావహారికవాక్య విన్యాసరీతులు పెక్కు కావ్యభాషలోఁ గనిపించునవకాశము లేక పోయినది.

ఒక్క యుదాహరణము చూతము. వ్యావహారికభాషలో 'ఎన్నాళ్లైంది నిన్నుచూచి' అను నొకవాక్యము కలదు. ఈవాక్యమును జూచినవెంటనే భాషా వ్యాసంగము చేసిన విద్వాంసునికీవాక్యములోని 'ఐంది' అనుక్రియారూపము తప్పుగాఁ దోఁచును. కర్తృబహువచనముచే 'ఎన్నాళ్లైనవి' అని కదా యుండ వలయు ననుకొనును. కాని, సూక్ష్మముగాఁ బరిశీలించినప్పు డది తప్పు గా దనిపించును. అది వ్యావహారికవాక్యవిన్యాసవైఖరి. ఇట 'ఐంది' అనుక్రియకుఁ గర్త 'ఎన్నాళ్లు' అను పదము కాదు. చూచుట జరగి యనునర్థ మిచ్చు 'చూచి' యనుపదము నచట దానికర్తగా సంభావింప వలయును. అది తెలుఁగునకు విలక్షణము.

ఇట్లే, వ్యవహారములోని మఱొక వాక్యము చూడుఁడు. 'ఉత్తరాలు రాసి అయిందా?' ఈవాక్యములో ఉత్తరాలు అనుపదము బహువచనాంతమగుటచే అయిందా అని యుండ వలయునా? అయినదా యని యనవలయునా యను సందేహము పొడమును. కాని 'రాసి' అన్నక్త్వార్థకక్రియకు భావార్థము చెప్పుకొనఁగా నీవాక్యవిన్యాసము సాధువేయనుట స్ఫురించును. ఉత్తరాలు వ్రాయుట అయినదా అనునపుడు క్రియ యేకవచనాంతముగానేకదా యుండ వలయును. రాసి యని క్త్వార్థకరూపమన్నను క్రియ మాత్రము భావార్థమున కున్నట్లే యేకవచనాంత మయి యుండుట వ్యావహారికభాషలోఁ గాన వచ్చువిశేషము.

'అక్కడికి నేను పోక తప్ప లేదు' అనువాక్యమునఁ గూడ 'నేను' అనునది కర్తృపదము కాక 'పోక' యనునది కర్తృపదముగా గ్రహింపవలసియుండును. అప్పుడే 'లేదు' అను నవంహక్రియారూపదము సాధు వగును. ఇట్టి సూక్ష్మాంశములు వ్యావహారికభాషావాక్యవిన్యాసవైఖరులలోఁ బెక్కు గలవు. బాలవ్యాకర్త యపరిశీలితముగా 'ఏకవాక్యంబునం దొకానొక్కండు దక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగ బ్రయోగింప జను' అనునొక సూత్రమును దనవ్యాకరణగ్రంథంబునందుఁ గల్పించియుండెను. అది యాతఁ డిచ్చిన యా యొక్క వాక్యమునందు మాత్రమే సరిపడును గాని, యంతట నావద్ధతి వర్తింపదు. ఆ వాక్యములు గూడ నన్నియు నేకార్థకములు కాక, వివిధభావచ్ఛాయలను బ్రాధాన్యవివక్షను బట్టి యొసఁగఁజాలియుండుట కూడ గమనింపఁ దగి యున్నది. ఇట్టిచో తెలుఁగు వాక్యవిన్యాసములలోని వైచిత్రులను గుర్తించిన ప్రౌఢ వ్యాకర్త వాక్యపరిచ్ఛేదములోఁ గొన్ని విన్యాసములనుగూర్చి మాత్రము

తెలుపుటకుఁ బ్రయత్నించెను. కావ్యభాషలో కెక్కినవానిలోఁ గూడఁ గొన్నింటిని మాత్రమే యతఁడుఁ దెలుపఁ గలిగెను. కావ్యభాషలోనే మిగిలి పోయినవి, వ్యావహారికభాషాప్రయోగమునందలి వింకను బెక్కు గలవు.

'వివిధమాండలికాలమధ్య గాని, ప్రాచీనఅర్వాచీనభాషలమధ్య గాని పదజాలంలో కనిపించేటంత భేదం వాక్యరచనలో కనిపించదు. పదజాలంలో వచ్చినంత త్వరితంగానూ వాక్యరచనలో మార్పు రాదు. భాషలో పదజాలంకంటె ఎక్కువ స్థైర్యంగల అంశం వాక్యం.'౧

ఈ దృష్టితోఁ బరిశీలించినపుడు నన్నయకవిత్వములో విరళముగాను, నన్నెచోడునిలో నంతకంటెఁ గొంత యెక్కువగాను, సోమనాథునిలోను, తిక్కనలోను మిక్కిలి యెక్కువగాను నీవ్యావహారికవాక్యవిన్యాసవైఖరులు గోచరించును. నన్నయభారతములోని యీ క్రింది పద్య మిట్టి దానికి నిదర్శనముగా గ్రహింపఁ దగును.

*'వీరెవ్వరయ్య? ద్రుపదమ*
*హారాజులె?'* భార. అది. *6–89*

నన్నెచోడుని కుమారసంభవమునందలి యీ క్రింది పద్యమును చూడుఁడు:

*తల్లిదండ్రులఁ బూజించు తగ వెఱింగి*
*మన్నపొడ వైననే యత్తమామ లనియుఁ*
*బ్రియ మెఱుంగు, నం దిచ్చినబిడ్డ మనకుఁ*
*బానె నని యుండుఁ డింక నీవలుకు లేల? 2–*

'ఎన్నడైనా తల్లిదండ్రులను గౌరవించి ఉండిన పెద్దమనిషి అయిఉంటే అత్తమామలనూ గౌరవించాలని తెలిసి ఉండును. వాళ్లింట్లో బిడ్డను ఇచ్చాము. ఇక ఆమె మనది కాదు అనుకుందాం. అనవసరంగా విచారపడడం ఎందుకు?'

ఈవాక్యముల విన్యాసధోరణినే నన్నెచోడుఁ డాపద్యములోఁ గావ్యభాష యందు నిబంధించినాఁడు. సోమనాథుఁడు తన బసవపురాణ, పండితారాధ్య

౧. శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారి వ్యాసము: విశ్వనాథకవిత – వ్యావహారిక భాష: సాహిత్యసమితివ్యాసావళి: పుట 93 ప్రచురణ: సాహిత్య సమితి, తిరుపతి.

చరిత్రముల యందు సంభాషణాత్మకములుగా నిర్వహించిన స్థలములు దెక్కువగా నిట్టి చిత్రవిచిత్ర వాక్యవైఖరుల నెన్నిటినో కావ్యభాషలోనికిం దెచ్చి కృతార్థుం డయ్యెను. తిక్కన సోమయాజి కవిత్వమునందలి వివిధ వాక్యవిన్యాసవైఖరులకుం దన్మూలమున నాతఁడు తెచ్చిన తెనుఁగుతనపు సొంపులకు సోమనాథుని యిట్టి రచనములే యుద్బోధకములయి యుండు ననిపించును.

కవి కుపాదేయ మయినకవిత్వభాషనుగుఱించి యాధునికాంగ్లకవి Gerard Manley Hopkins అనునతఁడు తనమిత్రుఁ డయిన Robert Bridges కు వ్రాసిన యొకలేఖలో నిట్లు తెలుపును.

'It seems to me that the poetical language of the age should be the current language heightened, to any degree heightened and unlike it, but not (I mean normally, passing freaks and graces are another thing) an absolate one'[2]

'ఏకాలమునాటి కావ్యభాషయయినను వ్యావహారికభాషను సంస్కరించుట వలన రూపొంద వలయు నని నాకుఁదోఁచును. వ్యావహారిక మని పోలిక పట్ట లేనంత యెక్కువగా సంస్కరించినను దప్పులేదు. కాని, యది సర్వసాధారణముగా నరిగిపోయి వ్యవహారచ్యుత మయిన నాణెమువంటి ప్రాచీనభాషమాత్రము కారాదు – అని నా భావము. అక్కడక్కడఁ జెదురుగాఁ గనిపించునట్టి కవి చేయు కల్పనల సంగతి వేఱు' –

ఇందు Hopkins పేర్కొనిన Current Language అనునది వ్యావహారిక పదజాలమునకును, వాక్యరచనమునకును సంబంధించిన దనియు – Heightening అనుప్రక్రియవ్యాకరణరూపములకు సంబంధించిన దనియు మనము భావింపఁ దగును.

Hopkins కడచిన శతాబ్దములోఁ జెప్పిన సూత్రమును అంతకు నాఱువందల సంవత్సరములకుఁబూర్వమే యాచరణలోఁ బెట్టుటకు సోమనాథుఁడు ప్రయత్నించి కృతార్థుఁ డయ్యెననవచ్చును.

వాక్పతిరాజు అనుప్రాకృతకవి 'గోడవహో' (గౌడవధమ్) అనుప్రాకృత కావ్యమునందు సంస్కృతప్రాకృతముల తారతమ్యమును, బరస్పరసంబంధమును

---

*2. Letter LXII August, 14, 1879*

నిట్లు తన యువతారికాభాగమున మనోహరముగాఁ దెలిపి యున్నాఁడు. వాక్పతిరాజు క్రీస్తుశకము ఏడవశతాబ్దమునకుఁ జెందినవాఁడు. కాశ్మీర యశోవర్మ యాశ్రితులలోఁ బ్రముఖుఁడు.

'ఉమ్మిల్లు లా అణ్ణ
ఫ అ ల చ్ఛాయాఇ సక్క అ పయాణం
సక్కద సక్కారుక్కరిసణేణ
ప అ అ స్సవి పహో ఓ.'

దీనికి సంస్కృతచ్ఛాయ యిది:

'ఉన్మీలతి లావణ్యం
ప్రాకృతచ్ఛాయయా సంస్కృతవచసాం
సంస్కృతసంస్కారోత్కర్షణేన
ప్రాకృత స్యాపి ప్రభావః'

సంస్కృతమునఁ బ్రాకృతచ్ఛాయ యుండినచో దానికి లావణ్యము సిద్ధించును. సంస్కృతసంస్కారోత్కర్షముచేతఁ బ్రాకృతమునకుఁ బ్రభావము సిద్ధించును – అని పయిగాథ యభిప్రాయము.

కావ్యభాషవిషయమునఁ గూడ నిట్లే చెప్పుకొనఁ దగును. వ్యావహారిక వాక్యవిన్యాసవైఖరివలనఁ గావ్యభాషకొక లావణ్యము కలుగును. అట్లే కావ్యభాషా సంస్కారమువలన వ్యావహారికభాషకుఁ బ్రాభవము కలుగును – అని.

సోమనాథుఁడును, తిక్కనసోమయాజియు, నాధునికులలో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారును దమరచనలలో నిట్టి లావణ్యమునే సాధించుటకుఁ బ్రయత్నించిరి. అల్లసాని పెద్దన, నంది తిమ్మన, పింగళి సూరన్నల కావ్యములలోఁ గొన్ని ఘట్టములు లోకోత్తరములుగా నుండుటకు కీవాక్యవిన్యాసవైఖరులే కారణము. ఈ విషయమునఁ దిక్కనకు మనసోమనాథుఁడే మార్గదర్శకుఁ డయ్యె నని చెప్పినను దప్పుకాదు.

కో ఊహల (కౌతూహల) యనుప్రాకృతభాషాకవి రచించిన 'లీలావఇ' (లీలావతి) యనుకావ్యమున నీక్రింది గాథ[3] కలదు.

---

3. ఈగాథలయునికినిగూర్చి శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తెలిపిరి.

లలి ఏ మహు రక్ఖ-త ఏ
దువఈ జణవల్లహే ససింగారే
సంతే పావుదకవ్వే
కోసక్కదిసక్కదం పఢిఉం

దీనికి సంస్కృతచ్ఛాయ యిది:

లలితే మధురాక్షరే
యువతీజనవల్లభే స శృంగారే
సతి ప్రాకృతకావ్యే
క శ్శక్నోతి సంస్కృతం పఠితుం.

లలితము, మధురాక్షరము, యువతీజనవల్లభము, సశృంగారము నగు ప్రాకృతకావ్యముండఁగా సంస్కృతము నెవఁడు చదువ నిచ్ఛగించును? - అని దాని భావము.

సోమనాథుని గ్రంథములు, తిక్కన భారతము మనకు రుచించుటకుఁ గారణము గూడ నిదియే - వాక్యవిన్యాసములలో వారుదేశివైఖరులను బెక్కింటిని - వ్యవహారమున నున్నవానిని బ్రదర్శించి యుండుట. కాని సోమనాథుని గ్రంథములు మతప్రాధాన్యము కలవి యగుటచే - శైవేతరుల యశ్రద్ధచే - శైవుల కయినను మత దృష్టికాక భాషాదృష్టి యావంతయు లేక పోవుటచేవాక్యరచనలో నతఁడు నెలకొలిపిన దేశితనము ప్రచురము కాలేదు. బసవపురాణ, పండితారాధ్యచరిత్రములయందు వాక్య విన్యాసములో సోమనాథుఁడు ప్రదర్శించి చూపిన దేశీయవైఖరుల నీక్రింది పట్టికమూలమునఁ గొంత గుర్తింపఁ దగును. ఎట్టి వ్యావహారికభాషావాక్యవైఖరి నాతఁడు తనకావ్యభాషలోఁ బెట్టుటకు జతనము సలిపెనో యెఱుఁగుటకైవాని కెదురుగా నాయా వాక్యముల వ్యావహారికరూపములు ప్రదర్శింపఁబడినవి. కాకువు, ఆక్షేపము, ఎత్తిపొడువు, అవహేళనము, వ్యంగ్యమర్యాద, హాస్యోక్తి మొదలగు సందర్భములందలి తెలుఁగు వాక్యముల పొలుపు, కొన్ని కొన్ని చిత్రము లయినవాక్యవిన్యాస వైఖరులు నీపట్టికలోఁ జూడఁ దగును.

| | |
|---|---|
| అంగ మెక్కంగ దిగంగc జూచుచును. 4-299. | ఒళ్లంతా ఎగాదిగ చూస్తూ. |
| అందఱ మమ్ముc గుక్కలకంటెను దక్కువ గాcగc బలికెదు. 7-500 | మమ్మల్ని అందరినీ కుక్కలకంటే హీనంగా మాట్లాడుతున్నావు. |
| అక్కటా, పీ రెవ్వరయ్య బోచెల్ల దాసి దేవయ్యగారా? సరణార్తి మీసరివారమా. మీ కిట్లు దగునె? యిట విజయంచేయు టేమి గార్యంబో? యెట పయనం బిట్టు లేcగుచున్నారో? కరుణించి యిచ్చటి కరుగుదెంచితిరో? హరహర, మము మఱుపరు గదె యెందు? నిట్టిభయంబు ను, నిట్టి నిగర్వ, మిట్టిభక్తియుc గల్గునే యితరులకు? 4-264 | ఎవరు వీరు? దాసిదేవయ్యగారా? నమస్కారం మీకు సాటివాళ్లమా మేము? మీ రిలా చేయడం ధర్మమా? ఇక్కడికి మీరు వేంచేయడానికి ఏమి కారణమో? ఎక్కడికైక్కె ప్రయాణమై వెడుతూ ఇక్కడికి వచ్చారో తెలుసుకోవచ్చా? మమ్మలిని మరిచిపోరుగదా? ఇంతభయమూ, భక్తీ, ఇంత నిగర్వమూ ఇతరులకు ఉంటాయా? |
| అట తాతచే వింటి నని తమతాత చిటిపొటి వాండ్రకుc జెప్పె మాతాత. 5-373 | వాళ్లతాత ఇలా చెప్పాడని మాతాత కుర్రాళ్లైన మాతో చెప్పాడు. |
| అట్టిభక్తుcడు గలc డయ్య లోకములc బెట్టంగ వచ్చునే పుట్టిన సంతుని మచ్చరం బున మాటలాడcగ వచ్చుcగాక... 4-288 | లోకంలో అలాంటిభక్తుడు ఉన్నాడా? తన కొడుకునను అలా జంగముడికి సమర్పించే వాడున్నాడా? అసూయతో మాట అయితే అనవచ్చుగానీ. |
| అడిగెడువారు లే కయ్య నీ వింత బడగ వైతివి .... 4-254 | అడిగేవారు పెట్టేవారూ లేకపోబట్టే నువ్విలా విచ్చలవిడిగా తిరుగుతున్నావు. |
| అది యేల కడు పూcద డయ్యెడుc జెపుమ. 3-138 | అదెందుకు కడు పుబ్బదో చెప్పు. |
| అనుమానమా? త్రావె హరుcడు విషంబు బనుగొన నటమీcది పను లెఱుంగ మన. 3-145 | అనుమానం ఏమీలేదు. ఈశ్వరుcడు విషం త్రాగడం నిజం. ఆతరువాత ఏం జరిగిందో మాత్రం మాకు తెలియదు. |

| | |
|---|---|
| అరిముఱిఁ జన్నుఁబా లర్థించి యేడ్చు చిఱుతచే నొకపిండికటు డిచ్చి తల్లి తన చన్ను మఱపించి కొనిపోయినట్లు. 4-279 | పాలకోసం ఏడ్చేపిల్లడిచేతిలో ఒక అప్పచ్చి పెట్టి తల్లి పాలుతాగడం మఱపించినట్లు. |
| ఆరగింపనె కాని యప్పదార్థముల పే రీశ్వరుఁ డెఱుఁగ నేరఁడు.... 5-387 | ఆరగించడమైతే ఆరగిస్తాడు కానీ ఆ పదార్థముల పేరు కూడా ఆయనకు తెలియదు. |
| ఇటఁక్రిందిమాటల కేఁ దప్పు వట్ట, నిట మీఁద సిరియాలు నీశ్వరువార్త మఱచి యాడితి రేని మాభక్తు లెడకు మరి మీరు హరునికోమతితోడినార లనవుడు... 4-293 | ఇంతకుముందు జరిగిపోయిందేదో జరిగి పోయింది. దానికి నేను తప్పుపట్టను. ఇక మీదమాత్రం పొరబాటునైనా సరే ఈశ్వరుడివిషయం ఎత్తారంటేమా భక్తులకు మీరు శివుడితోను, సిరియాలుడితోను సమానులు అవుతారు. |
| ఇట్లుండ వలవదే భక్తి? 4-293 | భక్తి అంటే ఇలా గదా ఉండాలి. |
| ..... ఇట్లింత కెత్తికొన్నాఁ డింక నిటమీఁద నెంత కెత్తికో నున్నాఁడో? యెఱుంగంగ రాదు. 5-364 | ఇప్పు డింత చేశాడు. ఇంకమీద ఇంకా ఎంత చేస్తాడో మనకేం తెలుసు? |
| ఇప్పాట నది యొక్కయొప్పుగా నతనిఁ జెప్పకు నెప్పకు ... 5-309 | ఇంతమాత్రంచేత అది ఒక గొప్పగా అతణ్ణి గూర్చి నాదగ్గర చెప్పవద్దు. |
| ...... ఇబ్బువిని మాబోటి భక్తుల మనికియు నునికి నీబయిసియె కాదె? విని యెఱుంగము దొల్లి విడియ లనంగఁ గనుఁగొనఁ బడియె నీకారణంబునను. 5-359 | ఈలోకంలో మాలాంటి భక్తుల బతుకంతా నీ భవిష్యమే కదా? విడియలు అంటే ఏమిటో మాకింతకుమునుపు తెలుసు గనకనా? ఇప్పుడు కదా నీమూలాన తెలుసుకోగలిగాం. |
| ఇసుమంత బూడిద నొసలఁ బూసినను మసలక కొండంత మరు లెత్తె ననుట తెల్లంబు .... 2-107 | రవంత బూడిద నొసట పూస్తే కొండంత పిచ్చి పట్టుకొంటుందట. |
| ...... ఉన్నవి యున్న చక్కటిఁ బ్రాణముల్ గ్రక్కున విడిచె. 5-343 | ఎలా ఉన్నవి అలానే ప్రాణాలు వదిలి పెట్టాయి. |

| | |
|---|---|
| ఎట్టు సూడఁగ వచ్చు నిక ధర్మంపుఁ గట్టియ యైనను బెట్టరదండు – అనుచు. 5–381 | చూస్తూ ఎలా ఊరుకోగలం. ధర్మపుకట్టె అయినా పెడతాం పదండి. |
| ఎన్ని మీ వలసిన వన్ని గైకొనుఁడు. 2–100 | మీకు ఎన్ని కావలిస్తే అని తీసుకోండి. |
| ఎన్నెదల్ గల్గె నీ కిటుఁ గుడ్వఁ బెట్ట. 6–445 | ఇక్కడ భోజనం పెట్టడానికి నీ కెన్ని గుండెలున్నాయి? |
| ఎల్లవారికిఁ బ్రాణ మేమి నిత్యంబు? 5–381 | ఎవరికైనా ప్రాణమేమి శాశ్వతమా? |
| (తనద) ఏనుఁగుపండ్లు దాఁ బట్టి చూచు మనుజుండు బ్రదుకునేమడియున కాక. 4–260 | ఏనుగుపండ్లు పట్టిచూచే మనుష్యుడు చస్తాడు కానీ బతుకుతాడా? |
| ఏను గూడలి సంగమేశ్వరుపేర కాన యా గుడిలోనఁ గదలకుండుదును. 1–37 | కూడలి సంగమేశ్వరుడు అనేపేరుతో నేను ఆ గుడిలో కదలకుండా మెదలకుండా ఉంటుంటాను. |
| ఏ మెదురెదుర మీ మ్మేమందు మింక. 7–499 | మిమ్మల్ని ఎదుటబెట్టుకొని మేమే మనగలం? |
| ఒక్కించ వెట్టిన నొగి నారగించి గ్రక్కునఁ దొడ్డెత్తు... 2–91 | కొంచెం చేతుల్లో పెడ్తే తినిపోయి వాళ్లను పిలుచుకుని వస్తా. |
| కంటిమి కానము వింటిమి వినము ఉంటిమి లే మనునుక్తులు వలదు. 7–548 | చూచాము, చూడలేదు, విన్నాము, వినలేదు ఉన్నాము లేము అనే మాటలు మాకు వద్దు. |
| కాన యిక్కడ నవమార్గము సేయుం ధీరమానసుఁ డెంతవాఁ డైనఁ గానిమ్ము. అట్లునేఁడును వాఁడు నరుదెంచెనేని యెట్లైనఁ జంపక యేఁ బోననుచు. 3–190 | ఇక్కడ దుర్మార్గం చేసేవాడు ఎంతవాడైనా కానీ ఎప్పటిలాగే వాడు వచ్చాడంటే ఈసారి ఏమయినా సరే అతణ్ణి చంపక వదిలిపెట్టను. |
| కాన, యిన్నియుఁ జెప్పఁగాఁ బని లేదు. 1–47 | కాబట్టి, ఇన్ని చెప్పవలసిన అవసరం లేదు. |

| | |
|---|---|
| కుక్క ముట్టినకడ్వకును విధి యేమి? చక్కనఁ గాల్చినఁ జాలున కాదె? 6–466 | కుక్కముట్టుకొన్నకుండకు ప్రాయశ్చిత్త మేముంది? బాగా కాలిస్తే సరి. ఆదోషం అంతటితో తీరుతుంది. |
| .... కూసి కుక్క దువ్వ దెచ్చికొన్ని యవ్విధం బయ్యె.... 6–488 | మొఱిగి కుక్క తగువు తెచ్చుకొన్నట్ల యింది నాపని. |
| క్రచ్చఱ నీనంగఁ గావి నక్కలకు నిచ్చిన ట్లయ్యె. 7–519 | ఈన గావి నక్కల పాలు చేసినట్లయింది. |
| చచ్చియు నిబ్బంగి సగము చావకయు. 7–512 | సగం చచ్చి చావక .... |
| చరజీవులకు నెల్లఁ జావును నొప్పి సరియ కాదే. 5–334 | చావూ, జబ్బూ మానవుడు అన్నవాడికి అందరికీ సమానమే కదా? |
| చెప్పంగలేదొండు చేయలేదొండు. 3–196 | చెప్పటానికీ లేదు, చెయ్యటానికీ లేదు. |
| చెప్పినఁ గొండెమౌఁ జెప్పక యున్నఁ దప్పగు నటు గాన చెప్పఁగ వలసె. 3–213 | చెప్పితే ఒకతప్పు. చెప్పకపోతే ఒకతప్పు. అంచేత చెప్పవలసి వచ్చింది. |
| చేరెంటి కైనఁజెచ్చెరఁ గడవ గొనువారు చేపట్టరు వాయించి కాని. 4–256 | కుండను కొనదలిచినవాళ్లు వాయించి కానీ తీసుకోరుగదా? |
| చొల్లుకారుడుమాట లెల్ల నేమిటికి? 6–465 | ఈజొల్లుమాట లన్నీ ఎందుకు? |
| .... జంబూఫలంబు మ్రింగిన భావన మ్రింగఁదే? 6–483 | .... నేరేడుపండు మింగినట్లు మింగలేదా? |
| తన కాళ్లు మొగంబు దాఁ గడిగికొని. 3–160 | కాళ్లూ మొహం కడుక్కొని. |
| తా నింతవాఁ డెఁ దల్లి లేకయును, దానెంత పెరుగునో తల్లి కల్గినను. 3–153 | తల్లి లేకున్నప్పుడ ఇంతవాడయ్యాడు. ఇంక తల్లే గనక ఉంటే ఎంతవా డయ్యేవాడో? |
| దాత కాఁడే? యిట్లు దాఁ బ్రోవ కెవరు ప్రోతురు? మేలయ్యెఁడో బ్రదికితిమి 5–358 | గొప్పదాతకదూ ఆయన. ఆయన రక్షించకపోతే మమ్మల్ని ఇంక ఎవరు రక్షిస్తారు. మంచి పని అయింది. బతికాం. |

| | |
|---|---|
| నగవు గా దిచటు, నున్నను బ్రమాదంబు. 3-183 | నవ్వులాటకాదు. ఇక్కడ ఉంటే చాలా ప్రమాదం |
| నమలెనో నమలఁడో నాతి వీక్షించి. 4-277 | నమిలినాడో లేదో – నమిలిన వెంటనే - ఆమె చూచి ..... |
| నా కేమి సెప్పెద, వీకాననమున లేకున్నవే చెట్లు నీకుఁ గూర్చుండ. 3-206 | నాకెందుకు చెప్తావు? నీకు కూర్చోవటానికి ఈ అడివిలో చెట్లే లేక పొయ్యాయా? |
| నిండిన కొలువులోపలను. 2-108 | నిండుకొలువులో – నిండిన యింటిలోలాగ. |
| ని న్నన్న దేమేని మున్నొండు గలదె? 5-359 | ని న్నెప్పుడైనా ఏమైనా అన్నానుగనకనా? |
| నీకు నిచ్చెదఁ గాని నీయాన, త్రావు. 3-163 | నీకు ఇస్తాను గానీ, ప్రస్తుతం దీన్ని తాగు. |
| నీకు నీవ చేసికొనఁగఁ దెవుల్ సిద్ధించెఁగాక. 3-158 | నీకు నువ్వే తెచ్చుకొన్నావు. రోగం వచ్చింది. చేతులారా చేసుకున్నావు – అనుట. |
| నీతలఁ బుట్టెనే నిటలాక్షుభక్తి? 7-493 | శివభక్తి నీమొహాన్నేపొద్దుపొడిచిందా? |
| నీవును మాతోడ రావైతి గాని వేవు నంతకు నొక్కవిధమైనసుఖము. 3-142 | నువ్వు మాతో రాలేదుగానీ, వచ్చి ఉంటేనా తెల్లారేదాకా ఒకేభోగం కదటయ్యా? |
| నీవు సద్భక్తప్రసాదంబు గుడిచియాదట బ్రతికి యిం తైతి గావునను. 7-581 | నీ ప్రసాదం ఇంతపుచ్చుకొని బతికి ఇంత వాళ్ల మయ్యాం. |
| పదవులు గిదవులు పని లేదు. 1-23 | పదవులూ, గిదవులూ అక్కరలేదు. |
| ...... పనియు లే దింక. 1-48 | ఇంకేమీ పని లేదు. అక్కరలేదు అన్న అర్థంతో. |
| పసిబిడ్డమాటలు పనియు లే దింక. 1-47 | పసిబిడ్డమాటలు పని లేదు. అక్కఱ లేదు. |
| పిడికటఁగోమలిఁ బొడువంగ మఱియుఁ బొడువుమా యనుక్రియఁ బొడువంగ రాదు. 6-417 | కోమలినిపిడికిటితో పొడుస్తూ ఉంటే ఇంకా పొడువు పొడువు అన్నట్లు పొడవకూడదు. |
| పిన్నవాఁడే యూరకున్నను జంప. 5-338 | ఊరకే ఉంటే చంపడానికి వాడేం కుర్రాడా? |
| పున్నెంబు మాలినపాడువల మెల్ల నెన్నంగ నున్నాడ మే మేమి గొఱయు. 5-352 | పుణ్యం చేసుకోని పాపాత్ములు మేమూ ఉన్నాం, ఏం లాభం? |

| | |
|---|---|
| ...... పువ్వు ముట్టినచెయి మొట్ట మొదటికిఁ గోసి మఱి కదా కోయుట మగువ నాసికము. 4-282 | పువ్వును ముట్టుకొన్న చేతిని ముందుగా మొదలంటా కోసి ఆతరవాత కదా ఆమె ముక్కు కొయ్యాలి. |
| పెండ్లికేఁగుటొ యిట్లు బండ్లిది యేమి? 7-507 | పెండ్లికి పోతున్నారా ఏం? లేకపోతే ఈ బండ్లూ ఇవీ యేమిటి? |
| పైఁగొసరఁగుంచంబు గూలఁబడ్డట్లగు. 7-554 | పైపైన కొసరగా కుంచమే కూలబడి నట్లయింది. |
| పొరుగింటిచిచ్చైన దరికొనుఁ గాని దరి కొనవే యిట్లు దమయింటి చిచ్చు. 4-291 | పొరుగింటిలో నిప్పు అయితే కాల్చి మన యింటిలో నిప్పు అయితే కాల్చదా ఏం? |
| పోయి వచ్చినకార్యములు విన్నవింపు. 1-14 | పోయివచ్చిన పనులు విన్నవించు. |
| పోలుగఁ గొంగనిఁ బొడిచి వంగని వ్రాలుగఁ దిగిచితిరి. 7-507 | కొంగణ్ణి చంపి వంగణ్ణి వదలాగినట్లు. |
| బండారిమీఁద నెవ్వండేనియింకఁ గొండెంబు సెప్పు నాకుక్కలఁ జెంది నాలుకల్ గోసి సున్నముసాలఁ బూసి పోల వేచిన యినుము వోయింతు నోళ్ల. 3-126 | బండారిమీద ఎవరైనా చాడీలు చెప్పితే ఆ కుక్కలను చెండి నాలుకలు గోసి సున్నం పెడతాను. పెనంమీద వేయించిన ఇనుము వాళ్లనోళ్లల్లో పోయిస్తాను. జాగర్త. |
| బల్లిదమైన మాప్రాణంబులైన విడుతుము గాక మామడిగూటివృత్తి విడుతుమే? 7-543 | మాప్రాణాలైనా వదులుతాం కానీ, ప్రసాదం పొందే హక్కు వదులుకొంటామా? |
| భక్తుండునైనను బ్రదుకంగ నీరు. 6-422 | భక్తుణ్ణైనా బతక నివ్వరు. |
| భువిని నాసుఖదుఃఖములు నీకుఁజెప్ప కెవరికిఁ జెప్పుదు నే హలాయుధుఁడ. 4-287 | నా కష్టసుఖాలు నీతో చెప్పుకోకుండా ఇంక ఎవరితో చెప్పుకుంటాను? |
| మనుజాలఁ బ్రోలిలో మన నీరు గాక పని యేమి గొఱియలకును మీకుఁ జెపుడ? మామీఁద నొకరాజు మఱి చెప్పఁగలఁడె? భూమిలో నన్నట్లు పొడిచి వైచెదరు. 5-338 | ఊళ్లో మనుష్యులను బతకనిస్తేనా? మీకూ గొఱ్ఱెలకూ ఏం పని చెప్పండి? మామీద అజమాయిషీ చేసి, మమ్మల్ని ఎవరు శిక్షిస్తారులే అనే ధీమాతో చంపేస్తున్నారు. |

| | |
|---|---|
| మఱి యెందు బోయెడు మర్యాదలెల్ల. 5-339 | మర్యాదలన్నీ ఎక్కడకు పోతాయి? |
| మాకు నీడై యున్నయాకొమ్మ కాని చేకొని నఱకంగఁ జెట్లు లేవె? 3-225 | మాకు నీడనిస్తున్న ఈకొమ్మకానీ కట్టెలు కొట్టుకోడానికి నీకు చెట్లే లేవా ఈ అడివిలో? |
| మిన్నక పోదు మాయన్నకుఁ జెప్పి మఱి కదా యున్నది, మాట లింకేల? 3-164 | ఇదంతా ఊరికే పోదు. మా అన్నకు చెప్పి ఆతరవాత కదా ఉంది నీసంగతి? ఇక వెయ్యి మాటలెందుకు? |
| మీ నోటికిఁ దగుకడి గొనరు. 7-508 | నోటికి తగిన కబళం మింగాలి కానీ .... |
| మీఱి పల్కుట యెల్ల మీ కుండెఁ గాక. 7-509 | ఎదిరించి మాట్లాడడం మీదగ్గరే ఉండనివ్వండి. |
| మూఁడు దినంబులు ముక్కంటి యచట లేఁడొ? తాఁ జచ్చినవాఁడొ కా కనుచు. 6-402 | ఆ మూడుదినాలూ శివుడు అక్కడ లేదా? చచ్చిపొయ్యాడా? |
| వచ్చెఁ జావనుచు దైవ మెఱుంగు ననుచు. 6-447 | ఏం చావు వచ్చిందిరా భగవంతుడా? దేవుడికే తెలియాలి పుణ్యం పాపం. |
| వడుగువ కని మున్న వచ్చినయతఁడు. 1-48 | వడుక్కాని ముందుగా వచ్చిన వాడిమామ. |
| ...... వాసనయుఁ లేకున్న మఱి కదా శివునకు మాకు సుకంబు. 4-313 | వాసన లేకపోయిన తరవాత కదా మాకు శివుడికీ మధ్య ఏం రగడ జరుగుతుందో తెలియడానికి? |
| విదితంబుగా మఱి చదువఁ బెట్టినను గలమతియును జెడ్డకారణం బయ్యె. 4-264 | చదవేస్తే ఉన్నమతి కాస్తా పోయిందట అన్నట్టుంది ఈ వ్యవహారం. |
| వీసానకై యెట్టి రోసానకైనఁ జేసాఁచికొను కర్మజీవులతోడ. 7-533 | కాసుకోసం ఎలాటికానికార్యమైనా చెయ్యడానికి సిద్ధపడే పాపాత్ములతో.... |
| సకలలోకైక రక్షకుఁ డగు శివున కొక నిన్ను రక్షించుటకు నెంత వెద్ద? 2-69 | సకలలోకరక్షకుడైన శివుడికి ఒక్కనిన్ను రక్షించడం ఏమంత కష్టం? |

అట్టి బ్రహ్మలను బ్రాహ్మణులనుద్రుంప
నట్టిచో మీకు నేహత్య ప్రాపించెఁ
దనకూఁతుఁ గవియు పితామహుఁద్రుంప
ననలాక్షు, మీకు నేహత్య నాఁ డయ్యె.
1-623

అలాంటి బ్రహ్మలనూ, బ్రాహ్మణులనూ చంపి నప్పుడు మీకు ఏ హత్యాపాపం కలిగింది? తన కుమార్తెనే కలిసిన బ్రహ్మను చంపినప్పుడు మీకు ఏహత్యాపాపం కలిగింది?

................ అట్లయిన దివిఁ
దిరిగెడు నట్టి తిమిరారి బొంకె? భువిఁ
జందురుఁడు వేఱ పుట్టెనె యొకడు
శ్రీకంఠుజడలపై శీతాంశుఁ డున్న
నాకసంబునయందు లేకుండ వలదె?
1-610

అలా అయితే ఆకాశంలో తిరిగే చంద్రుడు అబద్ధమంటావా? లోకంలో చంద్రుడు వేరే యింకొక్కడు పుట్టుకొచ్చాడా? శివుడి నెత్తిమీద చంద్రుడుంటే ఆకాశంలో లేకుండా ఉండాలి కదా.

అది యేల పెట్టితి వక్కడ ఘుటిక యిది
యేల యరసెద విప్పుడు వచ్చి
యెవరిచేతికి నిచ్చి తేల వచ్చితివి యెవని
వేఁడెద విది యేల కలుగఁ గొనినవా
గలిగినా కోటీశు వైరి యునిచినచోట
యుండె లేకుండె సిద్ధరసం బది
సెడునె.... 1-481

అక్కడ ఘుటిక ఎందుకు పెట్టాలి? ఇప్పుడు ఇక్కడ ఎందుకు వెదకాలి? ఎవరిచేతి కిచ్చావు? ఎందుకొచ్చావు? ఎవరి నడుగుతావు? ఎందుకు కంగారుపడిపోతావు? దాన్ని ఎవరైన తీసుకుని ఉంటే కోటీశులే అయిపోతారు. అది ఉంచినచోటుండినా లేకుండినా దాని కేమీ చెరుపు జరగదు.

............. అద్దంబుపై మిన్నగింజ
వైచినఁబడు నెంతవడి నంతమాత్రయిద్ద
సమాధిభూయిష్ఠతఁ దగిలి. 1-366

అద్దంమీద మినపగింజ ఎంతసేపు నిలుస్తుందో అంతసేపు సమాధిలో ఉండి ......

ఇటు గాని మెచ్చఁడే యిందుశేఖరుఁడు
గటుకటా, చూడంగఁ గాదు దోషంబు. 1-394

ఇలా చేస్తేకానీ శివుడు మెచ్చుకోడా? అయ్యో, చూడ్డానికి వీల్లేదు.

నిలు నిలు కావడి నిల దింపు దింపు తొల
తొల యిదియేల చలముడు గుడుగు
వెఱికికో నీవైన వెఱవక కొయ్య వెఱతేని
నే నైనఁ బెఱికెదఁ జూపు మనుచు దగ్గఱ
..... 1-394

నిలువు నిలువు. కావడిని నేలపైన దింపుకో. తప్పుకో తప్పుకో. పట్టుదల వద్దు. నువ్వైనా ఆ కొయ్యను పెఱుకుకో. నీకు భయమైతే చెప్పు నేనైనా పెఱుకుతాను.

| | |
|---|---|
| ఇది యవసర మగు నిది కాదు నాక మదనారిఁ గొలుచు సమ్మదము వట్రిల్ల 1-376 | ఇదిసమయం. ఇది సమయం కాదు అనకుండా శివుణ్ణి సంతోషంతో కొలుస్తాడు. |
| ఇప్పాట నొడఁబడ వేని నావలనఁ దప్పు లే దెట్టులు సెప్పక పోదుఁ బ్రాకటంబుగ గురుభక్తియె నాకు నీకును బ్రాణంబు నిజమట్లు గాన, పాడియే బి ట్టాసపడి నన్నుఁ బిలువఁ గూడునే? తొల్లి మీగురులింగమొక్క నాఁడు విచ్చేసి నాపాల నున్న వాఁడు గావున నిట్లు వలదంటి ననుడు. 1-418 | ఈపద్ధతికి ఒప్పుకోకపోతే నా తప్పు లేదు. ఎలాగూ చెప్పకతప్పదు. నీకూ, నాకూ కూడా గురుభక్తే కదా ప్రాణం. అలాంటప్పుడు నువ్వు నన్ను ఆశపడి పిలవ వచ్చునా? ఎందుకంటే మీగురువుగారు ఒక రోజు వచ్చినాతో ఉండడం జరిగింది. అందుచేత వద్దన్నాను. |
| ఈనాటనే గాని యింతులు లేరె తా నాఁడుపాడి భువివరానెఁ డమ్మెడినె జ్ఞానాత్మ శివుఁ గొల్చువానికి నింత యైనఁ బరేంగితజ్ఞానంబు వలదె? 1-342 | ఈ దేశంలోనే గానీ యింకెక్కడా ఆడవాళ్లు లేరా? అడపాడి యేమైనా అమ్ముతున్నారా లోకంలోఎక్కడైనా? శివభక్తు డయిన వాడికి కొంచెమైనా పరేంగితజ్ఞానం అక్కరలేదా? |
| ఈయథాకథన మిట్లెలుఁగక బ్రమసి పాయక తప్పులు పలుకుపాతకుని క్రొ వ్వెద వాని ముక్కున నోరఁ దోఁకఁ బురువ్వులు దొలఁగవే భువిఁగొడలుగను. 1-637 | సత్యం తెలుసుకోకుండా ఇష్టం వచ్చినట్లు మాట్లాడేవాడి ముక్కులో, నోటిలో, తోకలో పురుగులు పడవా, వాడి కొవ్వు అంతా అణగి పోయేటట్లుగా. |
| ఊరక పొమ్మన్న నొడఁబడనేను గారణం బేమేనిఁ గలదేని యిట్లు పోను నీ వాదొండె నే నొదు నొండెఁ గానవేయును నేల కమలాక్షి యనుడు. | ఊరికే పొమ్మంటేనేను పోను. ఇలా పోవడానికి ఏమైనా కారణం ఉంటేచెప్పు. నువ్వే గెలుస్తావో నేనే గెలుస్తానో తేల్చుకుందాం. |
| ఎట్టకో, సూరము యింత గాలంబు గట్టడి పై మాల గలపి తియ్యారు సిక్కితి గాక మాచేత నీ వింక నెక్కడ వోయెద విట్లు బోడలకుఁ బోఁడిగా నంబలి వోసినవిధము నేఁడు గదా నీకు నందారఁ బండె నింటి సఫల మయ్యె మన్నఫలంబు నింటిలోనన సుఖియింతు గాక – అనుచు. 1-119 | సూరమ్మా! ఈ ఊరినంతా మాలలతో కలిపేశావు. నేటికి మాచేతికి చిక్కావు. ఎలా తప్పించుకోగలవు? జంగంవాళ్లకు అంబలి పోసినఫలితం ఈనాడు కదా నీకు తెలిసివస్తూ ఉంది. నీజీవితంసఫల మయిందిలే. ఇంక ఇంటిలోపలనే ఉండి సుఖించు – |
| ...... ఎట్టెట్టూ, మహాదేవుఁ డనఁగ నెనయుంగనొకదైవమే? నిక్కమెట్లు శ్రుతిపేర్మిఁ | ఎలాగెలాగూ? శివుడంటూ ఒక దేవుడున్నాడా? నిజమా? వేదాలతో |

| | |
|---|---|
| బలుక నేర్తురుగదా యనియు నతివాదములు పెక్కులాడెదు రేఁగి. 1-604 | పరిచయం ఉంది కదా అని విపరీతంగా వాదిస్తున్నావు. |
| ఎన్నఁడు వెట్టంగ నున్నాఁడ విట్లు నన్న యేనాటను సతి వెట్ట గలదె? యెఱుఁగవే యెఱిఁగియు నెఱుఁగనియట్ల వఱటలఁ బెట్టుచు వచ్చెదు గాక. 1-361 | ఏకాలంలో నైనా సతివెట్టి అంటూ ఉందా? నీకు తెలియకా? తెలిసి కూడా తెలియనట్లుగా నన్ను కష్టపెడుతున్నావు. |
| ఎఱుఁగఁబో భక్తి నీవెఱిఁగెడువాఁడ వుఱుక యాడెడువాఁడ వోహిళప్రభుని యట్టిభక్తుఁడ విక నెట్టు వో యెదవో కట్టుగ్రమున భక్తిఁ గైలాసమునకు నెప్పు డే క్రియ నెన్నఁ డెవ్వరితోడఁ జెప్పుమా పోయెదు స్పష్టీశ, యనుడు. 1-415 | భక్తి అంటే నాకేమితెలుసులే. నువ్వు అంటే బాగా తెలిసినవాడివి. ఓహిళునిలాంటి భక్తుడివి. భక్తితో కైలాసానికి ఎప్పుడు, ఎలా ఎవరితో పోతావో కాస్త చెప్పు. |
| ఏవేమిరా, రంభ యేమి పంచినదె యామహాదేవుఁడే యడ్డ మాతనికి నన నేల ఇంక నాయధికారమొప్పుఁ గొన నిమ్ము రుద్రుండు గోపించె నేనిఁ బఱచక తప్పు తత్ప్రాప్తిఁ దా ననుచు. 1-358 | ఏమిరా రంభ పంపిందా ఏం? అతనికి ఆ మహాదేవుడే అడ్డపడుతున్నాడా? నా అధికారం ఒప్పుకుంటే సరి. లేకపోయెనా నే నా పరమేశ్వరుడే కోపించినా నేను వాణ్ణి బాధపెట్టక మానను. |
| ......... ఒక్క మనుజాచే నిట్లవమానతఁ బొంది బ్రదికెడి బ్రదుకుదాఁ బదటికే యనుడు. 1-111 | ఒక మామూలు మనిషిచేత ఇలా అవమానం పొంది బతికే బతుకుకూడా ఒక బతుకేనా? |
| కంటిమి గాన మే ముంటిమి లేవు వింటిమి విన మని వెనుక నా వలదు వినుఁడు నాదుప్రతిజ్ఞ వీరు వా రనక. 2-25 | చూచాము, లేదు, ఉన్నాము, ఉండలేదు – విన్నాము లేదు అని తరవాత అనకండి. వీరూ వీరూ అనే భేదం లేకుండా అందరూ వినండి నా ప్రతిజ్ఞను. |
| కడిగినఁ గడుగుదు గాని యేఁ గాళ్లు గడుగ వీనికి నుదకంబు వోయ బంధులు నగుదురు పరమార్థ మనుచు బంధురం బగు చేతిపసిఁడిగలంతి యవలఁ బెట్టుడు.... 1-281 | నువ్వు కడిగితే కడుక్కో. అంతేకానీ వీడి కాళ్లు కడగడానికి నేనుమాత్రం నీళ్లు పొయ్యను. అలా చేశానా బంధువు లంతా నన్ను చూచి నవ్వుతారు. |

....... కన్ను లిచ్చుట యది యేటి యిచ్చుట, యవియు వచ్చుట యది యేటివచ్చుట, మున్న పుచ్చుట దాపు నేఁ డిచ్చుట, మీరు మెచ్చుట యదియేటిమెచ్చుట, యనుచు. 2-44.

కండ్లివ్వటం అదేమివ్వడం? అవి రావటం అదేం రావటం? ..... మీరు మెచ్చుకోవడం అదేం మెచ్చుకోవడం?

కలుకంఠునకు జలకంబాచరించి మఱి కాని పలుకఁడో మనతోడ నయ్య! గాదేని యేమేని గారణంబునను వాఁడైన నలిగినవాఁడా? నీతోడ నే తెలుంగునఁ గల్గఁ డింతగాలంబు నీతోడ నలిగిన నెపమేమి నేఁడు...... 1-452

శివుడికి అభిషేకం చేసి కానీ మనతో అయ్య మాట్లాడడా? లేక ఏదైనా తగువు వస్తే అలిగి ఉన్నాడా? ఇంతకాలం ఇక్కడకనబడకపోవడానికి కారణం ఏమిటి? నీమీద అతనికి ఎందుకు కోపం వచ్చింది?

ఘనుఁడ, మమ్మిట్లాడి కాని యీవింక ననుభవింపవె మీఁద నపవర్గసుఖము వే యేల? నీంబాగి వేయును వచ్చెఁ బోయెదము - అని. 2-169

మమ్మల్ని ఇలా ఆడిపోసుకుంటేకానీ నీకు స్వర్గసౌఖ్యం రాదా? వెయ్యివరాల లెందుకు? నీ దానమూ వద్దు, నూవ్వా వద్దు! పోతాం.

చనువాఁడ వెట్లును జనియెదు గాక యనవుడు..... 2-488

పొయ్యేవాడివి ఎలాగూ పోతే సరి.

దేవ, నాయొడలను జీవ ముండంగ వదలుదునే నిజవ్రతమందు నచటఁ గదల నుంకింప నక్షణమాత్రమంద. 1-393

నా బొందలో ప్రాణం ఉండగా ఈ వ్రతం వదిలిపెడతానా? అంటూ కదలటానికి ప్రయత్నించేసరికి అంతలో .....

........ నడువవచ్చునే యిట్లు లెవ్వరికైనఁ జెప్ప వచ్చుఁగా కని యాడ వచ్చుఁగా కనుడు. 1-406

చెప్పడ వైతే చెప్పవచ్చుగానీ ఇలా నడుచుకోవడం సాధ్యమా? అంటూ చెప్పడానికేంలే.

నమ్మిన నీరీతి నమ్మంగవలదె, నమ్మితి మందు రెన్నంగ బసవేశుఁ దలఁచిన నిటువలెఁ దలఁపంగ వలదె, తలఁతు మంద్రు బసవదండనాయకుని గొలిచిన నిటువలెఁ గొలువంగవలదె, కొలుతు మంద్రు బసవగుర్వవతారు వలచిన నిటువలె వలవంగ వలదె, వలతు మంద్రెడ బసవ ప్రభువునకు వలతురు దలఁతురు గొలుతురు

నమ్మితే యిలా కదా నమ్మాలి. అందరూ బసవణ్ణి నమ్మా మంటారు. తలిస్తే ఇలా కదా తలవాలి. బసవణ్ణి తలుస్తామంటారు. కొలిస్తే ఇలా కదా కొలవాలి. బసవణ్ణి కొలుస్తా మంటారు. ప్రేమిస్తే యిలా కదా ప్రేమించాలి? బసవణ్ణి ప్రేమిస్తా మంటారు. ప్రేమిస్తారు, తలుస్తారు, కొలుస్తారు. అన్నీ చేస్తారు. అయినా

నెమ్మి నిల నిట్టిచోద్యంబు లిటు దొల్లి నేఁడు వింటిమే యిలు మూడి విడుతురే తొల్లి గంటిమే భక్తులకథలయం దైన. 1–493

ఇలాంటి చోద్యాలు ఎక్కడైనా వినం విన్నావమా? ఇల్లు కొల్లపెట్టే వాళ్లెవళ్లైనా ఉంటారా? భక్తుల కథల్లో తప్ప.

నాఁడు నేఁ డన కెల్లనాఁడు నేనాఁడు బోఁడిగా భంగంబుఁ బొందనియట్టి. 2–324

నాడూ, నేడూ అనకుండా ఎల్లప్పుడూ భంగం పొందనటువంటి .....

..... నినుఁజూచి కాని ప్రాణంబు వట్టఁజాలక వచ్చి పడిఁతి నిన్ గంటి నాతతం బుగఁ జాలు నంతియ కాక నీతియె వరుఁ డుండ నిను నాకు గలియ. 1–365

నిన్నుచూచి కాని ప్రాణం కుదటపడ దని వచ్చి నిన్ను చూచాను చాలు. అంతే కానీ వరు డుండగా నిన్ను కలియడం నాకు న్యాయమా?

నీవు నన్నిప్పుడు దీవింపకున్న నావంతయును నాయువది దక్కువ గునె? నీవు నన్నిప్పుడు దీవించుమాత్ర మావంతయును నాయువది యెక్కువగునె? మననివారల నీవు మనిపెద వయ్యు తనుఁ బొందుమృత్యువు దాసియే నీకు పడిబ్రహ్మ నుదుట మున్ వ్రాసిన వ్రాలు వెడతరి కేఁగునే పెక్కు లేమిటికి? 1–438

నువ్వు నన్ను దీవించకపోతే నా అయుస్సేం తగ్గిపోతుందా? నువ్వుదీవించిన మాత్రాన అయుస్సు వృద్ధవుతుందా? బతకనివాళ్లను నువ్వు బతికించగలవా ఏం? మృత్యుదేవత నీ కేమైనా దాసియనుకున్నావా నువ్వు చెప్పినట్లల్లా చెయ్యటానికి? బ్రహ్మదేవుడు నుదుటిలో వ్రాసినవ్రాత మెనక్కి పోతుందా ఏమిటి?

'నేఁడు నాయేంరాలి నిజసుతువడుగు వాఁడువాఁడునునొక్కవయసు గావునను జెచ్చెర సుతుఁడున్నఁ జేయునే నేఁడు నచ్చుగా వడు గంచు నడలు పుట్టుడును నచ్చోట నేడ్పు యవినీతి గాన యిచ్చోట నొక్కతె నేడ్చెద' నంచు 2–165

ఈరోజు నాతోడికోడలి కొడుక్కు ఉపనయనం. వాడూ, వాడూ ఒక్క వయస్సు వాళ్లే కావడం వల్ల వాడేగనక బతికి ఉంటే వాడికి నేను కూడా వడుగు చెయ్యనూ? ఇది మనస్సుకు వచ్చే సరికి అక్కడ అంతమందిలో ఏడవడం బాగుండదని ఇక్కడ ఒంటరిగా కూర్చుని ఏడుస్తున్నాను.

నేన యీతిరిపంబు మానంగ నున్న చో నది దనుదాన మానె మేలయ్యె 1–383

నేనే ఈ తిరిపం మానేద్దాం అనుకుంటూ ఉంటే అదే మానిపొయ్యే పరిస్థితి ఏర్పడింది. మంచి పని అయింది.

పొద పద మింక నీ పొత్తంబు గట్టి చదువులు గిదువులు పొలింపు మనుడు. 1–607

పదపద, ఇంక నీదస్త్రం కట్టిపెట్టు, చదువులు గిదువులూ చాలు చాలులే.

| | |
|---|---|
| పోదురు గాక మీ పోయెడి త్రోవ మా దిక్కరయ నేల మాకును మీకుఁ గారణం బేమేనిఁ గలదె? మేమాడు వారము, బ్రాహ్మణవాద, మట్లయ్యు, నేకతం బొక్కతె యే నున్నయెడకు మీకు వచ్చుడు ధర్మమే యేఁగుఁ డనిన 2-163 | మీదారిని మీరు పోక మావైపు ఎందుకు చూస్తారు? మాకూ మీకూ ఏం సంబంధం? మేం ఆడవాళ్లం. అందులోనూ బ్రాహ్మణులు, అలాంటప్పుడు ఒంటరిగానేను ఉన్న చోటుకు మీరు రావడం ధర్మమేనా? |
| భావింప సంతుఁ దిన్నపావంపుఁబుర్వు దేవుఁడ, మమ్మేల తిన దయ్యె ననక. 1-470 | మాకొడుకును పొట్టనుపెట్టుకొన్న ఆపాము మమ్మెందుకు కఱచి ఉండకూడదు? |
| మీక యుండెదుఁ గాక మీమహత్త్వంబు మా కేమి దీవింప మఱి బుధుల్ లేరె? 1-433 | మీగొప్పదనం ఉంటే మీదగ్గఱే ఉండ నివ్వండి. మాకేం దీవించడానికి బ్రాహ్మణులే లేక పొయ్యారా? |
| వఱలంగ నప్పురి వాడ వాడలను మెలయుచు నాఁడును మఱియొండు శిరము వరుస జైనులనెల్ల భస్మంబు సేయు నెడ నాఁడు మీజైను లెక్కడ సనిరి? ......వైజకవ్వయు వికస్వరభక్తిమహిమ వసుధ జైనుం డనువార్తయు నడఁప నొనఁగునాఁ డీజైనులెక్కడ సనిరి? 1-592 | ఆ వూరివాడవాడనా ఆనాడు ఇంకొకశిరస్సును పొంది జైనులనంతా భస్మపటలం చేసినప్పుడు మీ జైనులంతా ఏమయ్యారు? ఎక్కడికి పొయ్యారు? వైజకవ్వ తన భక్తి మహిమతో జైనుడు అనేమాట లోకంలో వినబడకుండా తుడిచిపెట్టేసినపుడు మీజైనులంతా ఏమయ్యారు? ఎక్కడికి పొయ్యారు.? |
| వలతేనిఁ గొనియాడు వలవదే మానుములుకగా నాయయ్యఁబలుకకు మనుడుఁ గామంబు లేనినిష్కాముల కెట్లు గామించి యీశ్వరుఁ గలయంగవచ్చు. 1-412 | ఇష్టముంటే పొగుడు. లేకుంటే మానెయ్. అంతేకాని మా అయ్యమగురించి చులకనగా మాత్రం మాట్లాడవద్దు - అనగా కామం లేనటువంటి నిష్కాములు ఈశ్వరుణ్ణి కామించి ఎలా పొంద గలుగుతారు? |
| వింటిమి వినమిన్న గంటిమి గానముంటిమి ఏ మన కూరివా రెల్లఁ జూడుఁడో యనుచు భూసురులు బిట్టులిగి. 1-125 | విన్నాము, లేదు, చూచాము, చూడలేదు. ఉన్నాము, లేము అనకుండా ఊళ్లోవాళ్లందరూ చూడండి. |
| విచ్చేయు నీయాగి వేయును మాకు వచ్చేఁ దక్కుము చాలు వనిత నీ వనుచు. 1-362 | దయచెయ్యి. నువ్వు చేసిన దానం ఉందే అదే మాకు పదివేలు. చాలు. వెళ్లు. |

## (VII) దేశీయ విజ్ఞానము

నన్నయభట్టారకుని కాలమునుండి నేఁటిదాఁక వెలసిన యాంధ్రకవులలో పాలకుఱికి సోమనాథునికిఁ గలప్రత్యేకత విశిష్టమయినది. అతఁడు రచించిన బసవపురాణము, పండితారాధ్యచరిత్రము ననుగ్రంథరాజములను జదివినప్పుడు సోమనాథుఁ డొక్క కవీశ్వరుఁడుగా మాత్రమే కాక బహుముఖప్రజ్ఞాశాలియు, లోకజ్ఞుఁడు నగునొక్క మహనీయవ్యక్తిగా మనకు గోచరించును. పరమశివుని పంచవింశతిలీలలు మొదలుకొని పర్వత మెక్కెడి పరుసజనుల వేషభాషలదాఁక నాతఁడు తనగ్రంథములలోఁ జెప్పని విషయము లేదు. తడవని యంశము లేదు. తనభావధార కడ్డువచ్చిన ప్రతివిషయమును నాతఁడు తనివి దీర వర్ణించినాఁడు. సాకల్యముగా వానిని నుట్టంకించినాఁడు. తన కాలమునాఁటి యాటలు – పాటలు, విద్యలు – వినోదములు, పత్తిరులు – పండ్లు, కొండలు, నదులు, మకుటములు, వస్త్రములు, వీణలు, రాగములు, తాళములు – ఒకటేమిటి? యాతఁడెన్నో విషయములను దెలిపినాఁడు. తనకాలమునాఁటి దేశీయ విజ్ఞాన మంతయు భద్రపఱచిన సాహిత్యనిధులతని గ్రంథము లన్నచో నతిశయోక్తి కాఁ జాలదు.

అతఁడు తనగ్రంథములందుఁ జెప్పినవిషయములెన్నో నేఁడు మనకుఁ దెలియవు. కొన్నిటి స్వరూపములే నేఁడు మనకర్థము కావు. అతఁడు పేర్కొనిన యెన్నో విషయములు నేఁడు మన జీవనవ్యవహారమునుండి తప్పిపోయినవి. కాని, యుక్కుటతోను – నభినివేశముతోను నతఁడు తనగ్రంథముల మూలమున నందించిన దేశీయ విజ్ఞానస్వరూప మెట్టిదో మన మీప్రకరణమునఁ బరిశీలింతము.

నేత్రరోగములు, నేత్రవైద్యము, వాయురోగమునకు వైద్యము, సర్పవైద్యము, ద్యూతవిద్య, చోరవిద్య, వస్త్రభేదములు, దెబ్బదిరెండు నియోగములు. పిల్లల ఆటలు, చేపల వేఁట, మృగయు, కోటల నిర్మాణము, శకునశాస్త్రము, మొదలగు నంశములకు సంబంధించిన దేశీయవిజ్ఞానము నీతనిగ్రంథములు మన కందించుచున్నవి.

## నేత్ర రోగములు:

బసవపురాణమునందలి తృతీయాశ్వాసమున ముగ్ధభక్తుల కథలను దెలుపు ర్భమున ఉడుమూరి కన్నప్పకథలో నేత్రరోగములు కొన్ని ప్రస్తావింపం వి. చూడుండు:

'తా నొక్కకంటనె ధార వర్వెడిని
గా నొప్పు నక్షి రోగంబు యేమని
చెప్పం జిత్రము, గోడిజొప్పు వెల్గినదొ
తప్పు వో నొప్పునో? తడికంటి విధమొ
నొవ్వియో? పొర గప్పెనో? మాదటెవులొ?
పువ్వు వట్రేల్ల నాపువుకంటి పోటొ?
మయిల పడ్డది యొ? దుర్మాంసదోషంబొ?
అయిరయో? వెండియు నక్షిరోగంబొ?
కా నొప్పు నిట్లనుమానంబు లేదు.'

బస. 3-195

పండితారాధ్య చరిత్రమునందలి మహిమప్రకరణమునం గూడ నిట్లే కొన్ని రోగములు పేర్కొనంబడినవి. కాళిదాసి యనుశివభక్తుండు తన కన్నులను శివుని కర్పించి యతనివే రాసులు రాసులుగా నేత్రములు పడసె నంట. టు నతండు నేత్ర రోగస్థుల నెల్లరను బిలిచి వారికి నేత్రదానము చేసె నని వర్ణించుసందర్భమున నీ నేత్ర రోగములు పేర్కొనంబడినవి.

'అన్నిదేశంబుల నన్ని పురముల
నన్నిగ్రామముల జాత్యంధు లందఱును
గనుగుర్పు లక్షిరోగస్థులై యున్న
జనుల రండో యని చాటంగం బనుపం
దప్పు వోయినకన్నుం దడికన్నుం బొరయు
గప్పినక న్నుడుక్కంగ న్నొడ్డుంగన్ను
గ్రుడ్డిక న్నెరిగన్ను గోడ్రెప్పు గన్ను
బ్రొడ్డుకన్నును బువ్వు వోయినకన్ను
పాల గట్టినకన్ను బ్రంగుడుకన్ను

గ్రాలుకన్నును నీరు గాఱెడుకన్నును
బ్రొందకన్నును బొరిఁబొరిఁ బ్రుస్సుకన్ను
ప్రందకన్నును బెక్కు ప్రూదలకన్ను
బోటుఁగన్నును బ్రొంగ వోయినకన్ను
దూటు గట్టినకన్ను దూలగొన్నకన్ను
మయిలకన్నును మనుమనుకనికన్ను
నయిరకన్నును బాయ కదరెడి కన్ను
దోఁటు వోయినకన్ను దొలుఁగుడుఁగన్ను
దీఁటుకన్నును, మఱి తిమిరంబు రక్త
దోషంబు దుర్మాంసదోషంబు వాయు
దోషంబుఁ బటలంబు దుర్దర్శి గ్రిష్ణ
కాసయు నతిరక్తకాసయు శ్వేత
కాసయు ననెడి రోగంబుఁ గన్నులును
నాదిగాఁ గలనమస్తాంధులు నక్షి
రోదనన్నులుఁ దనప్రోలి కే తేర ,

పండి మహి పుటలు ***107, 108, 109.***

౨. నేత్రవైద్యము.

అందే శస్త్రచికిత్స చేసి యితరులనేత్రములను నంధులకుఁ బెట్టు నేత్రవైద్య విధానము గూడఁ గలదు చూడుఁడు:

'చెన్నారఁ గాళిదాసియు శివుచేతఁ
గొన్న యామయ్యేడు గన్నులలోనఁ
దా రెండు గన్ను లుద్ధతి ధరియించి
వారివారికిఁ గన్గవలు వుచ్చి వుచ్చి
యిచ్చుచు నంధుల నెల్లను దనువ
నచ్చెరువంది లోకావలి వొగడ
గ్రక్కునఁ దమ తమకన్నులరాక
కక్కజంబె బంది పూర్వాంధులు మ్రొక్క.'

పండి మహి పుట ***109***

ఉడుమూరి కన్నప్పకథలోఁ గూడ నీ శస్త్ర చికిత్సావిధానమే ప్రశంసింపఁ బడినది

### 3. వాయురోగమునకు వైద్యము.

బసవపురాణములోని తృతీయాశ్వాసమున నాట్యనమిత్తండి కథలో వాయు రోగవైద్యవిధానము తెలుపఁబడినది చూడుఁడు

'       వాయుతైలంబుఁ గూర్చి యౌషధము
తెనయంగ వండితి ననుచు నాముదము
నూనియ నొక్కింత నులివెచ్చఁ జేసి
చే నిచ్చెఁ దత్క్రియ సెప్పుచు నతఁడు
వాయుతైలముఁ గొనివచ్చి యాక్షణము
మాయాపహరుమేన మర్దన సేసి
తవిలి యా వావిలి చివుళులు, లుమ్మెత్త
చివుళులు, దక్కాడిచివుళు, లాముదము
చివుళులు, పండిన జిల్లెడాకులును,
నివి యాదిగా మందు లన్నియుఁ గూర్చి
వెచ్చెరఁ దను వెల్ల సేకంబు చేసి
పొచ్చెంబు లేకిస్ముపొట్లాలఁ గాఁచి
పుచ్చుచు నరచేత వెచ్చఁ జూపుచును
నిచ్చ యెఱిఁగి కాఁక లిచ్చుచు వలయు
పథ్యంబు లారగింపంగఁ బెట్టుచును
దథ్యంబుగా వెండి తగుక్రియల్ సేయ '

బస *3-176* పుటు,

### ౪. సర్ప వైద్యము.

పండితారాధ్యచరిత్రమునందలి పురాతనప్రకరణమున సర్పవైద్య మిట్లు తెలుపఁబడినది చూడుఁడు

'జనపతి యప్పుడ వచ్చెఁ, జచ్చుచును
నాడ్యులు [illegible]

వైద్యులు గారుడవరమంత్రవిదులుఁ
జనుదెంచి విషముచేఁ జచ్చినన్నృపతిఁ
గనుఁగొని యిది యశక్యం బంచు నేఁగ
మఱియొక్క గారుడమంత్రసిద్ధుండు
వఱతెంచి విషదర్గభావంబుఁ జూచి
యక్కటా, కఱచెరా హరహరా, పాము
నెక్కని కాలంబు నిండెనో కాక

నాగంబు లన నిరునాల్గుజాతులకు
స్వాము లై తమతమజాతులయందు
నేమించి కఱచు దుర్నీతిపాపులను
ధరణి గారుడమంత్రతంత్రౌషధములఁ
బరమృత్యువు దక్కఁ బాయుఁ దద్విషము
వేండి గజాఁడు దుర్ముఖుండు మిత్రారి
దండపాదుఁడు గుళికుండు రేణుకుఁడు
జనకుండు స్వర్గకుండును మొద ల్గాఁగఁ
జను కిల్బిషో రగశతసహస్రములు
సత్య మకిల్బిషసర్పముల్ పరము
మృత్యు వానన్న మై మెడఁ ద్రొక్కకున్న
గారుడక్రియ వల్ల నేరకుండినను
ధారుణి మంత్రౌషధములచేఁ బాయు
నీవేళ యీజాతి యిన్ని దంతంబు
లీవల నీయంగ మిట యని చెప్పుఁ
దమతమువలఁతులు దప్పక కఱచు
నమితమహోగ్రనాగాంశోరగములు
గారుడమంత్ర సంస్కారప్రశక్తి
నారుగ నావేశ మతనికి వచ్చి
పలుకు ననాగతంబులఁ జెప్పు విషముఁ

దొలఁగించఁ బరమమృత్యువు గానినాఁడు
అపమృత్యువుల నైన నన్ని దంతములు
నపరీక్ష నాఁటిన నరుడు దక్కింప
నగ్గికాఁకలను జలాభిషేకముల
ల గ్గగు నొక్కవల్ నాఁట నాడినను
దండిమంత్రములచేఁ దరియు దంతములు
రెం డూన నౌషధక్రియలచేఁ బాయు
నరు మూఁడు దంతముల్ నాఁటిన వ్రేగుఁ
బరువడిమఱినాల్గు పండ్లు నాఁటినను
ధర మంత్రతంత్రౌషధక్రియ లేల
హరివేధలకుఁ గావ నరిది గావునను
నదియును గర్కోటకాంశ మీపాము
వొదల నాలుగుదంతములుఁ గాడి నవియు
ఫాలలోచనుఁ దహిపతికంకణుండు
గాలకాలుండు నిర్గతమృత్యుభయుఁడు
గాలకంఠుఁడుఁ గావఁ జాలునో యతఁడుఁ
జాలఁడో చాల సంశయ మంచు నరుగ

..

పండి పురా. పుటలు **435** నుండి **438** వరకు

## ౫. ద్యూతవిద్య.

పండితారాధ్యచరిత్రమునందలి పురాతనప్రకరణమున కుమారపాల ఘూర్జరుని కథను దెలుపుసందర్భమున ద్యూతవిద్యావిషయములు కొన్ని తెలుపఁబడినవి దాయము, ఈరైదు, దుగ, ఇత్తిగ, దచ్చొక, పందియ, చౌకదుగము, భద్రము, సత్తా, తీవంచ, సౌవంచి యనుద్యూతపరిభాషాపదము లీసందర్భమునఁ దెలియును మఱియు నందే మఱొకచోట జూదమున నోడినతనతలచుట్టుఁ గాలు వట్టి మోవఁగ నెత్తి కట్టుట శిక్షగా బేర్కొనఁబడినది మూర్ఖనాయనారను భక్తునిఁ గూర్చి తెలుపు సందర్భమున నీశిక్షా విధానము తెలుపఁబడినది

నొడలు నత్తా శివయోగుల కనుచుఁ
దడయక యాడు నత్తా యని పడిన
నాకు నా లీవంతనయె గెలు పనుచు
నాకాంక్షఁ దీవంచ యనుదాయ మాడు
వనిత మెచ్చువు వంచ వైచిన ననుచు
ననఘుఁడు సొవంచి యనుదాయు మాదు
నీ నెత్తి మి చ్లోడ నితరులతరమె
పూని యీశ్వరుకృప లేనివారలకు

,

పండి పురా పుటలు ***367, 368, 369***

కాయకు బొం దెఱుంగమిఁ జేసి మూర్ఖ
నాయనా రెప్పుడు నలి జూద మాడి
గెలిచి యర్థముఁ దెచ్చి వలయుపదార్థ
ములఁ గూర్చి జంగమంబులకు నర్పింప
హరుఁడు దుర్వ్యాతక్రియ నరుదెంచియాడి
శరణున కర్థంబు జాల నోడుడును
ధట్టించి తన తలమట్టునఁ గాలు
పట్టి మోచఁగ నెత్తి కట్టుడు నతఁడు
విడువంగ నేరఁ దేవడువున ననుచు
నొడలందు శివమూత్ర మొక్కింత సూప
హరహర, లాంఛనవరునిఁ గట్టితిని
బరికింప నే నంచు భవమూర్తి కాలు
గట్టిన తన తలమట్టున శిరముఁ
జట్టునఁ దెగఁ గోయు నట్టిచో శివుఁడు
ప్రత్యక్ష మై నిల్చి భక్తి నీ కిత్తు

పండి పురా పుట ***413***

## - చోరవిద్య:

బసవపురాణమునందలి పంచమాశ్వాసమున కన్నడ బ్రహ్మయ్యగారి కథలోఁ జోరవిద్యనుగూర్చి కొన్ని వివరములు తెలుపఁబడినవి. చూడుఁడు

'నిరవద్యహృద్యవినిర్మల భక్తి
పరతంత్రుఁ డన లసచ్చరితఁ బెంపారి
కత్తియు, బలపంబుఁ, గావిచీరయును
గత్తెర, యినుము, నక్షతలును, ముండ్ల
బంతియు, నీలికప్పడమును, ద్రిండు,
మంతరకాటుక, మఱి చండవేది,
నెలగోల, యొంటట్ల చెప్పులుఁ, బీఁకె
యొలుకుల బూడిదయును, వాటు ఊలుఁ,
గుక్కలవాకట్టుఁ, గొంకి నారసము,
గ్రక్కునఁ గంకటిరజ్జువు, నమర
సూచీముఖం బైనఁ జొనుపంగ రాని
యేచినచీఁకటి నిండ్లపంచలకుఁ
జడిముడివలుకులఁ జేరి యుల్వరసి
గడియకన్నంబును గడపకన్నంబు
గోడకన్నంబును గుఱినేలకన్న
మోడక త్రవ్వి యి ల్లొయ్యనఁ జొచ్చి
పరికించుచో భక్తభవనంబు లైన
నరసర దీపంబు సంధించి '

బస 5 పుటలు ***361, 362***

## ౭ వస్త్రభేదములు.

బసవపురాణమున బసవేశ్వరుఁడు తనభార్య చీర విప్పించి యొకజంగమ భక్తున కిచ్చినకథను దెలుపుసందర్భమునఁ బెక్కు వస్త్రభేదములు పేర్కొనఁబడినవి చూడుఁడు

'ఆరు దరు దనఁగ గణారాధనములఁ
గొనివచ్చి జంగమకోటి సన్నేహ

ము నచ్చినట్టి యుము త్ర్యవస్త్రములు
వెంజావలియు, జయరంజియు, మంచు
పుంజంబు, మణిపట్టు, భూతిలకంబు,
శ్రీకన్నియయు, మహాచీని, చీనియును,
భావజతిలకంబు, పచ్చని పట్టు
వాయుమేఘము, గజవాళంబు, గండ
వడము, గావులు, సరిపట్టును, హంస
వడియు, వీణావళి, పల్లడదట్టి
వారణాసియుఁ, జీకు, వాయుఁ, గెందొగరు,
గౌరిగనయమును, క్షీరోదకంబు
పట్టును, రత్నంబుపట్టును, సంకు
పట్టును, మరకతపట్టు, పొంబట్టు,
నెఱపట్టు, వెలిపట్టు, నేత్రంబుపట్టు,
మఱి తపరాజంబు, మాందోళి రవియుఁ,
జంద్రాతపంబును, సాంధ్యరాగంబు,
నింద్రనీలంబు, మహేంద్రభూషణము,
నన్ననడంచును, శరధియు, మేఘ
వన్నెయు, రుద్రాక్షవన్నె, కాంభోజి,
పులిగోరుపట్టును, భూపతి, రుద్ర
తిలకంబు, నరిపట్టు, మలయజసిరియు,
గౌలనిమేఘము, గజావలి, హయావళియు,
వలిపంబు, నరి గమ్మితెలుపు దివ్యాంబ
రంబును, నుదయరాగంబు, దేవాంబ
రంబు, పొత్తియు, గుజరాష్ట్రంబుపట్టు
మొదలుగా నెఱుఁగమే మును దరతరము.'

బస 3 - పుటలు ***127-128***

మఱియు నందే పండ్రెండేండ్లు నేసిన పసిఁడి పటవలిపుట్టమును గూర్చి చెప్పి యున్నాఁడు (చూ బస 3- పుట 130)

'నలి నిడిగుడి నయనా రసుభక్తుఁ
డిల నాలిచీర లొల్లీఁడె భక్తులకుఁ
బొంద్రెండువర్షముల్ పాయక నేసి
పంద్రెండు మూరల పసిఁడి పుట్టంబు
వివరీతగతిఁ దన్ను వేఁడుడు నొక్క
దపసికిఁ దేవరదాసయ్య యీఁడె?'

బస 3 పుట 130

## ౮. బాహత్తరి నియోగములు లేక డెబ్బదిరెండు నియోగములు

బసవపురాణమునందలి చతుర్థాశ్వాసమున మడివాలు మాచయ్యగారి కథలో బాహత్తరి నియోగవములలోఁ గొన్ని ప్రస్తావింపఁబడినవి ఇవి యాకాలమున నుండినకొన్ని జాతులను బేర్కొనును చూడుఁడు

'సరసిజభవుజడల్ జన్నిదంబులుగఁ
బరఁగ భిక్షించిన బ్రాహ్మణుఁ డతఁడ
మహితాపవర్గ సామ్రాజ్యపట్టంబు
సహజంబ పాలించుక్షత్త్రియుఁ డతఁడ
కడఁగి దుర్భవకర్మ ఘటవహిత్రంబు
వడి భవాంబుధిఁ ద్రిప్పువైశ్యుండు నతఁడ
యిల సత్క్రియారంభఫలములు గోసి
సొలవక నూర్చెడు శూద్రుండు నతఁడ
యాదిశక్తియ మున్నుపాదానముగను
నాదబిందులు గారణంబుగఁదగిలి
వేడుక బ్రహ్మాండ వివిధ భాండములఁ
గూడ వానెడు నాఁటి కుమ్మరి యతఁడ
హరియెమ్ము దండంబు నహవతి ద్రాడు
నరసింహు పెను వగు నఖరంబు గ్రొంకి
యవని మోచిన వరాహు బెజ్జగాఁగ
నవనిఁ గూర్మంబును నల్ల మత్స్యంబు
గాలమిటవేకోదకంబునఁ దిగి?

లీల నటించు నాజాలరి యతఁడ
చటుల సంస్కృతి జీవఘటచక్రకర్మ
పటుపరివర్తన భ్రమణంబుఁ గూర్చి
కీలు వొందించి యాక్రియ రాటనముల
వాలి యాడించు నా వడ్రంగి యతఁడ
మును జీవ మను లోహమునకు జ్ఞానాగ్ని
వొనరఁగఁ బద నిచ్చుకను మరి యతఁడ
యిచ్చుచో నెఱిఁగి కల్లచ్చుల నూకి
యచ్చుల నొరఁగొను నగసాలి యతఁడ
హరిణమై రమియించు నజుని శిరంబు
శరమునఁ ద్రెంచిన శబరుండు నతఁడ
హరిముఖ్య క్రిమికీటకాది పశువుల
వెరవుగఁ బాలించు వ్రేతేఁడు నతఁడ
ప్రకటిత కపట నాటకసూత్రములను
వికృతిప్రకృతు లార్చువెండేఁడు నతఁడ
కులనగంబులు నూకి జలధులు నల్లి
పొలము వోడేర్చు నాబోయయు నతఁడ
యేకార్ణవం బైన యెడ నజాచ్యుతులఁ
జేకొన కుదికెడు చాకియు నతఁడ
మహితభక్తాలికి మడుఁగులు నేఁత
మహి నిష్ఠ మడివాలు మాచయ్య యనఁగ
నిన్నియుఁ దాన యై యిట్లున్నయతని
కన్నెద వొకగులం బది నీకఁ గునె?'

బస 4 పుటలు 238, 239

". పిల్లల యాటలు·

పండితారాధ్యచరిత్రమునందలి పురాతనప్రకరణమున సకలేశ్వర రాదిరాజయ్య గారి కథలో – తెలుఁగుదేశమునందుఁ బిల్ల లాడుకొను నన్నియాటలు పేర్కొనఁబడినవి చూడుఁడు

*'ఆరంగ నేఁ దమ యాారాధ్యదేవు*
*పేరు గావున నున్నుఁ బెద్ద మన్నించుఁ,*
*బొందంగ రాగుంజుపోగుంజులాట*
*గుండెనగుడి గుడిగుంజంబులాట*
*యప్పలవిందులయాట, వల్మాఱుఁ*
*జప్పట్లు వెట్టుట, నరిగుంజులాట,*
*సేరబొంతలయాట, సిట్ల పాట్లాట*
*గోరంటలాట, డాఁగుడు మూఁతలాట,*
*డీకొని దిగుదిగుదిక్కైనునాట*
*లాకాంక్ష నాతోడ నాడెడువాఁడు*
*విలిచిన ముందట నిలిచినఁ బలుకఁ*
*డలవోకయును జూడఁ డలుక యెట్టిదియొ '*

పండి పురా పుట ***460.***

## ౧౦. చేపలవేఁట

బసవపురాణమునందు రెండుస్థలములలోఁ జేపలవేఁట ప్రస్తావింపఁబడినది చూడుఁడు

*'హరియెమ్మ దంతంబు నహావతి ద్రాడు*
*నరసింహు మెనుపగు నఖరంబు గ్రొంకి*
*యవని మోచిన వరాహం బెఱ గాఁగ*
*నవనిఁ గూర్మంబును నల్ల మత్స్యంబు*
*గాల మి ల్లేకోదకంబునఁ దిగిచి*
*లీల నటించు నాజాలరి యతఁడ.'*

*బస. **4** పుట **238***

మఱొకచోట నడిభక్తునికథలోఁ గూడ నీచేపల వేఁటను గూర్చిన ప్రస్తావము కలదు చూడుఁడు

*'మఱియును నప్పాండ్యమండలంబునను*
*మఱి యొండు గాయకం బెఱుఁగమిఁజేసి*

వల యెత్తి నీటిలో వైవంగఁ దడవ
వలఁ దోఁతె వచ్చిన వలుఁద మత్స్యంబు
నదియు శివప్రీతి యని పోవ విడుచు
నిదియ నేమము గాఁగ నితరమత్స్యముల
నంగడిఁ బోకార్చి యందుల లబ్ధి
జంగమారాధనల్ సలుపుచు లీలఁ
జరియింప దినములు సనఁగ వేఁటయును
బరికింప నేనాళ్లు వాటమి డస్సి
వలఁ గొని మఱునాఁడు వైవంగఁ దొలుత
వలనుగా నందు సువర్ణమత్స్యంబు
వచ్చిన నదియు శివప్రీతి యనుచు
నచ్చోన పో విడ్చి యవల వైచుడును
నమ్మిన వచ్చుడు నారెవు విడిచి
యెమ్మెయి వల వైన నెప్పటి మీన
తగులంగ విడువంగఁ దగులంగ విడువఁ
బగ లెల్ల నమ్మిన పట్టువడంగ
నాత్మేశునకుఁ బ్రియం బన్నమత్స్యంబు
నాత్మార్థమై కొను టనుచితం బనుచు
నింటికి నేతెంచి యిటు రాత్రి పుచ్చి
తొంటి యేటికిఁ బోక తూర్పు దీక్షికను
వల యెత్తి వైచుడుఁ దొలునాఁటి మీన
మలరుచు వచ్చుడు నట్లు పో విడిచి
మఱి వైవ నమ్మిన మసలి వచ్చుడును
జఱినవ్వు నవ్వుచు శివునిమత్స్యంబు
నేడ చూచినఁ దాన యీయేటు వైన
నాడ యీశ్వరుమీన మరుదెంచె నేని
వలఁ జేతఁ బట్టు నావ్రత మిది యనుచు
వల యెత్తి యూఁకించి వైచి తప్పుడును
వలతోన తొడఁబడి వచ్చి ముక్కున్ను

నలిఁ జతుర్భుజములు నంది వాహనము
నమరంగ శివుఁడు ప్రత్యక్షమై నిలిచి
ప్రమథేంద్రపదవి యారంగ నిచ్చుడును '

బస 4-317, 318 పుటలు

## ౧౧. మృగయ.

బసవపురాణమునందలి పంచమాశ్వాసమున తెలుఁగు జొమ్మయ్యకథలో మృగయావర్ణనము గావింపఁబడినది అది తెలుఁగుదేశమునందలి వేఁటవిధానమును దెలుపును చూడుఁడు

'పచ్చని తలచుట్టుఁ బచ్చకుప్పసము
నచ్చెరువున విల్లు నమ్ములు వట్టి
నందనవన మరణ్యంబుపై విడియు
చందంబునను సహజక్రియఁ బొల్చు
బలువేఁటకాఱు, నావంచాన్య మీఱు
చలమును బలమును గలజాగిలములు
దనుఁ బరివేష్టించికొని యేఁగుదేర
ననఘుండు జొమ్మయ్య సన నరణ్యమున
నమ్ముఁగావలి యుబ్బి జొమ్మయ్య మీఁదఁ
గ్రమ్మనఁ జనుదేరఁగా వేఁటకాఱు
నడిఁ గేల డుయ్యుడు సారమేయములు
నడర నంకమపోలె విడిపించి కొనుచుఁ
బొంగి మనోవేగమునఁ గూడ ముట్టి
యంగద మృగముల నార్చుచు డ్రేయఁ
గుక్కల జంకించి కోలల కెగసి
చక్కన జొమ్మయ్య శరముల కెదిరి
చచ్చును శాపమోక్షంబులు గాంచి
యచ్చోన గంధర్వులై నిల్చి తెలుఁగు
జొమ్మయ్యగారి పాదమ్ముల కెరఁగి
నమ్మదలీలఁ బ్రశంస సేయుచును

పృథుగురుధ్యానమన్ భిందిపాలమునఁ
బ్రథితసంసారమన్ పంచాస్యుఁ ద్రుంచి
మును భక్తదర్శనంబను ముద్గరమునఁ
జనుపురాకృతకర్మ మనుదుప్పిఁ జంపి
గుర్వాజ్ఞ యనుకత్తికుంతంబునందుఁ
బూర్వాశ్రమం బను పులిఁ బడఁ బొడిచి
సంజ్ఞాన మనువాఁడి సురియఁ జేపట్టి
యజ్ఞాన మను వరాహంబుఁ జెండాడి
యాయతి సద్భక్తి యనుతోమరమున
మాయాప్రపంచమన్ మనుఁబోతుఁ దునిమి
వినుతశివాచార మనుకుఠారమున
జినలోకపథ మను చిప్పంగిఁ జిదిపి
విమలప్రసాదమన్ విల్లు పూరించి
భ్రమితేంద్రియము లనఁబడు నిర్ల వేసి
భాషాప్రణీతమన్ బడు బల్లి గోల
నీషణత్రయ మనునెలుగుక న్పొడిచి
పారమహత్త్వం బనునర్ధాయుధమునఁ
వెలసిన యాబలువేఁటకానికిని
నిల మృగంబులఁ జంపు టిది యెంత పెద్ద.'

బస. *5–396, 397* పుటలు

## ౧౨. కోటల నిర్మాణము:

బసవపురాణమునందలి తృతీయాశ్వాసమున దీపదకళియారుకథలోఁ గోటల నిర్మాణమునుగూర్చి కొన్ని వివరములు తెలుపఁబడినవి. చూడుఁడు:

'గుడియు మంటపమును గ్రొత్త గావించి
కడు నొప్పఁ జుట్టు నగడ్తఁ ద్రవ్వించి

కోటయుఁ గొమ్మలుఁ గొత్తడంబులుఁ గ
వాటంబులును దగువంకదారలును
బెట్టించి వంపుడుగట్టు యగడ్త
చుట్టును బోయించి యట్టళ్లు దీర్చి
పాలుపొందఁ దెంకణంబులు వెక్కు వన్ని
నలిఁ బడగలుఁ దోరణంబులు గట్టి
కొత్తడంబులఁ గోట కొమ్ముల గొడుగు
లెత్తించి బలుమగ లెందఱొ ననిచి
వ్రాలినకుసులును వసులు దూలములు
ఱాలు గుండ్లును నిమ్మసాలఁ దెప్పించి
కోటకొమ్ములఁ దగు చోటఁ బంచించి
కోట యాక్రమమునఁ బాటించి యంత
లోఁతుగా నడబావి లోనఁ గట్టించి
పాఁతర్లఁ గొలుచు నేర్పడ సంగ్రహించి
యగ్గడిమట్టు బిల్వాశోకసురభి
గుగ్గులుక్రముకాదికుజములు వెట్టి
మరువంబు దవనంబు మాచిపత్తిరియు
వరుసను బాహ్యపుష్పవాటికల్ నాఁటి
జాలవారిని దివ్వటీలను బల్ల
గోలలవారిని గుడిపూజరులను
నాడిసెలకాండ్రను నోజులవారి
బడిపనిజనులను బంతంబుబంట్ల
ద్వారపాలుర సువిధానుల విండ్ల
వారిఁ దలారుల వారక యేలి
వారును దాను నవారితశక్తి
గోరంతప్రొద్దు మేకొని కట్టు బిగిచి

బస 3-168, 169 పుటలు

## ౧౩. దేవాలయ నిర్మాణము:

బసవపురాణమునందలి తృతీయాశ్వాసమందే ఉడుమూరి కన్నప్పకథలో – దేవాలయనిర్మాణవిధానము తెలుపఁబడినది చూడుఁడు·

*'హూరుఁ డెండఁ గారెడినసుచు నచ్చెలఁది*
*పరుచడిఁ దనమూలు దెరచీరభాతిఁ*
*దిరిగి వచ్చిన వృక్ష తృణగుల్మలతలఁ*
*బురికొల్పి మీఁదఁ గపోతముల్ దీర్చి*
*కరువుఁ బ్రతిష్ఠించి గంటయు వేది*
*విరచించి శిఖరంబుఁ గర మొప్ప నిలిపి*
*ద్వారబంధంబులు దగినవాకిళ్లు*
*నారంగ గర్భగ్రహాదులు దీర్చి*
*యకలంకకరవీరముకుళప్రభాతి*
*ప్రకటించి దేహాళీబంధంబునందు*
*రమణీయశతసహస్రదళాబ్జపంక్తు*
*లమరుపూజాప్రబంధానేకరచన*
*గావించి చెలఁది త్రికాలంబు భక్తి*
*భావనమై శివుఁ బాయక కొలువ*
*,*

*బస 3–188 పుట*

## ౧౪. శకునశాస్త్రము.

బసవపురాణమునందలి సప్తమాశ్వాసమున – అల్లయ్య మధుపయ్యల కథలో శకునశాస్త్రమునకు సంబంధించిన కొన్నివివరములు తెలుపఁబడినవి చూడుఁడు

*'కటకటా, కటకంరుగణములు వోఁవఁ*
*గటకంబుభాగ్యంబు గ్రక్కునఁ దొలఁగె*
*భూకంప మయ్యెను భువి నర్ధరాత్రిఁ*
*గాకు లఱచె వంటకంబులు వ్రచ్చె*

ధరఁ బడె నుల్క లత్తఱి బాలవాన
గురిసె భాస్కరచంద్రపరివేష మయ్యె
దివి దీటుకట్టె మేనవి మూఁగె మంచు
గవిసెను మధ్యాహ్నకాలంబునందుఁ
గడు నుగ్రరూపుఁడై కాలుండు గానఁ
బడియెను బట్టణప్రాంతదేశమునఁ
బొరిఁబొరిఁ గవిసెఁ గావిరి యెల్లయెడల
ధరణీశ్వరుఁడు గాంచెఁ దలలేని నీడ
రవి యుదయించు తత్ప్రస్థానంబునను
దివిఁ బ్రతిసూర్యులు దీపించి రింక
నెంత గా నున్నదో యిటమీఁద ననుచు
సంతాపచిత్తులై జనులు భీతిల్ల

బస. 7–576 పుట

పండితారాధ్యచరిత్రమునఁ గూడ శకునశాస్త్రమునకు సంబంధించిన విషయములు కొన్ని తెలుపఁబడినవి చూడుఁడు:

'పరమమాహేశ్వరప్రకరంబుఁ దాను
నరుగంగ నరుగంగ నంత నిక్కడను
బురి మహోత్పాతముల్ పుట్టంగఁ దొడఁగె
బాడువాఱంగఁ జొచ్చెఁ బట్టణం బెల్లఁ
జోడండు తల లేని నీడఁ గన్గొనియెఁ
గాలునిఁ గలలోనఁ గనియె, శ్వానములు
మోలగింపఁగఁ జొచ్చె రేలుఁ బగల్లు
వీఁకఁ గావిరి వెల్లి విరిసె, గుల్మముల
తోఁకల నిప్పులు దొఱఁగంగఁ జొచ్చె
నేలగాలఁగఁ జొచ్చె నింగి వడ్డట్టు
పాలి మేఘంబు లానన్న మై పర్వెఁ
బవలు నుక్కలు గానఁబడియె, ధూమంబు

గవిసె, నెల్లడ వంటకంబులు వ్రచ్చ
భూకంపరావ మద్భుతమయ్యె రాత్రి
గాకకౌశికజంబుకము లర్వఁ దొడఁగె
గాలి ధూళియుఁ బర్వెఁ గడు మోర లెత్తి
తూలుచుఁ బశువులు దొరుగంగఁ జొచ్చె
నింద్రచాపములు ఖండేందుచాపములుఁ
జంద్రార్కపరివేషజాలముల్ వొడిచె
మనుజేశునకు నంత మంత్రివిరోధ
మును బ్రధానవిరోధమును నాప్తభట వి
రోధంబుఁ బుత్రవిరోధంబు నిరప
రాధంబుఁ బుట్టె, నూరను మారి మసఁగె
ధరణి వెండియు మహోత్పాతముల్ వుట్టె.'

పండి మహిమ పుటలు ***59, 60***

ఇవి కాక యింకను నెన్నో విషయము లాతనిగ్రంథములయందుఁ దెలుపఁబడి యున్నవి. అవి యెల్ల నాతనిదేశీయవిజ్ఞానప్రాచుర్యమును దెలుపును శివమహోత్సవములలో నాతనికాలమునఁ గానవచ్చు ముచ్చటలు, ఉత్పాతములు, ఆభరణములు, జంగమకోట్లవేషము, వృద్ధతపోధనుల వేషము, మకుటములు, కుండలములు, బెత్తములు, గొడుగులు, నీరు నింపు పాత్రవిశేషములు, పత్తిరులు, పుష్పములు, ఫలములు, అడవి దినుసులు, గుడారములు, సంగీతశాస్త్రవిషయములు, నాట్యశాస్త్రవిషయములు అను విషయములను గూర్చి యాతనికిఁ గలపరిజ్ఞాన మంతయు నాతని పండితారాధ్యచరిత్రము నందును, బసవపురాణమునందును నిక్షిప్తము చేయఁబడి యున్నది అవి యెల్లఁ బట్టికలరూపమునఁ బ్రత్యేకప్రత్యేకముగా నీదిగువఁ బ్రదర్శింపఁబడినవి. అతని దేశీయ విజ్ఞానవైభవము వీనిమూలమున మనకుఁ గనులకుఁ గట్టు ననుట కెట్టి సందియమును లేదు.

## శివమహోత్సవములలో ముచ్చటలు

పాదాబ్జములమీఁదఁ బడి యుండువారు, పాదరేణువులందుఁ బడి పొరలు వారు, చుట్టుఁ జేరి ప్రణుతించువారు, నా అమ్మ నాఅక్క నాతల్లి యని

ముద్దాడువారు, మొలలయందుఁ దలలయందు బ్రాకులు చుట్టుకొని నటించువారు, చూరిలోని సెంబలి కోల దూసికొని కేళికలు చేయువారు, కత్తియు నారెయుఁ బట్టి యెగిరి యెగిరి యాడువారు, పాదరక్షలు తలలపై నిడుకొని యాడువారు, సంబవులు తాటించి యా ధూళిని ధరించువారు, చెప్పు లెగురవేసి పట్టుచు నాడువారు, చుట్టును జప్పటలు వెట్టి గునిసి గునిసి యాడువారు, పదపద్యములఁ గూర్చి పాడువారు, దండనాయకుని గీతములు పాడుచు సోలెడువారు, పురాతనమహితగీతులు పాడువారు, పంచమహా వాద్యపటలములతో నాడువారు, కో యని యార్చుచుఁ గునిసి యాడుచు 'చాంగుబళా' యనువారు, విభూతివసంత మాడువారు

**ఉత్పాతములు .**

పట్టణము పాడు వాఱుట, తల లేని నీడ కనుగొనుట, కలలోనఁ గాలునిఁ గనుట, రేయింబవళ్లు కుక్కలు మొఱుగుట, కావిరి వెల్లి విరియుట, గుఱ్ఱముల తోఁకల యందు నిప్పులు రాలుట, నేల కాలుట, నింగి పడినట్లుగా మేఘము లానన్న మగుట, పగలు చుక్కలు కాన వచ్చుట, ధూమము కవియుట, వంటకములు ప్రుచ్చుట, భూమి కంపించుట, రాత్రియందుఁ గాకులు, గ్రుడ్లగూబలు, నక్కలు నఱచుట, సుడిగాలి వీచుట, పశువులు మోరలెత్తుకొని పరువెత్తుట, ఇంద్రచాపములు సూర్యచంద్ర పరివేషములను బొడుచుట, రాజునకు మంత్రివిరోధము, ప్రధానవిరోధము, అష్టభట విరోధము, పుత్త్రవిరోధము, అనునవి నిరపరాధముగాఁ గలుగుట, ఊరియందు మారి మసగుట (2-59)

**ఆభరణములు .**

కంచుమట్టెలు, ఉంగరములు, వల్దయూరులు, నల్లగాజులు, తగరపుఁ గడియములు, పచ్చగాజుపూసలు, నంకుపూసలు, నల్లపూసల బన్నసరము

**పదరచనములు .**

తుమ్మెద పదములు, ప్రభాత పదములు, పర్వత పదములు, ఆనందపదములు, శంకరపదములు, నివాళిపదములు, వాలేశుపదములు, గొబ్బి పదములు, వెన్నెలపదములు సంజవర్ణన, గణవర్ణన పదములు

## ఆభరణములు

రాగికుండలములు, రాగినందులు, రాగినూలులు, రాగికంటెలు, రాగి యుంగరములు, రాగి దండలు, రాగి జన్నిదములు, రాగి యుత్తెరలు, కొక్కెరలు, పాలెలు, సరిపెణలు, నేవళములు, కీలుకొలుకులు, రాగి కీర్తిముఖములు, అందెలు రాగికటకములు, రాగి పదకములు, రాగి ఒడ్డియాణములు, కటిసూత్రములు (2-312)

## జంగమకోట్ల వేషము

సంబువులు, పసిండిగొడుగులు, సావలు - పావలు, లోహపుఁ బావలు, దంతపుఁబావలు, రాగిపావలు, వాగెల పాదరక్షలు, చందనకావులు, సరిసాటికావులు, కఱకంచుకావులు, వలిపాత్తిపచ్చడములు, కౌపీనములు, గూడకట్టులు, వెలిబేరెములు, కళుకులు, జోడు కుప్పసములు, పట్టుత్రాళ్లు, ప్రాఁతపట్టు వస్త్రములు, పట్టుతొంగళ్లు, పట్టువీణెలు, చందురుకావి పల్చని చల్వదొల్లు (2-307, 308)

కావిపచ్చడములు, కావి దుప్పట్లు, రావు మంజిళ్లు, ఖండంబుఁగోవులు, చల్లడాలు, దట్టిపచ్చడవములు, రత్నకంబళులు, వెలిపాత్తిపచ్చడవములు, బూరవడములు, పట్టుపచ్చడములు, వెలిపట్టు పైఁబెట్లు (2-309)

## వృద్ధతపోధనుల వేషము :

నగము అట్టలు విడిసిన ప్రాఁతలగు గూడచెప్పుటట్టలు, కుట్టిన గుడ్డల గోర్పడములు, అడిప్రాఁత కచ్చురములు, చింపి గొడుగులు, ఊఁతగోలలు. (2-314)

## మకుటములు :

ఉప్పరమునందుల పటికవలయము, రుద్రాక్షవలయములు, మీఁదఁ గలశవములు, కంచుగుబ్బలు, కెలఁకులయందుఁ జంద్రసూర్యులు కల చీరమకుట ములు, కంబళమకుటములు, నంది మకుటములు, పులితోలు మకుటవములు, కంచి మకుటవములు, రుద్రాక్షమకుటవములు, రాగి మకుటములు, నవరత్న మకుటములు, సోగతప్పరములు, బోడ తప్పరములు, గొప్పు తప్పరములు (2-309)

**కుండలములు**

స్ఫటికకుండలములు, రుద్రాక్షకుండలములు, మణికుండలములు, హేమ కుండలములు, రజతకుండలములు, రాగికుండలములు, నంది కుండలములు, నాగకుండలములు (2-310)

**బెత్తములు**

పన్నిబెత్తములు, వలిబెత్తములు, వలయపుబెత్తములు, మలకబెత్తములు, కక్కుబెత్తములు, వాదిబెత్తములు, వెదురుపొంజాయి బెత్తములు.

సైరణంగోలలు, సందనములు, గైరంబులాకులు, కనుపదండములు, అనసుల కోలలు, అనసుల మొగడలు, అనసుల సందుల జనులు, ఆకులములు, జలపోసనములు, కలశములు, పట్టుంగుచ్చులు, చిత్తరువులు, వెలిగొడుగులు, ముత్యాల గొడుగులు, వెలిపట్టుగొడుగులు, మోడ్పు గొడుగులు (2-310, 311)

**నీరునింపు పాత్రవిశేషములు:**

ఉత్తిలములు, పోకపొత్తులు, గల్లతిత్తులు, రాగిబిందెలు, పేరుపులు, కుండలు, గలంతలు, గుల్లగోరలు, గిండులు, కమండలములు, గరిగలు, బటువులు, కావళ్లు, గూడగర తిత్తులు

**పత్రిరులు.**

దేవగందలి, దవనము, రుద్రజడ, మరువము, అఖండబిల్వపత్తిరి, ఆవురు పత్తిరి, మాచిపత్తిరి, నేరేడు పత్తిరి, జమ్మిపత్తిరి, కాంచన పత్తిరి, పచ్చపత్తిరి, మారేడుపత్తిరి, వెలగపత్తిరి, వావిలిపత్తిరి, ఉమ్మెత్తపత్తిరి, గన్నేరుపత్తిరి, నెల్లిపత్తిరి, సంపెంగ పత్తిరి, ముసిడి పత్తిరి, సోమిందపత్తిరి

**పుష్పములు.**

గోగు, గేదంగి, మల్లె, చేమంతి, మొల్ల, చరచీద, తుమ్మి, జిల్లేడు, రేల, గురివింద, పొన్న, విరవాది, ములకు ప్రాకుడు, జాది, తామర, కలువ, కింశుక, సంజగి, ఉమ్మెత్త, క్రోవి, గుమ్మడు, కలిచె, తంగేడు, ములగు, కాంచన, గంటె, మారేడు, మంగ, గోరింట, కొమ్మి, చెంగల్వ, వెలగ (2-355, 356)

బొడ్డుమల్లియలు, కుందనవములు, చేవంతులు, నాగకేసరవములు, పున్నాగములు, పొగడపూవులు.

**పండ్లు :**

రేనం, మామిడి, ఈడె, నేరేడు, మొదలి, ఖర్జూరవము, పరికె, హింతాలము, జీడి, చిడిముడి, జామ, దానిమ్మ, మేడి, చిఱునెల్లి, మొలుగు, మారేడు, బలుసు, చిరి విందు, తుమికి, నారంగము, అనటి, గజనిమ్మ, కలివె, గువ్వమడి, వెలగ, కలుజువ్వి, ద్రాక్ష, మాదిఫలము,రావి, న్యగ్రోధము, వేవ,గొడవుడు, బుడము, జంబీరము, పనస, పులుపురు, పాల, బలిచిలి, అరిగి (2-357, 358)

**అడవి దినుసులు.**

వెల్లంకి, రేమిడి, కలివె, మామిడి, చిగురునిప్పపువ్వులు, తేనెలు

**గుడారములు.**

గూడచప్పరములు, గుడిసెలు, గూళ్లు, గుడారములు, తెరలు, గొల్లెనలు

**సంగీతవిషయములు : వీణలు :**

రావణహస్తము, బ్రహ్మవీణ, లావణ్యవీణ, కైలాసవీణ, అకాశవీణ, పినాకివీణ, సారంగవీణ, కూర్మవీణ, స్వాయంభువీణ, గౌరివీణ, కిన్నరవీణ, జనక. (3-207 బస )

మొగచాళము, నవరాణము, నవరాణము, తాళపట్టియ, కత్తరి, చోళవణి, సారణ. (3-207 బస )

బ్రహ్మవీణ, కైలాసవీణ, సారంగవీణ, కూర్మవీణ, ఆకాశవీణ, రావణవీణ, గౌరి వీణ, గాంధర్వవీణ, బాణవీణ, కాశ్యపవీణ, స్వయంభువీణ, భుజంగవీణ, భోజవీణ, కిన్నర వీణ, త్రినరివీణ, సరస్వతివీణ, మొల్లవీణ, మనోరధవీణ, నరధగణనాధవీణ, కౌమారవీణ, అణివాణి, రావణహస్తము, తిపిరి, నకనె, వలి, విచిత్రక, నటు, సాగరిక, గుంభిక, విపంచిక, సరవీణ,

వరవాదివీణ, మల్లది, కోలాష్ఠి, స్వరమండలము, ఘోషావతి, ఔదుంబరి, తంత్రి సాగరము, అంబుజవీణ (2-443)

**తంత్రులు.**

గీతానుగము, ఉభయానుగము, ముఖవీణానుగము, ద్రుతానుగము (2-444)

**జన్యజనక విరచనలు·**

కరణికలు, దండి, చిత్రము, మృదువు, లలి, మాధుర్యము, ఉల్లసము, నయరాణము, మొగచాళము, సుకళ, హయరాణము, దశహరము, సారణము, బొట్టవణిక, తిరువు, వక్తి,తాళపట్టె, కర్తరి. (2-444)

**బంధములు**

సమహస్తము, సైరణము, పదము, అంతరము, పారణ, దోర్తు, గలితము, జతి, ద్రుక్కారము, గచ్చము, మలపము, ముఖవాద్యము, జల్లణము, బొల్లావణి, మలపు, విబర్హణము, ఉల్లంఘి, అనుఘాతయుత్తాళ, విషమవాణి, అర్ధార్ధవాణి, అర్ధవాణి, దళుకుంభవాణి, దండహస్త, జోవాణి, సమగ్రత, బిండహస్త, చంద్రాణి, గజవతి, పంచహస్త, శిరోవధి, అంతరావృత, విహస్త, పయశ్ఛేది, అస్థానగర్భ, జతి, పాజ, జలపాణి, సమపాణి, భేదగతి, పరిశ్రమము, గర్భన్నిర్ణయము (2-455)

**సప్తతాళములు.**

చంచుపుట, గచ్చపుట, షడ్గీత, ఉత్పుట, మోచిత, సమతాళ, సత్రచ్ఛేద. (2-446)

**సప్తవింశతి శుద్ధతాళములు:**

ఎగ, బొంబడ, ఎడ, వాడ, గారు, హడుక, బంధకరణ, బాడకరణ, క్రౌంచ పదము, సరకరణ, ఆస్థానమండపము, ఫలము, చక్రవాళము, కలహంస, ఆర్య, లలిత, సరళ, విరళ, ఉమామందిర, మత్తమాతంగ, రథ్య, మర్ధె, ముదవ, బంధమర్దెము, వర రూపకము, ఏకతాళము, మరెతాళము (2-447)

## అష్టోత్తరశత తాళభేదములు

ఖండితతర, అచఖండ, కంకాళ, ఖండిత, చండకి, ఖండవర్ణ, అవిఘూర్ణిత, కుటిల, ఘూర్ణిత, గోష్ఠి, ఆర్ణ, కచ్చణ, ఆణ, ఆది, మాతృక, తరక్షణపుత్రి, ఉద్వీక్షణ, ఉచ్చవటి, అక్షోలిక, చటిక, యష్టిక, పూర్వకంకాళ, మణిమిశ్రకంకాళ, ఖండకంకాళ, కావ్యకంకాళ పంచాళ, భిన్నక, కోకిలప్రియ, నిరవద్య, రన్న, కుంజర, ఫణిరాజ, చతుశ్రదార, కృత్తి, విద్యాధర, రక్తధార, ఉత్తమమేరు, తాంబూలియాణ, మలవు, ఉత్ఫుల్లక, మాతంగ, అర్ధకలిక, సరస్వతీకంఠాభరణ, మిశ్రతాళ, సంమిశ్రవాద్య, మిశ్రకళా స్ఫూర్తి, మిశ్రవర్ణనము, సింహవిక్రీడిత, సింహనాద, సింహనందక, లక్ష్మీస్తన, ముక్త తాళ, పంచబ్రహ్మ, దశవృద్ధ, పంచతాళ, చాయణ, పరితాళ, ప్రసక్త, ఖుర, విసరఖుర, ఉత్తర, పంచావాణ, హరిణ, మాయాఖణ, ఆదికంఖాణ, ఖంజర, చతురశ్రఖంజర, కృష్ణఖంజర, అసమానఖంజర, తాళ, లఖ్ఖచతి, ధ్రువ, లయ, తనుభద్ర, లఖ్ఖణియాణ, విలంబిత, ఆది, మర్గె, వళీ, ధ్రువర్గె, జంపె మర్గె, మును తెగమానంబు మర్గె (2-448, 449)

## అష్టాదశ వాస నాదములు:

జాతివాస, విజాతివాస, కుమారవాస, పక్షవాస, భువనవాస, శ్వేతవాస, భాస్కరవాస, వరరుద్రవాస, హరివాస, నిధివాస, అష్టదిగ్వాస, ఋషివాస, కార్తికవాస, అఘోరవాస, బ్రహ్మవాస, త్రిపురవాస, శివభక్తివాస, భువనాధిపతివాస (2-449)

## గతిభేదములు.

ఆలాపము, హేలనము, వ్యాప్తి, బెడంగు, చాలన, సుళికె, జరుము, ఇంపు, అణువు, తిరువు, జయ, అనుజయ, కొంకు, వుణవ్రాణ, క వలి, భజవణ, పొంపు, నెవ, వహణి, సవ్యాంగుళవహణి, అధరవహణి. (2-450)

## సప్తస్వరములు :

స, రి, గ, మ, ప, ధ, ని (2-450)

## సప్తాలాపములు

ఆరోహి, అవరోహి, చక్రవాళ, నంపద, ప్రవ్యక్త, సువ్యక్త, లాలిత, (2-450)

**సప్తగ్రామములు :**

షడ్జము, ఋషభము, గాంధారి, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము (2-451)

**శ్రుతులు :**

సకళ, గూఢ, నిష్కళ, సంపూర్ణ, నావలి, మధుర, ఏకాక్షరి, భృంగి, జాతి, పరేంగిత, పూర్వవాస, రంజక, అలంకారిణిని, రేణుక, ప్రస్తవాసి, లలిత, స్వర వాస, భాషాగ్ని, నర్తకి, నాపూర్ణ, ప్రచ్ఛన్న, సర్వవ్యాపి (2-452)

**గమకములు**

దీర్ఘ, లాలిత, దీర్ఘిక, అదీర్ఘ, దీర్ఘోల్లసితము, దీర్ఘకంపితము, ఉల్లసితము, సమోల్లసితము, ఉల్లాసితము, ఉచ్చరితము, మూర్ధిక్షిప్తము, కోమలము, అక్షిప్తము, భ్రమితము, లలితోత్తమము, లలిత, ప్రస్తుతము, గుంఫితము, సూక్ష్మాంతము, కుంచితము, కర్షితము. (2-452)

**ప్రత్యేక గమకములు.**

కంపితము, స్ఫురితము, లీనము, త్రిభిన్నోత్తర, సప్తధా, ఆందోళితాహతము, సూక్తకలనము (2452, 453)

**రాగములు.**

శ్రీరాగము, ఆందోళి, చిత్రాంగి, లలిత, సౌర, గౌళి, శంకరాభరణ, గాంధారి, మధ్యమగాంధారి, రక్తగాంధారి, పంచమగాంధారి, దేవగుప్త, శ్రీకాశికగుప్త, గాంధారిగుప్త, కన్నడిక, దేశి, గుంభకము, ధన్నాసి, కాంభోది, దేశాక్షి, మధుకరి, దివిమేఘరంజి, రంగవరాళి, తరంగిణి, బహుళి, బంగాళము, ఆహురి, బ్రహ్మిణి, శుద్ధవాహిని, బృహతి, దేవప్రియ, రూప, సోహరి, సైంధవి, శుద్ధవరాళి, సౌరాష్ట్రసైంధవి, పౌరాణి, భిన్నపౌరాణి, ఉత్పలి, పదపంజరము, నాగవరాళి, కర్ణాటవరాళి, నాగదివికురంజి, నాట, త్రినేత్రి, మాళవగౌళ, రామక్రియ, సాయగౌళ, ద్రావిళగౌళ, కర్ణాటగౌళ, సౌరాష్ట్రగౌళ, దేసాళగౌళ, భైరవి, సారంగ, భైరవి, మదయంతి, నాదోత్తరి, అన్యసైంధవి, వసంత, మేఘచ్ఛవి, సౌందరి, రక్కరాగము, చౌహారి, రక్కసి, సోమరాగము, అసారవరాళి, భల్లాతకాళింది, ధైవతి, ఘంటారవము, వ్యాళింది, దేశాళి, అభ్రపంచమము

ుతామోది, శ్రీకంఠ, కాంభోజి, సింధువరాళి, కౌశికి, పూర్ణ, నాట, గుజ్జరి, ష్ట్రగుజ్జరి, ద్రవిళగుజ్జరి, మలహరి, కోలాహలము, మాళవి,గౌళిక, మధ్య, ష్ఠ, సాళగనాట, భూపాళము, సాయ, తోడి, దివ్యావతి,తుండక్రియ, నట ాయణి, ఋషభి, నర్తకి, శుద్ధహీర, కైతకి, వ్యభిచారి, కర్మారి, వేళావుళి, వేళావుళి, మాళవ, శ్రీమధుమావతి (2-453)

యములు.

వైళంబు, తాళంబు, సాళి, వెల్లావెల్లి, జాయనుజాయి, పంజళంబు, ంబు, విషమంబు, గ్రహమోక్షణము, భజవణి, రవణి, భరణి, మిరాయి, ణి, నివళము, నిచయవైధనము, నిగిలి, సుధాయి, సన్నిగితము, మిశ్రము, ఎకలలిత, గాఢవము, రాగకాకు, బొచ్చగాఢవము, దేశికాకు, సింధు, కాకాకు, నఖకర్తరి, హళువాయి, హరుసమవాయి, గుందాగుండి, భ్రమరలీల, డి, మోడామోడి, పొదిరవాళము, తిక్షాయి, హోయలు, రిఖలవిఱుగు, యి. (3-208, 209 బస)

ములు.

దేశాక్షి, ధన్నాసి, దేశిమలహరి, సకలరామక్రియ, లలిత, సాళంగ, నాట, , మేఘరంజి, వేళావుళి, చిత్రవేళావుళి, మాళవి, సిరి, వరాళి, కాంభోజి, పంచకము, బంగాళంపు గురిజ, భైరవిద్వయము, బడపంజరము, క్రియ, కౌశిక, దేవక్రియ, మధ్యమావతి, తోడి, యావసతము 209 బస)

ంటకా వుళధ్వనులు.

బంబళనారాట, మిశ్ర, కావుళ, ధ్వని (2-455)

ాచకములు

జయ, ఉజ్జయ. (2-456)

వాచకములు

హోయి, సుహోయి, గాణాయి, గూఢాయి, గాఢాయి, వాయి, దేశాయి, ాయి, బడియాయి, నిబిడాయి, బొక్షాయి, దిక్షాయి (2-456)

**జయపంచకము :**

షట్స్వాదు, సప్తస్వాదు, అష్టావళి, నవస్వాదు, సరసమాయాయి.

**జయత్రయము :**

దేహావళి, మదావళి, కంఠావళి (2-456)

**తిరుపులు**

విజయస్థానకము, వళిగ, అంతరము, ఉప్పరచట్టు, మందరణ, వాళ, సర్వగత, భంగాస్థానము, గమళాయి, నాభిగతి, ఉదరగతి, కంఠగతి (4-256)

**వహణులు**

దేహనాభికక్షో దరకంఠజాతములు, పరిహారి సక్కటు, సరివాగ వహణి, కంఠి కపాలి వహణి, ఉన్కుటము, ముదువ, సైతము (2-457)

**విశుద్ధఖాయములు.**

లలిత, గాఢ, గాఢలలిత, బొచ్చలలిత, సేవళ, లవులంగితము, గహ గుహకము, బొచ్చగాఢ, వివరణ, మహిమది, గమకముది, కంపితము, వివశ, గాణాయిలము, ఇంపు, గోష్ఠాగోష్ఠి, నుంపు, దీనకాకు, పెల్లాపెల్లి, కల్లి, స్వభావ కాకు, కొంకు, కంపితము, అణుకు, దరహరము, అనుతాయి, ఓజి, సంది, పేరాపేరి, సరిబరసము, మోటహ్హాయితము (2-457)

**సాళగతాళగతులు.**

నెవణ, సుర్కి, పూరణ, రంగు, సోమరక్త, జిగి, గమళ, కంపితము, అలారము, ఆనైకము, సమణ, ఘోటహ్హాయి, గవమ, నావాళ, వ్యక్తి, ప్రబంధము, అలంకూలి, నిహతంబు, ఉభయకాళాసము, తాహుత్తర, భజవణి (2-458)

**ఆళతులు**

నాగావతి, సందావతి, వరభద్రావతి, వినయావతి, చరభోగావతి, ఇంద్రావతి (2-459)

**నాట్యభేదములు :**

అంగరాగము, గీతాంగరేఖ, రంగశోభ, ముఖరాగము, తతము, వితతము నిలయము, విగతి, అసంగతి, అవర్తన, గ్రహగతి, లవణి, దేసికా రతసభాగీరథి,

కళాసము, సాక్షి, సళావళి, భ్రమరి, అవధానము, సంధి, వ్యవసాయము, నిజవణి, లంఘితము, తాళము, అభినయోనతాపన, సుతాళము, ప్రసన్నత, వివర్తనము, పయవాటము, లలితవస, కనిష్ఠక, అప్పణము, బళ, గోమళక, ఉల్లాసము, లలిమనోహరము, డిల్లాయి, దుఃఖాణి, రేవణి, జంకె, డాలము, రువళి, సౌష్ఠవము, విభ్రమము, చౌళి, ఒయ్యారము, సరసము (2-460, 461)

చతుర్విధవక్త్రవిభ్రమము, సప్తవిధభ్రూలతానటనము, షడ్వింశతిక్రమ చక్షురంజితము, షడ్విధ నాసాలసత్కుంచితము, దశవిధకర్ణావధానము, నవవిధ గళవముఖోల్ల సనము, త్రివిధ వక్షోవిలాసము, పాదద్వయపంచకము, ఊరుద్వయకలితపంచకము.

సంగతి, సమభంగి, త్రిభంగి మొదలగు వింశతి యంగహారములు, ఇరువది రెండు తానకములు, ఛత్తీసుదృష్టులు, చౌషష్టి హస్తములు, బత్తీసుచారులు, ఏడుభ్రమరులు, కరణములు అష్టోత్తరశతము, నూఱు అలంకారములు, పదమూఁడు శిరోభేదములు, ముప్పది రెండు దండనములు. (2-461)

## గతులు .

హంసగతి, మాతంగగతి, వృషభగతి, మర్కటగతి, మేషగతి, మాయూరగతి, భోగిగతి. (2-462)

## మానార్థకములు .

వ్రేలెఁడు, నల్లెఁడు, చుట్టెఁడు, జేనెడు, మూరెఁడు, చేరెఁడు, బారెఁడు, మానెఁడు, పాటెఁడు, అమట (2-480)

సోమనాథుని బసవపురాణ, పండితారాధ్యచరిత్రములు తెలుఁగుజాతి తొలి విజ్ఞానసర్వస్వము లనఁ దగును. సోమనాథునికిఁ బూర్వకాలమునందు వెలసిన గ్రంథములలో నిట్లుదేశీయవిజ్ఞానపు ప్రాప్తి యంతగాఁ గానరాదు. నన్నెచోడుని కుమారసంభవమునందు మాత్రము కొంత ప్రయత్నము జరగినది. అందలి యితివృత్తము పౌరాణిక మగుటచే దానిపరిధి యింతవిస్తృతము కాదు. సోమనాథునికిఁ దరువాతికాలమునఁ గూడ నిట్లు దేశీయవిజ్ఞానమును బుక్కిలించురచన లంతగా లేదనియే చెప్పవచ్చును ప్రబంధకవులు సాధారణముగా రసదృష్టి గలిగినవా రగుటచే వారికావ్యములలో నీదేశీయవిజ్ఞానమున కంతగా

నవకాశము కలుగలేదు. ప్రత్యక్షముగాఁ దమదేశీయవిజ్ఞానమును బ్రకటించు నవకాశము లేక పోవుటచేఁ బ్రబంధ కవులు వర్ణనలవ్యాజమునఁ గొంతవఱకుఁ దమకాలమునాఁటి దేశీయ విజ్ఞానమును బ్రకటింపఁ గలిగిరి. మనుచరిత్రము నందును, ఆముక్తమాల్యదయందును నిట్టిప్రయత్నములు జరఁగినవి. అనంతరసాహిత్యమున కొఱవి గోపరాజకవి సింహాసనద్వాత్రింశిక యందును, అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతియందును నీ దేశీయ విజ్ఞానము మిక్కుటముగాఁ గానవచ్చును. ఈదృష్టితోఁ జూచినపుడు – దేశీయ విజ్ఞానమును మొట్టమొదటిసారిగాఁ దనకావ్యములయందు విస్తారముగా – బహుముఖముగాఁ దెలిపిన పాలకుఱికి సోమనాథకవి విశిష్టత, యాతని దేశికావ్యప్రవణాత యెట్టి దో యవగతము కాఁగలదు.

## దేశీయజీవనము

పూర్వకాలమున మన జాతి యెట్టియుచ్చదశలో నుండెనో, యెట్టి నాగరకత నలవరుచుకొనినదో, నాఁటి ప్రజాజీవనమెట్లుండినదో తెలిసికొన వలయు నన్నచోఁ జరిత్రమునకుఁ దరువాత సాహిత్యమే మన కేకైక సాధనము మనపూర్వులకుఁ జారిత్రక మయిన జిజ్ఞాస యంతగా లేక పోవుటచేత వారిలో నెవరును జరిత్రరచనకు యత్నించలేదు. చరిత్రకారులు కాలేదు అందుచే జరిత్రముబట్టి ప్రజాజీవనవిధానమును దెలిసి కొనునవకాశము మన కంతగా లేక పోయినది. మన సాహిత్యములో వెలసిన కావ్యములనే యాధారము చేసికొని మన మానాఁటి జాతీయజీవనదర్శనమును జేయవలసి యున్నది

తెలుఁగున వెలసినకావ్యములు సాధారణముగా సంస్కృతసాహిత్య మార్గమును వరవడిగాఁ బెట్టుకొని రచింపఁబడినవగుటచేత నీయవకాశము నయినను సంపూర్ణముగాఁ బ్రయోజనపఱుచుకొని మహాభాగ్యము మనకు లేక పోయినది. తెలుగుసాహిత్యమునం దాదికాలమున వెలసినకావ్యములు ప్రాయికముగా సంస్కృతమూలకములు సంస్కృతగ్రంథములను రసవత్తరముగా ననువదించుటలో నిమగ్నుఁ డయినతెలుఁగు కవీశ్వరునికిఁ దనకాలమునాఁటి ప్రజాజీవనమాతని దృష్టిపథమున లేనే లేదు. వస్తువు యుగయుగములనాఁటి పౌరాణికేతివృత్తమగుటచేతను – అనువాదమో యనుకరణమో చేయుచున్నకవి మూలమునకుఁ గట్టువడి రచనలో నస్వతంత్రుఁడగుటచేతను – పురాణ

యుగమునందలి కవీశ్వరుఁడు ప్రజాజీవనమును లక్షింపఁజాలక పోయెను. ఆతరువాతి కాలమున వెలసిన ప్రబంధకవులు పురాణేతివృత్తమును దీసికొని స్వతంత్రముగానే కావ్యములు రసవత్తరముగా రచించినప్పటికిని రసైకచక్షుష్కు లయినవారు రససిద్ధికొఱకై నేల విడిచిన సాముగా మిన్నులలోనే విహరించిరి. రసనిర్వహణమునందుఁ జూపు నిలిపినయాకవీశ్వరులు పలుకుపొంకము, సంభాషణ వైదగ్ధ్యము, కథాగుంభనము, వర్ణనాచమత్కృతి – వీని నిర్వహణ విషయమై జాగరూకులుగా నుండుటలోను – నిందు సెబా సనిపించుకొనుట లోను – నిమగ్ను [illegible] రససముద్రమునఁ బోటుపాటులకు ముగ్ధు [illegible] [illegible]జాజీవనమునకుఁ దామును, దమకవిత్వమును దూర మగుచున్న విషయమునువిస్మరి[illegible] [illegible]సహజముగా నయినను గావ్యత్వమర్యాదలఁ బాటించుటకొఱకై యష్టాదశవర్ణన ములను గుప్పింప వలయు ననియే వారి దృష్టి యుండినది కాని, సహజతకు సన్నిహితముగాఁ గావ్యమునకు సహజాలంకార మయిన ప్రజాజీవనము వర్ణింప వలయు నను నభిలాష వారికి లేక పోయినది

అయినను గొందఱు కవీశ్వరులు తమకు నిత్యసన్నిహితములుగను, [illegible] నిత్యానుభవములోను నున్నకొన్ని విషయములను దమకావ్యములం దక్కడక్క స్పృశింప కుండ నుండఁజాలక పోయిరి. వా [illegible] బుద్ధిపూర్వ[illegible] [illegible] వలయు నని తెలుపక పోయినను నిది యా [illegible] కాలమునకు సంబంధించిన విషయము సుమా యని యావిషయము మనకుఁ బట్టి యిచ్చుచునే యుండును.

పార్వతి జననీ జనకులచేత ననుజ్ఞఁ బొంది తపస్సు చేయుటకై తపోవనముఁ బ్రవేశించిన సందర్భమున నన్నెచోడుఁ దెఱుకుతేమలను వర్ణించిన వద్యము మిగి

'పట్టకపురోటి [illegible] వెదురుఁబ్రా లోగిఁ బోయుచు గొరుకొమ్ము [illegible]
కటఁగొని దంచుచు శబరకామిని వెక్కులు రాగముల్ వ [illegible]
త్కటముగఁ బా [illegible] సమ్రంబులు సోము మనుష్యరూపధూ
ర్జటి మునిముఖ్య [illegible] జంగమ లింగము మల్లికార్జును [illegible]'

కుమా [illegible]

శబరకామిని పటికపురోటిలో వెదురుబియ్యము పోసి యేనుఁగుకొమ్ము రోఁకటితో దంచుచు జంగమమల్లికార్జునునిమీఁద వెక్కు రాగములతోఁ బాట

పాడినదఁట అపు డక్కడఁ జుట్టుపట్టుల నుండిన మృగములు కూడ నోడలు మఱచి సొమ్మసిల్లినవి

పయిపద్యములోని విషయ మెఱుకుజీవితవర్ణనమాత్రముగానే పయికిఁ బ్రతిభాసించుచున్నను నిది యానాఁటిప్రజాజీవనములోని యొకప్రధాన విషయమును బట్టి యిచ్చుచున్నది శబరకామిని యపుడు పాడినపాటలు దంపుళ్లపాటలు క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దినాఁటికే దంపుళ్లపాటలు ప్రజాజీవనవ్యవహారములో నుండిన ట్లీపద్యము లోని విషయము మనకుఁ బ్రబల మయినసాహిత్యాధారమును బ్రసాదించుచున్నది సువ్వి, సువ్వా లనఁబడు దంపుళ్లపాటలు నన్నెచోడుని కింకను బూర్వమునుండియు మన తెలుఁగుదేశము నందు వ్యవహారములో నుండినవని యిందువలన మనకుఁ దెలియవచ్చుచున్నది ఇట్లే ప్రజాజీవనస్ఫూర్తితో మెఱసి పోయెడి ఘట్టములు తెలుఁగుకావ్యములయం దక్కడక్కడ మబ్బులలో దాగుడుమూఁత లాడుచుండును సోమనాథుని పండితారాధ్యచరిత్రము, బసవపురాణము – శ్రీనాథుని పలనాటి వీర చరిత్రము – కృష్ణ రాయల ఆముక్తమాల్యద, నారాయణకవి హంసవింశతి ప్రజాజీవనమును బరిస్ఫురింపఁ జేసెడి గ్రంథములలోఁ బ్రధానముగాఁ బేర్కొనఁ దగినవి

వస్తువు, భాష, భావము, ఛందము – ఇన్నిటిలోను సంస్కృతసాహిత్య మార్గము నవలంబించుచుండినమార్గకవులవైఖరి శివకవు లయినసోమనాథుఁడు మొదలయినవారికి నచ్చలేదు దేశికథావస్తువుతో, జానుతెనుఁగుపదములతో, దేశిచ్ఛందస్సులోఁ గవిత చెప్పి శివకవులు ప్రజలుకు సన్నిహితులయిరి ప్రజాజీవనమును దమకావ్యములు దభివర్ణించి వారు ప్రజాకవు లనిపించుకొనిరి. సోమనాథుఁడు తనకాలమునాఁటి ప్రజాజీవనమును పండితారాధ్యచరిత్రమునందు – అందును పర్వతప్రకరణములో మనము కన్నులార దర్శింపఁ గలుగునట్లు చిత్రించిచూపెను

పంటకోఁతలు ముగిసి నూర్పిడి యయినతరువాత సంక్రాంతినాఁటికిఁ గ్రొత్త ధాన్యము నిల్లుచేర్చుకొని తెలుఁగు రైతాంగము సంక్రాంతినాఁడు పెద్ద పండుగచేసికొని, క్రొత్తబియ్యముతోఁ బొంగళ్లు పొంగించుకొని, యింటిల్లిపాది యారగించి యానాలుగైదురోజులు నత్యానందముగా వెళ్లఁబుచ్చుదురు ఆతరువాత మరలఁ బొలము దున్ని విత్తనములు చల్లుదాఁక నుండు మధ్యకాల

యి వారక విశ్రాంతి ఈవిశ్రాంతికాలములోనే రైతాంగము సాధారణముగా యాత్రలు తలపెట్టును సదా సర్వకాలము పంటచేలయందుఁ దీరిక ఎనది లేకుండఁ బాటుపడిన రైతాంగమునకు మ్రొక్కుబడులు కొనుటకు - సనూచానముగాఁ బెద్దలనాఁటి నుండియు వచ్చుచున్న చారముల నాచరించుటకు, నిలువేల్పులకు మ్రొక్కుగొనుటకు నిదియే నువయినకాలము విశ్రాంతిదృష్టిలో మాత్రమేకాక యార్థికదృష్టితోఁ సను నిది వారికిఁ జాల ననుకూల మయినకాలము సాధారణముగా ంప్రదాయమునకుఁ జెందిన తెలుఁగురైతాంగము శివరాత్రినాఁటికి బయాత్ర తలపెట్టెడిది శ్రీశైలయాత్ర చేయుసందర్భమున భక్తకోటి యెట్టి ంకజీవనము గడిపెడిదో మన కీఘట్టమునఁ జక్కఁగా నవగతము కాఁగలదు

దోనమరాజయ్య శ్రీశైలయాత్ర వెడలుచు మహేశ్వరద్వారమార్గమునఁ ఏంచుచుండఁగా నతనితోఁ బాటు యాత్ర చేయుచుండినపరుసజనము-

'నందడింపకుఁ డంచుఁ జక్క రం డనుచు
వెనుకఁ జిక్కకుఁ డంచు వేగ రం డనుచుఁ
జనుఁడు ముందర నంచుఁ జన కేమి యనుచుఁ
జోలతోలఁ డనుచు నాత్రోవఁ బొం డనుచుఁ
దలదకుఁడీ యంచు దవ్వెంత యనుచు
సిరిగిరి యిదె యంచుఁ జేరితి మనుచుఁ
బురమున కెన్నఁడు వోదుమో యంచుఁ
బొదపొదఁ డిపు డేమి వోయె మీ కనుచుఁ
బదినాళ్లకైనఁ బోయెదము కా కనుచు
నీయూరి బగుతులిం క్లైఱుఁగురే యనుచు
నాయేడు విడియమే యీయూర ననుచు
జయ వెట్టుఁ డిటు గూడ సాఁ తెల్ల ననుచు
జయజయ ఘే యుఘే జయజయయనుచు -'

సరససల్లాపములు చేసికొనుచుఁ బ్రయాణమునపనయించుకొనుచు నకు సాగి పోవుచుండినది

దోనమరాజు చతుర్ముఖబసవేశ్వరునియాలయము చేరుకొని నిత్యలింగార్చన నియమములు తీర్చి పండితార్పణముగా భక్తమండలికిఁ బండువు చేసెను పండువు ముగిసిన తరువాతఁ బరుసజనము పరవశము చెంది –

*'చిందులు వారుచుఁ జెలఁగి యాడుచును*
*జప్పట్లు వెట్టుచు సఖులఁ బట్టుచును*
*నుప్పొంగి పేర్చుచు నుబ్బి యార్చుచును*
*బద్యముల్ సదువుచుఁ బ్రభల నొదవుచును*
*వాద్యముల్ గూర్చుచు వడిఁ దనర్చుచును*
*దాళముల్ వెట్టుచుఁ దమము వట్టుచును*
*సాళెముల్ నూపుచు జడత వాపుచును*
*బ్రమరిఁ బొల్చుచు సమభంగి నిల్చుచును*
*గతులఁ గ్రాలుచును నాళతుల సోలుచును –'*

కేళికలు చేసినది. పంద్రెండవశతాబ్దినాఁటి ప్రజానీకము పండుగలు చేసికొన్నతరువాత నెంతయానందముగా నాపండుగదినమును గడపెడిదో మన కిందుమూలమునఁ దెలియవచ్చుచున్నది.

దోనమరాజు శ్రీశైలయాత్ర పోవుచుండఁగా మార్గమున నతనికిఁ దగిలినవా రనేకులు, అనేకవిధములవారు, అనేకవేషములవారు జంగమకోట్లు, వృద్ధతపోధనులు, మిండజంగములు, శీలవంతులు, విరక్తులు, శివయోగులు, అభ్యాసయోగులు, పుణ్యాంగనలు, జోగులు, పిచ్చుకుంటులు, చెంచు ధర్మాత్ములు – ఒక రేమిటి? ఎందఱో యెన్ని రకములవారో యతని బాటలోఁ దారసిల్లిరి ఈసందర్భమును బురస్కరించికొని కవి యాయావ్యక్తుల వేషభాషలను దనవి దీర వర్ణించి మన కలనాఁటి ప్రజల వేషభాషలు కనులకుఁ గట్టినట్లు చిత్రించినాఁడు. నాఁటి మిండజంగముల గడుసరి తనమును, ధార్ష్ట్యమును జూడుఁడు:

*'రారోరి బగుత, తేరా లంజ కనుచు*
*నారంగ వ్రయమున కడిగి తెచ్చుటలుఁ*
*గలియుగబ సవండ విల నీవ యనుచు*
*నలరించి భక్తుల నడిగి తెచ్చుటలుఁ*

ప్రాకటంబుగ వచ్చు పణ్యాంగనలను
గ్రేకంటఁ జూచుచుఁ గేలి సేయుటలు
సరసతఁ బుష్పమంజరులు వైచుటలు'

అనువారినడతలు నేఁటికిని రోఁత పుట్టించుచు వా రానాఁడెంత యవినీతిపరులుగా నుండెడివారో తెలుపుచున్నవి. ఇఁక బ్రతుకఁ బోవుచుండి పరునజనమువెంటఁ బడి పిచ్చుకుంటులు పాటలు పాడుచు బిచ్చ మడిగెడివారు. ఆబిచ్చ మడుగు తీరానాఁడె ట్లుండెడిదో యీక్రింది ప్వపదుంక్తులు మనకు దెలుపుచున్నవి చూడుఁడు

'తార మొనంగరే ధర్మాత్ములార
రారో యనుచు మమ్ము జేరంగఁ బిలచి
యేలయా యిందులో నెవ్వరేఁ గరుణ
నాలించి యక్కటా, యనరయ్య మాకు
వీవంగఁ జేతులు లేవయ్య, నడచి
పోవంగఁ గాళ్లును లేవయ్య, యంధ
కుల మయ్య, పిచ్చుకకుంటుల మయ్య
తలపోయ నభ్యాగతులము నుండయ్య
యగువడ్డ వెడఁగుల మగుమమ్ముఁ బ్రోవఁ
దగ వగుఁ జూం డయ్య, దయ గల్గుఁ డయ్య,
పరమమహేశుండు బసవయ్య కరుణ
సిరిగిరినాథుని కరుణయా, మీకు
నుంకరబంకయ్య సురియచౌడయ్య
శంకరదాసయ్య లెంక మంచయ్య
దేవరదాసయ్య దెలుఁగుజొమ్మయ్య
బావూరి బ్రహ్మయ్య బాచిరాజయ్య
భూమిలోఁ గోలెడు స్వామిభక్తుండు
దా మఱియొకఁడు లేఁడే మల్లినాథ '

అనుచు నొక పిచ్చుకకుంటు పాడఁగా నతనివెంట నుండు తక్కినపిచ్చు కుంటులు 'తార మొసంగరే ధర్మాత్ములారా' అని పల్లవి యందుకొని చేయ

చాపువా రటం ఇఁక చెంచు ధర్మాత్ములు పరుసజనమునకు యాత్రాసందర్భమున నవసర మయిన సమస్త పదార్థమును దమవెంటఁ దీసికొని వచ్చి యాత్రికులకు వలసినవారికి వలసిన పదార్థము లిచ్చుటయేకాక – వారికిఁ జలిపందిళ్ళు, సత్రశాలలు, చెలమలు, పందిళ్లు, మరుగులు, విడిదలలు, ఎప్పటికప్పు డేర్పఱుచుచు జంగమారాధన చేసెడివారు అంతేకాదు పరుసజనమునకు నీరు, పువ్వులు, కజ్జములు, విడియములు నిచ్చెడివారు నడవ లేని వారిని నడపించుకొని వచ్చెడివారు ప్రయాణపు బడలికతోఁ జొక్కి సోలుచుండు పరుస జనమునకుఁ జెంచుధర్మాత్ముల యుపచారము లమృతోపమానములు

పరుసజనము చుక్కలపర్వతము నెక్కుచుఁ బాడుపాట యిది

'చేదుకో చేదుకో శ్రీగిరినాధ
చేదుకో మల్లయ్య చేదొకొ మొమ్మాయి
చేదుకో చేదుకో శ్రీశైలనిలయ
చేదుకో మల్లయ్య చేదుకొ మొమ్మాయి
చేదుకో చేదుకో చేసేత నొడయ
చేదుకో మల్లయ్య చేరుకొ మొమ్మాయి'

ఈపాట పాడుచుఁ జిందులు ద్రొక్కుచుఁ బరుసజనము చుక్కలపర్వతము నెక్కెడివారు పరుసజనములో ననేకజాతులవారు, ననేకప్రాంతములవారు, ననేకభాషలవారు నుండిరి ఏ యే భాషలు మాటలాడువా రాయాభాషలలోఁ గలసికట్టుగా జట్లు గూడి పాడుచుఁ గొండ యెక్కుచుండిరి అందు తెలుఁగుదేశమునుండి వచ్చినపరుసజనము పాడు పాట

'నల్లవో నల్లవో నగరాజరాజ
మల్లయా మల్లయా మహనీయతేజ
పరమపాతకకోట్లు భస్మమై పూలు
సిరిగిరి మల్లన్న శర ణన్న జాలు
రాఁబోవ నెంత దూరం బైన నడువ
నేఁ బోదు మల్లయ్య నేఁటేటఁ గొలువఁ
బాతాళగంగాప్రవాహ మెంతైనఁ
జూతునే మల్లికార్జునదేవు నైనఁ

జుక్కిలపర్వతం బెక్కు డెంతైనఁ
జిక్కక పోదునే శిఖరేశుఁ గాన
నల్లవో నల్లవో నగరాజరాజ
మల్లయా మల్లయా మహనీయతేజ '

శ్రీశైలయాత్రకుఁ బోయిన దోనమరాజయ్య శివరాత్రినాఁటికి శ్రీశైలము చేరుకొనెను శివరాత్రినాఁడు రాత్రియందఱును జాగరణ ముండిరి. ఆరాత్రి యంతయు శ్రీశైలములో నొక్కటే కోలాహలము ఆటలు, పాటలు, నాటకములు - ఒకటేమిటి? అన్నియు వింతలే అన్నియు వేడుకలే గడలు పట్టుకొని పైకెక్కి పోయి యక్కడ వేడుకలు చూపువారు కొందఱు మ్రోకులు గట్టి యామ్రోకులమీఁద నడచుచుఁ బక్షులవలె నాడువారు కొందఱు తెరమఱుగున నుండి కథానుకూలముగా బొమ్మల నాడించుచు భారతాదికథలను జూపువారు కొందఱు ఆకాలమునాఁటికే తోలు బొమ్మలాటలు ప్రజావినోదములోఁ బ్రముఖపాత్ర వహించుచుండిన ట్లిది తెలుపును. కొందరు ప్రచ్ఛన్నవేషములు ధరించి ప్రేక్షకులకు సంతోషము గలిగించెడివా రఁట ఇప్పటికిని గ్రామాదులలోఁ బగటివేషముగాండ్రు కావడి మోసికొనుచు వచ్చి యొకచోటఁ గావడిని దింపి యందుండి మీసములు పెద్దగాఁ దీర్చి రంగులు దీర్చియున్న చేతమొగమును దీసి తలకుఁ దగిలించుకొని గ్రామములోని పిల్లలకు వినోదము కలిగించుట మనలో ననేకులు బాగుగా నెఱుఁగుదురు అటువంటి ప్రచ్ఛన్నవేషము లానాఁడు కూడ నధికముగా నుండినవి శివరాత్రినాఁడు శ్రీశైలమున భక్తకోటి యాడినయాటలు:

'చప్పట్లు పెట్టంగఁ జక్కన లేచి
యప్పాట వెడయాట లాడెడువారు
వేడుకతోఁ జిందు వాడంగ నుబ్బి
కోడంగియాటలఁ గునిసెడివారుఁ
బన్నని నిజదేశభాషల జతుల
కన్ని కోడంగాట లాడెడువారు
భ్రమరముల్ సాళెముల్ బయకముల్ మెఱసి
రమణఁ బంచాంసి పేరణ యాడువారు

దాల్చి నటుఁడు రంగస్థలముమీఁదికి వచ్చి తెర యెత్తుటకు ముందుగా నార్భట మిచ్చు వాఁడు. దానికిఁ దగినట్లుగా వాద్యసమ్మేళనము కూడ నుండెడిది ఆతరువాత తెర తీయుసరికి నటుఁడు త్రిభంగిగా నిలచి యుండెడివాఁడు ఆపిదప నభినయము శాస్త్రమర్యాదతో సాఁగి పోయెడిది ఆయభినయములో నతఁడు చూపునేర్పులు పెక్కు కలవు అందుఁ గొన్ని

*'చిలుకయుఁ బోలెఁ జెన్నొలయఁ బల్కుచును*
*జలచరంబులు వోలె జనుల కుల్కుచును*
*గలహంసయునుబోలె గతుల నేర్పుచును*
*నిల మృగ మట్లురిమురిమి చూచుచును*
*గండుగోయిలవోలెఁ గడఁగి కూయుచును*
*వెండి క్రోఁతియుఁబోలె వికృతి సేయుచును*
*మహి భుజంగమువోలె మలకలు గొనుచు*
*విహగంబుక్రియ నభోవీథిని జనుచు –'*

నటుఁ డాడుచుండఁగాఁ బ్రేక్షకజనము పరవశించి పోయెడిది

ప్రజల నిట్లు సమ్ముఖీకరణము చేసి కొనినతరువాత నతఁడు శివలీలఁ నభినయించి చూపెడివాఁడు. అది శివరాత్రి పర్వదిన మగుటచేత నానాఁడ ప్రత్యేకము శివకథాభినయము చూచుట, శివకథానాటకము లాడించుట పుణ్యప్రదముగా పరుసజనము భావించెడిది

*'పురములు గాల్చినపోల్కి యాడుచును*
*మరుఁ జిఱు వుచ్చినమాడ్కి నాడుచును*
*నలి కర్త మిచ్చినచంద మాడుచును*
*యతులు గొల్వఁగ నున్నయంద మాడుచును*
*నంధకాసురుమదం బడఁచు టాడుచును*
*గంధగజాసురుఁ గడవు టాడుచును*
*జన్నంబు ద్రుంచిన చాలి నాడుచును*
*వెన్నుండు గ న్నిచ్చువేళ నాడుచును*
*గరళంబు రాల్చినకరణి నాడుచును*
*వరి నజాతలఁ గొనువరణి యాడుచును –'*

నటుఁడు శివలీలల నభినయించి చూపుచుండఁగా తమ జన్మము తరించి నట్లుగాఁ దలపోసి తృప్తి చెందిడిది ఇవికాక యింకను నెన్నో శివకథలను నాటకములుగా నాడెడివారు ఇట్లాటలతోడను, పాటలతోడను శివరాత్రి జాగరణము ముగిసెడిది

ఈయధ్యాయమునందుఁ జర్చింపఁబడిన వివిధాంశముల సారాంశము నీ క్రిందివిధముగా సమీకరింప వచ్చును

పాల్కురికి సోమనాథుని గ్రంథసంచయమును పరిశీలించినపు డితివృత్తము నందలి దేశీయత, దేశిఛందస్సు, దేశివర్ణనలు, దేశిరచనావిధానము, ఉపమానాదులయందలి దేశీయత, తెలుఁగు సామెతలయొక్కయు, జాతీయముల యొక్కయుఁ బ్రయోగము, వ్యావహారికమునకు సన్నిహిత మగుభాషా ప్రయోగము, దేశిపదజాలము, దేశి సంజ్ఞాపదముల ప్రయోగము, దేశీయవిజ్ఞానము, దేశీయజీవనచిత్రణము, ఇత్యాదిక మగు పెక్కుభంగులలో నాతని దేశికవిత్వోద్యమవృక్షము శాఖోపశాఖలుగా విస్తరిల్లి యున్నట్లు గోచరించును

౧. ఆంధ్రవాఙ్మయమునందు వెలసిన యనేకకావ్యములవలె నాతని బసవ పురాణ మేసంస్కృతగ్రంథమునకును ననువాదము కాదు. అది యొక స్వతంత్రగ్రంథము. అదీ కొన్ని స్వతంత్రగ్రంథములవలె నుత్పాద్యగ్రంథమును గాదు. అది కేవలము దేశీయము. కన్నడమునందలి బసవగీతములు తనగ్రంథమునకు మాతృకయని యాతఁడు పేర్కొని యుండినను నాయాభక్తులచరితములను స్థూలముగా నెఱిఁగించుటకే యవియాతనికిఁ దోడ్పడినవి. వాని మూలకత్వము తావన్మాత్రమే తమిళమునందలి పెరియ పురాణమును దానికి మూలము కాదు శివతత్త్వసారమునందలి కొందఱుభక్తుల చరితముల నితఁడు తనకావ్యములయందుఁ బెంచి వ్రాసినను నవి యాయాయి భక్తజనుల చరితములను వివరముగా నరయఁగోరు జిజ్ఞాసను గలిగించుటకే యాతనికిఁ దోడ్పడి యుండును. అతని బసవపురాణమునకుఁ గాని, పండితారాధ్యచరిత్రమునకుఁ గాని శివతత్త్వసారము మూలము కాదు

భక్తజనులగోష్ఠిలో నాతఁడు తనమిత్రుల నడిగి బసవపురాణకథాసూత్రము నెఱిఁగెను ఇట్లాతని బసవపురాణము దేశీయేతివృత్తముతోఁ గూడిన స్వతంత్రగ్రంథము. పండితారాధ్యచరిత్రమునందలి యితివృత్తము కూడఁ జారిత్రకపురుషునకే సంబంధించినది సంస్కృతమూలకము కాదు. స్వతంత్రగ్రంథము మల్లమదేవీపురాణ మొకమహాభక్తురాలి మహిమాదికము నభివర్ణించుగ్రంథము అదియు స్వతంత్రగ్రంథమే అతనిగ్రంథములు దభివర్ణింపఁబడిన యితరభక్తులును నీదేశమునకే చెందిన వివిధజాతులవారు ప్రజలలోఁ గలసి మెలసి తిరిగి తమ మహిమాదికమును బ్రదర్శించినవారు అతఁడు తనగ్రంథములయం దితివృత్తవిషయముగా సాధించిన దేశీయత యిట్టిది

2 ఇతివృత్తగ్రహణమునందే కాక యతఁడు ఛందోవిషయమునను నట్టి దేశీయాభిమానమునే ప్రదర్శించెను ఛందఃప్రయోగమునం దాతనికిఁ గలదేశిదృక్పథమును బ్రధానముగాద్విపద, రగడలు, సీసపద్యములు, కందములు, గద్యలు అను నయిదువిభాగములక్రింద వింగడించుకొని పరిశీలింపఁ దగి యున్నవి. అతని బసవపురాణ, పండితారాధ్యచరిత్రములయందు దేశిచ్ఛందమగు ద్విపదపంక్తులు **35,115** గలవు ద్విపద దేశిచ్ఛంద మనుట నిర్వివాదము, అతని వివిధకృతులలో మొత్తము **848** రగడ పాదములు కలవు **358**సీస పద్యములును, **169** కందపద్యములును నాతనివివిధ రచనములయందుఁ గాన నగును అతఁ డీదేశీయవృత్తములను వాడుటయందలి యుత్సాహమును సంస్కృతవృత్తములపైఁ జూపలేదు అతనికృతులన్నిటి యందును గలసి **223** సంస్కృతవృత్తములు మాత్రమే కానవచ్చుచున్నవి దీనిఁబట్టి దేశిచ్ఛందముల ప్రయోగమునుదాతనికిఁ గలయభిమానము వ్యక్త మగుచున్నది.

3 సోమనాథుని దేశికవిత్వములో నాతఁడందదుఁ జేసిన దేశివర్ణనలు కూడ నొక విశిష్టభాగముగాఁ బరిగణింపఁదగియున్నది. లాక్షణికులు పేర్కొనిన యష్టాదశవర్ణనములలోఁ గొన్నింటిని దనకావ్యములందు వర్ణించుపట్టులలోఁ గూడ సోమనాథుఁడాలాక్షణికుల నియమమునకుఁ గట్టువడినట్లు కాన రాదు.

ఆవేశపరవశుఁడై యా యావర్ణనలను దనబుద్ధికి గోచరించినవిధమున స్వతంత్రముగా నభివర్ణించినాఁడు కొన్ని వర్ణనలవిషయమున నీతఁ డవలంబించిన పద్ధతి వినూతనము, విలక్షణము అది మార్గపద్ధతికి విరుద్ధము కనుకనే యతనివర్ణన లచ్చముగా దేశివర్ణన లనిపించుకొనును అతఁడు తన కావ్యములయందు వెలయించినవర్ణనలను ౧ సంప్రదాయసిద్ధములగువర్ణనములు, ౨ స్థిరరూపవర్ణనలు, ౩ చలరూపవర్ణనలు, ౪ సహజవర్ణనములు, ౫ అద్వితీయ వర్ణనలు లేక అపూర్వవర్ణనలు, అని ప్రధానముగా నయిదు విభాగములక్రింద వర్గీకరింప వచ్చును అతనివర్ణనములలోఁ గొన్నిటిని దరువాతికవులు కొంద ఱనుకరించిరి కొన్ని మౌలికములై యాతనిప్రతిభను జాటును మఱికొన్ని సహజసుందరము లై యచ్చమయినదేశివర్ణన లనిపించుకొనఁ జాలి యున్నవి సంప్రదాయసిద్ధము లయినకొన్ని వర్ణనల విషయమున నాతఁడు స్వతంత్రప్రవృత్తిని బ్రదర్శించి వానికి దేశీయత్వగుణ మలవడునట్లు చేసెను

౪ రచనావిధానమునందుఁ గూడ నతఁడు దేశీయతను బాటించి యుండుట యొక గొప్పవిశేషము మార్గకవుల రచనావిధానమున కది పూర్తిగా భిన్నము. దేశిసారస్వతమునకుఁజెందిన వీరగాధల రచనమునందుఁ గానవచ్చు సామాన్యలక్షణములలోఁ గొన్ని యాతనికావ్యములయందుఁ గానవచ్చును అవి పునరావృత్తిలేక దరువు (Refrain), అభివర్ధితపునరుక్తి (Incremental Repetition), వారానువర్తనము (common-places) వీరగాధాచక్రముల (Ballad cycles) యందుఁ బునరావృత్తివ్యగ్యము సోమనాథుని ద్విపదకావ్యములు సుదీర్ఘము లయినయితివృత్తములు కలవి యగుటచే వీర గాధాచక్రములందువలెనే యిందును బునరావృత్తి కవకాశము లేదు కాని, యాపున రావృత్తిని బాదాంతములయందుఁ జేర్చి పఠించినపు డీకావ్యములు కూడ గానయోగ్యము లై వీరగాధాగానమునఁ గలుగు నానందావేశముల నొసఁగఁజాలి యుండును తక్కిన రెండులక్షణములును నాతనికావ్యములయందుఁ బూర్ణముగాఁ గలవు ఇట్లాత నిరచనావిధానము దేశిలక్షణలక్షితమై మార్గకవిత్వ విధానమునకుఁ బూర్తిగా భిన్నమై యున్నది

౨౹ అతఁడు తనగ్రంథములయందుఁ బ్రయోగించిన కొన్నియుపమాన ములయందును, బాటించినకవిసమయములయందును గూడ దేశితనము గానవచ్చును. ఉపమానముల ప్రయోగమునందు సంస్కృతమున నొకనిర్దిష్ట విధానము కలదు ఆ సంప్రదాయమునే చాలవఱకుఁ దెలుఁగుకవీశ్వరు లందఱును ననుసరించుట జరగినది కవిసమయముల విషయము కూడ నిట్లే కాని, దేశితనమును బ్రయోగించుటలో నభినివేశము కల సోమనాథుం డందందు సంస్కృతకావ్యములందును, వమార్గపద్ధతిని రచితములు లగు న యాంధ్రకావ్యములందును గాన రాని యుపమానములను, గవిసమయములను గ్రహించి తన స్వతంత్రప్రవృత్తిని, దేశీయాభిమానమును జాటుకొనెను వానిలోఁ గొన్ని దక్షిణదేశభాషలయందుఁ గానఁగును

౬ ఇతివృత్తము, ఛందస్సు, వర్ణనలు మొదలగువాని విషయమున సోమనాథుఁడు దేశీయతను సాధించి తన దేశీయాభిమానమును బ్రదర్శించినట్లే భాషా ప్రయోగమునందును దేశితనమును బ్రదర్శించి యుండుట యాతని దేశిరచనాప్రవణతను వ్యక్తము చేయును అతఁడు తన బసవపురాణ, పండితారాధ్య చరిత్రములయందు నెలకొలిపిన భాషను సామెతలు, జాతీయములు, తత్సమపదప్రయోగము, తద్భవరూప ములు, సమాసములు, పదజాలము, సంజ్ఞాపదములు, వాక్యరచన లోకవ్యవహారానుగుణ మయినవాక్యరచనావిధానము అనుశీర్షికలక్రింద వింగడించుకొని చూచినపుడు వాని యన్నింటి సమాహార రూపమున నాతఁడు భాషలో సాధింపఁ దలఁచిన దేశీయతయొక్క స్వరూప మెట్టిదో విశదము కాఁగలదు. అతనిభాషలోఁ గానవచ్చు విశేషసంధి రూపములు కూడ నాతని దేశిరచనాప్రవణతనే వెల్లడి చేయును నన్నయ భారతము, నన్నెచోడుని కుమారసంభవము, మల్లికార్జునపండితుని శివతత్త్వసారము అను గ్రంథములయందు సామెతలును, జాతీయములును నతివిరళములు సోమనాథుఁడు వా రందఱికంటెను నధికముగాఁ దనకావ్యముల యందు సామెతలను, జాతీయములను బ్రయోగించి తన కవిత్వమును సామాన్య ప్రజాభాషకు మఱింత సన్నిహితము చేయఁ గలిగెను. తత్సమ పదముల ప్రయోగవిషయమై యాతఁడు కొంత స్వాతంత్ర్యము వహించి తనకాలము నాఁటి

శాసనములందును, వ్యవహారమునందును గల రూపములను దనకావ్యముఁ యందు బ్రయోగించెను నన్నయ, నన్నెచోడులలో నతివిరళముగా మాత్రమే వైరిసమాసములు ప్రయోగింపఁబడగాఁ నితఁడు చాల ముందునకుఁ బోయి వ్యవహారభాషలో సామాన్యముగాఁ గాన వచ్చు వైరిసమాసములన ప్రయోగించుట కేమాత్రము వెనుదీయ లేదు తనకాలమునఁ బ్రజలు తమయనుదిన వ్యవహారములయందుఁ గల్పించుకొనచుండిన వైరిసమాసముఁ పద్ధతిలోనే యాతఁడును గొన్ని వైరిసమాసములను గల్పించు కొనియుండ వచ్చును మొత్తముమీఁద నాతని యీ వైరిసమాసముల ప్రయోగమాతనికి వ్యవహారభాషా సన్నిహితమగు భాషా ప్రయోగమునందుఁ గల మక్కువనే తెలియఁ జేయును అతని కావ్యములలోఁ గానవచ్చు కొన్ని తద్భవరూపము లాతఁడు నూతనముగాఁ గల్పించిన వనుటకంటె నాయాసంస్కృతపదముఁ నాతనికాలమున నా రూపములతోనే ప్రజలు వ్యవహరించుచుండి రనియు, నట్లు వారి వ్యవహారమున నుండిన యా తద్భవరూపములనే యాతఁడు తనకావ్యములయందు గ్రహించి యుండు ననియు భావింపఁ దగును కావ్యభాషలో సంధికి నియతప్రవృత్తి కలదు వ్యవహారభాషలో నట్టినియతప్రవృత్తి లేదు. సోమనాథుని గ్రంథములలోఁ గానవచ్చు విశేషసంధి రూపము లానాఁటి వ్యవహారభాషాస్థితిని దెలియఁ జేయును. సోమనాథుని గ్రంథము లయందు దేశిపదజాలము విశేషముగాఁ గానవచ్చును. మాదిరిపరిశీలనము (Sample survey) బట్టి యాతఁడు ప్రయోగించిన పదజాలములో సంస్కృతాంధ్ర పదముల నిష్పత్తి 1:2 చొప్పున నున్నట్లు తేలినది. ఇది యాతని దేశిరచనా ప్రవణతను వెల్లడించును నన్నయాదులగుమార్గకవుల గ్రంథములు ప్రాయికముగాఁ బురాణగ్రంథములగుటవలన వారి గ్రంథములలోని సంజ్ఞాపదములును బౌరాణికవ్యక్తులచే యయి యుండును అం దభివర్ణింపఁ బడిన స్థలములు భారతదేశములోనివే యయినను నుత్తరహిందూస్థానము నందలివి ఇట్లు సంజ్ఞాపదములవిషయమునఁ గూడ వారిగ్రంథములను మార్గసంప్రదాయమే గోచరించును దేశివాతావరణము వానియం దంతగాఁ గాన రాదు సోమనాథుని గ్రంథములలో దేశీయములయిన సంజ్ఞాపదములు

పురుషులపేళ్లు, స్త్రీలపేళ్లు, స్థలములపేళ్లు విస్తారముగాఁ గాన వచ్చును సోమనాథునికిఁ దరువాతికాలమునఁ గూడ నింత విస్తారముగా సంజ్ఞాపదములను గలిగిన కావ్యము మఱొండు గానరాదు. ఇట్లు, సోమనాథుఁడు తన సమకాలమునందు జనవ్యవహారమున నున్న మనుజసంజ్ఞలను, స్థలములపేళ్లను విస్తారముగాఁ దన కావ్యములయందు నెలకొలిపి యావిషయమునఁ గూడఁ దనదేశీయాభిమానమును బ్రదర్శించినాఁడు. సోమనాథుఁడు తనకావ్యగతము లగు సంభాషణాదులలో వ్యవహార భాషకు నతిసన్నిహిత మయినవాక్యరచనము మూలమున నాసంభాషణములకును, నందలి వాక్యనిర్మాణమునకును నొక సహజత్వమును సంతరించుకొనినాఁడు కావ్యభాషా గ్రథితములయినను గొన్నిపట్టులయందు రచితము లయిన యాతనివాక్యము లాతఁడు తనమనసులోఁ దొలుత నూహించినవ్యావహారికభాషావాక్యమును బట్టి యిచ్చుచు గ్రాంథికభాషలో నున్నను నవి వ్యావహారికభాషావాక్యములే సుమా యని తోఁచఁజేయు పద్ధతిలో నుండును. ఇట్లుగా వింగడింపఁదగినవిధమున నాతఁడు తనకావ్యములయందు భాషాప్రయోగమును దేశిలక్షణలక్షితముగా నిర్వహించి యున్నాఁడు

౭. సోమనాథునిగ్రంథములను జదివినప్పు డతఁడొక్క కవీశ్వరుఁడుగా మాత్రమే కాక బహుముఖప్రజ్ఞాశాలియు, లోకజ్ఞుఁడు నగు నొక్క మహనీయ వ్యక్తిగా మనకు గోచరించును. పరమశివుని పంచవింశతిలీలలు మొదలుకొని పర్వత మెక్కుపరుస జనుల వేషభాషలదాఁక నాతఁడు తనగ్రంథములలోఁ జెప్పనివిషయము లేదు తడవని యంశము లేదు తనకాలమునాఁటి దేశీయవిజ్ఞాన మంతయు భద్రపఱచినసాహిత్యనిధులాతనిగ్రంథము లన్నచో నతిశయోక్తి కాఁజాలదు నేత్రరోగములు, నేత్రవైద్యము, వాయురోగమునకు వైద్యము, సర్పవైద్యము, ద్యూతవిద్య, చోరవిద్య, వస్త్రభేదములు, దెబ్బదిరెండు నియోగములు, పిల్లల ఆటలు, చేపఁల వేఁట, మృగయ, కోటలనిర్మాణము, శకునశాస్త్రము మొదలగు నంశములకు సంబంధించిన దేశీయవిజ్ఞానము నీతనిగ్రంథములు మనకందించుచున్నవి ఇంకను దనకాలమునందలి సాంఘిక జీవనమునకుఁ జెందిన వివిధ వస్తుపరికరాదులను, తెలుఁగుదేశమునందలి చెట్లు

చేములు, పువ్వులు, ఫలములు, పత్తిరులు మొదలగు నెన్నోవిషయములన గూర్చిన దేశీయవిజ్ఞాన మీతనిగ్రంథముల మూలమున మనకెఱుక కందుచున్నది

౮ సంస్కృత గ్రంథములను రసవత్తరముగా ననువదించుటలో నిపుణ్ణుఁడయిన తెలుఁగు కవీశ్వరునికిఁ దనకాలమునాఁటి ప్రజాజీవన మాతనిఁ దృష్టిపథమున లేనే లేదు వస్తువు యుగయుగములనాఁటి పౌరాణికేతివృత్త మగుటచేతను - అనువాదమో, యనుసరణమో చేయుచున్నకవి మూలమునకుఁ గట్టుపడి రచనలో స్వతంత్రుఁ డగుటచేతను - పురాణయుగమునందలి కవీశ్వరుఁడు ప్రజాజీవనమును లక్షింపఁజాలక పోయెను తరువాతికాలమున రసవత్తరముగా రచించినప్పటికిని రసైకచక్షుష్కు లయినవారు రససిద్ధికొఱకై నేల విడిచినసాముగా మిన్నులలోనే విహరించిరి సహజతకు సన్నిహితముగాఁ గావ్యమునకు సహజాలంకార మయినప్రజాజీవనమును వర్ణింప వలయు ననునభిలాష వారికి లేక పోయినది. అయినను గొందఱు కవీశ్వరులు తమకు నిత్యసన్నిహితములై, తమనిత్యానుభవములో నున్న కొన్నివిషయములను దమకావ్యములయం దక్కడక్కడ స్పృశింపకుండ నుండఁ జాలక పోయిరి ఇట్లు ప్రజాజీవనస్ఫూర్తితో మెఱసి పోయెడిఘట్టములు తెలుఁగు కావ్యములలోఁ గ్వాచిత్కముగా మాత్రమే యక్కడక్కడ మబ్బులతో దాఁగుడుమూఁత లాడుచుండును సోమనాథుని బసవపురాణ, పండితారాధ్యచరిత్రములు, శ్రీనాథుని పలనాటివీరచరిత్రము, కృష్ణరాయల యాముక్తమాల్యద, అయ్యలరాజు నారాయణా మాత్యుని హంసవింశతి ప్రజాజీవనమును బరిస్ఫురింపఁ జేసెడి గ్రంథములలోఁ బ్రధానము గాఁ బేర్కొనఁ దగినవి. సోమనాథుఁడు తనకాలమునాఁటి ప్రజాజీవనమును పండితారాధ్య చరిత్రమునందు - అందును బర్వతప్రకరణములో మనము కన్నులార దర్శింపఁ గలుగునట్లు చిత్రించి చూపెను. సోమనాథుని కాలమునాఁటి ప్రజాజీవన మం దతివేలముగాఁ బ్రతిబింబించును.

# సప్తమాధ్యాయము

# దేశికవిత్వోద్యమ పరిణామము - తరువాతి సాహిత్యముపై దానిప్రభావము

## (VIII) దేశికవిత్వోద్యమ పరిణామము

పాల్కుఱికి సోమనాథుఁడు సాఁగించిన దేశికవిత్వోద్యమముయొక్క పరిణామ స్వరూపమును బరిశీలించుటకు ముం దాయుద్యమముయొక్క పూర్వదశావస్థలను, నప్పటి యాంధ్రవాఙ్మయస్వరూపమును, దేశికవిత్వము వెలువడ వలసినపరిస్థితులు మొదలగువిషయములనుగూర్చి కొంత సంగ్రహముగా నయినను నెఱుఁగుట యుక్తము కాఁగలదు. నన్నెచోడుఁడు తనకుమారసంభవము నందలి యవతారికలో -

*క. మును మార్గకవిత లోకం*
*బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం*
*గును నిలిపి రంధ్ర విషయం*
*బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్*

అనుపద్యమునందు లోకములోఁ దొల్లి మార్గకవిత ప్రచలితమగుచుండఁగా చాళుక్య రాజాదు లగుపలువురు దేశికవితను బుట్టించి యాంధ్రదేశమున తెలుఁగును నిలిపి రని యాంధ్రకవిత్వమునకు సంబంధించిన యొకయద్భుత విషయమును దెలిపెను. దీనిఁబట్టి మార్గకవిత యనఁగా నెట్టిదో - చాళుక్యరాజాదులు పుట్టించిన దేశికవితయొక్క స్వరూప మెట్టిదో యరయ వలసియున్నది. ఈపద్యమున కర్థము చెప్పుటకు యత్నించినపండితులు మార్గకవిత యనఁగా సంస్కృతకవిత యనియు, దేశికవిత యనఁగా తెలుఁగు కవిత్వ మనియు, నిందుఁ బేర్కొనఁబడిన చాళుక్యరాజు రాజరాజనరేంద్రుఁ డనియు వివరించుటకు యత్నించిరి కాని, నన్నయకుఁ బూర్వకాలమునందే తెలుఁగునఁ గవిత్వ మున్నటులు నిదర్శనము లగపడుచుండుటచే రాజరాజ

నరేంద్రుఁడు దేశికవితను బుట్టించినాఁడనుట యసంబద్ధమై యుండుటవలన వా రాపద్యమునకుఁ దెలిపినయర్థము సరి యయినది కా దని తలంప వలసి యున్నది అయినచోఁ బయిపద్యమునఁ బేర్కొనఁ బడిన మార్గకవిత యేదో యుండియుండును

నృపతుంగుఁడు అను నామాంతరముగల యమోఘవర్షుఁ డను రాష్ట్రకూట రాజు క్రీస్తుశకము 815 నుండి 877 వఱకు రాజ్యపరిపాలనముఁ గావించెను అతఁడు కన్నడమున 'కవిరాజమార్గము' అనుపేర నొక లక్షణగ్రంథమును రచించెను అది మిక్కిలి ప్రాచీన మయినది అందాతఁడు తనకుఁ బూర్వమందుండినమహాకవులను బలువురిని బేర్కొనెను విమలోదయ, నాగార్జున, జయబంధు, దుర్వినీతులనుకవీశ్వరులు గొప్ప గద్యకావ్యకర్తలుగాను, శ్రీవిజయకవీశ్వర, పండితచంద్ర, లోకపాలురు గొప్ప కవీశ్వరులుగను నందుఁ బేర్కొనఁబడిరి దీనిఁబట్టి నృపతుంగునికిఁ జాలకాలమునకుఁ బూర్వమే కన్నడవాఙ్మయము మిక్కిలి యున్నతస్థితియం దుండెనని తెలియుచున్నది వారి కావ్యజాతమెల్లఁ బ్రాయికముగా మార్గకవిత్వమే యగును కాని, కవిరాజమార్గము నందలి పీఠికనుబట్టి నృపతుంగునికిఁ బూర్వమునందే చౌపది, గీతిక, అక్కర, కందము మొదలగుపద్యములతోఁ గూడిన చెత్తాణం, బెదండె యను కావ్యభేదములు కల వనియు, నవి నృపతుంగునికాలమునకే పఱగన్నడము నృపతుంగునికి సమ్మతముకాదు. అతనికి సంస్కృతభూయిష్ఠ మగు శిష్టభాషయం దాదరము హెచ్చు అందుచేతనే యాతఁడు పఱ గన్నడభాషాప్రయోగమును నిరసించి సమసంస్కృతమునే దేశభాషలలోఁ గలుప వలయును గాని కేవలసంస్కృతపదములను గలుప రాదని యొక యనుశాసనము కావించి యుండెను. 'విరసంకర మవుదేసిగె జరద్వధూవిషయసురతరసరసికతవోల్' అని పఱగన్నడభాషా ప్రయోగము నతఁడు జరద్వధూసురతరాసిక్యమువంటిదని యవహేళనము కూడఁ గావించెను సమసంస్కృతముతోఁ జెప్పిన కవిత్వము మృదంగ సంగీతకాదిమధురతరమును బోలు నని వివరించెను ఇట్లు నృపతుంగుఁడు తన కవిరాజమార్గమునఁ గన్నడభాష కొక వ్యవస్థ నేర్పఱచెను. అవ్యవస్థనే యనుసరించి పంపాదులు కావ్యరచనము గావించిరి. అందుచేతనే నృపతుంగుని కవిరాజమార్గము నందలి భాషకును, దరువాతి కన్నడకవులభాషకును వ్యత్యాసమంతగాఁ గానరాదు భాషావిషయమున నాతఁడు చెప్పినసూత్రములను దరువాతివారు పాటించిరి

ఇట్లు నృపతుంగుఁడు భాషాప్రయోగవిషయమునను, ఇతర కవితాలక్షణముఁ విషయమునను, సుస్థిర మయిన వ్యవస్థ నొకదానిని గల్పించి మార్గకవితా పద్ధతి ఘంటాపథము తీర్చెను అతని తరువాతఁ గన్నడకవు లాతనిమార్గముఁ యనుసరించి కవిత్వము వెలయించిరి

ప్రాచీనకాలమున కన్నడభాషకును, తెలుఁగుభాషకును నిప్పు డున్నంత వ్యత్యాసము గాని పార్థక్యము గాని లేదు అందుచే నుభయదేశములయందలి కవీశ్వరులును ఒండొరుల భాషాకవిత్వములతోఁ బరిచయము కలిగి యుండుట కవకాశమున్నది అందుచే నృపతుంగునికిఁ దరువాతఁ గన్నడమున వ్యాపించిన మార్గకవితా పద్ధతి తెలుఁగుభాషలోఁ గూడఁ బ్రవేశించుట కవకాశము లేకపోలేదు. కాని, నన్నెచోడుఁడు తనపద్యమునందుఁ బేర్కొనిన చాళుక్యరాజాదు లావమార్గపద్ధతి నంగీకరింపక దేశికవితకు నాదరము నొసఁగుటకుఁ బ్రయత్నించిరి అ ప్రయత్నముయొక్క ఫలముగానే నన్నయకుఁ బూర్వకాలమునకుఁ జెందిన శాసనములందును, కొన్ని గ్రంథములందును కొంత దేశికవిత్వము వెలసినది వా రాకాలమున నట్లు గట్టి ప్రయత్నము చేసి యుండక పోయినచో తెలుఁగునఁ గూడ నానాఁడు కన్నడమునందలి మార్గకవితాపద్ధతియే వ్యాపించి యుండును ఇట్లు చాళుక్యరాజాదులు తెలుఁగుదేశమున దేశికవితను బుట్టించి నిలిపిరి.

నన్నయకుఁ బూర్వకాలమందు వెలసిన కవిత్వమును శాసనకవిత, పదగేయ రూప మయిన దేశికవిత, మార్గపద్ధతికిఁ జెందినకావ్యకవిత యని మూఁడు విధములుగా విభజింప వచ్చును. అందు శాసనకవిత ప్రారంభకాలమున దేశిమార్గమునకును – పదియవ శతాబ్దినుండి మార్గపద్ధతికిని జెందియున్నది అప్పటి పదగేయకవిత సోమనాథుఁడు పేర్కొనిన గీతములు, పదములు అను రచనములనుబట్టి తెలియును కావ్యకవిత్వము పద్మకవి మొదలగు జైనకవులకావ్యములనుబట్టి యూహింపఁ దగును ఈజైనకావ్యము లయినను పదియవశతాబ్ది యుత్తరార్థమున రచింపఁబడినవి దీనినిబట్టి తెలుఁగులో కవిత్వము మొట్టమొదట చాళుక్యరాజాదుల ప్రేరణముచే దేశిరూపముగానే యవతరించినదనియు తరువాత కవిరాజమార్గమునకుఁ బిదప వెలువడిన కన్నడకావ్యముల ప్రభావముచే మార్గ కవిత్వముకూడ కొంత వెలువడి యుండు ననియు నూహింపఁ దగుచున్నది

కన్నడకవుల ప్రభావము తెలుఁగుదేశమున సన్నసన్నగా వ్యాపించుటకు మొదలిడెను పండితకవులు దేశిపద్ధతి వైపునఁ గాక మార్గపద్ధతి వైపునకు మ్రొగ్గు సూపఁ దొడఁగిరి నన్నయకాలమునాఁటికి మార్గకవితాభిమాన మధికమయ్యెను. నన్నయభట్టారకునకుఁ గన్నడ భాషలో చక్కని పరిచయమే యుండియుండవలయును ఏల యనఁగా నాకాలమున నాయుభయభాషలకును నంత వ్యత్యాసము లేదు అతని మాట యెటు లున్నను అతని సహాధ్యాయుఁడైన నారాయణభట్టు కర్ణాటభాషలో గొప్ప పండితుఁడును, కవియు నయి యుండెనని నందంపూడి శాసనమువలన నెఱుకపడు చున్నది నారాయణభట్టు కర్ణాటభాషయందలి మార్గకవితాపద్ధతిని గాంచి, యందలి శబ్దార్థగాంభీర్యమున కలరి, యాపద్ధతినే యవలంబించి యాంధ్రమహాభారతమును వ్రాయవలసిన దని ప్రబోధించెను నన్నయ యాతనియుపదేశము ననుసరించి మార్గ పద్ధతిలోఁ దనభారతమును వెలయించెను

ఇట్లు, నన్నయకుఁ బూర్వకాలమునందలి జైనకావ్యములలో సన్నసన్నగాఁ బొడసూపుచుండిన మార్గపద్ధతి నన్నయభారతమున సమగ్రస్వరూపసౌష్ఠవముల నందెను నన్నెచోడుని పద్యమునఁ బేర్కొనఁబడిన మార్గకవిత్వము నృపతుంగునికిఁ బూర్వకాలము నందుఁ గన్నడ భాషలో రచితము లయినగ్రంథములయందలి కవిత్వ మనియు – చాళుక్య రాజాదులు పుట్టించిన దేశికవిత నేఁడుపలబ్ధములగుచున్న శాసనములయందలి కవిత్వము లోఁ గొంత కానసగు ననియు – మఱల కవిరాజమార్గము యొక్క ప్రభావమునను, పంపాదుల కావ్యముల యొక్క ప్రభావములనను మొదట సన్నసన్నగా తెలుఁగులో బ్రవేశించిన మార్గకవిత ఆంధ్రజైనకావ్యములలో ప్రారంభదశలో నుండి, నన్నయ నారాయణ భట్టుల సమష్టికృషిఫలితముగా భారతమున సమగ్రస్వరూపము నందె ననియు నీ పరిశీలనమువలనఁ దేలుచున్నది

మార్గకవిత్వము, దేశికవిత్వము అనునవి రెండు భిన్నములయినప్రక్రియ లని కాని, వాని కొండొంటితో సంపర్కముండ దని కాని తలఁచుటకు వీలు లేదు. మార్గకవిత్వమున దేశికవితాచ్ఛాయలు కొన్నియు, దేశికవిత్వమున మార్గకవితాచ్ఛాయలు కొన్నియుఁ గానవచ్చుచునే యుండును ఇందుచేతనే కావ్యము నయినను వీనిలో నేదో యొకపద్ధతికిఁ జెందిన దని నిర్ణయించుట యాకావ్యము నందు దేని కధికప్రాధాన్యముండునో [illegible]

నన్నయభారతమున మార్గకవితాంశ మధికముగా నుండినను నందు దేశికవితారేఖ కూడఁ గొన్ని లేక పోలేదు అతనికవిత్వమున తరువోజలు, మధ్యాక్కరలు సీసములు అనుదేశివృత్తములే కాక యచ్చటచ్చట దేశ్యపదప్రచురమయిన రచనముకూడఁ గలదు కాని, శార్దూల, మత్తేభ, చంపకమాలోత్పలమాలాది సంస్కృతవృత్తప్రచురమును, తత్సమపదభూయిష్ఠమును నగు తక్కినభాగముతో బోల్చి నపు డిట్టిది చాల తక్కువ యనియే చెప్పవలసి యున్నది అందుచేత బాహుళ్య దృష్టిని – మొత్తముమీఁద నాతనిభారతము మార్గకవిత్వమునకుఁ జెందినదని తలఁపఁ బడుచున్నది

నన్నెచోడుని కుమారసంభవము కూడ మార్గపద్ధతి కావ్య మనియే చెప్పఁదగి యున్నది ఏల యనఁగానందలి యితివృత్తము పురాణప్రసిద్ధ మయినది ఛందో విషయముఁ జూచితిమేని నందు శార్దూలాదిసంస్కృతవృత్తముల సంఖ్యయే యధికము భాషావిషయకముగా నతఁడు తనకు జానుతెనుఁగు రచన మభిమత మని చెప్పుకొనినను నతనికుమారసంభవమునందలి రచనము ప్రాయికముగా సంస్కృతసమాసభూయిష్ఠము ఈవిధముగా నీతని కుమారసంభవమున మార్గకవితావిధానమే కానవచ్చుచున్నను నిందు నన్నయభారతమునకంటె దేశికవితాచ్ఛాయ లధికముగా గోచరించుచున్నవి ఇతివృత్తమునను, సంప్రదాయమునను, కవిసమయములందును నితఁడవలంబించిన దేశీయ విధాన మితని దేశికవితాభిమానమునువ్యక్తము చేయును అతఁడవలంబించిన భాషా ప్రయోగపద్ధతి నన్నయపద్ధతి కించుక భిన్న మయినది ఈపరిశీలనమువలన నన్నయ నన్నెచోడుల గ్రంథములు రెండును మార్గకవితా పద్ధతికిఁ జెందినవే యయినను నన్నయలో దేశికవితాగుణము చాలఁ దక్కువగను, నన్నెచోడునిలో నంతకంటెఁ జాల నెక్కువగాను నుండినట్లు గోచరించును

నన్నెచోడుఁడు తనకుమారసంభవమునందలి కావ్యప్రశస్తిలో –

*'దేశిమార్గంబులు దేశీయములుగా*
*నలంకారములు దా నలంకరింప'* –

కవిత్వము రచింపఁబడ వలె నని తెలిపి యుండెను. ఇచట దేశిమార్గములు దేశీయము లగుట యనఁగా నేమో పరిశీలింప వలసి యున్నది మార్గమును దేశీయముగా నొనరించుట యనఁగా సంస్కృతమునుండి గ్రహించిన

యితివృత్తములోఁ గొన్ని దేశీయాచారసంప్రదాయములను బ్రవేశపెట్టుట, దేశీయచ్ఛందోఽనుగుణము లయినవృత్తములను జేర్చుట మొదలగు కార్యము లని యూహింప వచ్చును ఇఁక దేశిని దేశీయముగా నొనరించుట యనఁగా దేశికవిత్వము నధికతర దేశీయకవితాముద్రతోఁ బ్రభావితము చేయుట మార్గకవిత్వమును దేశికవిత్వమునకు సన్నిహితముగాఁ జేయుటయు దేశికవిత్వమును ఇతోఽధికదేశీయముగా నొనర్చుటయు నాతని లక్ష్యమై యుండును ఇట్లీతనికావ్యమున నీరెండుప్రక్రియలును గోచరించును దేశి మార్గములను గలుపుట యనునీపద్ధతి నీతఁడు కన్నడకవులనుండి గ్రహించి యుండవచ్చును పంపకవి, రన్నకవి యనుకన్నడకవుల కట్టిపద్ధతియే యభిమతము 'దేశియొళ్పుగువుదు పొక్కమార్గదొళె తళ్వుదు' అని పంపకవియు – 'నెగళ్దరసం మనుగొళిసె మార్గ మొడంబడె, దేశికబ్బమంబగె గొళె వింత పేళ్దుదు' అని రన్నకవియుఁ దమగ్రంథములం దీవిషయమును దెలిపి యున్నారు

ఇఁక, నన్నెచోడుఁడు తనకుమారసంభవ మనుకావ్యమునందు సాధించిన దేశీయత యెట్టిదో యించుక పరికింతము

నన్నెచోడుఁడు కాళిదాసువలెఁ దనకావ్యమును హిమవద్వర్ణనముతోను, బార్వతీవృత్తాంతముతోను బ్రారంభింప లేదు. తనకావ్యమునందు వస్త్వైక్యమును సాధించుటకుఁ గాఁబోలును సతీదేవివృత్తాంతమును, దక్షాధ్వరధ్వంసమును మొదటిరెం డాశ్వాసములలో నభివర్ణించెను ఆదిశివుఁడే త్రిమూర్తిత్వముఁ దాల్చి విశ్వసృష్టికిఁ గారణభూతుఁ డయ్యెనను శివపురాణకథను సంగ్రహించి దక్షుఁ డాదిశక్తిపరమేశ్వరుల నావాహనము చేసి వారిని మిథునచర్యాసక్తికిఁ బురికొల్పఁగా వారు కరి కరిణీరూపములను దాల్చి క్రీడించి నపుడు వారికి గజాననుఁడు జన్మించినట్లు నన్నెచోడుఁడు తనకావ్యమునం దభివర్ణించెను. ఈగజాననజన్మవృత్తాంతము శివపురాణమునం దీరీతిని గానరాదు సుప్రభేదాగమమునం దీగజాననోత్పత్తి నన్నెచోడుఁడు వర్ణించినరీతినే యున్నది కాని, యాగమముల ప్రాచీనత యెట్టిదో నిర్ణయింప శక్యముగాకుండుటచే సుప్రభేదాగమము ననుసరించి నన్నెచోడుఁ డాగజాననవృత్తాంతమును రచించె నని చెప్పుటకును వీలు లేదు ఈగజాననోత్పత్తికథయిట్లే ప్రాచీన తమిళగ్రంథముల యందుఁ బ్రసిద్ధమై యున్నది అందుచే నితఁడు దీనిని దక్షిణదేశీయగాథలనుండి సంగ్రహించి యుండును క్రీస్తుశకము ఏడవశతాబ్దికిఁ జెందిన 'తేవార'

మనుస్తోత్రగ్రంథమున నీవిషయము సూచింపఁబడినది తమిళము నందలి వినాయకపురాణమునను, మలయాళరామచరిత్రమునను గూడ నీకథ సూచింపఁబడినది ఇట్లు తమిళ, మలయాళములయందుఁ బ్రచారమున నున్న యీకథ యాంధ్రదేశమున కపరిచితము గజాననునికి గజాననత్వము గలుగుటకుఁ గారణమిట్టి దై యుండినచోఁ బార్వతి నలుగుపిండి కథకంటె నది యెక్కువ సహేతుకముగా నుండు నని యూహించి యేతమిళకవియో యిట్లుగా నాకథను దొలుత కల్పించి యుండును అది యాదేశమునందును, నాదేశీయుల గ్రంథములయందును విశేషప్రచారము నంది యుండఁగాఁ దనకావ్యమునందు దేశీయతను సాధింపఁదలఁచిన నన్నెచోడుఁడు దానిని గ్రహించి తనకావ్యమున నలంకరించుకొని యుండ వచ్చును వాల్మీకి రామాయణకథ దేశభాషాకవుల చేతులలోఁ బడి దేశీయము లగుమార్పులకుఁ జేర్పులకు లోనయినట్లే శివ పురాణకథకూడ నన్నెచోడుని చేతిలో దేశీయతను సంతరించుకొనెను ఇదియే మార్గమును దేశీయముఁ జేయుట

దక్షుఁడు తనకుమార్తెల కాపురములు చూచివచ్చుటకై బయలుదేరుటయు – అతనియల్లు డగుకశ్యపుఁడు, చంద్రుఁడు, యముఁడు అను వారాతని కెదురేఁగి పెక్కు తెఱఁగుల సత్కరించుటయు – తనమొదలియల్లుఁ డగుపరమేశ్వరుని కడకుఁ బోఁగా నాతఁడు తనకువమారుని యుద్దాడుచుండి యాతనిని సత్కరింపకుండుటయు – నంతదానికిఁ గుపితుఁడై దక్షుఁడు శివు నవమానింప వలయు ననుమద్దేశముతో నొక యజ్ఞమును బ్రారంభించుటయు నన్నెచోడుఁడు దేశీయతాపాదనకై కల్పించినవే కాని మూలమునందు లేవు

ఇంకను వీరభద్రునిచేతఁ గాక జ్యేష్ఠకుమారుఁడగు గజాననునిచేతనే దక్షాధ్వర ధ్వంసము చేయించుట, పార్వతీశైశవక్రీడలు, రతిమన్మథ సంవాదము, దేవా సురయుద్ధము అనునవి యితివృత్తమునందు దేశీయతను సాధించుటకై నన్నెచోడుఁడు కల్పించినవే కన్యావరణము, ముద్రారోహణము మొదలగు దేశీయాచారములును, మండనాంగానోకహములు, కవిగమకివాదివాగ్మిలు అను సంప్రదాయములు, కవిసమయములు కొన్ని దేశీయతాసాధకమునకై నన్నెచోడుఁడు కల్పించినవి కలవు

నన్నెచోడుని కించుక తరువాతివాఁ డని చెప్పఁదగు నృపధూర్జటి భీమయ పండఁడు (క్రీ శ 1145) –

చ. తలఁపు నదర్థభావమునఁ దద్గతసూక్తులఁగూడ వర్థనల్
గొలుసు గొనంగ వ్రావడులు గోరినభంగిక వచ్చి ముట్ట గో
ములగతి దేశిమార్గములు మట్టుపడం గటనంబు లొప్ప నా
ద్యులక్రియంజెప్ప నేర్చె నృపధూర్జటిభీమయపండ్డఁ డిమ్మహిన్

*శాసనపద్యమంజరి* - ***19***

అను పద్యమున దేశిమార్గములు మట్టుపడునట్లుగా - నాద్యులక్రియఁ - గవిత్వము చెప్పఁగలనేర్పును బ్రశంసించుకొనెను నన్నెచోడుఁడు 'దేశిమార్గములు దేశీయములుగాఁ' గవిత్వము చెప్పవలయుననగా నితఁడు 'దేశిమార్గములు మట్టుపడు' నట్లుగాఁ గవిత్వము చెప్పినవిషయమును బేర్కొనినాఁడు మట్టుపడుట యనఁగా కుదురు కొనుట దేశిమార్గములను గలిపి చెప్పవలయు ననియే యిరువురి యభిప్రాయమయినను నన్నెచోడుఁడు దేశివైపునకే మ్రొగ్గినట్లు అతని పదప్రయోగము సూచించుచున్నది దేశిమార్గములు కుదురుకొనినట్లు కవిత్వము చెప్పినయా యాద్యులు నన్నయ నన్నెచోడు లయినను కావచ్చును పంపాదులగు కన్నడకవు లయినను కావచ్చును నన్నయలో మార్గాంశమధికము. నన్నెచోడునిలో దేశిపాలు అధికము అయినను ఆయుభయపద్ధతులును వారికవితలలోఁ గుదురుకొని యున్నవి. భీమయ పండఁడు పేర్కొనిన యాయాద్యులు వారే కావచ్చును

పాల్కురికి సోమనాథుఁడు రచించిన బసవపురాణ పండితారాధ్య చరిత్రములు ప్రధానముగా దేశిమార్గమునకుఁ జెందినవి. ఇందలి యితివృత్తము, ఛందస్సు, భాషా ప్రయోగాదులు మున్నగున వన్నియు నాతని దేశిప్రవణతనే పట్టి యిచ్చుచున్నవి కాని, యిందు మార్గకవితాచ్ఛాయ లసలు లే వని చెప్పుటకు వీలు లేదు సంస్కృతలాక్షణికులు నిర్దేశించిన కవిత్వలక్షణము లిందును గొన్ని కానవచ్చుచున్నవి. పండితారాధ్యచరిత్ర అవతారికలో నావిషయము లుట్టంకింపఁ బడినవి. ఇందలి ఛందస్సుదేశీయము భాషావిషయముగా నిందుజాతీయము లయినపలుకుబళ్లును, జానుతెనుఁగుపద ప్రయోగములును హెచ్చు. వైరిసమాసములు, స్వతంత్రపదప్రయోగములు బహుళముగాఁ గానవచ్చును నన్నెచోడునిలో దేశిచ్ఛాయ లెంతగా నున్నవో యీతనిలో మార్గచ్ఛాయ లంతగా నున్న వని చెప్ప వచ్చును ఇతనికాలమున నీతని యుద్యమఫలితముగా దేశికవిత్వ మధికముగాఁ బ్రజాదరమును జూఱగొనఁ జాలినది. సమకాలమునఁ

ప్రాభవమంది ప్రజ్వరిల్లుటయే కాక యాతనిదేశి కవిత్వము తరువాతి కాలమున వెలసిన యాంధ్రసాహిత్యముపైఁ గూడఁ దనప్రభావమును నెఱపినది అట్లాప్రభావమునకు లోఁగక కొందఱుకవులు ప్రజాదరపాత్రము లయిన దేశికవిత్వాంశములను దమతమకవిత్వములలోఁ గూడ వెలయించుకొని పుష్టిమంతము లొనర్చుటకుయత్నించిరి

పాల్కుఱికి సోమనాథుని కించుమించుగా సమకాలికుఁ డని చెప్ప దగిన కవీశ్వరుఁడు గోన బుద్ధారెడ్డి ఇతివృత్తము, భాష, ఛందస్సు – అనెడి మూఁడును దేశీయములే యయి యుండవలయు ననెడి శుద్ధదేశికవిత్వలక్షణములు మెండుకొని యున్న గ్రంథములు సోమనాథుని ద్విపదకావ్యములు అతని యితర లఘుకృతులు కూడ నించుమించుగా నట్టివే కాని, సోమనాథుని ద్విపద కావ్యములు వ్యాకరణచ్ఛందో లక్షణాదులలో నిర్దుష్టములు కాక పోవుటచేత బండితకవులకును, శైవమతవిషయకములే యగుటచేత శైవేతరు లయినబహుళాంధ్రజనమునకును నెక్కువ ప్రీతిపాత్రములు కాక పోయెను బుద్ధారెడ్డి ద్విపదకావ్యము లక్షణయుక్తమై, సర్వజనులకును బూజ్యార్హ మగు రామచరితము నభివర్ణించునదియగుటచేఁ బండితులకును, సర్వమతముం వారికిని – ఎల్లరకును శిరోధార్య మయ్యెను. అనఁగా బుద్ధారెడ్డి రామాయణము ఛందోవిషయమున దేశిమార్గమునే యనుసరించినను ఇతివృత్తము, భాష యనువానివిషయమున మార్గకవితాసంప్రదాయమునే యనుసరించెను కాని యాతని యితివృత్తము మార్గేతివృత్తమే యయినను నన్నెచోడుని వలె నితఁడు తన యాంధ్రీకరణమును దేశీయచిహ్నములతో విలక్షణతాశోభితమొనర్చి తనస్వతంత్రతాతృష్ణను, తనదేశీయుల సారస్వతాభిరుచిని దనిపెను ఇట్లు గోనబుద్ధారెడ్డి ఇతివృత్తము విషయమున నన్నెచోడుని – ఛందో విషయమున పాల్కుఱికి సోమనాథుని – భాషా విషయమున మార్గకవితాపద్ధతిని అనఁగా లక్షణయుక్తమగుభాషను బాటించి తనకావ్యమును దీర్చి దిద్దెను

రంగనాథరామాయణమునందలి దేశీయతాంశములను బరిశీలింతము. సంస్కృతపురాణాంధ్రీకరణమున కంకురార్పణము చేసిన నన్నయభట్టారకుఁడు భారతానువాదసందర్భమున మూలకథా విధేయముగా నడిచెనేకాని తా నై స్వతంత్రించి యాకథలో నెట్టి మార్పును గాని చేయ లేదు కేవలానువాదకుఁడు మూలమునకు భిన్నముగా స్వతంత్రము లగుకల్పనములను చేయఁడు

స్వతంత్రానువాదకుఁ డట్లు కాదు అతఁ డట్టి కల్పనలు చేయుటకు వెనుదీయడు అట్టి యాతనిగ్రంథము అనువాద మనుట నామమాత్రమే యథార్థమున కది యట్టిది కాదు రంగనాథ రామాయణము అట్టి స్వతంత్రానువాదము దానికి విశిష్టత నాపాదించిన యంశము ప్రధానముగా మూలభిన్నము లగు నీగాథాకల్పనమే ఆ కథ లన్నియు నేప్రాచీనపురాణములలోనో యుండి నను నతఁడు వాని నాయా గ్రంథముల నుండి యేర్చి యిందు గూర్చి యుండుననుట నసత్యము కాదు ఆకథ లన్నియు నేనాఁడో, యేవిధముననో యాంధ్ర ప్రజానీకము యొక్క చెవులలోఁ బడి, వారినోటఁ బదములుగాను, పాటలుగాను, కీర్తనలుగాను వెలసి వారిరక్తములో రక్తముగా జీర్ణించుకొనిపోయి యుండును. అట్టి పదకవిత్వఖనినుండి బుద్ధారెడ్డి యీ దేశీయగాథ లనెడిజాతిరత్నములను వెలికిఁ దీసి తన రామాయణ మనెడి రత్నహారమునందుఁ గూర్చుకొని యుండును. రంగనాథరామాయణమునకు దేశితన మాపాదించిన మఱొక లక్షణ మిదియే. అతఁ డిట్లు దీనిని దేశీయతాలక్షితముగాఁ దీర్చిదిద్ది యుండకపోయినచోఁ బరిచితవస్తురహిత మైన యీరచనముదేశీయులకుఁ బ్రీతిపాత్ర మయి యుండెడిది కాదు తక్కిన యన్నిరామాయణములవలెనే యిదియు నొకచోఁ బడియుండ వలసిన పరిస్థితి యేర్పడి యుండెడిది

రంగనాథరామాయణమునందలి అరణ్య, యుద్ధకాండలలో గోన బుద్ధారెడ్డి ప్రవేశపెట్టిన యమూలకగాథలు ముఖ్యముగా మూఁడు కలవు అందు మొదటిది జంబువృత్తాంతము. ఇది యీరామాయణమునకుఁ గ్రొత్తదన్నెను దెచ్చిపెట్టుచున్నది. ఈవృత్తాంతము లేనిచో శూర్పణఖాప్రవేశము సమర్థితము కాఁజాలదు లోకనిందా పాత్రమును, పరిహాసభాజనమును నయిన యీయవివేకురాలిచరితము శోచనీయమును, దయనీయమును నగుట దీనిమూలముననే ఇట్లది స్వయంసంపూర్ణ మై వెలుఁగొందుటయే కాక ప్రధానేతివృత్తమునకు సైతము పోషకముగా నున్నది రెండవది కాలనేమి వృత్తాంతము. ఇందు రాక్షసుల ప్రతిక్రియాకల్పనాచాతురి మనల నాశ్చర్య మగ్నులను గావించును రావణశక్తిచే మూర్ఛితుఁడై పడి యున్న లక్ష్మణు డెప్పుడు పునరుజ్జీవితుఁ డగునా యని తహతహపడుపాఠకులకు దీనిమూలమున మఱింత యుత్కంఠకలిగి, యంతమునఁ గలుగు శుభమును మఱింత యాస్వాద యోగ్యము జేయును ఇఁక మూఁడవది సులోచనావృత్తాంతము ఈమె

ఘునాథుని సతి మండోదరి కోడలు ఈధీరవనిత యుద్ధరంగమున త్రుమధ్యమునకుఁ బోయి వారిని మెప్పించి రణనిహతుఁ డయిన తన ాణేశ్వరునియొక్క మృతకళేబరమును సహగమనార్థమై తెచ్చుకొనును. ఇవి మాఁడే కాక ప్రత్యేకముగా యుద్ధకాండకు వన్నె తెచ్చిన కల్పనలు వేఱువిధము యినవి మరికొన్ని కలవు గౌతముని శాపముచే నహల్య పాషాణరూపముఁ ల్చుట, యుద్ధకాండాంతమున నాత్మసంప్రీణనములో బుద్ధారెడ్డి ప్రవేశపెట్టిన మిత్రినవ్వు అనునవి యాతఁడు పాటలు, పదములు మొదలగు దేశిరచనముల ుండి గ్రహించి యుండవచ్చును

ఇట్లితివృత్తమువిషయమున నన్నెచోడు ననుసరించి దేశీయమైన గునమూలక గాథలను దీర్చి దేశీయాభిమానమును బ్రకటించుటయేకాక ుతఁడు గానానుకూలమై జనవశీకరణయోగ్యతను సంపాదించుకొనిన ుమనాథుని ద్విపదకావ్యములకుఁ గల ప్రచారాదరములను గుర్తించి తానును న్లే, దేశిచ్ఛందమగు ద్విపదలోఁ దన రామాయణమును వెలయించెను ఇట్లొక్క ాషావిషయమునఁ దప్ప గోన బుద్ధారెడ్డి రామాయణమున తక్కి ున్నివిషయములందును దేశిపద్ధతినే యనుసరించి కృతార్థమయ్యె నని నుడు నను. ఈసందర్భమున ద్విపదకావ్యములయందలి దేశితనమునుగూర్చి శ్రీ ుగలి లక్ష్మీకాంతకవిగారు తెలిపిన యంశములు గమనింపఁ దగి యున్నవి.

'నిజమునకు శుద్ధదేశికవిత్వమున ఇతివృత్తము, భాష, ఛందస్సు – అనెడి ాఁడును దేశీయములే యై యుండవలెను. గీతి దానికి వాయువుపట్టు. అట్టి ుణము గల వాఙ్మయమే మన పదకవిత్వము. దానికి కేవలభిన్న మైనది శుద్ధమార్గ ిత్వము దీనియందు ఇతివృత్తము సంస్కృతపురాణసంబంధి భాషయు స్కృత మయము. ఛందము కూడ సంస్కృతవృత్తానుకరణము కాలక్రమమున మనుకరణ వాఙ్మయమే ప్రబలి, ప్రౌఢసాహిత్య మనిపించుకొని, తంత్రమును, సజీవమును నగు దేశికవితను వెనుకకు నెట్టినది దానిని ష్టించువారును, సేవించువారును బామరులుగాఁ దిరస్కరింపఁబడిరి. తుదకు ుకరణశీల మైనవాఙ్మయమే పట్టము కట్టుకొనెను దీని ధాటికిఁ దాళ లేక ాకోమలదేశికవిత నగరములు, రాచబాటలు వదలి పల్లెపట్టుల సందు ుదుల నడయాడఁ దొడఁగెను. సహజసౌందర్యము గల యాముగ్ధసరస్వతికి ొకొంత ప్రౌఢవేషము వేసి నాగరమర్యాదలు నేర్పి సభాప్రవేశార్హత కలిగింప

వలె నని పాటు పడినవారే ద్విపదకావ్యకర్తలు వీ రొకవంక తమదేశి కవితాభిమానమును, ఇంకొకవంక విద్వత్కవికీర్తికాంక్షను నణంచుకొనలేక యుభయతారకమైనమార్గము ద్రొక్కి కొంత వఱకుఁ జరితార్థు లయిరి

సహజముగాఁ బ్రాచీనద్విపదకావ్యకర్తల చిత్తవృత్తి దేశికవితాప్రవణమే కాని యాదారినే పోయినచో దృఢస్థానకమును, విద్వల్లోకప్రతిష్ఠితమును నైన సారస్వతాలయమునకు వెలివార మగుదు మన్నభయముచేఁ దత్ప్రవేశార్హత నిచ్చు సంస్కారములఁ గొన్నింటిని స్వయముగాఁ జేసికొనిరి అనఁగా పైని పేర్కొన్న దేశికవితాలక్షణములలో నేయొకటిరెండింటినో పాటించి మిగిలినవానిలో మార్గకవితానుయాయులే యయి, యిటు ప్రజాసామాన్యమునకును – అటు సాహిత్యపరులకును నిష్టు లై వారిహృదయములలోను, వీరికోశములలోను స్థానములను దక్కించుకొనిరి వీరిది పదకవిత్వమయ్యు బామరకవిత్వము కాదు పండితకవిత్వమయ్యు దేశికవిత్వము కాకపోదు ఇదియే ద్విపదకావ్యకర్తలకుఁ గల ప్రత్యేకత ' –

బుద్ధారెడ్డి రామాయణమున నీసూత్రము వర్తింపఁజేసినచో నితివృత్తము విషయమునను, భాషావిషయమునను మార్గపద్ధతినే యనుసరించి ఛందోవిషయమునఁ బూర్ణము గాను, ఇతివృత్తవిషయమున స్వల్పముగాను దేశీయాభిమానమును ప్రదర్శించి – కేవల మార్గపద్ధతిని రచితము లయిన గ్రంథములకంటె నెక్కువగాఁ బ్రజాదరపాత్ర మయినది

రంగనాథుఁ డనుకవి కల్పితవ్యక్తి యగునో కాఁడో మనకుఁ దెలియదు కాని రంగనాథకవి రచితములుగాఁ గొన్ని రచనములిటీవల నుపలబ్ధము లయినవి అది శివస్తుతి పదము లగుటచే వానిని సేకరించి ప్రకటించిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆరచనముల సంకలనమునకు రంగనాథునిశివకవిత్వము అని పేరిడిరి అందు నయనరగడ, నమశ్శివాయరగడ యను రెండు రగడకృతులు కలవు ఆ రగడకృతులరచనము సోమనాథకవి ప్రభావముచే జరగినది కావచ్చును శివకవులకు సహజ మయినదేశీయాభిమాన మీకృతులయం దాతఁడు స్వీకరించినదేశిచ్ఛందములవలననే తెలియుచున్నది

తిక్కనసోమయాజి భాషావిషయమున దేశికవితాభిమానమునే ప్రదర్శించెను గాని యితర కవితాలక్షణములలో మార్గపద్ధతినే యవలంబించెను

నన్నెచోడుఁడును నిట్లే యొనరించినను భాషాప్రయోగవిషయమున నించుక విశృంఖలముగా వర్తించెను అందుచేతనే యాతనికావ్యము పండితాదరమును బడయఁజాలకపోయెను సోమనాథుఁడు జానుతెనుఁగుపదములను గుప్పించినను, జాతీయంబులను, సామెతలను దన భాషలో విశేషముగా వాడినను - అయుభయవిధములను నాతఁడు దేశికవితాభిమానమును బ్రదర్శించినను నతనికవిత్వమునఁ గూడ భాషాప్రయోగవిషయమున విశృంఖల వర్తనము కానవచ్చుటచే నతనిగ్రంథములును బండితజనామోదముఁ బడయఁజాలక పోయెను తిక్కనసోమయాజి యీపరిస్థితిని జక్కఁగా నవగాహనముఁ జేసికొని యలాక్షణిక మయినభాషాప్రయోగముచేతను - దేశిపదముల నెక్కువగాఁ బ్రోవులు పోయుటవలనను, జాతీయములు గుప్పించుటవలనను, సామెతల నందందు జొప్పించుట వలనను భాషావిషయకముగా దేశీయతను సాధించినట్లు కా దని తీర్మానించుకొనినవాఁడై తనకవిత్వము పండితాదారపాత్రము కావలయు నన్న నందలి భాష సలక్షణమై యుండవలయు నని, యట్టి సలక్షణ మైన భాషలోనే యాంధ్రభాషాసహజము లయిన వాక్య నిర్మాణాదికము నిర్వహించి యా ఘట్టములఁ జదువుసందర్భమున నాంధ్రభాషాసహజ మయిన సంభాషణా సౌందర్యము కొట్టవచ్చినట్లు రచించి భాషా ప్రయోగమున నొక నూతనదేశిమార్గమును ద్రొక్కెను. నన్నయకవిత్వమునందు మార్గకవితాంశ మధికము గాఁ గానవచ్చును. తిక్కన కవిత కేవలమార్గమును గాదు - కేవలదేశియును గాదు. అది యారెండింటి యొక్క సలక్షణ మయిన సమరస మయిన సమ్మేళనము. అందు చేతనే యాతఁ డుభయకవిమిత్రుఁడు.

తిక్కన భాషావిషయమున సాధించినదేశీయత యెట్టిదో యించుక పరిశీలింతము

తిక్కనతెనుఁగులో నితరకవులయందుఁ గానరాని కొన్ని ప్రత్యేకతలు కలవు. అతనికిఁ బూర్వు లయిన నన్నయ, నన్నెచోడుఁడు, పాల్కురికి సోమనాథుఁడు అను ప్రసిద్ధకవులకావ్యములలోని తెనుఁగునకు విలక్షణ మయినస్వభావము కలది తిక్కన తన భారతమునందు నెలకొల్పినతెనుఁగు అతనిది ఒక ప్రత్యేకవాణి. బాణీ కూడ.

తిక్కన తెనుఁగులోని కొన్ని ప్రత్యేకతలను వింగడించి చూచినపు డీక్రింది సామాన్యలక్షణము లతనికవిత్వములో మనకు గోచరించును తెనుఁగు

పదములను ఎక్కువగా వాడుట, ఎంత క్లిష్ట మయినభావము నయినను, గహన మయినవిషయము నయినను తెనుఁగునందే శక్తిమంతముగాఁ జెప్పఁ గలుగుట, ఆవశ్యక మగుచోఁ గొన్ని పదబంధములను ఉద్దిష్టార్థములో సృష్టించుకొనుట, తెనుఁగుపలుకుబళ్లను గొన్నిఁటిని సంస్కృతీకరించి వాడుట, సంస్కృత జాతీయములను తెనుఁగు చేసి చూపుట, తెనుఁగు జాతీయములను, సామెతలను విస్తారముగాఁ బ్రయోగించుట, వ్యావహారికభాషా వాక్యములకు నతిసన్నిహిత మయినగ్రాంధికవాక్యరచన చేసి యొకసొంపు సంపాదించుట, వ్యావహారికములోని కాకువు, ఎత్తిపొడుపు, అవహేళన మొదలయిన విచ్ఛిత్తివిశేషములను సాధించుట, తెనుఁగుపదములతోడికూర్పే యయినను తెనుఁగువారికిఁ గూడ సులభముగా నర్థము కానంత భావప్రధానముగా నుండుట, తిక్కన యేభావస్థితితో నాపద్యము వ్రాసెనో యాభావస్థితితో నాభావధారను అందుకొనినతప్ప నాపద్యార్థము సుగమము కాకపోవుట యను విలక్షణ లక్షణములు తిక్కనకవిత్వములో నెక్కువగాఁ గానిపించును స్వతంత్రించి యతఁడు కొన్ని ప్రౌఢప్రయోగములు చేయును అవి యాతనికిఁ దెలుఁగుభాషాప్రయోగముపైఁ గల యధికార మెట్టిదో వ్యక్తము చేయును తిక్కన భారతభాగములోని సంభాషణాత్మకశైలి వ్యావహారికానుగుణముగా నుండి మహామహుల సంభాషణలలోని కాక్వాక్షేపములను, ఎత్తిపొడుపును, అవహేళనను తనలోఁ బొదుగుకొని యుండుటయే తిక్కన తెనుఁగునఁ గానవచ్చు ముఖ్య మయిన ప్రత్యేకత

తిక్కనవలెఁ గావ్యరచన చేయుట సామాన్యులకు శక్యము కాదు అతని భాషయు, శైలియు ననుకరణీయములు. అందుచేతనే యతనితరువాత మరల దేశి కవితాసంప్రదాయమునకు దుర్దినములు పట్టినవి. అతని తరువాత తెనుఁగునందుఁ గవిత్వము చెప్పినకవీశ్వరులు అతనియంత శక్తిమంతులు కాకపోవుటచే దేశిమార్గమునం దాదరము చూపక నన్నయ యవలంబించిన మార్గకవితాసంప్రదాయమునే యవలంబించి పెంపొందించిరి నాచన సోమనాథుఁడు, శ్రీనాథుఁడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు, పెద్దనాదులగు ప్రబంధకవులు నామార్గమునే పరాకాష్ఠ నొందించిరి కాని, వారిలో శ్రీనాథుఁ డొకవంక మార్గకవితాభిమానమును ప్రదర్శించుచునే - అందుఁ దనప్రజ్ఞా ప్రాభవములను ప్రకటించుచుఁ బండితుల యాదరాభిమానములఁ జూఱ కొనుచునే మఱొక వంకఁ గొంత దేశికవిత్వమును గూడ వెలయించెను. తిక్కన

తనభారతమున మార్గదేశికవిత్వములను గరుపుటకు యత్నింపఁగా శ్రీనాథుఁడు దేనికి దానినే ప్రత్యేకముగా నిర్వహించి యుభయవిధములగు రచనములను జేయుటయందును దనకుఁ గలప్రజ్ఞను జాటుకొనెను అవి రెండును బ్రత్యేకముగా నిర్వహింపఁబడఁదగిన కళలే – పద్ధతులే యని యాతని యాశయము కాఁబోలును అతని వీధినాటకము వస్తుతత్త్వమును బట్టి దేశిరచనమే అందలి భాష సాంస్కృతిక మయ్యు నందలివివిధవర్ణనలు శుద్ధాంధ్ర దేశీయములు తెలుగు రాజధానీ నగరము ఓరుగల్లునందలి విశేషములను అభివర్ణించు కావ్యమది అందలి ఛందస్సు కూడ ప్రాయికముగా సాంస్కృతికమే ఇట్లది పాక్షికముగా దేశిరచన మగుచున్నది అయినను నిం దతని సంస్కృతపాండిత్య ప్రకర్ష ప్రకటనవాంఛయే యడుగడుగునందును గోచరించును ఇఁక నాతని పలనాటివీరచరిత్ర అచ్చముగా దేశికావ్య మని చెప్పఁదగును

ఇందలి దేశితనమునుగుఱించి శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు పలనాటివీర చరిత్రమునకు వ్రాసిన పీఠికలో నిట్లు తెలిపి యున్నారు.

'మార్గకవిత్వమును నిరసించి దేశికవిత్వమునకై కంకణము కట్టుకొన్న పాల్కుఱికి సోమనాథుఁడు సైతము ఈమూఁడు లక్షణములను సర్వత్ర సాధింప లేక పోయెను. బసవపురాణములోని యితివృత్తము ఆంధ్రదేశములోనిది కాదు అతని భాషలో దేశీయపదజాల మెంతయున్నదో సంస్కృతపదజాలమును అంతే యున్నది. మరియు అతని గ్రంథములు పద్యప్రబంధములవలె సాహిత్యపరులకు సంసేవ్యములే కాని సామాన్యప్రజలకు సంబోధకములు కావు. సోమనాథుని తరువాత వెలసిన తెలుఁగు ద్విపదకావ్యములన్నియు ఒక ఛందస్సులో దేశీయములు కాని తక్కినగుణములలో మార్గకవిత్వమునకు చెందినదే. కాఁగా ఈదేశికవితాశబ్దమును అన్నిట సార్థకము చేసినకావ్యములలో ఈ పల్నాటివీరచరిత్ర మొదటిది, మేటి

సహజకావ్యసంపదను సంతరించుకొని దేశికవిత్వమును ప్రతిష్ఠించిన ఉత్తమ కావ్యము పలనాటివీరచరిత్ర బసవపురాణాదులు ఇంకొకవిధముగా ప్రశంసార్హములు ఆద్విపదకావ్యకర్తలు ఈదేశికవిత్వమునకు కూడఁ పద్యకవిత్వముతోపాటు సారస్వత ప్రతిష్ఠ కలిగించి వాఙ్మయమున స్థిరత్వము కలుగఁజేయుటకై పలువిధముల పాటుపడిన వాఙ్మయ సంస్కర్తలు వారు దేశీయ మయిన శుద్ధపదకవిత్వమునకు, సాంస్కృతిక మయిన ప్రౌఢసాహిత్యమునకు

సామరస్యము కలిగించి యుభయతారక మయిన కావ్యపథమును తీర్చిదిద్దిరి ఇదియే ద్విపదకావ్యకర్తల ప్రత్యేకత

ఈవలనాటిపదము ప్రౌఢసాహిత్యమున స్థాన మాశింపనే లేదు పండిత పరసయోగ్యము కావలె నని అభిలషింపను లేదు ప్రజలకొఱకే పుట్టి, ప్రజలకే ఆదరపాత్ర మై, వారిమెప్పును ఆశించి, తాను తరించి, వారిని తరింపజేయు ప్రజాకవిత్వ మది ఈదృష్టితో చూచినచో ఇట్టి స్వతంత్రకావ్యము కాని, దేశిరచన కాని, మహాపురుషుల చరిత్ర కాని ఆంధ్రసాహిత్యమున ఇంకొకటి లే దని పూర్వపక్షభయము లేకుండ చెప్పవచ్చును '

శ్రీనాథయుగమునకే చెందిన మఱొక ద్విపదకావ్యకర్త గౌరన అతని హరిశ్చంద్రద్విపదలో నొక్క యితివృత్తము మాత్రమే మార్గము. ప్రాఁదెనుఁగు పలుకులు ప్రయోగించుటలో నీతనికి మక్కువ యెక్కువ యని యీతనికావ్యములను బట్టి తెలియవచ్చుచున్నది ఛందస్సు దేశీయమే కదా ఇట్లు గౌరనయు దేశికవిత్వాభిమానమును గొంత ప్రదర్శించెను. దేశీయ వస్తుస్వీకరణమున కాతనికి సాహసము చాలినది కాదు. కాని, యాపౌరాణిక వ్యక్తులను గూడ దేశీయపరిసరములలో దేశీయము లగు వేషభాషలతోఁ దీర్చి దిద్ది వస్తువిషయమునఁ గూడఁ గొంత దేశికి సన్నిహిత మగుటకే జతనము సలిపి యాతఁ డందుఁ గృతార్థుఁ డయ్యెను.

ప్రబంధయుగమునకుఁ గొంత ముందువెనుకలుగా తాళ్లపాక కవుల కృతులలో నీదేశికవిత మరల నొకతూరి తలయెత్తుకొనినది వారు పాలకుఱికి సోమనాథుని వలెనే ద్విపదకావ్యములు, ఉదాహరణములు, శతకములు, రగడలు, గేయకృతులు మున్నగు వివిధదేశిరచనాప్రక్రియల నవలంబించి దేశికవిత్వమును విస్తారముగా సృష్టించిరి కాని, రాయలవారి యాదరప్రోత్సాహములతో నాతనియాస్థాని నలంకరించిన యష్ట దిగ్గజ కవీశ్వరులును, నితరులును సృష్టించిన ప్రబంధకవితావాహిని యురవడి కది ప్రక్కకుఁ దొలఁగి నిలువవలసి వచ్చినది అందుచేత దాని నంతగా నాదరించువారు లేక పోయిరి

ప్రబంధయుగమునకుఁ దరువాత నీదేశికవిత్వము దృశ్యాదృశ్యమై పోవుట తటస్థించెను కాలప్రభావముచే నాకాలమునందలి కవీశ్వరులు నన్నయాది ప్రాచీన కవులను, పెద్దనాది ప్రబంధకవులను ననుసరించి మార్గకవిత్వమునే చెప్పినను

చెదరుచెదరుగా దేశికవిత్వ లక్షణములకు తమ కవిత్వములో నేదో యొక రూపమునఁ జోటు కల్పింప వలయునని సంకల్పింపక పోలేదు అట్టి సంకల్పముయొక్క ఫలమే తెలుఁగున వెలసిన అచ్చతెనుఁగు కావ్యములు, యక్షగానములు పొన్నిగంటి తెలగనార్యుఁడును, కూచిమంచి తిమ్మకవియు సంస్కృతనిరపేక్షముగాఁ గావ్యములు విరచింపవలయు నని సంకల్పించి యచ్చ తెనుఁగుకావ్యములను తెలుఁగున వెలయించిరి ఆంధ్రభాష సంస్కృతభాషపై సంపూర్ణము గా నాధారపడియుండుట వారికి గిట్టలేదు సంస్కృతపద విరహితముగా – తద్భవదేశ్యపద ములతోఁ గావ్యకల్పనము చేయుట యసాధ్యము కాదు అనువిషయమును వారు తమకావ్యకల్పనము మూలమున నిరూపించిరి ఇతి వృత్తము, ఛందము అను రెండు విషయములందును వారు సంస్కృతమునే యనుసరించిరి. ఒక్కభాషలో మాత్రమే వారు సంస్కృతపదప్రయోగమును సమ్మతింపక అచ్చతెలుఁగునందే కావ్యకల్పనము చేయ జతనపడిరి వారు తమయత్నమున సాఫల్యము గాంచి రనియే చెప్పవలసియున్నను – వారి కావ్యములయందలి కృతకసమాసముల కల్పనములు, కావ్యపాత్రముల నామము లను తత్సమములుగానే యుంచుట, అట్టివానికిఁ గొన్నింటికి కృతముగా నచ్చతెనుఁగు సమాసములను కల్పించుట మొదలుగా వారవలంబించిన పద్ధతులచే వారియచ్చతెనుఁగు కవిత్వము శుచిగా నున్నను రుచిగా, రసవంతముగా నుండఁజాలక పోయినది. ఇట్లు వారి ప్రయత్న మంతయువ్యర్థప్రయత్నమే యయినది అదియు నొకవిధ మయిన సాహిత్యప్రక్రియగా నిలచిపోయినదే కాని యది తా నాశించినంతగాఁ బ్రజలకు సన్నిహిత మై దేశిరచనాముద్రను గ్రహింపఁజాలక పోయినది

తరువాత నాయకరాజులకాలమున నీదేశికవిత్వము యక్షగానములు పదములు, జావళీలు మొదలగువానిరూపమునఁ గొంతవిజృంభణము గాంచెను కాని, యీ విజృంభణము కూడఁ జాలకాలము నిలువక యచిరకాలముననే యడఁగిపోయెను. కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయము మనకుఁ దెలిసినంతవఱకుఁ మొదటి యక్ష గానము అందలి యితివృత్తము మార్గేతివృత్తమే కాని, ప్రక్రియ దేశిప్రక్రియ. అందలి దరువులు, కీర్తనలు, పదములు దేశిచ్ఛందమునకు సంబంధించినవి భాష గ్రాంథికమే కొన్ని యక్షగానములలో వ్యావహారికభాషయుఁ గలదు నాయక రాజులకాలమునాఁటి

యక్షగానములు కొన్ని సమకాలమునకు సంబంధించినవి సమకాలమునందలి రాజులకు సంబంధించినవి కూడఁ గొన్నికలవు. దక్షిణదేశీయవాఙ్మయమున నీయక్షగానములు కుప్పతిప్పలుగా నుప్పతిల్లినను నవి రాజాస్థానములలో వర్ధిల్లుటచేతఁ గాఁబోలు వానికిఁ బ్రజలలో నంతగాఁ బ్రచారము లేకపోయినది వానిలోఁ బెక్కు రాజభాండాగారవములలోఁ దలదాఁచుకొనినవి తప్ప ప్రజాస్థానరంగముల కెక్కలేదు. పదములు, జావళీలు నాట్యాంగములుగా వాసి కెక్కినవి వానికిని మొన్నమొన్నటిదాఁక నుత్తమసాహిత్యపురస్కారము లభింపలేదు

ఆధునికకాలమునఁ బండితులకును, గవులకును దేశికవితావాఙ్మయముపై నపరిమిత మైన యాదరాభిమానము లుదయించినవి ప్రాచీనకాలమునఁ బుట్టినదేశి సారస్వతము నంతను సేకరించి కొందఱు విద్వాంసులు దాని నెల్ల గ్రంధస్థము కావించి భద్రపఱుచుచున్నారు. పూర్వకాలమునందలి పాటలను, పదములను దృష్టిలో నిడుకొని కొందఱు కవులు సర్వజనసుబోధము లయిన గేయరచనలు కావించుచున్నారు. గ్రాంథికభాష విశ్వవిద్యాలయములందునుఁ బాఠ్యగ్రంధములయందును మాత్రమే నిలిచి వ్యావహారికభాష ప్రజాజీవితము నందలి యితరరరంగము లన్నింటఁ బ్రవేశించినది. వ్యావహారికభాషలో, దైనందిన జీవితసంఘటనలను చిత్రించుచు, గేయరూపమున రచితము లయిన యాధునిక గేయరచనవములు ప్రజానీకమున కత్యంతము సన్నిహితమై ప్రజాకవిత్వ మనిపించుకొనఁ జొచ్చినది. ఆధునికకాలమునందలి యాంధ్రకవిత్వము చాలవఱకు దేశిమార్గముననే నడచుచున్న దనినచో నతిశయోక్తి కాఁ జాలదు. కాని, విద్వాంసులకు మాత్రము నేఁడు కూడ దీనియెడ నిరసనభావమే కాని సహజ మయిన గౌరవాదరములు సమకూడుట లేదు. ప్రజాహృదయములలో మాత్ర మిది చిరస్థిరస్థానమును సంపాదించుకొనె ననియే చెప్పవలసియున్నది కాని, దాని మనుగడ చిరకాలప్రవృత్తము కాదు. స్వల్పకాలికము. అయినను దాని భవిష్యత్ప్రవృత్తి యెట్లుండునో యిప్పుడప్పుడే చెప్పుటకు వీలు కాదు

ఇట్లు దేశికవితాప్రవాహము నన్నయకుఁ బూర్వకాలమునుండియు నాయా కాలపరిస్థితుల ననుసరించి పోటుపాటులనందుచు సన్నసన్నగాఁ బ్రవహించి వచ్చుచునే యున్నది. నన్నయకుఁ బూర్వకాలమునందుఁ జాళుక్యరాజాదు లగుపలువురు దేశి కవిత్వమును బుట్టించి దానిని బెంపొందింప

యత్నవములు గావించిరి కాని, యనాకాలవమునఁ బండితు
సంస్కృతాభిమానము పెచ్చుపెరిగి యుండుటచే దానికిఁ దగినంత ప్రాముఖ
లభింప లేదు నన్నయ కన్నడమునందలి పంపాదుల ననుసరించి మార్గ
పద్ధతికే ప్రాధాన్యమొసఁగెను. అందుచే నాకాలమున దేశికవిత్వము మఱి
హీనస్థితినంది యుండెను తరువాత మతప్రచారమే ప్రధానాశయముగాఁ
కావ్యసృష్టి కావించిన పాల్కుఱికి సోమనాథుల కాల మాదేశికవితావాహి
ప్రావృట్కాలకల్ప మై యనల్ప మయిన యుల్బణము నాపాదించెను తి
కవిత్వము దేశిమార్గకవిత్వముల యద్భుత సమ్మేళనము. శ్రీనాథుఁడు సవ్య
యై మార్గదేశి కవిత్వములను రెంటిని బ్రత్యేకప్రత్యేకముగా నిర్వహించి
యసమానప్రజ్ఞాధురంధరత్వమును బ్రదర్శించెను గౌరనలో దేశికవిత్వం
కొంత తొంగిచూచినది. తాళ్లపాక కవులు విస్తారముగా దేశికవితాసృష్టికావిం
కాని, వర్షాకాలము గడచినపిమ్మటఁ గ్రమగ్రమముగా సన్నగిల్లి నది నిదాఘకా
నాఁటికి నిర్జల మై పోవునట్లు దేశికవితోద్యమము ప్రబంధకాలమునాఁ
గ్రమముగా రూపఱి దృశ్యాదృశ్యమై పోవుట సంభవించెను అచ్చతెను
కావ్యములలో దేశికవిత్వలక్షణము కొంత కానవచ్చును తరువాత నాయకరా
కాలమున యక్షగానాదుల రూపమున నది కొంత విజృంభణము కాంచెను
యావిజృంభణము దీర్ఘకాలము సాఁగ లేదు మఱల నాధునిక కాలము
బండితులకును, గవులకును దేశికవిత్వముపై విశేష మయినయాదరాభిమాన
లుదయించెను. దానికిఁ బాశ్చాత్యభాషాకవిత్వముతోడి పరిచయ
కొంతకారణముకావచ్చును వ్యావహారికభాష ప్రజాజీవితములోని పెక
రంగములలోఁ బ్రవేశించెను. ఆధునికకాలమునందలి యాంధ్రకవిత్వ
చాలవఱకు దేశిమార్గముననే నడచుచున్న దని చెప్పఁ దగును. దేశికవిత్వము
సోమనాథునికాలమునాఁటి యాదరప్రోత్సాహములు నేఁటికాలమునం
యాధునికకవులవలన లభించుచున్నది ఇంచుమించుగా నెనిమిదివం
సంవత్సరములకుఁ బూర్వము భిన్నము లయినదేశకాలపరిస్థితుల
భాషాకవిత్వప్రయోజనాదులనుగూర్చి నేఁటియాధునికదృక్పథము, విశాలదృ
లేనియాకాలముననే సోమనాథుఁడు దేశికవితోద్యమమును లక్షించి విస్
మయిన సాహిత్యమును సృష్టించి యుండుట యాతనిమహనీయతక
దూరదర్శితకు గొప్ప నిదర్శనము

## తరువాతి సాహిత్యముపై దానియొక్క ప్రభావము

ఇంచుమించుగా వేయియేండ్లకుఁ బైఁబడిన యుజ్జ్వలచరిత్రము కలయాంధ్ర సాహిత్యములో మహాకవులుగాఁ బరిగణింపఁ దగినకవివరేణ్యులు పెక్కురు గలరు కవితా ప్రాశస్త్యముచే నాయాయికవీశ్వరవిరచితము లగుకావ్యము లుత్తమకావ్యములుగాను, నాయాయికవీశ్వరు లుత్తమకవులుగాను బరిగణింపఁబడినను వారిలోఁ బెక్కురు సమనంతరసాహిత్యముపై నెట్టిప్రభావమును గాని ప్రసరింపఁ జాలక పోయిరి తరువాతి సాహిత్యముపైఁ దమప్రభావమును బ్రసరింపఁ జేయఁగలిగిన యదృష్టము వారిలో నే కొలఁది మందికో మాత్రమే కలదు అట్టివారిలో మనసోమనాథుఁ డొకఁడు, ప్రముఖుఁడుకూడ తమప్రభావము తరువాతి సాహిత్యముపైఁ బడవలయు నని యుద్దేశించి బుద్ధిపూర్వకముగాఁ దదనుగుణ మయినరచనలుచేయువారును గొందఱు కలరు అట్లు ద్దేశపూర్వకముగాఁ గాక యాదృచ్ఛికముగాఁ దరువాతికాలపు సాహిత్యముపైఁ దమప్రభావమును బ్రసరింపఁజేసిన వారును గొందఱు లేక పోలేదు సోమనాథుఁ డీ రెండుతెగలలో మొదటికోవకుఁ జెందిన కవితల్లజుఁడు ఉద్దేశపూర్వకముగాఁ దమయుద్యమము యొక్క ప్రభావమును బ్రసరింపఁ జేయఁదలంచినవా రందఱును దమప్రయత్నములోఁ గృతార్థత్వము నందఁ గలిగి రనుటకును వీలు లేదు తాము సంకల్పించిన ప్రభావమును బ్రసరింపఁజేయఁగలుగుటకూడ నొకయదృష్టమే అట్టి యదృష్టమునకు నోఁచుకొనినకవీశ్వరుఁడు పాల్కుఱికి సోమనాథుఁడు

ఆంధ్రకవిత్వములో సంస్కృత భాషాప్రాచుర్యమును గుర్తించి, సంస్కృతనిరపేక్షముగాఁ గావ్యములను వెలయింపవలెనని సంకల్పించి, తదనుగుణముగా నచ్చతెనుఁగు లోనే కొందఱు కవులు కావ్యములను వెలయించిరి. కాని, వారిది వ్యర్థప్రయత్నమే యయినది వారంత గాఢగముగా బాఢముగాఁ బ్రయత్నించినను నాంధ్రకవీశ్వరులు వారిచేతఁ బ్రభావితులు కాక యథాపూర్వముగానే సంస్కృతపదసమ్మిళితముగాఁ గావ్యములను విరచించిరి కనుక, నీదృష్టితోఁ జూచినపుడు సోమన యాంధ్రసాహిత్యముపైఁ బ్రసరింపఁ జేసిన ప్రభావము చాల మహనీయ మయిన దనియు, ననితరసాధ్యమనియు భావింపఁ దగి యున్నది

ఆంధ్రసాహిత్యముపై నాతనిప్రభావమును, నాతనియుద్యమప్రభావమును బ్రత్యక్షముగాఁ గొంతయు, నప్రత్యక్షముగాఁ గొంతయుఁ గలదు మఱొకవిధముగాఁ గూడ మన మీప్రభావమును వర్గీకరింప వచ్చును కావ్యగతము, ఛందోగతము, ప్రక్రియా గతము, భాషాగతము నని యాతనిప్రభావము నాలుఁగుతెఱఁగులుగానున్నది

## ౧. కావ్యగతము

### ఎ కావ్యమును మతప్రచారసాధనముగా రచించుట

పాల్కుఱికి సోమనాథుఁడు శైవమతమును బ్రజలలో వ్యాపింపఁ జేయఁ దలచి బసవేశ్వరుని జీవితచరిత్రముతోఁ బెక్కురు పురాతన, నూతనభక్తుల చరితములను వేళవించి శైవమతావలంబకులకుఁ బరమపూజ్యమయిన మతగ్రంథముగాఁ దన బసవపురాణకావ్యమును వెలయించెను అట్లే పండితారాధ్యచరిత్రమున మల్లికార్జునపండితారాధ్యుని జీవిత చరితము నభివర్ణించు వ్యాజముతో శైవమతధర్మముల నెన్నిటినో ప్రత్యక్షముగాను, బరోక్షముగాను బోధించెను ఇంకను స్తోత్రరూపము లగుపెక్కురచనలు చేసి శైవమత ప్రచారము గావించెను క్రీస్తుశకము పదునైదు, పదునారు శతాబ్దులలో వెలసిన తాళ్లపాక కవులును సోమన యనుసరించిన యీపద్ధతినే యవలంబించి వైష్ణవమత ప్రచారమునకై పెక్కు గ్రంథములను విరచించిరి. ఇతని వలెనే వారును శతకములు, ఉదాహరణములు రగడలు, కీర్తనలు, మొదలగుప్రక్రియల నవలంబించి వైష్ణవమతప్రచారమును విస్తారముగాఁ గావించిరి

### బి చారిత్రకపురుషునిఁ గథానాయకునిఁ గావించుట

సోమనాథునికిఁ బూర్వకాలమందు వెలసినయాంధ్రసాహిత్యమును బరిశీలించినచో నది ప్రాయికముగా సంస్కృతమూలకమే యని స్పష్టమగును అందలి యితి వృత్తము కూడఁ బౌరాణికవ్యక్తులకు సంబంధించినది. అట్లు కాక చారిత్రకపురుషులయిన బసవేశ్వరుఁడు, మల్లికార్జునపండితుఁడు ననువారిచరితముల నితివృత్తముగా గ్రహించి సోమన బసవపురాణము, పండితారాధ్యచరిత్రము అనుగ్రంథములను వెలయించెను ఇవి యనువాద గ్రంథములు కాక స్వతంత్రగ్రంథము లయి యున్నవి సోమనకుఁ బిదప వెలసిన యాంధ్రసాహిత్యములో పింగళి సూరనవిరచిత మగు కళా పూర్ణోదయము వంటి

స్వతంత్రగ్రంధములును, కృష్ణరాయ విజయము, అన్నమాచార్యచరిత్రము, మన్నారుదాసవిలాసనాటకము, రఘునాధనాయకాభ్యుదయము మున్నగుచారిత్రక పురుషుల జీవితములను జిత్రించు కావ్యములు వెలయుట సోమనాధుని దేశికవితోద్యమము యొక్క ప్రభావమే యనుట సాహసము కాదు

## ౨ ఛందోగతము ·

### ౧ ద్విపద కావ్య రచనము

సోమనాధుఁడనుభవసారమును రచించినపిదప వీరశైవమతోద్ధారకుఁడగు ...సవేశ్వరునిగూర్చియు, నాతనియనుయాయులనుగూర్చియు నాతనికిఁ గొన్ని ...వరములు తెలియ వచ్చెను బసవేశ్వరునిపై నాతనికి భక్తిప్రపత్తులు కుదిరినపిదప ...తఁడు మున్ముందు సోమనాధస్తవము, బసవస్తోత్రపరము లగు గద్యలు, రగడలు, ...దాహరణములు మున్నగులఘుకృతులను రచింప దొరకొని సంస్కృతపద ...యాంయిష్టములగు నాదేశీయగేయకృతులు జనవశీకరణమునకును, ...తప్రచారమునకును దగినంతగా సహాయకారులు గానేర వని తలఁచి ...నుతెనుఁగుపై వలపు పచరించి, దేశీయచ్ఛంద మనుద్విపద గానయోగ్య ...గుటచే నది మతప్రచారమునకు మిక్కిలిగా నుపకరింపఁ గల దనునూహతో ...నవపురాణ మనుగ్రంధము నే డాశ్వాసముల ద్విపదకావ్యముగా రచించెను. ...తఁడు రచించిన పండితారాధ్యచరిత్రమును, సోమనాధస్తవమును, నతఁడు ...చించినదిగాఁ జెప్పఁబడు మల్లమదేవీపురాణమును ద్విపదకృతులే ఇతని ...నవపురాణము తెనుఁగున వెలసిన ద్విపదకావ్యములలో మొదటిది కేవలము ...నపదులపాటగాఁ బాడు కొనఁబడుచుండిన యాద్విపదచ్ఛందమును ...షాకావ్యోపయోగియగురీతిగా దిద్ది తీర్చినయశస్సు పాల్కురికి సోమనాధునిదే ...ంధ్రసాహిత్యమున ద్విపదవాఙ్మయశాఖకు సోమనాధుఁడు శ్రీకారము చుట్టెను ...తప్రచారమునకు మిక్కిలిగా నుపకరించు నీ ద్విపదలో సోమనకుఁ బిదపఁ ...క్కురు మార్గకవులు కూడ గ్రంథములు విరచించిరి గోనబుద్ధారెడ్డి ...వరామాయణము, గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము, కట్టా వరదరాజు ...మాయణము, ద్విపదభారతము, తాళ్లపాక కవుల అష్టమహిషీకల్యాణము, ...షాకల్యాణము మొదలగు ద్విపదకావ్యములకువరవడి పెట్టినది సోమనాధుని ...పదకావ్యములే

## ౫ ద్విపదలోఁ బ్రాసయతి నిలుపుట

సంస్కృతభాషలో 'అనుష్టుప్' ఛంద మక్షరబాహుళ్యములేక సులువుగా జదువఁదగిన యన్వయక్లేశము లేక పోవుటచే సులువుగా నర్థము చేసికొనఁ దగిన పురాణగ్రంథములయందు లక్షలకొలఁది గ్రంథ సంఖ్యలో వెలసి యుండుట తెలుఁగున, ననుష్టుప్పువలె నాకారమునఁ జిన్నది యైన ఛందము ద్విపద యని గుర్తించిన సోమనాథుఁడు తన ప్రధానగ్రంథములగు బసవపురాణ, పండితారాధ్య చరిత్రముల యందు దానిని నెక్కొలిపెను ఇతఁ డీద్విపదలోఁ గూడ నితరకవు లెవ్వరును బాటింపని ప్రాసయతిని బాటించెను ఇతఁడును, నితని కనుయాయులగుకొందఱు శివకవులును మాత్రమే ద్విపదలో నిట్లు ప్రాసయతిని గూర్చిరి రంగనాథరామాయణమునఁ గాని, గౌరన హరిశ్చంద్రద్విపదలోఁ గాని ప్రాసయతి పాటింపఁబడ లేదు 'అనియతగణైః ప్రాసో వా యతి ర్వా' యని మూఁడు సంస్కృతసూత్రముల నుదాహరించి సోమనాథుఁడు మాత్రాగణ ఘటితము లగుజాతివృత్తములలోఁ బ్రాసయతి చెల్లు నని నిర్ణయము గావించెను చూడుఁడు

*జాతులు మాత్రానుసంధానగణవి*
*నీతులు గాన 'యనియతగణై' ర*
*నియును 'బ్రాసో వా' యనియు 'యతి ర్వా'య*
*నియుఁ జెప్పు ఛందోవినిహితోక్తి గాన*
*ప్రాస మైనను యతియై వడి యైన*
*దేసిగా నిలిపి యాదిప్రాసనియతి*
*దప్పకుండఁగ ద్విపదలు రచియింతు ' -*

పండి 1-18 పుట

పయి వాక్యములలో సోమనాథుఁడు ద్విపదలోఁ బ్రాసయతిని నిలుపుట యందుఁ దనకుఁ గలయభినివేశమును వ్యక్తపఱిచెను. ఇట్లు ద్విపదలోఁ బ్రాసయతిని నిలుపుట యను నూతన సంప్రదాయమున కితఁడు ప్రవర్తకుఁ డై తక్కిన శివకవుల ద్విపదరచనలకు మార్గదర్శకుఁ డయ్యెను. ఇది యాతఁడు కవిత్వమునఁ బ్రవేశపెట్టిన నూతనసంప్రదాయ మనువిషయము మనకుఁ బిడుపర్తి సోమనాథుఁడను కవీశ్వరుఁడు తన పద్యబసవపురాణమునందుఁ బేర్కొనిన యోరుగంటి వృత్తాంతమును బట్టి కూడఁ దెలియుచున్నది.

ఒకనాఁడు శివభక్తు లోరుగంటిలో స్వయంభూదేని యాలయ మంటపమున గూర్చుండి బసవపురాణమును వినుచుండఁగాఁ బ్రతాపరుద్రచక్రవర్తి యీశ్వరదర్శనార్థమై యట కరుదెంచి యదిచూచి 'యీసంభ్రమ మేమి' యని యడిగెను వారు బసవ పురాణమును వినుచుంటి మని బదులు పలికిరి అంతట రాజు బసవపురాణ మనఁగా నెట్టి దని మఱల వారి నడిగెను అపు డొకధూర్తవిప్రుఁ డీ నడుమ పాల్కురికి సోమనాథుఁడనుపతితుఁడు ప్రావల్లు పెట్టి బసవపురాణమును ద్విపదరూపమునఁ గల్పించెను అది యప్రామాణికము, ననాద్యము నని రాజుతో దానినికూర్చి తెగడి పలికెను రా జంతట నటనుండి వెడలిపోయెను బసవపురాణమును వినుచుండిన శివభక్తులాధూర్తవిప్రునిఁ జంపుటకై పాల్కురికి పురమున నున్నసోమనాథుని యనుజ్ఞఁ బడయుటకై వెడలిరి

ఈవృత్తాంతమువలన ద్విపదలోఁ బ్రాసయతి నిలిపినందులకు సోమన కాలముననే గొప్ప యలజడి చెలరేఁగిన దని తెల్లమగుచున్నది

**సి త్రిభంగి, క్రౌంచపదము, మంగళమహాశ్రీ మొదలయిన విశేషవృత్తములను రచించుట:**

అనుభవసార మనుప్రాథమికకృతియందుఁ బాల్కురికి సోమనాథుఁడు త్రిభంగి, క్రౌంచపదము, తరువోజ, వనమయూరము మొదలగు విశేష వృత్తములను రచించెను విశేషించి, క్రౌంచపదమున రెండవ దళములోఁ గూడఁ బ్రథమదళప్రథమాక్షరముతో యతిమైత్రి కల్పింపఁ బడినది ఇది నన్నెచోడుని కుమారసంభవములోని క్రౌంచపదవృత్తరచనమునకు భిన్నముగా నున్నది ఇతఁ డిం దవలంబించిన విశేషవృత్తరచనాసంప్రదాయమును జూచియే కాఁబోలు తిక్కన భారతములోని స్త్రీపర్వమునను, నాశ్వాసాంత పద్యములలో నియతముగను విశేషవృత్తములను రచించెను. తిక్కన యే కాక యింకను బెక్కురు కవీశ్వరులు తమకావ్యములలో నిట్లే విశేషవృత్తముల నటనట రచించి తమప్రాగల్భ్యమును బ్రదర్శించిరి. ఇట్లాంధ్రసాహిత్యమున విశేషవృత్తరచనమునకు సోమనాథుని ప్రభావమే కారణ మనుట నిర్ధారిత మగుచున్నది

## 3. ప్రక్రియాగతము :

**ఎ శతకము**

బసవపురాణమును రచించిన పిదప సోమనాథుఁడు వృషాధిపశతక మనుపేర నొకశతకమును రచించెను ఇది మల్లికార్జునపండితునిచే రచిత మయిన

'శ్రీగిరిమల్లి కార్జునా' యనుమకుటముతోఁడి శతకము ననుసరించి రచింపఁ బడినది శ్రీగిరి మల్లికార్జునశతకము నేఁడు పూర్తిగా లభించుట లేదు మల్లికార్జునపండితుఁడు రచించిన శివతత్త్వసారమున శతకలక్షణములు కొన్ని యున్నను మకుటనియమమును, సంఖ్యా నియమమును నందుఁ గానవచ్చుట లేదు ఇతని వృషాధిపశతకము 'బసవా, బసవా, బసవా, వృషాధిపా' యనుమకుటమును గలిగి యున్నది ఇందు 108 చంపకోత్పలములు కలవు ఇట్లేకైకమకుటము గలిగి యుండి యిది 108 చంపకోత్పలములతో రచింపఁబడుటచే మకుటనియమము, సంఖ్యానియమము గలిగినశతకములలో – మనకు లభ్యమయినవానిలో – నీవృషాధిపశతకమే మొదటిది ఆంధ్ర సాహిత్యమున సోమనాధునికిఁ దరువాత నీశతకవాఙ్మయము మిక్కిలి విస్తారముగా నభివృద్ధిఁ జెందినది భక్తిరసాత్మకములు, శృంగారరసాత్మకములు, నీతి బోధకములు నగుపెక్కుశతకము లాంధ్రభాషలో నుప్పతిల్లినవి ఇట్లు వెలసిన యాంధ్రశతకవాఙ్మయమున కంతకును మూలకంద మీతని వృషాధిపశతకము శతక మను నూత్నసాహిత్యప్రక్రియకు నీవృషాధిపశతకమున సోమనాధుఁడు చక్కనిబాట వేసె నన వచ్చును

<u>ఉదాహరణము :</u>

పిడుపర్తి సోమనాధుఁడు తనపద్యబసవపురాణమున సోమనాధవిరచితము లగు గ్రంధములను బేర్కొనుచు, నం దాతఁ డుదాహరణయుగ్మము రచించినట్లు దెలిపెను ఇతఁడు సంస్కృతమున నొకబసవోదాహరణమును, తెనుఁగున బసవోదాహరణ, పండితారాధ్యోదాహరణములను రచించెను వీనిలోఁ బండితారాధ్యోదాహరణ మిటీవలనే డాక్టరు బి రామరాజుగారికృషిచే లభించినది ఉదాహరణ మొకవిశిష్టసాహిత్యప్రక్రియ. ఇది పద్యము, కళిక, ఉత్కళిక యనువిభాగములతో సప్తవిధవిభక్తుల నుదాహరించుచుఁ గడపట సార్వవిభక్తిక మగుపద్యముతోఁడను, నంకితాంకపద్యముతోఁడను నాయకగుణకీర్తనము గావించును

సంస్కృతాంధ్రవాఙ్మయములందలి యుదాహరణరచనల కితని యుదాహరణములే ప్రధమోదా హరణములు. సుప్రసిద్ధాలంకారికుఁ డగు విద్యానాధకవి తనప్రతాప రుద్రీయమునఁ బేర్కొనిన యుదాహరణ లక్షణమునకు సోమన సంస్కృతోదాహరణమే యేకైకలక్ష్యముగాఁ గాన్పించును ఇతని తెలుఁగు

ాసవోదాహరణమున నంకితాంక పద్యము లేదు సంస్కృతకృతిలో మాత్ర
ుయంకితాంకపద్యముగలదు తెనుఁగున నుదాహరణగ్రంధములను రచించిన
ర్వాతికవులు సార్వవిభక్తిపద్యమునకుఁ దరువాత నీ యంకితాపద్య రచనమును
ాడఁ నియతముగాఁ బాటించుచు వచ్చిరి తరువాతి కాలమున రావిపాటి
ిపురాంతకుఁ డనుకవి రచించిన త్రిపురాంతకోదాహరణమును, కాకునూరి అప్పకవి
చించిన హనుమదుదాహరణమును, తాళ్లపాక పెదతిరుమలాచార్యుఁడు రచించిన
ంకటేశోదాహరణమును, నింకను బెక్కుదాహరణ కావ్యములును తెలుఁగున
లసినవి ఈయుదాహరణము నొకవిశిష్టసాహిత్య ప్రక్రియగాఁ
ిణమింపఁజేసినది సోమనాధుని యుదాహరణగ్రంధములును, నాతని
ిశకవిత్వోద్యమమును తెలుఁగున నుదాహరణకావ్యరచనము పొల్కుటకి
ోమనాధుని దేశికవిత్వోద్యమఫల మని వేఱుగాఁ బేర్కొన నవసరము లేదు

## ిత్ర కవిత్వము .

సోమనాధుఁడు తనరచనలయందుఁ గొన్ని చిత్రకవితారీతులను బ్రదర్శించి
ూంధ్రమునఁ జిత్రకవిత్వమునకు మార్గదర్శకుఁ డాయెను సోమనాధునికిఁ
ార్వ మిట్టిచిత్రకవిత్వపద్ధతు లాంధ్రవాఙ్మయమున నున్నట్లు కానరావు

## ్షరాంక గద్య .

సోమన యక్షరాంకగద్య యనుపేర నొకకృతిని వెలయించెను. అకారము
ుదలు క్షకారమువఱకు వర్ణసమామ్నాయమునఁ గలయేబది యక్షరములతోను
ునగా నీ గద్యపాదముల ప్రధమాక్షరములు కూర్పఁ బడుటచే దాని కీ పే
ిడఁగఁ బడినది

*'అపి చ శివశృంగార ఓం*
*ఆదిపదవిస్తార ఓం*
*ఇహపరసుఖాధార ఓం*
*ఈషణత్రయదూర ఓం*
*ఉద్ధతగుణోపేత ఓం*
*ఊర్ధ్వరేతోజాత ఓం' –*

ఇత్యాదిగా వర్ణసమామ్నాయమునందలి యక్షరములతో నిందలిగద్య
దము లుపక్రమింపఁబడును

ఇతఁడు 'అక్షరాంకపద్యములు' అనుపేర నొకలఘుకృతిని వెలయించెను ఇదియుఁ బూర్వకృతివలె వర్ణసమామ్నాయమునందలి యక్షరములతో వరుసగాఁ గూర్చినపదజాలము గలిగిన పద్యరచన

చ 'అమితయశస్క ఆద్యయన ఇద్రుచి ఈశ్వర ఉగ్ర ఊర్జిత
క్రమ వృషభాంక ఋూజహార ఌితి ౡిత ఏకరుద్ర ఐం
ద్రమహితరూప ఓమితిపదద్యుతి ఔర్వలలాట అంబికా
సమరసభావ అఃకలిత వర్ణనుతం బసవేశ, పాహి మాం '

ఇందు యతినియమము పాటింపఁబడక ప్రాసనియమము మాత్రము పాటింపఁబడెను

## చిత్రకందములు

ఇతఁడు తనయనుభవసార మనుకృతియందుఁ జతుర్విధకందము అనుపేరఁ జిత్రకవిత్వమును బొందుపఱుచుటయే కాక యిందలి కందములలోఁ గొన్నిట నితఁడు ద్వంద్వప్రాసమును, త్రిప్రాసమును, గూర్చి యున్నాఁడు నన్నెచోడుని కుమారసంభవమునఁ గూడ నిట్లే చతుర్విధకందము గలదు (శ్రీ) బండారు తమ్మయ్య గారి యభిప్రాయము ప్రకారము నన్నెచోడుఁడు సోమనకుఁ దరువాతివాఁ డని భావించినచో నీచతుర్విధకందమునుదెలుఁగున దొలుత వెలయించినవాఁడు సోమనయే యగును.

## గద్యలు .

సోమన అక్షరాంకగద్య, నమస్కారగద్య, పంచప్రకారగద్య, శరణుబసవ గద్య, అష్టోత్తరశతనామగద్య యనుగద్యరచనలను రచించియున్నాఁడు దీనిలోఁ బంచప్రకారగద్య యైదువిధము లగునడకలు గలది యగుటచే పంచప్రకారగద్య యనుపేరితో వెలయుచున్నది ఇందుఁ దొలుత నొకశ్లోకము, తరువాత నయిదు రగడ భేదములును గలవు. ఇట్టి గద్యరచన లాంధ్రసాహిత్యమున సోమనాథునికిఁ బూర్వకాలమునందుఁ గానరావు సంస్కృతవాఙ్మయములో స్తోత్రరూపము లయిన యిట్టిగద్య లుండిన వేమో గాని తెలుఁగున మాత్ర మిట్టి రచనలు కితఁ డాద్యుఁడు వైష్ణవమతమునకుఁ జెందినవారు గద్యత్రయమును మిక్కిలి

భక్తిప్రపత్తులతో ననుసంధానము చేయుదురు ఆగద్యరచనలకును నీతని యీగద్యలే ప్రోద్బలకములు గావచ్చును సింహగిరి నరహరి వచనములు, వేంకటేశ్వరవచనములు ననువృత్తగంధి వచనములరచనమున కీతనిగద్యరచనల ప్రభావమే కారణమని తలఁచుట తప్పు గా దనఁదగును

## రగడలు

ఇతఁడు సద్గురురగడ, గంగోత్పత్తిరగడ యనుకృతులను రచించుటయే కాక తనయుదాహరణగ్రంథములయందును, పంచప్రకారగద్యలోను బెక్కురగడలను రచించి యున్నాఁడు రగడ యొక దేశీయ మయిన ఛందోవిశేషము ద్విపదనువలె దీనిని గూడ నీతఁడు చేపట్టి దానికిఁ గావ్యత్వగౌరవముఁ గలిగించెను ఇతనికిఁ బిదప నుదాహరణ కావ్యముల రచించిన కవీశ్వరులును నితనిమార్గమునేయనుసరించి బెక్కు రగడలను రచించిరి. చక్రపాణి రంగన యనుకవి భక్తిప్రధానము లగురచనములకు రగడఛందము మిక్కిలిగా నుపకరించు నని సోమనరచనలమూలమున నెఱిఁగినవాఁడై 'శివభక్తిదీపికా' యను పేరు గల నయనరగడ, నమశ్శివాయరగడ యనురెండులఘుకృతులను వెలయించెను ఇట్లు స్తోత్రరూపరచనలయందు సోమనమూలమునఁ దెలుఁగునఁ బ్రవేశించిన యీ రగడను దొలుత శృంగారములోనికి దింపినవాఁ డాంధ్రకవితాపితామహుఁ డగు నల్లసాని పెద్దన కవీశ్వరుఁడు అతని ననుసరించి యితరప్రబంధకవులును దమకావ్యములలో రగడను పుష్పాపచయవర్ణనసందర్భమున విరివిగా వాడఁజొచ్చిరి ఇట్లు దేశీయ ఛందోభేద మగు నీ 'రగడ' పొల్కుటికి సోమనాథుని దేశికవితోద్యమము మూలముగానే తెలుఁగునఁ బ్రవేశించినది

## ంచరత్నములు - అష్టకము :

బసవపంచరత్నము లనియు, వృషభాష్టక మనియు నీతని లఘుకృతులు ండు కలవు ఇట్టి రచనలకు మన యాలంకారికులు క్షుద్రకావ్యము లని పేరిడిరి మనాథునికిఁ బూర్వకాలమందుఁ దెలుఁగున నిట్టికృతులు రచింపఁబడినవేమో ని మనకు మాత్రము లభింప లేదు సోమనాథుని రచనలు పెక్కువెలసినవి నిలో కందుకూరి జనార్దనాష్టకము మిక్కిలి ప్రసిద్ధిఁ జెందినది

## ౪ భాషాగతము

### ౧ జానుతెనుఁగు

ఆంధ్రమున నన్నెచోడమహాకవియుఁ బాల్కుఱికి సోమనాథుఁడును దప్పమఱి యెవ్వరును నీ జానుతెనుఁగు శబ్దమును వాడి యుండలేదు నన్నెచోడమహాకవి తన కుమారసంభవకావ్యమును జానుతెనుఁగునందు రచించినట్లు పేర్కొనెను జాను తెనుఁగును తొలుదొలుతఁ బేర్కొనినకవి యాతఁడే ఈ క్రిందిపద్యమును జూడుఁడు

*చ సరళము గాఁగ భావములు జానుఁదెనుంగున నింపుపెంపుతోఁ*
*బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థములొత్తిగిల్ల బం*
*ధురముగఁ బ్రాణముల్ మధుప్రదుత్వరసంబునఁ గందళింప న*
*క్షరములు సూక్తులార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్*

కుమా అవతారిక 35ప

నన్నెచోడునికిఁ దరువాత పాల్కుఱికి సోమనాథుఁడు తన బసవపురాణము నందును, బండితారాధ్యచరిత్రమునందును నీ జానుతెనుఁగును బేర్కొనుటయే కాక తత్స్వరూపము నొకింత గోచరింపఁ జేసినాఁడు చూడుఁడు

*‘ఉరుతరగద్యపద్యోక్తులకంటె*
*సరస మై పరఁగిన జానుతెనుంగు*
*సర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ*
*గూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱఁ*
*దెనుఁగుమాటు లనంగ వలదు, వేదముల*
*కొలఁదియు కాఁ జూడుఁ డిల నెట్లు లనిన’*

బసవ అవతారిక 8 పుట

తనకుఁ బూర్వకాలమందును, దనసమకాలమునను నాంధ్రమున వెలయుచుండిన గద్యపద్యోక్తులతోఁ గూడిన చంపూగ్రంధములకును, దాను జానుతెనుఁగున రచించుకృతులకును గలతారతమ్యమును సోమనాథుఁడు పయి ద్విపదపంక్తులయందుఁ బేర్కొనుచు సోమనాథుఁడు జానుతెనుఁగు ‘సర్వసామాన్య’ మగుటచే నాదరము పడయ వలసి యున్న దనియు, వానిని తెలుఁగుమాటు లని తేలికగాఁ జూడఁ దగదనియు, వేదతుల్యములుగా వానిని భావింపఁ దగు ననియుఁ దెలుపుచున్నాఁడు

జానుతెనుఁగునకు 'సర్వసమాన్యత' యనుగుణముమాత్రమే కాక 'ప్రసన్నత' యను మఱొకగుణవిశేషము కూడఁ గల దని యతఁడు పండితారాధ్యచరిత్రమునందలి యీక్రిందిపంక్తులలోఁ దెలుపుచున్నాఁడు చూడుఁడు

*'ఆరూఢ గద్యపద్యాదిప్రబంధ*
*పూరితసంస్కృతభూయిష్ఠ రచన*
*మానుగా సర్వసామాన్యంబు గామి*
*జానుతెనుఁగు విశేషము ప్రసన్నతకు '*

*పండితా అవతారిక* ***15*** *పుట*

సోమనాథుఁడు తనవృషాధిపశతకములో నీ 'జానుతెనుఁగు' నొకొకలక్ష్యమును గూడఁ బ్రదర్శించెను చూడుఁడు

*చ బలుపొడ తోలుసీరయును బాపసరుల్ గిలుపారుకన్ను వె*
*న్నెలతల సేదుకుత్తుకయు నిండినవేలుపుటేఱు వల్గుపూ*
*సలు గలజేని లెంక వని జానుదెనుంగున విన్నవించెదన్*
*వలపు మదిం దలిర్ప బసవా, బసవా, బసవా, వృషాధిపా!*

*వృషా శత పద్యము* ***62***

ఇట్లీయుభయకవీశ్వరులచేత మాత్రమే ప్రయుక్తమై, యితరకవులెవరును వాడి యుండని యీ 'జానుతెనుఁగు' యొక్కస్వరూప మెట్టిదో – యెట్టిభాషను వారు జానుతెనుఁ గని పేర్కొనిరో మనయాంధ్రసాహిత్యవిమర్శకుల కంతు చిక్కలేదు. అందుచేత వృషాధిపశతకములోని పయిపద్యము అచ్చుతెనుఁగుపదములచేఁ గూర్పఁబడి యుండుటను గని సుప్రసిద్ధవిమర్శకు లగు శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు తమ కుమారసంభవవిమర్శలో జానుతెనుఁగు అనఁగా అచ్చ తెనుఁగు అనియర్థము వ్రాసిరి. కాని, యీజానుతెనుఁగును బేర్కొనినకవీశ్వరుల కావ్యములను బరిశీలించినపుడవి యచ్చతెనుఁగుకావ్యములు కా వని స్పష్ట మగుచున్నది. కనుక జానుతెనుఁగు అచ్చతెనుఁగు కాదు దానికంటె విలక్షణ మయినది

డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు తాము పండితారాధ్యచరిత్ర గ్రంథమునకు వెలయించిన పీఠికలో జానుతెనుఁగునుగూర్చి చర్చించుచు

జానుతెనుఁగనఁగాఁ గర్ణాటలాక్షణికులు పేర్కొనిన సమసంస్కృతోక్తివంటి దనియు, నది యాదికవుల విద్వత్తును బ్రకటించుటకు నిఘంటువ్యాకరణ ములమూలముగా బోధపడు సంస్కృతభూయిష్ఠము కాక, యదేపనిగా, వికారముగా, బలవంతముగా నేర్చి కూర్చిన యచ్చ తెనుఁగుమాటలతో మాత్రమే కూడిన భాషయును గాక లోకవ్యవహారబద్ధము లయిన సంస్కృతాంధ్ర పదములతోఁ గూడిన భాష యని తమయభిప్రాయ మయినట్లు వెల్లడించిరి పండి ఉపోద్ఘాతము 115 పుట

పయియిరువురువిమర్శకులలో నొకరు వృషాధిపశతకపద్యమాధారముగా జానుతెనుఁగును నిర్వచించుటకుఁ బ్రయత్నింపఁగా వఱొక రతని గ్రంథములలో నెల కొలుపఁబడినభాష యంతయు నాధారముగా నాపదమును నిర్వచించుటకుఁ బ్రయత్నించిరి ఈయిరువురయభిప్రాయములును నూహామీఁద నాధారపడినవే కాని, యిది యిట్లే యని నిర్ధరించి చెప్పునట్టివి కావు అన లీపదమును దొలుత బ్రయోగించిన నన్నెచోడుఁడు దీనిని తనకుఁ బూర్వ ముండినకన్నడకవులనుండి గ్రహించెను వారిలో నయినను నొకరిద్దఱు కవీశ్వరు లీపదమును బ్రయోగించిరే కాని దానిస్వరూప మిట్టి దని వారును దెలిపినవారు కారు. కన్నడమున నాగవర్మ, గుణవర్మ యను కవీశ్వరు లీ 'జాణ్నుడి' కిఁ బ్రసిద్ధులు నయసేనకవియు, జన్నకవియుఁ దమ గ్రంథములలో గుణవర్మయొక్క 'జాణ్ణుడి' ని బ్రశంసించి యున్నారు

కన్నడమున 'ఛందోఽంబుధి' యను ఛందశ్శాస్త్రగ్రంథమును రచించిన నాగవర్మ కృత్యవతరణికలో నన్నెచోడునివలెనే స్వీయకవితాప్రశస్తి చేసికొను సందర్భమున నొకపద్యములో నిట్లు తన 'జాణ్మణము' ను బ్రశంసించుకొనెను

*'నవరసముణ్మె మాతుపొసతాగిరె దేశియదే సెవెత్తు దెం*
*బవొలిరె, జాణ్మణం గొళిసె పొణ్దివ దర్ధకృతిప్రబంధముం*
*కివిదిని దాగె పొచ్చపొసతాగె మనోహర మాగె పేళ్వ స*
*త్కవి కవిరాజహంసనెనె పేళ లొడర్చిదె నీ ప్రబంధముం'* –

నయసేనకవి తన 'ధర్మామృత' మనుగ్రంథమున గుణవర్మయనుకవీశ్వరుని యొక్క 'జాణ్' తనమును బ్రశంసించెను ... [illegible]

అసగనదేసె పొన్నన మహోన్నతి వెత్త బెడంగు పంప నొం
దుసదృశమప్ప పూర్వరసభావ గజాంకుశ నొళ్పువెత్తురం
జిసువసదర్థదృష్టి గుణవర్మన జాణ్ కవిరత్ననోజె శో
భిసి నెలసిర్కె ధారిణి మనంగొళె మత్కృతియొళ్ నిరంతరం

జన్నకవి కూడ తన 'యశోధరచరిత్ర' లో గుణవర్మయొక్క 'జాణ్ణుడి' ని ప్రశంసించెను చూడుఁడు

ఎనగనుకూలమక్కె, గుణవర్మన జాణ్ణుడి, పంపనింపు, పొ
న్ననబగె, నాగవర్మనబహుజ్ఞతె, రన్ననకాంతి, నాగచం
ద్రనరసభావ, మగ్గళన వక్షతె, నేమియదెసె, పుష్పబా
ణనమృదుబంధ, మీకవిగళత్తె జనేంద్రపురాణకర్తృగళ్

కన్నడకవులు పేర్కొనిన యీ జాణ్, జాణ్ణుడి యనుపదములే జాను తెనుఁగు అను నన్నెచోడుని ప్రయోగమునకు మూలప్రకృతులు కాఁదగును ఇట్లు కన్నడము లోని 'జాణ్ణుడి' చేఁ బ్రబోధమునొంది నన్నెచోడుఁడు దానిఁబోలినది యగు 'జానుతెనుఁగు' అనుపదమును గల్పించి, యట్టి భాషాప్రయోగమునకుఁ బునాదులు వేయఁగా నాతని తరువాతఁ బాల్కురికి సోమనాథుఁడు నన్నెచోడుని కావ్యమును గని తనప్రధానాశయ మగుశైవమతప్రచారమునకై ప్రారంభించిన దేశి కవితోద్యమములో నొకభాగముగా నీ 'జానుతెనుఁగు' రచనమునకు సంకల్పించెను సోమనాథుని యీ జానుతెనుఁగు యొక్క ప్రభావము కూడ సమనంతరకాలమునందు వెలసిన సాహిత్యములోఁ జాలఁగాఁ గలదని వచింపఁ దగియున్నది.

సోమనాథుని జానుతెనుఁగు భాషోద్యమము మూలమున నాంధ్ర సాహిత్యమునకుఁ గొంత మేలే జరిగెను. అంతవఱకు దీర్ఘసమాసములతోఁ గూడిన సంస్కృత భూయిష్ఠ రచనముమీఁద నుండిన యాదరము తగ్గి యాంధ్ర కవీశ్వరులు దేశీయపదజాలమును, దెనుఁగు నుడికారమును బ్రయోగించుట వంకఁ గొంత మ్రొగ్గు చూపఁ దొడఁగిరి తెలుఁగు లాక్షణికులు కూడ భాషా విభాగములలో నిట్టి తెలుఁగునకుఁ బ్రత్యేక పరిగణనమునుగల్పించుట దీని ప్రభావ ఫలిత మనియే చెప్పఁదగి యున్నది.

'జానుతెనుఁగు' అని కంఠోక్తిగా నీ పేరుతోఁ బేర్కొనక పోయినను గేత
తన యాంధ్రభాషాభూషణములో 'దేశ్య' మను నొక విభాగమునుబేర్కొనెను.
అతఁడు చేసిన భాషావిభాగములను బేర్కొను నీ క్రింది పద్యమును జూడుఁడు

'తత్సమంబు లనఁగఁ దద్భవంబన నచ్చ
తెనుఁగు నాఁగ మఱియు దేశ్య మనఁగ
గ్రామ్యభాష నాఁగఁ గల నైదు తెఱుఁగులు
వేఱ వేఱ వాని విస్తరింతు' – ఆంధ్రభాషా, 18 ప.

ఇందు అచ్చ తెనుఁ గనియు, దేశ్యమనియు వేఱ్వేఱుగా రెండు
భాషావిభాగములు పేర్కొనఁబడినవి. అచ్చతెనుఁగనఁగా 'ఎల్లవారికిఁ దెలిసెడి
యా పలుకు' అని యతఁ డీ క్రింది పద్యమునఁ బేర్కొనెను.

క తల నెల వేసవి గండి పండి
పులి చలి మడుగూరు పేరు బూరుగు మగవాఁ
డలుక యని యెల్లవారికిఁ
దెలిసెడి యాపలుకు లచ్చతెలుఁగనఁ బరఁగున్ – ఆంధ్రభాషా 22ప

ఇక 'దేశ్య' మనునది యతఁడే పేర్కొనిన యచ్చ తెనుఁగునకంటె విలక్షణ
మైనదని యతఁడు దేశి తెనుఁగున కిచ్చిన యుదాహరణ పద్యముల వలనఁ
దెలియుచున్నది

సీ ఎఱుకువ నెత్తమ్మి యెరగలి యెనకంబు
నొస లింతి తేఁటి నెక్కసము నెమ్మి
మక్కువ చెచ్చెర మచ్చిక పొచ్చెము
కడిమి యేడ్తెఱ లగ్గు కలవలంబు
వెన్ను విన్నఁదనంబు వీనులు వెన్నడి
యెక్కలి తివురుట యుక్కు మేటి
బాగు తొయ్యలి బోఁటి ప్రసన్న నరిజోటి
వేసలి పాలపంబు మిన్ను మన్ను

గీ నెల్లి కొఱలుట వీచోపు లుల్ల మువిద
వీఁక కాఱియ గ్రద్దలు వేఁట గ్రేణి

కౌను పాలిండు లోగి మొగి గనయ మిట్టి
తెలుఁగుపలుకులు ధర దేశి తెనుఁగు లయ్యె

సీ. తమ్మెర లేమావి తెలిగన్ను క్రొన్నన
వలరాజు రేఱేఁడు వాలుగంటి
యలరులపిండు తెక్కలికాఁడు క్రొమ్మించు
కెమ్మోవి కెంజాయ కమ్మతావి
కడలి తామరకంది వెడవిల్తుఁ డెడకాఁడు
నలువ కలువకంటి నాన సెగ్గ
మెలనాఁగ ముద్దియ చెలువ చిగురుబోఁడి
తెఱువ తలిరుఁబోఁడి మెఱుఁగుఁబోఁడి

గీ. పదరు విసువుట పరిగమి పసలు నసదు
పొద్దు రేయెండ, తబ్బిబ్బు పోటుముట్టు
తనివి వలవంత చెంత మంతద మనంగఁ
దేర నాడిన ధర దేశితెనుఁగు లయ్యె –

– ఆంధ్ర భాషా **23, 24** పద్యములు

పయిపద్యములలోని పదములను బరిశీలించినవారి కవి 'యెల్లవారికిఁ దెలిసెడి యాపలుకులు' కావనియుఁ దెనుఁగులలో మంచి పరిచయము గలపండితులును, శిష్టులును మాత్రమే తెలియఁగల పదము లనియు నందుచే నవి కేతనమతప్రకార మచ్చ తెనుఁగు కా దనియుఁ దెలియుచున్నది కేతనకవి తన ...ంచుక పూర్వకాలమున వెలసిన దేశికవులు తమకావ్యములలోఁ బ్రయోగించిన జానుతెనుఁగునే – దేశికవులు వాడిన దగుటచే దేశితెనుఁ గని పేర్కొని యుండ వచ్చును శివకవుల కావ్యముల లోని జానుతెనుఁగును బరిశీలించినచో నదికేతన పేర్కొనినదేశితెనుఁ గనియే స్పష్టముగా గుఱుతింప వచ్చును ఈదృష్టిలోఁ బరిశీలించి చూచితిమేని సోమనాథుఁడు తనవృషాధిపశతకమునలో జానుతెనుఁగునకు లక్ష్యముగా నిచ్చిన 'బలుపొడ తోలుసీరయును' అను పద్యములోని పదములు శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగా రభిప్రాయపడినట్లు అచ్చతెనుఁగు పదములుకా వనియు, కేతనమతప్రకార మవి దేశితెనుఁగుపదము లనియు, నవి యెల్ల వారికిఁ దెలిసెడి యాపలుకులు కావు కాన యాదేశితెనుఁగే నన్నెచోడ, పాల్కురికి సోమనాథులు పేర్కొనిన జానుతెనుఁ గనియుఁ దేలుచున్నది

విన్నకోట పెద్దన తనకావ్యాలంకారచూడామణిలో కేతనవలెనే దేశ్యము, అచ్చతెనుఁగు అనువానిని భిన్నములుగాఁ బేర్కొనెను అచ్చతెనుఁగు సహజాంధ్రదేశభవ మనియు, దేశ్యము బహుదేశానేయము లై, చక్కఁదనము, నెఱదనములు నై యీ యానెలవులఁ జెవులకుఁ దీయము లగుపలుకు లని తెలిపెను ఈక్రిందిపద్యమును జూడుఁడు·

క· భువిలోఁ దత్సమమును ద
ద్భవమును సహజాంధ్రదేశభవమును దేశ్యో
ద్భవమును గ్రామ్యము నాఁబం
చవిధము లై తెలుఁగుఁబలుకంజాతము పరఁగున్

అం దచ్చతెనుఁగునకు లక్షణ మిట్లు లక్ష్యప్రదర్శనపూర్వకముగాఁ జెప్పబడినది

క ఈమూఁడుదెలుంగులలో
నేమిటనున్దొరలకున్న నెల్ల జనులకున్
లో మిగులఁ దేటపడియెడు
నామాటల యచ్చతెనుఁగు లన నెగ డొందున్.

తత్సమ, తద్భవ, దేశ్యపదములు (దేశ్యము లనఁగా నన్యదేశము లని పెద్దనభావము) ఎల్లజనులకును నర్థము కాక పోవచ్చును గాని సహజాంధ్రదేశ్యము లయిన తెనుఁగుమాట లెల్లజనులకును మిగులఁదేటపడును వియే అట్టిమాటలకు 'అచ్చ తెనుఁగు' అని పేరు వీనికి నర్థముచెప్పవలసిన యవసరము లేదు ఈయచ్చతెనుఁగు అనునది తద్భవము దొండలని దని పెద్దన యిందు స్పష్టము చేసి యున్నాఁడు దీనికి లక్ష్యముగాఁ బెద్దన యొసఁగిన యీక్రింది పద్యమునుజూడుఁడు

చ· ఎనుములు గుఱ్ఱముల్ మొదవు లెద్దులు బందులు వండు ఉప్పువ
ప్పునుములు కొల్లు లాముదము లాకులుఁబోఁకలు నేయినూనె యే
పునఁ బెనుపొందుప్పవిభుప్రోల ననం దగ విన్నవారికిన్
మనమునఁ దేటగాఁ దెలియుమాటల యచ్చతెనుంగునాఁ జనున్

కావ్యా 9–18

పయిపద్యమునఁ బేర్కొనఁబడిన యెనుములు, గుఱ్ఱములు మొదలగు పదము లెల్లరకును సులభముగా నర్థ మగునవియే కనుక నవి యచ్చతెనుఁగుపదము లనఁ దగును ఇఁక దేశ్యమునకు లక్షణలక్ష్యము లీక్రిందివిధముగా నొసఁగఁ బడినవి

క శ్రేయము లై బహుదేశా
నేయము లై చక్కఁదనము నెఱిఁదనములు నై
యాయానెలవులఁ జెవులకుఁ
దీయము లగుపలుకు లెల్ల దేశ్యము లరయన్

కావ్యా 9-16

సీ వాలాయ మాలంబు వంగడ మంగడ
సోలంబు చొక్కులు సోయగంబు
విన్నన్ను మెన్ను వావిరి వంత వాగెంబు
డెందంబు డిప్పాడి డిల్లపాటు
నెమ్మోము నెత్తమ్మి నెలఁత క్రొన్నెల కొమ్మ
లావడి యొయ్యార మారజంబు
పొక్కుడు నెవ్వఁగు పొచ్చెంబు మచ్చిగ
యక్కజం బచ్చెరు వక్కు నిక్కు

గీ వెలఁది చిగురెల్లి మేనలి మేనవేలు
నాఁగఁ జనుశబ్దములు దేశినామకములు
వీనఁ జెప్పునకవితలు వినుచు మెచ్చుఁ
జారుతరకీర్తి విశ్వేశచక్రవర్తి

కావ్యా 9-17

ఇవి యెల్లవారికిఁ దెలిసెడి యాపలుకులు కావు బహుదేశానేయములు, చక్కఁదనములు, నెఱిఁదనములు గలవి ఇట్టి పదములు దేశ్యములు, ఇవి దేశినామకములని పద్యమునఁ బేర్కొనఁబడినవి కేతన పేర్కొనిన దేశితెనుఁగులకును, నీదేశ్యపదములకును భేదము లేదు నన్నెచోడ, పాల్కుఱికి సోమనాథులు తమకావ్యములందుఁ బ్రయోగించిన జానుతెనుఁగునే యీ రిట్లు దేశితెనుఁగనియు, దేశ్య ..., [illegible]

కేతనయు, విన్నకోట పెద్దనయు అచ్చతెనుఁగు, దేశ్యము అని రెండు ప్రత్యేకవిభాగములు చేసి చెప్పఁగా అప్పకవి దేశ్యమునే శుద్ధాంధ్రదేశము, అన్యదేశజాంధ్రము అని రెండు విభాగములుగాఁ జేసి చెప్పుటయే కాక అచ్చతెనుఁగనుదానికిఁ దొల్లిటి లాక్షణికులు తెలిపినయర్థమును గాక వేఱొకయర్థమును గల్పించినాఁడు అతనియభిప్రాయమున తద్భవములు, శుద్ధాంధ్రదేశ్యములు, అన్యదేశజాంధ్రములు – ఇవన్నియుఁ గలిసి యచ్చతెనుఁగు లగును ఇంతమాత్రమే కాక యతఁడు మఱి రెండు రకముల విభాగములను గూడ నచ్చతెనుఁగులలోనే చేర్చినాఁడు అవి తెనుఁగుమఱుఁగులు, ప్రాఁదెనుఁగులు నను నవి ఈ క్రింది పద్యమును జూడుఁడు

క తెలుఁగుమఱుంగులు ప్రాఁదెనుఁ
గులుఁ దద్భవదేశ్యములును గూర్చి మృదుపదం
బులు గాఁగ నచ్చతెనుఁగులు
మెలఁకువతోఁ జెప్పఁదగు శమీప్రాంతగృహా

దానితోఁ బ్రాఁదెనుఁగు లనఁగా నెట్టివో యీక్రిందిపద్యమునఁ దెలుపఁబడినది

క తొల్లింటికవులవాక్యము
లెల్లను బ్రాఁదెనుఁగు లయ్యె నిప్పటివారల్
చెల్లుబడి వాడునవియే
తెల్లమిగా నింకఁ బ్రాఁతతెనుఁగులు నృహరీ

తొల్లింటి కవులవాక్యములు ప్రాఁదెనుఁగులు ఇట్టి ప్రాఁదెనుఁగుల కుదాహరణముగా నప్పకవి పుడమి, సిరి, పడితి, వెడవిలుతుఁడు, పసిఁడికడుపు వేల్పు మొదలయినశబ్దముల నిచ్చి యున్నాఁడు ఇవికాక యప్పకవి కాలమునాటికి 'తెనుఁగుమఱుఁగు' లనునవి యాంధ్రభాషలో విలక్షణ మయినవర్గీకరణమున కనువుగా నేర్పడియుండుట తటస్థించిన దని మనము గుఱుతింప వలసి యున్నది అప్పకవి యిట్టి తెనుఁగుమఱుఁగులకుఁ బ్రత్యేకముగా లక్షణము చెప్పక – చెప్పఁగుదురక కాఁబోలు – తెనుఁగుమఱుఁగు లనునవి యిట్టివి యని మాత్ర ముదాహరించి యూరకొన్నాఁడు చూడుఁడు

గీ అబ్ధిమేఖల కుదయించినట్టి సీతఁ
జేకొనియె రాఘవుం డని చెప్పుచోటఁ
గడలిమొలనూలిచేడియ గనినపడుచుఁ
దెచ్చుకొనె రాముఁ డనఁగను దెనుఁగుమఱుఁగు -

దీనిఁబట్టి సంస్కృతసమాసములకు బదులుగాఁ దదర్థకము లయిన దేశ్యపదములతో దీర్ఘసమాసములు పరికల్పింపఁబడుచో నట్టిదానికి 'తెనుఁగుమఱుఁగు' అని పేరని తేలుచున్నది సహజముగాఁ దెలుఁగులో నిట్టిదీర్ఘసమాసము లుండవు సంస్కృత భాషాగ్రథితము లయినదీర్ఘ సమాసములను దత్సమీకరించుకొని తెలుఁగులోఁ బ్రయోగించుట రుచింపని యాంధ్రతాభిమాను లయిన కవీశ్వరులు కొంద ఱాదీర్ఘసమాస గతము లయినపదములకు సమానార్థకము లయినతెలుఁగుపదములతో దీర్ఘ సమాసములను గూర్చి రచింప దొరకొనిరి అట్టి రచన నప్పకవికంటెఁ జాలకాలము పూర్వమే తెలుఁగునఁ బ్రారంభమై యుండినది. కన్నడమునందు 'జాణ్ణుడి' యనియు, నాంధ్రమున 'జానుతెనుఁగు' అనియు నది ప్రచురమైనది. నన్నెచోడ, సోమనాథులకాలమునాఁటి జానుతెనుఁగే కాలక్రమమున నప్పకవినాఁటికిఁ దెనుఁగుమఱుఁగైనది. అప్పకవి పేర్కొనిన తెలుఁగు మఱుఁగునకును, సోమనాథుని వృషాధిపశతకమునందలి జానుతెనుఁగునకును నేమియు భేద మగపడదు. సోమనాథునిపద్యములోని 'బలుపొడతోలు సీరయును' అనుపద్యములోని జానుతెనుఁగునకును, దరువాత నప్పకవి తెనుఁగుమఱుఁగున కుదాహరణముగా నిచ్చిన 'కడలిమొలనూలిచేడియ గనినపడుచు' ఇత్యాది పద్యమునకును బదప్రయోగకల్పనములోఁ జక్కని సామ్యముండుట స్పష్టమగుచునే యున్నది వ్యాఘ్రచర్మాంబరము - అనుటకు బలుపొడతోలుసీర యని తెనుఁగుపదములతో సమాసకల్పన మందు జరుగఁగా 'అబ్ధిమేఖల కుదయించినట్టి సీత' యనుటకు మాఱుగా 'కడలిమొలనూలి చేడియ గనినపడుచు' అను తెనుఁగుపదములతోడి సమాసమిందుఁ గూర్పఁ బడినది ఇట్లే పద్యము నందంతట నిర్వహింపఁబడినది సంస్కృతసమాసగతము లయిన పదముల యర్థము సులభ మయిన తెలుఁగుపదములోఁ గొంతజాణతనము వ్యక్తమగునట్లుగాఁ గూర్పఁ బడుటచే నది జానుతెనుఁ గయినది సంస్కృత సమాసగతము లయినపదముల యర్థమును సులభములయిన తెలుఁగుపదము కూర్పున మఱుఁగుపఱచి రచించుటచే నిది తెలుఁగుమఱుఁగు లయినవి

ఇట్లు అప్పకవి భాషాభాగములను వర్గీకరించుటలో 'తెనుఁగు మఱుఁగులు' అనుపేర నొకప్రత్యేకవిభాగమును బరికల్పించుటకు సోమనాథుని జానుతెనుఁగు కావ్యములయం దాతఁ డభిమానముతో, నభినివేశముతో వెలకొలిపిన భాషాప్రయోగవైలక్షణ్యమే కారణ మనియుఁ దత్ప్రభావమే లాక్షణికుల యాయాయిభాషాభాగములపరికల్పనమునకుఁ బ్రోద్బలకమయ్యె ననియు నీచర్చకు సారాంశము

## ౨ వ్యావహారికభాషాప్రయోగము

దేశికవిత్వోద్యమముయొక్క భాషాగత మయినప్రభావమును బరిశీలించు సందర్భమున జానుతెనుఁగునకుఁ దరువాతఁ బేర్కొనఁదగిన ముఖ్యాంశము దేశికవిత్వములోని – ముఖ్యముగాఁ బాల్కురికి సోమనాథునికవిత్వములోని వ్యావహారికభాషా ప్రయోగము సోమనాథుని గ్రంథములలో నిట్టివ్యావహారికభాషా ప్రయోగము విస్తారముగాఁ గలదు నన్నయాదులగు మార్గకవులు తమకాలమునాఁటి శాసనముల యందుఁ గానవగు భాషాప్రయోగపద్ధతిని, వ్యవహారమునం దుండినభాషాప్రయోగవిధానమును నధిగమించి, వానిప్రభావము తమకావ్యభాషపైఁ బ్రసరింప కుండునట్లుగాఁ దగు జాగ్రత్తవహించి లక్షణయుక్త మయినకావ్యభాషలోఁ దమతమకావ్యములను విరచించి భాషాయోష నలంకరించిరి నన్నెచోడ, సోమనాథాదు లగు దేశికవులరచనలలోఁ దద్భిన్నముగా నాకాలమునాఁటి వ్యావహారికభాషా ప్రయోగముయొక్క ప్రభావము విస్పష్టముగా గోచరమగుచుండును. దేశికవిత్వమునందలి యీవ్యావహారికభాషా ప్రయోగమును స్థూలముగా నాలుగు విభాగములక్రింద వింగడింప వచ్చును

౧ సమకాలమునాఁటి శాసనములందలి భాష ౨ వ్యవహారవశమున మార్పు చెందిన పదముల ప్రయోగము ౩ వ్యావహారికభాషావాక్యముల ప్రయోగము. ౪ వ్యాకరణవిరుద్ధము లయినప్రయోగములు – వైరిసమాసములు మొదలగునవి

సోమనాథునిగ్రంథములలో నచ్చటచ్చట సమకాలమునందలి శాసన భాషయు, నాశాసనములలోని విలక్షణపదప్రయోగములును జోటుచేసికొన్నవి యట్లే, వ్యవహారవశమున జనులనోళ్లలో నలిగి నలిగి నిజస్వరూపములను గోలుపోయి వికారము పొందినపదములు సంస్కారవిరహితముగా నట్లట్లే

నగ్నముగాఁ బ్రదర్శింపఁబడినవి బసవపురాణ, పండితారాధ్యచరిత్రములందలి కొన్నివాక్యముల వ్యావహారికప్రయోగానుసారులుగా నుండి విలక్షణమయిన కూర్పుసొంపుతో గుబాళించుచున్నవి సోమనాథుఁడు భాషాప్రయోగ విషయమున సర్వస్వతంత్రుఁడు వ్యాకరణాదినియమములకుఁ గట్టుపడుట యాకవిదిగ్గజమున కలవాటు లేని యాపోశనము అందుచే నాతనిగ్రంథములలో లక్షణవిరుద్ధము లయిన ప్రయోగములు పెక్కుతెఱఁగులుగాఁ గానవచ్చు చుండును వైరిసమాసములప్రయోగమతనిలో విస్తారము సంధివిషయమున నాతనిమార్గము వినూతనము విలక్షణము అతనిసమాసకల్పన మందందు నపూర్వము ఇట్టి విలక్షణలక్షణములతో వెలయుచున్న సోమనాథుని గ్రంథములప్రభావము తరువాతికాలమునందలి యాంధ్రసాహిత్యముపైఁ బ్రసరింపక పోలేదు అంతకుఁ బూర్వము లక్షణవిరుద్ధ మయినయొకపదమును గాని, వాక్యమునుగాని ప్రయోగించుటకు వెఱచుచుండిన – వెనుకాడుచుండిన కవీశ్వరులకు సోమనాథునిరచనలవమూలమునఁ గొంతబలము, ధైర్యము చేకూరినది. వ్యాకరణోల్లంఘనము చేయుట కతఁ డొకవిధముగా నితరకవులకు మార్గదర్శకుఁ డయ్యెను అతనినిజూచి వ్యావహారికప్రయోగములు చేయుటకును గొందఱుకవులు ధైర్యముచేసిరి ఆంధ్రకవీశ్వరులకు రచనావిషయమున నిట్టిస్వేచ్ఛాప్రవృత్తి యలవడుట దేశికవిత్వోద్యమముయొక్క పరోక్షప్రభావమే యనుట యతిశయోక్తి కాఁ జాలదు

## సి. అన్యభాషా పద్యములను, మణిప్రవాళభాషను నెలకొలుపుట

సోమనాథుఁడష్టభాషా కవితాప్రవీణుఁడు ఇతని యాయష్టభాషా పాండిత్య మతని వృషాధిపశతకమునను, బండితారాధ్యచరితమునను మనకుఁ గానవచ్చును వృషాధిపశతకమున నితఁడు తనకుఁ గలబహుభాషా పాండిత్యమును తెలియఁ జేయుచు సంస్కృత, తమిళ, కన్నడ, మహారాష్ట్రము లనుభాషలలో నొక్కొక్క పద్యముచొప్పున రచించి, పిదప మణిప్రవాళభాషలో నొకపద్యమును, జానుతెనుఁగున నొకపద్యమును విరచించెను. పండితారాధ్య చరిత్రమున శ్రీశైలము నధిరోహించుభక్తులను వర్ణించుచుఁ బలికినవాక్యములను నాయాభాషలలోనే రచించి వాని కొక సహజత్వమును సముపార్జించెను ఆరెపరుస, కన్నడపరుస, అరవపరుస, తెలుఁగుపరుస యనుపేరులతో నాయాఘట్టములందుఁగలవు ఇట్లితరభాషా పద్యములను దెనుఁగునఁ

దొలిసారిగా వెలయించి యొక చిత్రమును బ్రదర్శించినాఁడు పాల్కురికి సోమనాథుఁడు నన్నెచోడుఁడును దన కుమారసంభవకావ్యమునందుఁ గన్నడపదములను, దమిళపదములను బెక్కింటిని బ్రయోగించెను ఇట్లితరభాషా పదములను దమకవితలలో వెలయించి యాకవీశ్వరు లన్యదేశ్యముల వాడుక కొకరాచబాటను వేసినవా రయిరి ధూర్జటిమొదలగు కవీశ్వరులు కన్నడము మొదలగుభాషలలోని పదములను దమ తమ కావ్యములందుఁ బ్రయోగించుటకును వీరి యీయన్యభాషాప్రయోగమే ప్రోద్బలకము కావచ్చును

సోమనాథుఁడు తనగ్రంథములలో నెక్కొలిపిన జానుతెనుఁగు తిక్కనపైఁ బరోక్ష ప్రభావము నెఱపెను సోమనాథుని ప్రభావము సోఁకుటచేతనే తిక్కనకుఁ దెనుఁగుపదముల కూర్పుపై మోజేర్పడె ననవచ్చును సోమనవలెఁ దెనుఁగుపదముల ప్రయోగము నెక్కువగాఁ జేయుట మాత్రముతో దేశికవిత్వోద్యమలక్ష్యము నెఱవేరదని గుర్తించిన తిక్కనసోమయాజి మార్గదేశికవిత్వములను దన కవిత్వమునఁ బడుగుపేకవలె నల్లుకొనిపోవునట్లుచేసి యభిలషణీయ మయినయాంధ్రకవిత్వవిధాన మి ట్లుండవలయునని తనకవిత్వములో నొకయాదర్శముఁ జూపెను ఆమార్గము కవిసాధారణులకు సుగమము కాక పోవుటచే నాతీరు రచనము లాంధ్రమునఁ బెక్కు వెలయునవకాశము లేకపోయినది తెలుఁగుజాతీయముల ప్రయోగమునను, సామెతల నందందుఁ బ్రయోగించుట యందును సోమనాథుఁడే తక్కిన కవులకు మార్గదర్శకుఁ డయ్యెను. నాచనసోమనాథుని యుత్తరహరివంశములో నెన్నో తెలుఁగుసామెతలు కానవచ్చును. అతఁ డిడిన యాసామెతలయామెతలకు సోమనాథునిరచనలే కారణము అట్లే, పొన్నిగంటి తెలగన్న, కూచిమంచి తిమ్మకవి మొదలగు కవీశ్వరు లచ్చతెనుఁగుకావ్యము లల్లుటకును దేశికవిత్వముయొక్క ప్రభావమే కారణ మనవచ్చును. ఏల యనఁగా నాంధ్రకవిత్వమున సంస్కృత భాషాప్రయోగమునెడ వైముఖ్యమేర్పడఁగా నచ్చమయినయాంధ్రమునందే – సంస్కృతనిరపేక్షముగాఁ గావ్యము లల్లవలయునను నుద్దేశము పొడమి కొందఱు కవులు తత్ప్రయత్నమునకుఁ గడంగిరి ఆప్రయత్నఫలమే యచ్చతెనుఁగు కావ్యముల కల్పనము నాచనసోమనాథుఁడు సామెతలను దనకవిత్వములోఁ జొప్పించుటకుఁ బ్రయత్నించినట్లే తొలిసారిగాఁ నచ్చతెలుఁగులోనే యొకపద్యమును విరచించి చూపవలయు నని ప్రయత్నముచేసి [illegible]

చూపి, తరువాతి యచ్చతెనుఁగుకవులకు నాశాజ్యోతి యయ్యెనను నాచనసోమనాథుని కిట్టి తలఁపు కలుగుటకు పాల్కురికి ప్రభావము కారణమని తలఁచుట తప్పు కాదు

మల్లికార్జునపండితుని శివతత్త్వసారము, నన్నెచోడుని కుమారసంభవము అను గ్రంథములమూలమున శైవమత మాంధ్రదేశమున సన్నసన్నగా వ్యాపించుచు నిలువఁ ద్రొక్కుకొనుటకు యత్నించుచుండఁగా పాల్కురికి సోమనాథుఁ డవతరించి తన బసవ పురాణము, పండితారాధ్యచరిత్రము అనుగ్రంథముల మూలమునను, దాను రచించిన యితరలఘుకృతులమూలమునను నామతము స్థిరముగాఁ బాతుకొనిపోవుటకు విశేషముగాఁ దోడ్పడెను దానితో వీరశైవ మాంధ్రదేశమున బాగుగాఁ బ్రబలిపోయెను ఇతరమతములు కూడ సమకాలమునందే దేశమున నెట్లయినను బ్రవేశము గల్పించు కొని, ప్రజలయాదరాభిమానముల నందుటకు యత్నింపఁ దొడఁగెను అందుచే నామతానుయాయులనడుమఁ గొంత ఘర్షణ యేర్పడెను పశ్చిమసముద్రతీరమున నప్పుడే హరిహరతత్త్వము వేరు తన్నినది కన్నడదేశమునందుఁ దుంగభద్రా నదులసంగమ స్థానమున హరిహరదేవాలయము వెలసినది. మతవైమనస్యములవలన నేర్పడుచుండిన యలజడినడఁచి మతసామరస్యమును సాధింపవలయు నను సముత్సాహముతోఁ గొందఱు మతదురభిమానము లేని శాంతికాముకు లద్వైతమును బ్రతిపాదించి హరిహరుల కభేదమును బాటింపఁ జూచిరి అట్టిప్రయత్నములు సోమనాథునికాలమునందును గొన్ని జరగి యుండును అట్టివారి యుత్సాహమును, వారివాదమును సోమనాథుఁడు తనపండితారాధ్య చరిత్రములో నిట్లు తెగడెను వాదప్రకరణమునం దిట్లు కలదు

*'హరిహరుఁ డన నొక్కఁ డనియెదేన్ వినుము*
*కాముని హరియింపఁగాఁ గామహరుఁడొ*
*కాముండు హరుఁడు నిక్కం బొక్కరుండొ?*
*అఱిముఱి సర్వంబు నటు హరించుటను*
*హరిహరుం డనునామ మయ్యెఁగా కిట్లు*
*హరియును, హరుఁడు నైక్యము గారు వినుము*
*కావున హరిహరాంగము లేక మగునె?*
*యేవెంటఁ బొందు గా దిల, నట్లుఁ గాక*

విష్ణుండు శివుఁడు నా వేఱె? శివాయ
విష్ణురూపాయ నా వెండియు నంద
విను శివరూపాయ విష్ణవే యనఁగ
మును మ్రోయుఁ దత్సూక్తి వినవె? యంటేని
దలఁపఁ బ్రక్షిప్తసూక్తము గాక శ్రుతులు
పలుకునె శివునిరూపము విష్ణుఁ డనుచు' -

పండి 1-647 పుట.

అని 'శివాయ విష్ణురూపాయ' - యను సూక్తి ప్రక్షిప్త మని త్రోసిపుచ్చి హరిహరాద్వైతము గూర్చి సముత్సాహులయిన వారివాదమును బరిహరించెను బసవపురాణములోఁ గూడ నొకచోట నిట్లే వారి వాదము నెదుర్కొనిన యీసందర్భమును జూడుఁడు:

'హరిహరుఁడనెడుశబ్దార్థ మెర్గమిని
హరిహరుఁ డన నొక్కఁ డనియెడిఁగాని
హరిని హరించుట యది కారణముగ
హరిహరుఁడును మారహరుఁడు ననందు'-

బస. 7-522 పు.

సోమనాథుని యీయాక్షేపవాదమునకు సమాధానముగా తిక్కన సోమయాజి తనభారతప్రారంభమును ద్విదేవతాస్తుతి చేయుచు 'భద్రాయితమూర్తియై హరిహరం బగురూపముఁ దాల్చి విష్ణురూపాయ నమశ్శివాయ యని పల్కెడు భక్త జనంబు' అని నొక్కివక్కాణించుచుఁ బ్రక్షిప్తసూక్త మని త్రోసిపుచ్చిన సోమనాథుని చమత్కారవాదమును సరకు గొనక హరిహరాద్వైతవాదమును బ్రతిష్ఠాపించినాఁడు తనకుఁ బూర్వకాలమునందును, దన సమకాలమునందును దేశమునందుఁ గలయాకొంద ఱద్వైతులవిశ్వాసమునకు సాహిత్యత కల్పించినాఁడు తిక్కన ననుసరించి యాతరువాత నాచన సోమనాథాదులు కూడ నట్టివిశ్వాసమునే కలవా రై సాహిత్యసృష్టిఁ గావించిరి. ఇట్లు తిక్కనాదు లగుపెక్కురు హరిహరాద్వైతము నభినివేశముతోఁ బ్రతిపాదించుటకు సోమనాథుని రచనములే కారణము. కనుక నిదియు సోమనాథుని రచనల ప్రభావముగానే పరిగణింపఁ దగి యున్నది

పండితారాధ్యచరిత్రమునఁ గుమారపాలఘూర్జరుని కథలో ద్యూత పరిభాష చాలఁగాఁ గలదు నాచనసోమనాథుఁడు తన యుత్తరహరివంశమునందు దాని నట్లే యనుకరించినాఁడు ఉత్తరహరివంశములో రుక్మిణీకృష్ణులు జూదమాడు సందర్భము నందలి యీక్రింది పద్యములోని ద్యూతపరిభాషను జూడుఁడు

క ఇత్తీవం చిత్తిగ దుగ
సత్తా రచ్చొకవంచి జావం చీరై
దిత్తిగ నిద్దుగ బద్రలు
చిత్తంబునఁ దలఁచినట్లు చేతికిఁ దెచ్చున్

సొగటాలాటలో నుపయుక్త మగుపరిభాష నిట్లు గ్రంథస్తము గావించి పాల్కురికి సోమనాథుఁడు తరువాతివారికి మార్గదర్శకుఁ డయ్యెను

పోతనభాగవతములోని 'మందారమకరందమాధుర్యమునఁదేలు' అను సుప్రసిద్ధమయిన సీసపద్యములోఁ గానవచ్చు భావమును, బోలికయు సోమనాథునినుండి గ్రహించినవే శైవమతాభినివేశములో శ్రీనాథుఁడు రచించిన హరవిలాసమునకు మూలము చాలవఱకు సోమనాథుని బసవపురాణమే యనఁదగును. బసవపురాణమునందలి చిఱుతొండ నంబికథనే శ్రీనాథు డెంతో యింపుగాఁ బెంచి సరసమైనచమత్కారములతో నించి పెంపొందించినాఁడు.

ఇట్లే, ధూర్జటిమహాకవి విరచితమగు శ్రీకాళహస్తిమహాత్మ్యము నందలి తిన్నని కథకు మూల మితని బసవపురాణమే. బసవపురాణమునందు ఉడుమూరి కన్నప్పకథ యనుకథలో నీతిన్ననివృత్తాంతమే యభివర్ణింపఁబడినది. ఉడుమూరి కన్నప్ప శివలింగమునుగాంచి కాఱడవిలో నుండనేల? తనతో నూరికి రమ్మని పిలుచుఘట్టములోను – శివలింగము కంట నీరు గారఁగా వగఁజెంది యుపచరించిన ఘట్టములోను ధూర్జటి మన సోమనాథుని ననుకరించెను చూడుఁడు·

'కఱకంఠ, మావల్లె గల దెల్ల సుఖము
అడవుల మనుబిల్ల కడుమంచిపాలు
నొాడిపిలి పొసెంబు నుడుపనేతులును

నిప్పుపూవును దేనె బెల్ల పటాదు
లొప్పెడు వెదురుఁబ్రా లోగిరంబులును'

బస 3-183 పుట

గలవు రమ్మని కన్నప్ప శివుని నాహ్వానించినాఁడు ఈపట్టును ధూర్జటి యిట్లనుకరించెను

'ఓ లింగను, విను నివ్వరి
ప్రాలును నోడిపిల్లు గునుకుఁబ్రాలును వెదురుం
బ్రాలును నవరపు మెకముల
పాలును గలవచట నీకుఁ బాయసమునకున్
పుట్టుతేనియ పెరతేనె పుట్టజున్ను
తొఱ్ఱతేనియగల వందుఁ దోఁచి తోఁచి
కాలి దులదుల నై పిండిపోలె రాలు
నట్టినింజెట్లు గలవు నీ కారగింప '

మూలమునందు 'ఫలాదు లన్నియు' ననఁగా నీతఁడొక్కసీసపద్యమునే దానికే నియోగించెను. ఇచ్చటి యీతని రచన చాలవఱకుఁ బండితారాధ్య చరిత్రమునందలి యిట్టిరచనమును దలఁపించును (ఫలాదులను బేర్కొను సందర్భము)

ఇట్లే లింగము కంట నీరు గాఱినపుడు కన్నప్ప వగచి -
'కటకటా, యిది యేమి కష్టంబు పుట్టె
నిటలాక్ష, నీకంట నీరు గాఱెడిని

. ... .

ఊరకో నాయన్న ఊరకో తండ్రి
యూరకో నాస్వామి యూరకింతేల
యుమ్మలికము తగ దుడుగవే యనుచు -
. కంటిలోని
కసువ, పా మ్మనట్లు గన్ను శోధింపఁ
గరతలాంగుళములఁ గనుఱెప్ప లెత్తి

నెర సున్న దని పాల నిష్ఠించి యూఁదుఁ
బరఁగ నాలుక గ్రుడ్డుపైఁ ద్రిప్పి ద్రిప్పి
యొరయుచు నొరయుచు నొయ్యనఁజూచుఁ
జీరావిఁ గొని కంటఁ జేర్చి హత్తించి.'

బస 3-191 పు

యనేకవిధముల నీరు కాఱకుండఁ జేయుటకుఁ బ్రయత్నించును ధూర్జటి యీఘట్టమును గూడ మిక్కిలి రసవంతముగాఁ బ్రపంచించినాఁడు కోకపాట్లం బావిఁ గొననూఁది యొత్తుచు నేత్రవ్యాధిచికిత్సను గూడ నాతఁడు చేసిన ట్లందుఁ జెప్పఁబడినది ఇట్లు, సోమనాధుని కన్నప్పకథనుండి మాత్రమే కాక యతని బసవపురాణమునందలి గొడగూచి కథావిధానమునుండి కూడఁ గొంత యనుకరణము ధూర్జటి రచించిన తిన్నని కథలోఁ గాననగును తిన్నఁడు కాల్చి తెచ్చిన కఱకుట్లను శివుఁడారగింపకుండఁగా -

చాలవో, యివి మంచిపాలు గా వనియొ
పాలపైఁ జిత్త మేఁ బఱపితి ననియొ
కోర బెడంగవో, కుంచెఁడు లేవొ,

బస. 3-161 పు

ఇత్యాదిగా గొడగూచి ప్రార్థించినట్లే తిన్నఁడును -

క. కాలవొ క్రొవ్వవొ మాడు
గాలెనొ చవిగావొ కమ్మగావొ నీకున్
జాలవొ యులవడవొ తిన
వేలా కఱకుట్లు పార్వతీశ్వర, చెపుమా

అని బుజ్జగించి యడుగును ఇట్లే రెండుఘట్టములందును ధూర్జటి రచనము పాల్కుఱికి సోమనాధునిరచనమున కనుకరణమనుట స్పష్టము. సోమనాధుని దేశిరచనాప్రభావ మిట్లు పోతన, శ్రీనాధ, ధూర్జటుల కవిత్వము నందు గోచరించును. ఇట్టి మహాకవులకెల్ల మార్గదర్శకుఁ డైన పాల్కుఱికి సోమనాధుని కవితామాహాత్మ్య మెంత మహనీయమో తెలియఁ జేయుచున్నది

ఀయధ్యాయమునందుఁ జర్చింపఁబడిన వివిధాంశముల సారాంశము
ధముగా సమీకరింప వచ్చును

నన్నెచోడుని కుమారసంభవమునందలి యవతారికలోని 'మును
త' యనుపద్యమున కర్థము చెప్పుటకు యత్నించిన పండితులు
తయనఁగా సంస్కృతకవిత్వ మనియు, దేశికవిత యనఁగాఁ
విత్వ మనియు, నందుఁ బేర్కొనఁబడిన చాళుక్యరాజు రాజరాజ
డనియు వివరించిరి కాని, నన్నయకుఁ బూర్వకాలమునందే
వఁ గవిత్వ మున్నటులు నిదర్శనము లగపడుచుండుటచే వా
ానకుఁ దెలిపిన యర్థము సమంజసము కా దని తోఁచును కన్నడమునఁ
ార్గమునకుఁ బూర్వము దేశికవిత యుండె ననియుఁ గవిరాజ మార్గకర్త
తుంగుఁడు తన లక్షణగ్రంథమున నాభాషకొక వ్యవస్థ కల్పించె ననియు,
నే యనుసరించి పంపాదులు కావ్యరచనము చేసి రనియుఁ
మున్నది ప్రాచీనకాలమునఁ గన్నడభాషకును, దెలుఁగు భాషకును
న్నంత వ్యత్యాసము లేదు నృపతుంగునికిఁ దరువాతఁ గన్నడమున
వ మార్గకవితాపద్ధతి తెలుఁగుభాషలోఁ గూడఁబ్రవేశించెను కాని,
ాజాదులా మార్గపద్ధతి నంగీకరింపక దేశికవితకు నాదరము నొసఁగుటకు
ిరి నన్నయకుఁబూర్వకాలమందు వెలసిన కవితను శాసనకవిత,
ాపమయిన దేశికవిత, మార్గపద్ధతికిఁ జెందినకావ్యకవిత యని మూఁడు
ాగా వింగడింప వచ్చును కన్నడకవులప్రభావముచేఁ బండిత కవులు
త్వమువైపునకు మ్రొగ్గు చూపఁ దొడఁగిరి నన్నయ కాలము నాఁటికి
త్వాభిమాన మధిక మయ్యెను నన్నయ, నారాయణభట్టుల సమష్టికృషి
గా మార్గకవిత్వము భారతమున సమగ్రస్వరూపము నందెను అందు
తాంశమధికముగా నున్నను నందు దేశికవితారేఖలు కూడఁ గొన్ని లేక
నన్నెచోడుని కుమారసంభవము కూడ మార్గపద్ధతికావ్య మనియే చెప్పఁ
అందు నన్నయభారతమున కంటె దేశికవితాచ్ఛాయ లధికముగా
మును ఇతివృత్తము, సంప్రదాయము, కవి సమయములు — వీనియం
వలంబించిన దేశీయవిధాన మితనిదేశికవితాభిమానమును వ్యక్తము
పాల్కురికి సోమనాథుఁడు రచించిన బసవపురాణ, పండితారాధ్య

చరిత్రములు ప్రధానముగా దేశిమార్గమునకుఁ జెందిన గ్రంథములు సమకాలమునఁ బ్రభవ మంది ప్రజ్వరిల్లుటయే కాక యాతని దేశికవిత్వము తరువాతికాలమున వెలసిన యాంధ్రసాహిత్యముపైఁ గూడఁ దనప్రభావమును నెఱపెను అట్లాప్రభావమునకు లోఁగక కొందఱు కవులు దేశికవిత్వాంశములను దమతమకవిత్వములలోఁ గూడ వెలయించుకొని పుష్టిమంతములొనర్చుటకు యత్నించిరి గోనబుద్ధారెడ్డి రామాయణము ఛందోవిషయమున దేశిమార్గమునే యనుసరించెను ఇతివృత్తము, భాష యనువానివిషయమున మార్గకవితా సంప్రదాయమునే యనుసరించెను కాని యాతని యితివృత్తము మార్గేతివృత్తమే యయినను నన్నెచోడునివలె నితఁడు తన యాంధ్రీకరణమును దేశీయ చిహ్నములతో విలక్షణతాశోభిత మొనర్చెను. రంగనాథకవిరచితములుగా నిటీవలఁ గొన్ని రచనము లుపలబ్ధము లయినవి అవి రగడ కృతులు. 'రగడ' యను నీదేశీయచ్ఛంద స్స్వీకరణమునసోమనాథుని ప్రభావముచేతనే కా వచ్చును తిక్కన సోమయాజి భాషా విషయమున దేశికవితాభిమానమునే ప్రదర్శించెనుగాని యితరవిషయములలో మార్గపద్ధతినే యవలంబించెను. తిక్కనతరువాతఁ దెనుఁగునందుఁ గవిత్వము చెప్పినకవీశ్వరు లతనియంత శక్తిమంతులు గాక పోవుటచే నన్నయ యవలంబించిన మార్గకవితాపద్ధతినే యవలంబించి పెంపొందించిరి. వారిలో శ్రీనాథుఁడొక వంక మార్గకవితాభిమానమును బ్రదర్శించుచునే మఱొకవంకఁ గొంతదేశి కవిత్వమును గూడ వెలయించెను అతని పలనాటివీరచరిత్ర యచ్చముగా దేశికావ్యమని చెప్పఁ దగును. శ్రీనాథయుగమునకుఁ జెందిన మఱొక ద్విపద కావ్యకర్త గౌరన. అతని హరిశ్చంద్రద్విపదలో నొక్కయితివృత్తము మాత్రమే మార్గము ప్రబంధయుగమునకుఁ గొంతముందువెనుకలుగాఁ దాళ్లపాకకవుల కృతులలో దేశికవిత మరల నొకతూరి తల యెత్తుకొనినది ప్రబంధ యుగమునకుఁ దరువాత దానిప్రభావము చేతఁ గాఁబోలు దేశికవిత్వము దృశ్యాదృశ్యమై పోవుట తటస్థించెను. కాని, యాకాలపుఁ గవులలోఁ గొందఱు చెదరు చెదరుగా దేశికవిత్వలక్షణములకుఁ దమకవిత్వములో నేదో యొకరూపమునఁ జోటు గల్పింప వలయు నని సంకల్పింపక పోలేదు. అట్టివారి సంకల్పములయొక్క ఫలమే యచ్చతెనుఁగు కావ్యములు తరువాత నాయకరాజులకాలముననే దేశికవిత్వము యక్షగానములు, పదములు, జావళీలు మొదలగువానిరూపమునఁ గొంత

విజృంభణము గాంచెను ఆధునికకాలమునఁ బండితులకును, గవులకును దేశి కవిత్వముపై నపరిమితమయినయాదరాభిమానము లుదయించినవి ఆధునికకాలము నందలి యాంధ్రకవిత్వము జాలవఱకు దేశిమార్గముననే నడచుచున్న దనినచో నతిశయోక్తి లేదు కాని, విద్వాంసులకు మాత్రము నేఁడు కూడ దీని యెడ నిరసనభావమే కాని, సహజ మయిన గౌరవాదరములు సమకూడుట లేదు దీనిభవిష్యత్ప్రవృత్తి యె ట్లుండునో యిప్పుడప్పుడే చెప్పుటకు వీలు కాదు కాని, యిట్లుగాఁ బరిణమించి నేఁటికాలమున నింతగా మన మభిమానించుచున్న దేశికవిత్వమును – నేఁటికిఁ బూర్తిగా భిన్న మయిన దేశకాలపరిస్థితులలో నించుమించుగా నెనిమిది వందల సంవత్సరములకుఁ బూర్వము లక్షించి తదాశయసిద్ధికై తన యావచ్ఛక్తిని వినియోగించి విస్తార మయిన దేశికవిత్వసంపదను బిత్రు ధనముగా మన కందించి పోయిన సోమనాథుని దూరదృష్టివిజ్ఞాన మెంతటిదో యనూహ్యము

౨ ఆంధ్రసాహిత్యముపై సోమనాథుని దేశికవిత్వోద్యమముయొక్క ప్రభావము ప్రత్యక్షముగాఁ గొంతయు, నప్రత్యక్షముగాఁ గొంతయుఁ గలదు మఱొక విధముగాఁ గూడ మన మీప్రభావమును వర్గీకరింప వచ్చును కావ్యగతము, ఛందోగతము, ప్రక్రియాగతము, భాషాగతము నని యాతని దేశికవిత్వోద్యమ ప్రభావము నాలుఁగు తెఱఁగులుగా నున్నది కావ్యమును మతప్రచారసాధనముగా రచించుట, చారిత్రకపురుషునిఁ గావ్యనాయకునిఁ గావించుట యని వానిలోఁ గావ్యగతప్రభావమును మఱల రెండు తెఱఁగులుగా విభజింపఁ దగును ద్విపదకావ్యరచనము, ద్విపదలోఁ బ్రాసయతి నిలుపుట, త్రిభంగి మొదలగువిశేష వృత్తములను వాడుట యనుమూఁడుతెఱఁగు లుగా నీతని ఛందఃప్రభావము తరువాతికవులపైఁ గలదు శతకము, ఉదాహరణము, చిత్రకవిత్వము అను ప్రక్రియాగతము లయినప్రభావము తరువాతికాలపుఁ గవిత్వమునఁ గాన నగును జానుతెనుఁగు, వ్యావహారికభాషాప్రయోగము అని రెండుతెఱఁగుల భాషాగత మయినప్రభావము వెలయుచున్నది మతవిషయక మయినప్రతిక్రియ (Re-action) కూడ నీతని దేశికవిత్వము మూలమునఁ గొంత జరగినది. నాచన సోమనాథుఁడు, పోతన, ధూర్జటి మహాకవి యితని రచనములను గొన్నిచోటుల ననుకరించి యున్నారు

# దశమాధ్యాయము
## సింహావలోకనము - నిర్ణయము

సాహిత్యము ప్రగతి శీలము. దేశకాల పరిస్థితులను బట్టియు, రాజకీయోపప్లవముల కారణమునను, మఱియుఁ గొన్ని యవాంతర కారణముల వలనను సాహిత్య మెప్పటి కప్పుడు తన స్వరూప స్వభావ లక్షణములను, నప్పుడప్పుడు లక్ష్యములను గూడ మార్చుకొను చుండును. దేశకాల ప్రభావముతోఁబాటు సాహిత్యమునఁ దఱచుగా నేర్పడుచుండు కొన్ని యుద్యమములు కూడ సాహిత్యములోని పరిణామములకుఁ గారణభూతము లగుచుండును ఏ భాషయందలి సాహిత్య చరిత్ర మయినను నా భాషా సాహిత్యమున నేర్పడిన సాహిత్యోద్యమముల సమాహార స్వరూప నిరూపకమే యనుట యతిశయోక్తికాఁజాలదు యుగకర్త యగు కవి తల్లజుని ప్రయత్న ప్రభావము, రాజకీయ పరిస్థితులు, సాంఘిక పరిస్థితి, మతము, రాజకీయ ప్రభావము, అనుకరణము, ప్రతిధ్వని, మహాపురుష ప్రభావము, నూతనత్వాభిలాష, వైయక్తిక సన్నివేశము ననునవి వివిధ భాషల యందలి సాహిత్యోద్యమముల యావిర్భావ వికాసములకు హేతుభూతము లగుచున్నవి ఆయా ప్రాంతములయందు సాహిత్యాభ్యుదయము నాకాంక్షించి యేర్పడిన సాహిత్యోద్యమములు కూడ సాహిత్యోద్యమములకు నకృత్తుగా హేతుభూతము లగుచుండును. భాష, భావము, ఛందస్సు, ప్రక్రియ, అనుకరణము, స్వతంత్రరచనము ననునవి సాహిత్యోద్యమ లక్షణములుగాఁ బరిగణింపఁదగి యున్నవి. (ప్రథమాధ్యాయము)

భారతీయ భాషలలో - ముఖ్యముగా హిందీ, బెంగాలీ, పంజాబీ, ఓఢ్రము, తమిళము, కన్నడము, మలయాళము, మహారాష్ట్రము అనుభాషలలో నాయా కాలములయందుఁ గొన్ని సాహిత్యోద్యమము లేర్పడి యాయా భాషా సాహిత్యముల యభివృద్ధికి దోహదము కావించె నను విషయ మాయా భాషా సాహిత్య చరిత్రములను బట్టి తెలియవచ్చుచున్నది ఒకానొక నిర్దిష్ట లక్ష్యముతో నుద్యమములుగానే ప్రవర్తిల్లినవి మాత్రమే కాక - నేఁటి దృష్టితో లక్షించు మనకు - ఒక ప్రత్యేక కాలమునందలి రచనములలో నేకరూపమయినరచనా పద్ధతి

ొనవచ్చినప్పుడట్టివి కూడ నాయా కాలములందు సాఁగిన యుద్యమములు
ొనే పరిగణింపఁబడినవి  హిందీ సాహిత్యమున ఖడీబోలీ యుద్యమము,
ాయావాదకవితోద్యమము, ప్రగతివాద కవితోద్యమము, ప్రయోగ వాది
వితృవము, హిందూస్థానీ యుద్యమము, నయీ కవిత, నయీ కహానీ
ుద్యమము అను సాహిత్యోద్యమములు ప్రధానముగాఁ బేర్కొనఁ దగినవి
ెంగాలీ భాషలో లౌకిక సాహిత్యోద్యమము లేక మంగళకావ్య రచనోద్యమము,
ైతన్య సాహిత్యోద్యమము, పురాణానువాదోద్యమము, కవీర లడాయి
ముద్యమము, గద్య సాహిత్యోద్యమము, ఆధునిక కవితోద్యమము, అత్యాధునిక
వితోద్యమము, ఆఁ కలితరము కవుల యుద్యమము అను నుద్యమములు కలవు
ంజాబీ సాహిత్యమున రహస్యవాద కవితోద్యమము, భక్తికవితోద్యమము,
ేశ భక్తి కవితోద్యమము, శుద్ధ పంజాబీ యుద్యమము అను
ాహిత్యోద్యమములు చూపట్టును  ఓఢ్ర సాహిత్యమునఁ బ్రజా
.వితోద్యమము, వైష్ణవ సాహిత్యోద్యమము, కావ్య సాహిత్యోద్యమము, నవ్య
.వితోద్యమము, సత్యవాది సంఘోద్యమము, సబూజసంఘము లేక
ిత్యశ్యామల సంఘోద్యమము, అను సాహిత్యోద్యమములు ప్రవర్తిల్లి యా
ాహిత్యాభివృద్ధికిఁ దోడ్పడినవి. తమిళ సాహిత్యమునఁ దమిళ కవి సంఘముల
ూలమునఁ సాఁగిన దేశికవితోద్యమము, కావ్యసాహిత్యోద్యమము, భక్తి
ివితోద్యమము, అనువాద సాహిత్యద్యోమము, యుద్ధ కావ్యోద్యమము,
్యావహారిక భాషోద్యమము, చారిత్రక నవలోద్యమము, 'శెందమిళు' ఉద్యమము,
ని ప్రముఖముగా నెనిమిది యుద్యమములు చూపట్టును  కన్నడ సాహిత్యమున
ుహాకావ్యకవితోద్యమము – లేక మార్గకవితోద్యమము, భక్తికవితోద్యమము
ేక దేశికవితోద్యమము, దాసకూటోద్యమము, పునరుజ్జీవనోద్యమము,
ఆధునిక కవితోద్యమము, ప్రగతి శీల సంఘోద్యమము అను నుద్యమము లా
ాషా సాహిత్యము యొక్క యభివృద్ధికిఁ దోడ్పడినవి  మలయాళ సారస్వతమున
శెందమిళు ఉద్యమము, మణిప్రవాళ భాషోద్యమము, నిరణ కవితోద్యమము,
ాథాకవితోద్యమము, 'కిలిపాట్టు' ఉద్యమము, చంపూకావ్యోద్యమము, సందేశ
కావ్యోద్యమము, 'అట్టక్కథ' యుద్యమము, 'తుళ్లల్' ఉద్యమము, ఆధునిక
కవితోద్యమము, మర్మకవితోద్యమము, అభ్యుదయ కవితోద్యమము లేక జీవత్
సాహిత్యోద్యమము అను సాహిత్యోద్యమము లేర్పడి యా సాహిత్య ప్రగతికి

దోహదము కావించినవి మహారాష్ట్ర సాహిత్యమున నాధపంథ యుద్యమము, మహానుభావ పంథ యుద్యమము, భాగవత పంథ లేక వార్కారీ పంథ యుద్యమము, పునరుజ్జీవనోద్యమము, రామదాసీ పంథ యుద్యమము, పండిత కవుల సాహిత్యోద్యమము, షాహిరీ వాఙ్మయోద్యమము లేక పోవాడ లావణీ రచనోద్యమము, నిబంధ రచనోద్యమము, నవ్యకవిత్వోద్యమము అను తొమ్మిది సాహిత్యోద్యమములు ప్రవర్తిల్లినట్లు గోచరించును వివిధ భారతీయ భాషలయందలి యీసాహిత్యోద్యమములు భాష, ప్రక్రియ, ఛందము, కవితాపద్ధతి యను వాని విషయమున నాయాకాలములందాయా సాహిత్యములలోఁ బరివర్తనము కలుగఁజేసినవి మతము, రాజకీయ సాంఘిక పరిస్థితులు, మహాపురుషుల ప్రభావము, సాహిత్యసంఘములు, నూతన త్వాభిలాష యనునవి యాయా సాహిత్యోద్యమముల యావిర్భావములకు వివిధ భాషా సాహిత్యముల యందు హేతువు లయి విరాజిల్లినవి (ద్వితీయాధ్యాయము)

ఆంధ్ర సాహిత్యమున వివిధ కాలముల యందేర్పడిన సాహిత్యోద్యమములు పదునొకండు గలవు అవి మార్గ కవిత్వోద్యమము, దేశి కవిత్వోద్యమము, హరిహరనాధ తత్త్వోద్యమము, ప్రబంధ కవిత్వోద్యమము, అచ్చ తెనుఁగు కవిత్వోద్యమము, యక్షగాన రచనోద్యమము, భావ కవిత్వోద్యమము, వ్యావహారిక భాషోద్యమము, అభ్యుదయ కవిత్వోద్యమము, అధివాస్తవిక కవిత్వోద్యమము, దిగంబర కవిత్వోద్యమము వీనిలో అచ్చ తెనుఁగు కవిత్వోద్యమము, వ్యావహారిక భాషోద్యమము ననునవికావ్యములందును, రచనము లందును నుపయోగింపఁదగిన భాషకు సంబంధించిన యుద్యమములు హరిహరనాధ తత్త్వోద్యమము మత సంస్కరణ లక్ష్యముతో నేర్పడినట్టిది దేశికవిత్వోద్యమ లక్ష్యము ప్రధానముగా మత ప్రచారమే యయినను నది కవిత్వరూపమున సాధింపఁబడిన యుద్యమము యక్షగాన రచనోద్యమము ప్రక్రియకు సంబంధించినది. తక్కిన వన్నియు నాంధ్ర భాషయందుఁ గవితా పద్ధతులలో నిర్దిష్ట పరిణామమును లక్షించి యేర్పడిన యుద్యమములు. భిన్న భిన్న రంగములకు సంబంధించి సాఁగిన యీ యుద్యమము లన్నియు నాయా కాలముల దాంధ్ర సాహిత్య పరిణామమునకు యధాశక్తి దోహదము కావించినవి తమిళము, కన్నడము, తెలుఁగు, మలయాళము ననునవి ద్రావిడ భాషా

కుటుంబమునకుఁ జెందిన భాషలగుట చేతను – దక్షిణ దేశమందలి రాజకీయ సాంఘిక మతపరిస్థితులించుమించుగా నీ భాషలయందలి పరిణామములకుఁ జాలవఱకు సమానములే యయి పరస్పర సామ్యము కల యుద్యమము లాయా భాషలలో వెలయుట సంభావ్యమగుట చేతను, ఇరుగు పొరుగు భాషలలో నొక భాషయందలి యుద్యమ ప్రభావమును, వ్యాప్తియు నితరభాషలయందును బొడసూపుట సహజ మగుట చేతను – దక్షిణ దేశ భాషా సాహిత్యములయందలి యుద్యమములను బరస్పరము పోల్చి, తులనాత్మక పరిశీలనము చేయుట యావశ్యక మయినది అట్లుకాక, యాదృచ్ఛికముగానేకూడఁ గొన్ని సమాన ధర్మములు కలయుద్యమముల భిన్న భిన్న కాలముల యందీ దక్షిణ దేశ భాషలయందేర్పడుట కూడ సంభవమే ఒకప్పుడొక భాషయం దా భాషా పరిస్థితులను బట్టి యేర్పడిన యుద్యమమా సమకాలమున నితర దక్షిణ దేశ భాషయందవసరము కాక – మరేదో కాలాంతరమున నా భాషాపరిస్థితులనుబట్టి యట్టి యుద్యమమే యేర్పడుచుండుటయుఁ గలదు కన్నడమునందలి మహాకావ్యకవిత్వోద్యమము లేక మార్గకవిత్వోద్యమమునకును దెలుఁగునందలి మార్గ కవిత్వోద్యమమునకును బోలిక గలదు తెలుఁగునందలి దేశి కవిత్వోద్యమముతోఁ దమిళమునందలి సంఘ కాలపు దేశి కవిత్వోద్యమమును, కన్నడమున బసవ యుగమునందలి దేశి కవిత్వోద్యమ మును బోల్పఁదగియున్నవి తెలుఁగున వెలసిన హరిహరనాథ తత్వోద్యమమునకును, మహారాష్ట్ర సాహిత్యమునందలి నాథపంథ, మహానుభావపంథ యను నుద్యమములకును బోలికలు గలవు మలయాళ భాషయందలి, 'కిళిపాట్టు' ఉద్యమము, తమిళ భాషయందలి యనువాద సాహిత్యోద్యమము, మన యాంధ్రభాష యందలి ప్రబంధ కవిత్వోద్యమమును గొంతవఱకుఁ బోలుచున్నవి తెనుఁగు భాషయందలి యచ్చ తెనుఁగు కవిత్వోద్యమము మలయాళము నందలి శెందమిళు (లేక పచ్చ మలయాళము) ఉద్యమము, తమిళ భాషయందలి శెందమిళు ఉద్యమము – కన్నడ భాషయందలి అచ్చ గన్నడ కావ్య రచనా ప్రయత్నము అనువానితో సంవదించుచున్నది మలయాళ సారస్వతమునందలి అట్టక్కథ యాంధ్రభాషలోనియక్షగాన రచనోద్యమమును బోలును. ఆంధ్రభాషయందలి వ్యావహారిక భాషోద్యమము తమిళమున సుబ్రహ్మణ్య భారతి ప్రారంభించిన వ్యావహారిక భాషోద్యమము నించుమించుగా సమానాశయములతో వెలువడినవి

మన భాషయందలి భావకవిత్వోద్యమము వంటి యుద్యమము లొక్క తమిళ భాషలోఁ దప్పఁ దక్కిన యన్ని దక్షిణ దేశ భాషలయందును బయలుదేరినవి అవి బయలుదేరిన పరిస్థితులును, వాని యావశ్యకమును నన్ని భాషలయందును సమానములు మన భాషయందలి యభ్యుదయ కవిత్వోద్యమమునకు కన్నడమునందలి ప్రగతిశీల సంఘోద్యమము, మలయాళ సారస్వతము నందలి జీవత్ సాహిత్యోద్యమము అనువానితోఁ బోలికలు గలవు ఇట్లు పరస్పర సామ్యములు లేక యాయా భాషలయందలి పరిస్థితుల కనుగుణముగా నేర్పడిన సాహిత్యోద్యమములు కొన్నిగలవు అవి యాయా భాషలకుఁ బ్రత్యేకములు (తృతీయాధ్యాయము)

సోమనాథుని కాలమును గూర్చి పరిశోధకులలో భిన్నాభిప్రాయములు కలవు అతఁడు క్రీస్తుశకము పండ్రెండ్రవ శతాబ్ది యుత్తరార్థమునకు, బదుమూఁడవ శతాబ్ది పూర్వార్థమునను జీవించి యుండెనను బహుజనాంగీకృత వాదమే యిందును నంగీకరింపఁ బడినది సోమనాథునికి బూర్వకాలమునందలి యాంధ్ర వాఙ్మయమును శాసనకవిత, పదరచనములు, ఉపలబ్ధమగుచున్న కావ్య వాఙ్మయము, అనుపలబ్ధమగు సారస్వతము అని నాలుగు తెఱఁగులుగా వింగడింపఁ దగియున్నది నన్నయ భట్టారకుఁడు పావులూరి మల్లన, మల్లియ రేచన, నన్నెచోడుఁడు, మల్లికార్జున పండితుఁడు, వేములవాడ భీమకవి, అథర్వణాచార్యుఁడు, కవిభల్లటుఁడు అను వారు సోమనాథునికిఁ బూర్వము వెలసిన కవులు నన్నయ భారతము, పావులూరి గణితము, కవిజనాశ్రయము, కుమారసంభవము, అథర్వణ భారతము, అను గ్రంథములు సంస్కృత మూలకములు. కాని, యాంధ్రీకరణ విధానము స్వతంత్రము. శివతత్త్వ సారము స్వతంత్ర రచన మయ్యును నది కావ్యము కాదు శతక జాతిలోఁ జేరును నన్నయ భారతమునందుఁ దత్సమ పదము లధికము సంస్కృత వ్యాకరణ సంప్రదాయములు, సంస్కృత కారకచ్ఛాయలు నతని గ్రంథమున గోచరించును సంస్కృత వృత్తముల నధిక సంఖ్యలోఁ దన కవిత్వమునందుఁ బ్రవేశ పెట్టెను అతఁడనుసరించిన చంపూకావ్య పద్ధతి సంస్కృతము ననుసరించినది అతని పద్య రచనాశైలి సాంస్కృతికము అయ్యును నితఁడు కొన్ని సామెతలను, జాతీయములను దన గ్రంథమునఁ బ్రవేశపెట్టెను దాని సంఖ్య యత్యల్పము

అచ్చటచ్చట నావశ్యకమునుబట్టి యలఁతి యలఁతి తెలుఁగుపద్యములను దేటమాటలలో రచింపక పోలేదు. పావులూరి గణితములోని యాంధ్రీకరణము భారతాంధ్రీకరణమును బోలినదే అందు దేశీయములగు మానాదికములు దెలుపునంతవఱకే దేశి గుణము కానవచ్చును రచనము మాత్రము సాంస్కృతిక మార్గము ననే సాఁగినది కవిజనాశ్రయమునఁ గందపద్యము లెక్కువ. నన్నెచోడుని కుమారసంభవము నందు దేశి సంప్రదాయములు కొన్ని యనుసరింపఁబడినవి. అయినను నందలి రచనము ప్రాయికముగాసాంస్కృతికముగనే చూపట్టును దేశి ఛందస్సునకుఁ జెందిన పద్యము లధికముగా నున్నను నితఁడును నన్నయ వలెనే సంస్కృత వృత్తముల నధిక సంఖ్యలోఁ దన కవిత్వమునఁ బ్రవేశపెట్టెను. సామెతలు, జాతీయములు నన్నయలోఁ గంటెఁ గొంచె మధికముగా నుండును ఇతని కవిత్వమున 'జానుతెనుఁ'గనునదియొక యాశయముగా మాత్రమే యుండెను శివతత్త్వసారము నందలి పద్యము లన్నియుఁ గందములే ఇందు మంచిమంచి జాతీయములు కొన్నిప్రయోగింపఁబడినవి వ్యాకరణా విరుద్ధములగు ప్రయోగములుకూడఁ గొన్ని కలవు సోమనాథుని భాషా ప్రయోగమున కీతని భాషాప్రయోగము పూర్వరంగము. ఉపలబ్ధము లయిన వేములవాడ భీమకవి చాటువులు, అధర్వణ భారతమందలి పద్యములు, కవి భల్లటుని పద్యములు సాంస్కృతికమయిన శైలిలోనే నడచినవి. సోమనాథునికిఁ బూర్వ ముండినట్లూహింపఁబడుచున్న గద్యరచనములు కూడ సంస్కృత భూయిష్ఠములుగానే యుండెనని తలఁపబడుచున్నది శాసనములందును, పదరచనముల యందును దేశికవిత్వముకన్పట్టును '

ఉద్యమకర్తయగు వానికిఁ బ్రధానముగా సమ్యగవేక్షణము, సంకల్ప తీవ్రత, ధైర్య సాహసములు, ఆత్మప్రత్యయము, ఆవేశము, నిరుపమానమయిన పాండిత్యము, తర్కనైపుణ్యము అను లక్షణము లుండవలయును. దేశి కవిత్వోద్యమ ప్రవర్తకుఁడగు పాల్కుఱికి సోమనాథునిలో నీ లక్షణము లన్నియుఁ బూర్ణముగాఁ గలవు. అతనికి శ్రుతి స్మృతీతిహాసములు, అష్టాదశపురాణములు, శివపురాణములు, వేదాంతము, సంగీతము, వైద్యము, వాస్తువు మొదలగు శాస్త్రములు, శివాగమములు, చతుష్షష్టికళలు, సంస్కృతమునందలి కావ్య వాఙ్మయము, వివిధములగు దేశభాషలు – మొదలగువానియందుఁ జక్కని

౦చయము కలదు వీని యన్నింటి యధ్యయనాదులవలన లభించినవిజ్ఞాన
ాతనికి దేశి కవిత్వోద్యమ నిర్వహణమున నితరలక్షణములతోఁబాటు
క్కిలిగా నుపకరించినది (చతుర్థాధ్యాయము)

సంగీతము, నాట్యము, కవిత్వము అను లలితకళల యందు మార్గ, దేశి
మము లున్నట్లు పరిశీలనములవలనఁ దెలియుచున్నది సంస్కృత లాక్షణికులు
ని, కవీశ్వరులు కాని, కవిత్వ విషయమున మార్గ, దేశి భేదములను భావింప
ము వాల్మీకి రామాయణ కాలము నాఁటికే సంగీతమున మార్గ దేశి భేదములు
వు సంగీతరత్నాకరము మొదలగు సంగీత శాస్త్ర గ్రంథములందు మార్గ
శి లక్షణములు నిర్వచింపఁబడినవి వానిఁబట్టి మార్గ సంగీతము నియమ
ాతము, బ్రహ్మాదులచే మార్గితమై భరతాదులచేఁ బ్రయుక్తము, ననాది
ంప్రదాయసిద్ధము, లక్షణప్రధానమునై పండిత జనులను రంజింపఁజేయునని
లియుచున్నది దేశి సంగీతము కామచారప్రవృత్తి కలదై నానా దేశ జనులచే రుచ్య
గుణముగా నప్పటి కప్పుడు నూతనముగాఁ బ్రయుక్త మగుచు లక్ష్యప్రధానమై
మాన్య జనులకు రంజింపఁజేయుననితెలియుచున్నది క్రీస్తుశకము రెండవ
శాబ్దికిఁ జెందిన దని కొందఱు విద్వాంసులచేఁ దలంపఁబడు 'శిలప్పదిగారము'
ను తమిళకావ్యముఁబట్టి నృత్యమునకు మార్గమనియు, నృత్తము నకు దేశి
నియు వ్యవహార మున్నట్లు తెలియును సంగీత నాట్యములయందుఁ గాన
న్బు నీమార్గ దేశి భేదములను భాషల కన్వయించినపుడు సంస్కృత భాష మార్గ
నియుఁ బ్రాకృత భాషలు దేశి యనియుఁ దేలును ఆంధ్ర కర్ణాటాదిదేశభాష
ల్లియు దేశి మార్గమునకే చెందును భాషకు సంబంధించిన యీ మార్గదేశి
క్షణములను బ్రతి దేశ భాష యందలి కవిత్వమునకును నన్వయింప వచ్చును
యా భాషల యందు లక్షణానురూపముగా వెలయుకవిత్వము మార్గము
క్షణము ననుసరింపక స్వచ్ఛందముగా వెలయింపఁ బడునది దేశి
ిత్వవిషయమున నీమార్గ దేశి విధానములను బాటించుట తొలుతఁ గర్ణాటభాష
ందు జరగినది వారి ననుసరించి నన్నెచోడుఁడు వానిని దెలుఁగునందుఁ
వేశపెట్టెను. తెలుఁగు లాక్షణికులు కాని, తక్కిన కవులు మఱెవ్వరు కాని
ిత్వమున నీ భేదములను బేర్కొన లేదు. నన్నె చోడుని పద్యమునఁ బేర్కొనఁ
డిన మార్గ సత్కవీశ్వరులు కన్నడమునందలి పంపాదులగు కవులు, తెలుఁగున

నన్నయాదు లగు కవులు కాఁదగుదురు మును లోకంబున వెలసిన మార్గ కవిత కన్నడమునందలి మార్గ కవితాపద్ధతి చాళుక్యరాజు రాజరాజ నరేంద్రుడు కాఁడు నన్నయకుఁ బూర్వము శాసనాదులందుఁ దెలుఁగు కవితను వెలయించుటకు దారి చూపిన చాళుక్య రాజాదులు రాజరాజనరేంద్రునికిఁ బూర్వులయిన చాళుక్యరాజులు మార్గకుమార్గము అనియు, దేశి యమార్గము అనియు వాదించి మణిప్రవాళ భాషలోఁ గవిత్వము చెప్పవలయునని యభిప్రాయపడుచుండిన మార్గకవులనే యాతఁడు కుకవి నిందలోఁ బరిహరించెను దేశిమార్గములను దేశీయముగాఁ జేయుట యనఁగా మార్గను దేశీయ సంప్రదాయముతో నొప్పునట్లు రచించుట దేశిని దేశీయముగా నొనర్చుట యనఁగా దేశి కవితారీతిని మఱింత దేశీయముగా నొనరించుట దేశి మార్గములు మట్టుపడునట్లుగాఁ గవిత్వము చెప్పిన యాద్యులు కన్నడమునందుఁ గవిత్వము చెప్పిన పంపాదులును, దెలుఁగు నందలి నన్నయ, నన్నెచోడులును గాఁదగుదురు సంస్కృతమునందలి యాలంకారికుల నిర్దేశము ననుసరించి పురాణేతివృత్తముతో, సంస్కృత వృత్త సమాదరణముతో, సంస్కృత పద బహుళమై, లక్షణ యుక్త మయిన భాష కలకవిత్వము మార్గ కవిత్వము పురాణ ప్రసిద్ధము కాక దేశీయ మయిన వస్తువుతోఁ గూడినదియు, దేశీయము లయిన ఛందములయందు రచింపఁబడినదియు, దీర్ఘసమాస భూయిష్ఠముకాక దేశి పదప్రచురమై సామెతలు, జాతీయములు పెల్లుగాఁ గలిగి వాక్యరచనము, రచనా విధానము అను విషయములందు దేశీయత వెలార్చు నదియు, దేశీయ విజ్ఞానమును, దేశీయ జన జీవనమును జిత్రించునదియు, దేశి వర్ణనములను గలదియు దేశికవిత్వమగును. ఈ లక్షణముల ప్రాచుర్యమునుబట్టి మార్గదేశికవిత్వముల నిర్దేశము సాధారణముగా జరగుచుండును. సంగీతమున దేశియందున్నట్లే, కవిత్వమున మార్గ దేశి భేదములు మఱల నిబద్ధమనియు, ననిబద్ధమనియు మఱల ద్వివిధము లగును పాల్కురికి సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య చరిత్రములు నిబద్ధ దేశి సంప్రదాయమునకుఁ జెందును. మార్గగుణములు కొన్ని దేశియందును, దేశిగుణములు కొన్ని మార్గమునందును గాలక్రమమున సంక్రమించుచుండును ఆంగ్ల సాహిత్యము నందలి Romantic Movement అను కాల్పనిక కవితోద్యమమునకును, తెలుఁగు సాహిత్యమునందలి దేశి కవితోద్యమము నడుమ కొన్ని సమానాంశములు కలవు. తెలుఁగున నీ దేశికవిత్వ మొక్క కాలమున

నుద్యమ రూపమునఁ జాలఁ దీవ్రముగా నుండిననునంతకుఁ బూర్వమున
ననంతరమునను నిది మార్గ కవిత్వమునకు సమానాంతరముగా సాఁగుచ
వచ్చినది మార్గమును Classicism కుఁ బర్యాయముగను, దేశి
Romanticism కుఁ బర్యాయముగనువాడునప్పుడు వాని నొక పరిమితార్థమ
ననే వాడుట యుక్తము (పంచమాధ్యాయము)

తెలుఁగు కన్నడ భాషలపై సంస్కృత భాషా ప్రభావ మధికముగాఁగలదు
తమిళము, మలయాళము నను భాషలపై నీ ప్రభావ మంతగాఁ గానరాదు. వింధ
పర్వతమునకు దక్షిణమున నున్న తెలుఁగు కన్నడదేశము లార్య జనాక్రాంతమ
లయినట్లు, తమిళదేశ మార్యజనాక్రాంతము కాలేదు అందుచేతఁ దమి
దేశమునఁ గ్రీస్తుశకారంభకాలము నాఁటికే సంస్కృత ప్రభావము సోకని దేశి కవి
పెంపొంది యుండినది. అగనానూఱు, పుఱనానూఱు అను సంకల
గ్రంధములయందాదేశి కవిత యొక్క స్వరూపము గోచరించును
తొల్కాప్పియము నందలి పొరుళధికారమునఁ దమిళుల సామాజిక జీవ
విధానము మిక్కిలి మనోజ్ఞముగా నభివర్ణింపఁబడినది. తమిళవేదము
సంభావింపఁబడు 'తిరుక్కురళు' నందు సార్వజనీనములు, సార్వకాలికము
నగు నీతులు 'కురళ్' అనఁబడు దేశీయ ఛందములోఁ దెలుపఁబడెను
సంగకవులు తమకావ్యవస్తువులను సంస్కృతమునుండి గ్రహింపలేదు. వర్ణన
యందును వారి ప్రత్యేకత గోచరించును. ఛందస్సాహిత్య రీతుల విషయమున
గూడ సంస్కృత సంప్రదాయములు తమిళమునందుఁ బ్రవేశింప లేదు జైన
బౌద్ధుల యుగమున వెలసిన శిలప్పదిగారమువంటి కావ్యములు సంస్కృతాన
వాదములో, సంస్కృతనాటకములోకాక దేశీయేతివృత్తములత
శోభిల్లుచుఁదమిళ భాష యాదినుండి యనుసరించుచుండిన 'దేశి' మార్గమున
బరిరక్షించినవి శైవ వైష్ణవ మతాచార్యులయుగమున వచ్చిన తమిళ సాహిత్య
మంతయు మధుర గేయమయము 'తిరువాచకం' అను గ్రంధమునంద
దేశికవితాశాఖకుఁ జెందిన 'అమ్మానై, తెళ్లేణం, పాళల్' మొదలయిన గే
ప్రభేదములలోఁ బెక్కు గేయములు రచింపఁబడి యున్నవి కంబ రామాయణము
వాల్మీకి రామాయణము ననుసరించియే రచింపఁబడినను నందలి వర్ణనాంశములు
కొన్ని దైనందిన జీవితమునుండి గ్రహింపఁబబడినవి అరుణగిరినాధుని
'తిరుప్పుగళ్' అను గ్రంధమునఁ బెక్కు మధుర గీతములు కలవు ఆధుని

కాలమునందలి సుబ్రహ్మణ్య భారతి రచనము లందు గేయాంశ మధికము, క
సమయములు, వర్ణనాంశములు, ఉపమానములు మొదలగువాని విషయము
గూడఁ దమిళ కవులు సంస్కృత భాషాప్రభావమునకు లోఁబడక స్వతంత్రముగ
దేశీయముగా నిర్వహించిరి కన్నడమునఁ గవిరాజమార్గము నకుఁ బూర్వప
దేశిపద్ధతికూడ మార్గపద్ధతితోఁబాటు సమాన గౌరవము నందియుండెన
కవిరాజమార్గమున వేయఁబడిన కన్నడ మార్గపద్ధతి ప్రభావముచే నంత
ముందుండిన దేశిపద్ధతి యంతరించినది పంపాదులు దేశిని స్మరించినను వా
కవిత్వము మార్గపద్ధతినేపోఁగినది బసవ యుగమున విషయము, భాష, ఛందస
అను మూఁడు విషయములందును దేశి ప్రాధాన్య మెక్కువ యయ్యెన
వచనమనుసాహిత్య రూపము పుట్టెను రగళె, త్రిపది, షట్పది, య
'అచ్చుగన్నడ' ఛందస్సులు వ్యాప్తిలోనికి వచ్చెను ప్రాయికముగా శరణ
చరిత్రములుకావ్యవస్తువు లయ్యెను కుమారవ్యాసయుగమున దాసకూటవ
ప్రాచుర్యమునకు వచ్చి షట్పది, సాంగత్యము, త్రిపది, కీర్తనలు ప్రాధాన్యవ
వహించెను లింగాయతమతముతో వ్యాప్తిలోనికివచ్చిన యీ దేశి ఛందస్సు
కాలక్రమమున నన్నిమతముల వారిచేతను నాదరింపఁబడఁజొచ్చెను తెలుఁగులో
యక్షగానముల ననుసరించి కన్నడమునను నిటీవలి కాలమున యక్షగాన మను
రచనా ప్రభేదము వ్యాప్తిలోనికి వచ్చెను కన్నడ కవులు ప్రయోగించిన 'జాణ్ణు
యనుపదము సంస్కృత ప్రాధాన్యములేని జాతీయమయిన కన్నడ భా
ప్రయోగమును దెలుపునని యూహింపఁబడుచున్నది దాని బేర్కొనినకవు
కన్నడకవిత యందు దేశి ప్రాధాన్యము నభిలషించువారుగాఁదోఁచుచున్నా
తమిళమునందు వలెనే కన్నడమునందును దేశీయములయిన యుపమానము
జాతీయములు, సంప్రదాయములు కొన్ని కలవు తెలుఁగు భాషయం
నన్నయకుఁ బూర్వము దేశికవిత చాలవఱకుఁ బాటల రూపమున నుఁ
యుండును. భారత రచనమునకుఁ దరువాత నట్టిరచనముల కాదరము
పోవుటచేతను, నవి ముఖ్యములే యయి యుండుటచేతను నశించి యుండు
నన్నయకుఁ దరువాతికాలమునఁ గూడఁ బెక్కు విధములగు దేశిరచన
లుండెనని సోమనాథుని రచనములను బట్టి తెలియుచున్నది. కన్నడ దేశమ
బయలుదేరిన వీరశైవమతోద్యమమాంధ్ర దేశమునఁ గూడ వ్యాపిం
వెంటనేయుచటను గన్నడ దేశమునందువలెనే దేశి రచనముల యావశ్యకమేర్పడె

వత్తృసారము దేశీయచ్ఛందో భేదముగుకందుపద్య బహుళముగా రచింపఁబడెను నన్నెచోడుఁడు తన కుమార సంభవమునఁ గొన్ని దేశి సంప్రదాయములను గొప్పించెను పాల్కుఱికి సోమనాధుఁడు తెలుఁగున వెలయించిన దేశి సారస్వతము బహు ముఖము రంగనాధ రామాయణమున ఛందస్సునందు మాత్రమే కాక యితివృత్తమునందును గొంత దేశీయతను సాధించు ప్రయత్నము జరగినది పలనాటి వీరచరిత్రములోని యితివృత్తము తెలుఁగు దేశమునకే సంబంధించినది తాళ్లపాకకవులు వెలయించిన సాహిత్య మంతయు సోమనాధుఁడు సాఁగించిన దేశి కవితోద్యమమునే యనుసరించినది హంసవింశతి, శుకసప్తతి కావ్యములలో దేశి కథలు మార్గ పద్ధతిని రచింపఁబడినవి యక్షగాన రచనము దేశి సాహిత్య ప్రక్రియ యని వేఱుగాఁజెప్ప నవసరము లేదు ఆధునిక యుగమున మార్గ కవితాపద్ధతి క్రమక్రమముగా సన్నగిల్లుచు దేశికవితకుఁ దానధిష్ఠించి యుండిన కవితా సింహాసనమును వదలి పెట్టినది ఇటీవలి కాలమునఁ దెలుఁగున రచింపఁబడుచున్న పెక్కు రచనలు దేశి మార్గమునకే చెందును వానియందలి యితివృత్తము ప్రాయికముగా సాంఘికము, భాష వ్యావహారికము మలయాళమునఁ గావ్యవాఙ్మయము వెలయుటకుఁ బూర్వము గేయ సారస్వతము విస్తారముగా నుండెను అది యెల్ల దేశి సారస్వతము క్రిందికే వచ్చును ఆదియుగమునందలి 'కణ్ణశన్ పాట్టుగళ్' అను కావ్యసంపుటమున 'నిరణవృత్త' మనఁబడు దేశి ఛందో విశేషము నూతనముగా నుపయోగింపఁబడినది 'కృష్ణగాధ' యనుకావ్యమునందలి మంజరీ ఛ్ఛందము మలయాళ ఛ్ఛందము ఎళుత్తచ్ఛన్ మూలమున 'కిళిప్పాట్టు' అను ఛందోభేదమునకుఁ గావ్యత్వగౌరవము కలిగెను మలయాళకవులు సంస్కృతతమిళముల నాదరించినంతగా మలయాళమునాదరింపలేదు వారు మలయాళ ఛ్ఛందములను చిన్నచూపు చూచిరి. అట్టి పరిస్థితులలో దేశీయ ఛ్ఛందములయందు రచింపఁబడిన 'కృష్ణగాధ', ఎళుత్తచ్ఛన్ రామాయణము అనునవి దేశీయ పద్ధతికిఁ బట్టముగట్టెను 'ఉణ్ణునీలి సందేశము' అనుకావ్యములోఁ గేరళ దేశపుఁ జారిత్రక సాంఘికపరిస్థితులు మిక్కిలి మనోజ్ఞముగా నభివర్ణింపఁబడినవి అందలి వర్ణనములు కడు స్వతంత్రములు ఆమేరకదిదేశిరచనముతో నొప్పుచున్నదని చెప్పఁదగును కథకళికి నుపయోగపడు 'అట్టక్కధలు' దేశిలక్షణలక్షితములు 'తుళ్లల్' రచనలు పౌరాణిక గాథల మూలమున సమకాలపు జీవన విధానమును

జిత్రించుచు ప్రజలకు మిక్కిలి సన్నిహితము లయ్యెను అధునిక కాలము నందలి మలయాళ సాహిత్యము కూడ దేశిమార్గముననే పురోగమించుచున్నది అధునిక రచయితలు జటిలము లగు సంస్కృత వృత్తముల నుపయోగించుట లేదు ప్రాచీన మలయాళ చ్ఛందములనే వారుపయోగించుచున్నారు వారు స్వీకరించు నితివృత్తములు సామాన్య జనరంజకములు సామాన్య మానవుని జీవితమే యాధునిక కాలమునందలి పెక్కు రచనములకుఁ గావ్యవస్తువు మహారాష్ట్ర భాష యందు భక్తకవులు, పండితకవులు సంప్రదాయప్రవక్తలు వెలసి భాషాభివృద్ధికి బహువిధములఁ దోడ్పడిరి వా రుపదేశ గ్రంధములను, జ్ఞాన భక్తి యోగాదులను ప్రబోధించు నుత్తమ గ్రంధములను రచించి మహారాష్ట్ర సాహిత్యమును బరిపుష్టము గావించిరి సమర్ధరామదాసు భక్తి జ్ఞానములను ప్రబోధించుటయే కాక రాజకీయములను, వ్యావహారిక విషయములను, దేశ భక్తిని గూడఁ బొంపొందించు సాహిత్యమును వెలయించెను అతని యానందవనము మహారాష్ట్ర దేశీయచ్ఛందములు కూడ వారిచే విశేషముగా వాఁడబడినది మహారాష్ట్ర సాహిత్యమున నధికముగా నాదరింపఁబడిన దేశీయవృతములో ఓవీ ఛందము, అభంగవృత్తము. దేశి సాహిత్యమునకుఁ జెందిన స్త్రీలపాటలు, 'ధవళ' యను గ్రంధముగాఁ గూర్పఁబడినది మహారాష్ట్ర సాహిత్యమున గ్రంధము లనేకములు దేశీయ వృత్తములందే రచింపఁబడినను వాని యందలి వస్తువు మాత్రము వేదాంతము, భక్తి, సంస్కృత పురాణ సంబంధి యయి యుండుట గమనార్హము ఒక్క ఛందోవిషయమునఁ దప్ప దక్కిన విషయముల యందు మహారాష్ట్ర సాహిత్యమున నంతగా దేశితనము గాన్పింపదు (షష్ఠాధ్యాయము)

సోమనాధుఁడు పరమశివుని ప్రమధగణములలో నొకఁడగు భృంగిరిటి యొక్క యవతారమని శైవుల విశ్వాసము, అతఁడు పరమేశ్వరుని యాదేశము చొప్పున లోకములో శివభక్తి ప్రచారము గావించెను అతని యాదేశము చొప్పుననే యాతఁడు 'సకలభక్తకధామణి సూత్రభాతి' గా బసవపురాణమును రచించెను ఈ విజయమునకు శైవ ప్రపంచమున నునుశ్రుతము వినవచ్చు ప్రాస్తావి కశ్లోకములును, బిడుపర్తి సోమనాధునిపద్య బసవపురాణమును, సోమనాధుని యనుభవసారమందలి పద్యములును దెలియఁజేయుచున్నవి పరమేశ్వరుఁ డానతియిచ్చిన విషయమును మనము విశ్వసించినను, విశ్వసింపక పోయినను నతఁడు బసవపురాణాది గ్రంధములు రచించి శైవమతప్రచారము గావించె ననుమాట మాత్రము సత్యము సోమనాధుని గ్రంధములలో నొకఁడు

చెప్పుకొనిన యంశములను బట్టి కూడ శైవ మతప్రచారమే యాతని పరమాశయ
మని విశద మగును తాను శివభక్తి తత్పరుఁడయినఁ గాని శైవమతప్రచారమ
చేయుట కాతని కధికార ముండదు. అతఁడు తన వైయక్తిక జీవితమునఁ గఠోరమ
లగు నియమ నిష్ఠలు పాటించి శైవసమయ దీక్షను నిర్వహించిన యవిరళ శివభ
తత్పరుఁ డని యాతని గ్రంథ ములను బట్టియు, నితరు లాతనిని గూర్చి చేసి
వర్ణనాదికమును బట్టియు విశద మగుచున్నది. అతని శైవమత ప్రచారమ
ముఖ్యముగా మూఁడు తెఱఁగులుగా సాఁగినది శైవమతావలంబకులగువారి
నిత్యాను సంధానమునకుఁ, బారాయణాదులకు నుపయోగపడు స్తోత్ర
గ్రంథములను రచించుట, పరమత ఖండనముఁ గావించి శైవమతౌత్కృష్ట్యము
స్థాపించు సిద్ధాంత గ్రంథములు రచించుట, శైవులకును శైవేతరులకున
శైవమతము నందాస్థయు, నభినివేశమును గల్పించుటకుఁ గథావ్యాజమున శైవమ
ధర్మములను దెలుపు గ్రంథములు విరచించుట అతఁడీ ముత్తెఱఁగులన
సృష్టించిన శైవసాహిత్యము మూలమున నతని పరమాశయ మయిన శైవమ
ప్రచార లక్ష్యము పూర్ణముగా నెఱవేరినది. బసవేశ్వరుఁడనాదిగా నుండి
శైవమతమును సంస్కరించియు – వేలకొలఁదిగా భక్తిమయము లగు గేయములన
గన్నడ భాషలో రచించియు, స్వీయ మహిమాదిక ప్రదర్శనముల ( దృష్ట
ప్రత్యయముల) మూలమునను వీరశైవమతోద్ధరణము గావించెను మల్లికార్జు
పండితుఁడు తన పాండిత్యముచే నితరమతముల వాదములను ఖండించ
శైవమతౌత్కృష్ట్యమును స్థాపించెను. అట్టి మహిమాదికము మీఁద విశ్వాసమ
సడలి నప్పుడును, నట్టి పాండిత్యమును బ్రదర్శించిన మహనీయుని
నిర్యాణముతోను శైవమతము తిరిగి దిగనాశిల్లు ప్రమాద మేర్పడును
వారిరువురును జేసిన సేవ కంటె గొప్పది సోమనాథుఁడు వీరశైవమునకుఁ జేసి
సేవ తనకాలముననే కాక తన తరువాతికాలముననఁగూడ శైవ మతమ
ప్రచారమందుటకుఁ దన కావ్యముల మూలమున నతఁడు గొప్ప యవకాశమున
గలిగించెను వీరశైవమత ప్రచారమే సోమనాథుని పరమాశయము. దాని కతఁడ
కవిత్వమును సాధనముగా గ్రహించెను బుద్ధ భగవానుఁడు తన మతము ప్రజలల
బాగుగా వ్యాపింప వలయు నను నుద్దేశముతోఁదన మత ధర్మములను సంస్కృ
భాషలోఁ గాక ప్రాకృత భాషలో వెలయించిన ట్లీతఁడు జాను తెనుఁగున
దేశీయచ్ఛంద మగు ద్విపదలోఁ గతిపయ గ్రంథములను రచించెను. గద్యలు
రగడలు, ఉదాహరణములు గ ంత గయ ధర్మములను గలిగి యుండుటచె

వానియందుఁ గొన్ని లఘుకృతులను విరచించెను పౌరాణికేతివృత్తమును గాక దేశీయేతివృత్తమును గావ్య వస్తువుగాఁ బరిగ్రహించెను ఇట్లు శైవమత ప్రచార లక్ష్యముతో నాతఁడు దేశికవితోద్యమమును జేపట్టెను దానిమూలమున నాంధ్ర సాహిత్యమునందానుషంగికముగా నొక విస్పష్ట పరిణామము, నభ్యుదయ దీపనము నేర్పడినవి (సప్తమాధ్యాయము)

పాల్కురికి సోమనాథుని గ్రంథ సంచయమును బరిశీలించినపుడితివృత్తము నందలి దేశీయత, దేశి ఛందస్సు, దేశివర్ణనలు, దేశిరచనా విధానము, ఉపమానాదుల యందలి దేశీయత, తెలుఁగు సామెతల యొక్కయు, జాతీయముల యొక్కయుఁ బ్రయోగము, వ్యావహారికమునకు సన్నిహిత మగు భాషా ప్రయోగము, దేశి పదజాలము, దేశి సంజ్ఞాపదముల ప్రయోగము, దేశీయ విజ్ఞానము, దేశీయ జీవన చిత్రణము ఇత్యాదిక మగు పెక్కు భంగులలో నాతని దేశికవితోద్యమ వృక్షము శాఖోపశాఖలుగా విస్తరిల్లి యున్నట్లు గోచరించును.

ఆంధ్ర వాఙ్మయమునందు వెలసిన యనేక కావ్యముల వలె, నాతని బసవపురాణ మే సంస్కృత గ్రంధమునకును ననువాదము కాదు అది యొక స్వతంత్ర గ్రంధము అది కొన్ని స్వతంత్ర గ్రంధముల వలె నుత్పాద్య గ్రంథమును గాదు అది కేవలము దేశీయము కన్నడము నందలి బసవగీతములు తన గ్రంధమునకు మాతృక యని యాతఁడు పేర్కొని యుండినను నాయా భక్తుల చరితములను స్థూలముగా నెఱిఁగించువఱకే యవి యాతనికిఁ దోడ్పడినవి వాని మూలకత్వము తావన్మాత్రమే తమిళము నందలి పెరియపురాణమును దానికి మూలము కాదు. శివతత్త్వ సారమునందలి కొందఱు భక్తుల చరితముల నితఁడు తన కావ్యములయందుఁ బెంచి వ్రాసినను నవి యాయాయి భక్త జనుల చరితములను వివరముగా నరయఁగోరు జిజ్ఞాసను గలిగించువఱకే యాతనికిఁ దోడ్పడి యుండును అతని బసవపురాణమునకుఁగాని, పండితారాధ్య చరిత్రమునకుఁ గానిశివతత్త్వసారము మూలము కాదు. భక్తజనుల గోష్ఠిలో నాతఁడు తన మిత్రుల నడిగి బసవ పురాణ కథాసూత్రము నెఱిఁగెను ఇట్లాతని బసవ పురాణము దేశీయేతివృత్తముతోఁ గూడిన స్వతంత్ర గ్రంథము పండితారాధ్య చరిత్రమునందలి యితివృత్తము కూడఁ జారిత్రక పురుషునకే సంబంధించినది. సంస్కృత మూలకము కాదు స్వతంత్ర గ్రంథము మల్లమ దేవీ పురాణ మొక మహాభక్తురాలి మహిమాదికము నభివర్ణించు గ్రంథము

అదియు స్వతంత్ర గ్రంథమే. అతని గ్రంథములం దభివర్ణింపఁబడిన యితర భక్తులును నీ దేశమునకే చెందిన వివిధ జాతుల వారు. ప్రజలలోఁ గలసి మెలసి తిరిగి తమ మహిమాధికమును బ్రదర్శించినవారు. అతఁడు తన గ్రంథముల యందితివృత్త విషయముగా సాధించిన దేశీయత యిట్టిది.

ఇతివృత్త గ్రహణమునందే కాక యతఁడు ఛందో విషయమునను నట్టి దేశీయాభిమానమునే ప్రదర్శించెను. ఛందః ప్రయోగమునం దాతనికిఁ గల దేశి దృక్పథమును ప్రధానముగా ద్విపద, రగడలు, సీసపద్యములు, కందములు, గద్యలు అను నయిదు విభాగముల క్రింద వింగడించుకొని పరిశీలింపఁదగి యున్నది. అతని బసవపురాణ, పండితారాధ్య చరిత్రముల యందు దేశి ఛ్ఛంద మగు ద్విపద పంక్తులు 35,115 గలవు. ద్విపద దేశిచ్ఛంద మనుట నిర్వివాదము. అతని వివిధ కృతులలో మొత్తము 848 రగడ పాదములు కలవు. 358 సీస పద్యములును, 169 కందపద్యములును నాతని వివిధ రచనములయందుఁ గాననగును. అతఁ డీ దేశీయ వృత్తములను వాడుట యందలి యుత్సాహమును సంస్కృత వృత్తములపైఁ జూప లేదు. అతని కృతులన్నిటియందును గలసి 223 ల యందు సంస్కృత వృత్తములు మాత్రమే కానవచ్చుచున్నవి. దీనిఁ బట్టి దేశి ఛ్ఛందముల ప్రయోగమునందాతనికిఁ గల యభిమానము వ్యక్తమగుచున్నది.

సోమనాథుని దేశి కవిత్వములో నాతఁ డందందుఁ జేసిన దేశివర్ణనలు కూడ నొక విశిష్ట భాగముగాఁ బరిగణింపఁదగి యున్నది. లాక్షణికులు పేర్కొనిన యష్టాదశవర్ణనములోఁ గొన్నింటిని దన కావ్యములందు వర్ణించుపట్టులఁ గూడ సోమనాథుఁ డా లాక్షణికుల నియమమునకు గట్టుపడినట్లు కానరాదు. ఆవేశ పరవశుఁడై యా యావర్ణనలను దన బుద్ధికి గోచరించిన విధమున స్వతంత్రముగా నభివర్ణించినాఁడు. కొన్ని వర్ణనల విషయమున నీతఁడవలంబించిన పద్ధతి వినూతనము. విలక్షణము. అది మార్గపద్ధతికి విరుద్ధము. కనుకనే యతని వర్ణన లచ్చముగా దేశివర్ణన లనిపించుకొనును. అతఁడు తనకావ్యములయందు వెలయించిన వర్ణనలను 1. సంప్రదాయ సిద్ధములగువర్ణనములు, 2. స్థిరరూపవర్ణనలు, 3. చలరూపవర్ణనలు, 4. సహజవర్ణనములు, 5. అద్వితీయవర్ణనలు లేక అపూర్వ వర్ణనలు అని ప్రధానముగా నయిదు విభాగముల క్రింద వర్గీకరింప వచ్చును. అతని వర్ణనములలోఁ గొన్నిటిని దరువాతి కవులు

కొందఱనుకరించిరి. కొన్ని మౌలికములై యాతని ప్రతిభను జాటును. మఱికొన్ని సహజ సుందరములై యచ్చ మయిన దేశివర్ణన లనిపించుకొనఁజాలి యున్నవి. సంప్రదాయ సిద్ధము లయిన కొన్ని వర్ణనల విషయమున నాతఁడు స్వతంత్రప్రవృత్తిని బ్రదర్శించి వానికి దేశీయత్వగుణ మలవడునట్లు చేసెను.

రచనా విధానమునందుఁ గూడ నతఁడు దేశీయతను భావించి యుండుట యొక గొప్ప విశేషము. మార్గకవుల రచనా విధానమునకది పూర్తిగా భిన్నము, దేశి సారస్వతము నకుఁ జెందిన వీరగాథల రచనమునందుఁ గానవచ్చు సామాన్య లక్షణములలోఁగొన్ని యాతని కావ్యములయందుఁ గానవచ్చును. అవి, పునరావృత్తి లేక దరువు (Refrain), అభివర్ధిత పునరుక్తి (Incremental Repetition), వారానువర్తనములు (common-places), వీర గాథా చక్రముల (Ballad cycles) యందుఁ బునరావృత్తి వ్యంగ్యము, సోమనాథుని ద్విపదకావ్యములు సుదీర్ఘము లయిన యితివృత్తములు కలవి యగుటచే వీరగాథాచక్రములందు వలెనే యిందును బునరావృత్తి కవకాశములేదు. కాని, యా పునరావృత్తిని బాదాంతముల యందుఁ జేర్చి పఠించినపుడే కావ్యములు కూడ గానయోగ్యములై వీరగాథాగానమునఁ గలుగు నానందావేశముల నొసఁగఁజాలి యుండును. తక్కిన రెండు లక్షణములును నాతని కావ్యములయందుఁ బూర్ణముగాఁ గలవు. ఇట్లాతనిరచనా విధానము దేశి లక్షణ లక్షితమై మార్గకవిత్వ విధానమునకుఁ బూర్తిగా భిన్నమై యున్నది.

అతఁడు తన గ్రంథములయందుఁ బ్రయోగించిన కొన్ని యుపమానముల యందును, బాటించిన కవిసమయములయందును గూడ దేశితనము గానవచ్చును. ఉపమానములు ప్రయోగమునందు సంస్కృతమున నొకనిర్దిష్ట విధానము కలదు. ఆ సంప్రదాయమునే చాలవఱకుఁ దెలుఁగు కవీశ్వరు లందఱును ననుసరించుట జరగినది. కవి సమయముల విషయముకూడ నిట్లే. కాని, దేశితనమును బ్రయోగించుటలో నభినివేశము కల సోమనాథుఁ డందందు సంస్కృత కావ్యములందును, మార్గపద్ధతిని రచితము లయిన యాంధ్ర కావ్యములందును గానరాని యుపమానములను, గవిసమయములను గ్రహించి తన స్వతంత్ర ప్రవృత్తిని, దేశీయాభిమానమును జాటుకొనెను. వానిలోఁ గొన్ని దక్షిణ దేశభాషలయందుఁ గానవగును.

ఇతివృత్తము, ఛందస్సు, వర్ణనలు మొదలగువాని విషయమున సోమనాథుఁడు దేశీయతను సాధించి తన దేశీయాభిమానమును ప్రదర్శించినట్లే భాషా ప్రయోగము నందును దేశితనమును ప్రదర్శించి యుండుట యాతని దేశి రచనా ప్రవణతను వ్యక్తము చేయును. అతఁడు తన బసవపురాణ, పండితారాధ్య చరిత్రముల యందు నెలకొలిపిన భాషను సామెతలు, జాతీయములు, తత్సమపద ప్రయోగము, తద్భవరూపములు, సమాసములు, పదజాలము, సంజ్ఞా పదములు, వాక్యరచన లేక వ్యవహారానుగుణ మయిన వాక్య రచనా విధానము అను శీర్షికల క్రింద వింగడించుకొని చూచినపుడు వాని యన్నింటి సమాహార రూపమున నాతఁడు భాషలో సాధింపదలఁచిన దేశీయత యొక్క స్వరూప మెట్టిదో విశదము కాఁగలదు. అతని భాషలోఁ గానవచ్చు విశేష సంధిరూపములు కూడ నాతని దేశిరచనా ప్రవణతనే వెల్లడి చేయును. నన్నయ భారతము, నన్నెచోడుని కుమార సంభవము, మల్లికార్జునపండితుని శివతత్త్వసారము అను గ్రంథముల యందు సామెతలును, జాతీయములును నతి విరళములు. సోమనాథుఁడు వారందఱికంటెను నధికముగాఁ దన కావ్యములయందు సామెతలను, జాతీయములను బ్రయోగించి తన కవిత్వమును సామాన్య ప్రజాభావనకు మఱింత సన్నిహితము చేయఁ గలిగెను. తత్సమ పదముల ప్రయోగవిషయమై యాతఁడు కొంత స్వాతంత్ర్యము వహించి తన కాలమునాఁటి శాసనములందును వ్యవహారమందును గల రూపములను దన కావ్యముల యందుఁ బ్రయోగించెను. నన్నయ, నన్నెచోడులలో నతి విరళముగా మాత్రమే వైరి సమాసములు ప్రయోగింపఁబడఁగా నితఁడు చాలముందునకుఁ బోయి వ్యవహార భాషలో సామాన్యముగాఁ గానవచ్చు వైరిసమాసములను బ్రయోగించుట కేమాత్రము వెనుదీయలేదు. తనకాలమునఁ బ్రజలు తమ యనుదిన వ్యవహారములయందుఁ గల్పించుకొనుచుండిన వైరిసమాసముల పద్ధతిలోనే యాతఁడును గొన్ని వైరిసమాసములను గల్పించుకొని యుండవచ్చును. మొత్తముమీఁద నాతని యీ వైరిసమాసముల ప్రయోగ మాతనికి వ్యవహార భాషా సన్నిహితమగు భాషా ప్రయోగము నందుఁ గల మక్కువనే తెలియఁ జేయును. అతని కావ్యములలోఁ గానవచ్చు కొన్ని తద్భవ రూపము లాతఁడు నూతనముగాఁ గల్పించిన వనుట కంటె నాయా సంస్కృతపదముల నాతని కాలమున నారూపములతోనే ప్రజలు వ్యవహరించుచుండి రనియు, నట్లు వారి వ్యవహారమున నుండిన యా తద్భవరూపములనే యాతఁడు తన కావ్యముల యందు గ్రహించి యుండు

ననియు భావింపఁ దగును. కావ్య భాషలో సంధికి నియతప్రవృత్తి కలదు. వ్యవహార భాషలో నట్టి నియతప్రవృత్తి లేదు. సోమనాథుని గ్రంథములలోఁ గానవచ్చు విశేష సంధిరూపము లా నాఁటి వ్యవహార భాషాస్థితిని దెలియఁ జేయును. సోమనాథుని గ్రంథములయందు దేశిపదజాలము విశేషముగాఁ గానవచ్చును. మాదిరి పరిశీలనము (Sample survey) బట్టి యాతఁడు ప్రయోగించిన పదజాలములో సంస్కృతాంధ్ర పదముల నిష్పత్తి 1:2 చొప్పున నున్నట్లు తేలినది. ఇది యాతని దేశి రచనా ప్రవణతను వెల్లడించును. నన్నయాదులగుమార్గకవుల గ్రంథములు ప్రాయికముగాఁ బురాణ గ్రంథము లగుటవలన వారి గ్రంథములలోని సంజ్ఞాపదములును పౌరాణిక వ్యక్తులచే యయి యుండును. అందభివర్ణింపఁ బడిన స్థలములు భారతదేశము లోనివే యయినను నుత్తరహిందూస్థాన ముందలివి, ఇట్లు సంజ్ఞాపదముల విషయమునఁగూడ వారిగ్రంథములందు మార్గసంప్రదాయమేగోచరించును. దేశి వాతావరణము వానియందంతగాఁ గానరాదు. సోమనాథుని గ్రంథములలో దేశీయములయిన సంజ్ఞాపదములు పురుషులపేర్లు, స్త్రీల పేళ్లు, స్థలముల పేళ్లు విస్తారముగాఁగానవచ్చును. సోమనాథునికిఁ దరువాతి కాలమునఁ గూడ నింతవిస్తారముగా సంజ్ఞాపదములను గలిగిన కావ్యము మఱొండు గానరాదు. ఇట్లు, సోమనాథుఁడు తన సమకాలమునందు జనవ్యవహారమున నున్న మనుజ సంజ్ఞలను, స్థలములపేళ్లను విస్తారముగాఁ దన కావ్యములయందు నెలకొలిపి యావిషయమునఁగూడఁ దన దేశీయాభిమానమును బ్రదర్శించినాఁడు. సోమనాథుఁడు తన కావ్యగతము లగు సంభాషణాదులలో వ్యవహారభాషకు నతిసన్నిహితమయిన వాక్య రచనము మూలమున నా సంభాషణములకును నందలి వాక్య నిర్మాణమునకును నొక సహజత్వమును సంతరించుకొనినాఁడు. కావ్యభాషాగ్రథితము లయినను గొన్ని పట్టులయందు రచితము లయిన యాతని వాక్యము లాతఁడు తనమనసులోఁ దొలుత నూహించిన వ్యావహారిక భాషావాక్యమును బట్టి యిచ్చుచు గ్రాంథిక భాషలో నున్నను నవి వ్యావహారిక భాషా వాక్యములే సుమా యని తోఁపఁజేయు పద్ధతిలో నుండును. ఇట్లుగా వింగడింపఁదగిన విధమున నాతఁడు తన కావ్యములయందు భాషాప్రయోగమును దేశి లక్షణ లక్షితముగా నిర్వహించి యున్నాఁడు.

సోమనాథుని గ్రంథములను జదివినప్పుడతఁ డొక్క కవీశ్వరుఁడుగా మాత్రమే కాక బహుముఖ ప్రజ్ఞాశాలియు, లోకజ్ఞుఁడు నగు నొక్క మహనీయ

వ్యక్తిగా మనకు గోచరించును. పరమశివుని పంచవింశతి లీలలు మొదలుకొని పర్వతమెక్కు పరుసజనుల వేషభాషలదాఁక నాతఁడు తన గ్రంథములలోఁ జెప్పని విషయము లేదు. తడవని యంశము లేదు. తనకాలమునాఁటి దేశీయ విజ్ఞానమంతయు భద్రపఱచిన సాహిత్య నిధు లాతని గ్రంథము లన్నచో నతిశయోక్తి కాఁ జాలదు. నేత్రరోగములు, నేత్రవైద్యము, వాయురోగమునకు వైద్యము, సర్పవైద్యము, ద్యూతవిద్య, చోరవిద్య, వస్త్రభేదములు, డెబ్బదిరెండు నియోగములు, పిల్లల ఆటలు, చేఁపల వేఁట, మృగయు, కోటల నిర్మాణము, శకున శాస్త్రము మొదలగు నంశములకు సంబంధించిన దేశీయ విజ్ఞానము నీతని గ్రంథములు మనకందించుచున్నవి. ఇంకను దన కాలమునందలి సాంఘిక జీవనమునకుఁ జెందిన వివిధ వస్తుపరికరాదులను, తెలుఁగుదేశమునందలి చెట్లు చేమలు, పువ్వులు, ఫలములు, పత్తిరులు మొదలగునెన్నో విషయములను గూర్చిన దేశీయ విజ్ఞాన మీతని గ్రంథ ములమూలమున మన కెఱుక కందుచున్నది.

సంస్కృత గ్రంథములను రసవత్తరముగా ననువదించుటలో నిమగ్నుఁడయిన తెలుఁగు కవీశ్వరునికిఁ దన కాలమునాఁటి ప్రజాజీవన మాతని దృష్టిపథమున లేనే లేదు. వస్తువు యుగ యుగములనాఁటి పౌరాణికేతివృత్తమగుట చేతను – అనువాదమో, యనుసరణమో చేయుచున్న కవి మూలమునకుఁ గట్టువడి రచనలో నస్వతంత్రుఁ డగుట చేతను – పురాణ యుగమునందలి కవీశ్వరుఁడు ప్రజాజీవనమును లక్షింపఁజాలక పోయెను. తరువాతి కాలమున వెలసిన ప్రబంధ కవులు పురాణేతివృత్తమును దీసికొని స్వతంత్రముగానే కావ్యములను రసవత్తరముగా రచించినప్పటికిని రసైక చక్షుష్కు లయినవారు రససిద్ధికొఱకై నేలవిడిచిన సాముగా మిన్నులలోనే విహరించిరి. సహజతకు సన్నిహితముగాఁ గావ్యమునకు సహజాలంకార మయిన ప్రజాజీవనమును వర్ణింప వలయు నను నభిలాష వారికి లేక పోయినది. అయినను గొందఱు కవీశ్వరులు తమకు నిత్య సన్నిహితము లై, తమ నిత్యానుభవములో నున్నకొన్ని విషయములను దమ కావ్యముల యందక్కడక్కడ స్పృశింపకుండ నుండఁజాలక పోయిరి. ఇట్లు ప్రజాజీవన స్ఫూర్తితో వెలసి పోయెడి ఘట్టములు తెలుఁగుకావ్యములలోఁ గ్వాచిత్కముగా మాత్రమే యక్కడక్కడ మబ్బులలో దాఁగుడుమూఁత లాడుచుండును. సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య

చరిత్రములు, శ్రీనాథుని పలనాటి వీరచరిత్రము, కృష్ణరాయల యాముక్త మాల్యద, అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతి ప్రజాజీవనమును బరిస్ఫురింపఁజేసెడి గ్రంథములలోఁ బ్రధానముగాఁ బేర్కొనఁ దగినవి. సోమనాథుఁడు తన కాలము నాఁటి ప్రజాజీవనమును పండితారాధ్య చరిత్రము నందు – అందును బర్వత ప్రకరణములో మనము కన్నులార దర్శింపఁ గలుగునట్లు చిత్రించి చూపెను. సోమనాథుని కాలమునాఁటి ప్రజాజీవన మం దతి వేలముగాఁ బ్రతిబింబించును. (అష్టమాధ్యాయము).

నన్నెచోడుని కుమార సంభవమునందలియవతారికలోని 'మును మార్గకవిత' యను పద్యమున కర్థము చెప్పుటకు యత్నించిన పండితులు మార్గకవిత యనఁగా సంస్కృతకవిత్వ మనియు, దేశికవిత యనఁగాఁ దెలుఁగు కవిత్వమనియు, నందుఁ బేర్కొనఁబడిన చాళుక్య రాజు రాజరాజనరేంద్రుఁ డనియు వివరించిరి. కాని, నన్నయకుఁ బూర్వకాలమునందే తెలుఁగునఁ గవిత్వ మున్నటుల నిదర్శనము లగుపడుచుండుటచే వారా పద్యమునకుఁ దెలిపిన యర్థము సమంజసము కాదని తోఁచును. కన్నడమునఁ గవి రాజమార్గమునకుఁ బూర్వము దేశికవిత ఉండె ననియుఁ, గవిరాజమార్గకర్త యగు నృపతుంగుఁడు తన లక్షణ గ్రంథమున నా భాషకొక వ్యవస్థ కల్పించె ననియు, నా వ్యవస్థనే యనుసరించి పంపాదులు కావ్యరచనముచేసిరనియుఁ దెలియుచున్నది. ప్రాచీన కాలమునఁ గన్నడ భాషకును, దెలుఁగు భాషకును నిప్పుడున్నంత వ్యత్యాసము లేదు. నృపతుంగునికిఁ దరువాతఁ గన్నడమున వ్యాపించిన మార్గకవితాపద్ధతి తెలుఁగు భాషలోఁ గూడఁ బ్రవేశించెను. కాని, చాళుక్య రాజాదులా మార్గ పద్ధతి నంగీకరింపక దేశికవితకు నాదరము నొసఁగుటకు యత్నించిరి. నన్నయకుఁ బూర్వకాలమందు వెలసిన కవితను శాసన కవిత, పదగేయ రూపమయిన దేశి కవిత, మార్గపద్ధతికిఁ జెందిన కావ్యకవిత యని మూఁడు విధములుగా వింగడింప వచ్చును. కన్నడ కవుల ప్రభావముచేఁ బండితకవులు మార్గకవిత్వము వైపునకు మొగ్గు చూపఁ దొడఁగిరి. నన్నయకాలమునాఁటికి మార్గ కవిత్వాభిమాన మధిక మయ్యెను. నన్నయ, నారాయణభట్టుల సమష్టికృషి ఫలితముగా మార్గకవిత్వము భారతమున సమగ్రస్వరూపము నందెను. అందు మార్గకవితాంశ మధికముగా నున్నను నందు దేశి కవితా రేఖలు కూడఁ కొన్ని లేకపోలేదు. నన్నెచోడుని కుమార సంభవము కూడ మార్గపద్ధతి కావ్యమనియే చెప్పఁ దగును. అందు నన్నయ

భారతమునకంటె దేశికవితాచ్ఛాయ లధికముగా గోచరించును. ఇతివృత్తము, సంప్రదాయము, కవిసమయములు - వీనియం దితఁడవలంబించిన దేశీయ విధాన మితనిదేశి కవితాభిమానమును వ్యక్తము చేయును. పాల్కుఱికి సోమనాథుఁడు రచించిన బసవపురాణ, పండితారాధ్య చరిత్రములు ప్రధానముగా దేశి మార్గమునకుఁ జెందిన గ్రంథములు. సమకాలమునఁ బ్రభవమందు ప్రజ్వరిల్లుటయే కాక యాతని దేశికవిత్వము తరువాతి కాలమున వెలసిన యాంధ్ర సాహిత్యముపైఁ గూడఁ దన ప్రభావమును నెఱపెను. అట్లా ప్రభావమునకు లోఁగక కొందఱు కవులు దేశికవిత్వాంశములను దమతమ కవిత్వములలోఁ గూడ వెలయించుకొని పుష్టిమంతము లొనర్చుటకు యత్నించిరి. గోనబుద్ధారెడ్డి రామాయణము ఛందో విషయమున దేశి మార్గమునే యనుసరించెను. కాని యాతని యితివృత్తము మార్గేతివృత్తమే యయినను నన్నెచోడునివలె నితఁడు తన యాంధ్రీకరణమును దేశీయ చిహ్నములతో విలక్షణ శోభిత మొనర్చెను. రంగనాథకవి రచితములుగా నిటీవలఁ గొన్ని రచనము లుపలబ్ధము లయినవి. అవి రగడ కృతులు. 'రగడ' యను నీ దేశీయచ్ఛంద స్స్వీకరణము సోమనాథుని ప్రభావము చేతనే కావచ్చును. తిక్కన సోమయాజి భాషా విషయమున దేశి కవితాభిమానమునే ప్రదర్శించెను గాని, యితర విషయములలో మార్గ పద్ధతినే యవలంబించెను. తిక్కన తరువాతఁ దెనుఁగునందుఁ గవిత్వము చెప్పిన కవీశ్వరులతనియంత శక్తిమంతులుగాక పోవుటచే, నన్నయ యవలంబించిన మార్గకవితాపద్ధతినే యవలంబించి పెంపొందించిరి. వారిలో శ్రీనాథుఁ డొకవంక మార్గకవితాభి మానమును బ్రదర్శించుచునే మఱొకవంకఁ గొంత దేశికవిత్వమును గూడ వెలయించెను. అతని పలనాటి వీరచరిత్ర యచ్చముగా దేశికావ్యమని చెప్పఁ దగును. శ్రీనాథ యుగమునకుఁ జెందిన మఱొక ద్విపద కావ్యకర్త గౌరన, అతని హరిశ్చంద్ర ద్విపదలో నొక్క యితివృత్తము మాత్రమే మార్గము. ప్రబంధ యుగమునకుఁ గొంత ముందు వెనుకలు గాఁ దాళ్లపాక కవుల కృతులలో దేశికవిత మరల నొకతూరి తలయెత్తుకొనినది. ప్రబంధ యుగమునకుఁ దరువాత దానిప్రభావముచేతఁగాఁబోలు దేశి కవిత్వము దృశ్యాదృశ్యమై పోవుట తటస్థించెను. కాని, యాకాలపుఁ గవులలోఁ గొందఱు చెదరు చెదరుగా దేశి కవిత్వ లక్షణములకుఁ దమ కవిత్వములో నేదో యొక రూపమునఁ జోటు గల్పింపవలయునని సంకల్పింపక పోలేదు. అట్టి వారి సంకల్పముయొక్క ఫలమే యచ్చ తెనుఁగుకావ్యములు. తరువాత నాయకరాజుల

కాలమున నీ దేశి కవిత్వము యక్షగానములు, పదములు, జావళీలు మొదలగువాని రూపమునఁ గొంత విజృంభణముగాంచెను. ఆధునిక కాలమునఁ బండితులకును, గవులకును దేశి కవిత్వముపై నపరిమిత మయిన యాదరాభిమానము లుదయించినవి. ఆధునికకాలమునందలి యాంధ్ర కవిత్వము చాలవఱకు దేశిమార్గముననే నడచుచున్న దనినచో నతిశయోక్తి లేదు. కాని, విద్వాంసులకుమాత్రము నేఁడు కూడ దీని యెడ నిరసన భావమే కాని సహజమయిన గౌరవాదరములు సమకూడుట లేదు. దీని భవిష్యత్ప్రవృత్తి యెట్లుండునో యిప్పుడప్పుడే చెప్పుటకు వీలుకాదు. కాని, యిట్లుగాఁ బరిణమించి నేఁటికాలమున నింతగా మనమభిమానించుచున్న దేశికవిత్వమును – నేటికిఁ బూర్తిగా భిన్నమయిన దేశకాల పరిస్థితులలో నించుమించుగా నేడువందల సంవత్సరములకుఁ బూర్వము లక్షించి తదాశయ సిద్ధికై తన యావచ్ఛక్తిని వినియోగించివిస్తారమయిన దేశికవిత్వ సంపదను బిత్రుధనముగా మన కందించి పోయిన సోమనాథుని దూరదృష్టి విజ్ఞానమెంతటిదో యనూహ్యము.

ఆంధ్ర సాహిత్యముపై సోమనాథుని దేశి కవిత్వోద్యమము యొక్క ప్రభావము ప్రత్యక్షముగాఁ గొంతయు, నప్రత్యక్షముగాఁ గొంతయుఁ గలదు. మఱొకవిధముగాఁ గూడ మన మీ ప్రభావమును వర్గీకరింప వచ్చును. కావ్యగతము, ఛందోగతము, ప్రక్రియాగతము, భాషాగతము నని యాతనిదేశి కవిత్వోద్యమప్రభావము నాలుఁగు తెఱఁగులుగా నున్నది. కావ్యమును మత ప్రచార సాధనముగా రచించుట చారిత్రకపురుషునిఁ గావ్యనాయకునిఁ గావించుట యని వానిలోఁ గావ్యగత ప్రభావమును మఱల రెండు తెఱఁగులుగా విభజింపఁదగును. ద్విపద కావ్యరచనము, ద్విపదలఁ బ్రాసయతి నిలుపుట, త్రిభంగి మొదలగు విశేషవృత్తములను వాడుట యను మూఁడు తెఱఁగులుగా నీతని ఛందః ప్రభావము తరువాతి కవులపైఁ గలదు. శతకము, ఉదాహరణము, చిత్రకవిత్వము అను ప్రక్రియాగతము లయిన ప్రభావము తరువాతి కాలపుఁ గవిత్వమునఁ గాననగును. జానుతెనుఁగు, వ్యావహారిక భాషాప్రయోగము అని రెండు తెఱఁగుల భాషాగత మయిన ప్రభావము వెలయుచున్నది. మత విషయకమయిన ప్రతిక్రియ (Re-action) కూడ నీతని దేశి కవిత్వము మూలమునఁ గొంత జరగినది.

# ఉపయుక్త గ్రంథములు

**తెలుఁగు**

అప్పతెలుఁగు రామాయణము : కూచిమంచి తిమ్మకవి,
వావిళ్లరామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, మదరాసు.

అనంతుని ఛందము : అనంతామాత్యుఁడు,
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, మదరాసు

అనుభవసారము : పాలకుఱికి సోమనాథకవి
పరిష్కర్తలు : శివశ్రీ బండారు తమ్మయ్య, శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య
వావిళ్లరామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, మదరాసు (1956)

ఆంధ్ర భాషా చరిత్రము : (1,2 సంపుటములు),
డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు
ప్రకాశకులు : ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు

ఆంధ్రమహాభారతము : కవిత్రయము
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, మదరాసు

ఆంధ్రమహాభారతము : కవిత్రయము
వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, మదరాసు

ఆంధ్రవాఙ్మయ చరిత్రము : డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారు
ప్రకాశకులు : ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు

ఆంధ్రవాఙ్మయారంభదశ : ప్రథమసంపుటము : ప్రాఙ్నన్నయ యుగము –
డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారు,
ప్రకాశకులు : గ్రంథకర్త, ఆంధ్ర శాఖాధ్యక్షుడు,
ఉస్మానియావిశ్వవిద్యాలయము, హైదరాబాదు (1966)

ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము : ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము

ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి : శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము, శ్రీ ఖండవల్లి
బాలేందుశేఖరము ప్రకాశకులు : శ్రీ బాలసరస్వతీ బుక్ డిపో,
కర్నూలు, (1951)

ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగము :
డాక్టరు సి. నారాయణరెడ్డి,
ప్రకాశకులు : గ్రంథకర్త, ఉస్మానియా విశ్వవిద్యాలయము,
హైదరాబాదు (1967)

ఉత్తరభారత సాహిత్యములు :
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు

ఉత్తరహరివంశము : నాచన సోమన
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, మదరాసు

కవిజనాశ్రయము : మల్లియరేచన
వావిళ్లరామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, మదరాసు (1950)

కవిరాజశిఖామణి : శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య,
సారస్వతకుటీరము, మదరాసు - 21 (1956)

కుమారసంభవము : నన్నెచోడమహాకవి
పరిష్కర్తలు : శ్రీ కోరాడ రామకృష్ణయ్య, శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి
మదరాసు విశ్వవిద్యాలయము, మదరాసు (1948)

కుమారసంభవము : నన్నెచోడమహాకవి
పరిష్కర్త : శ్రీ నిడుదవోలు వెంకటరావు,
వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, మదరాసు (1948)

చతుర్వేదసారము : పాలకుఱికి సోమనాధకవి
పరిష్కర్త : శివశ్రీ బండారు తమ్మయ్య
ప్రచురణ : చలవాది రామయ్య, పల్నూరు పాలెము, కృష్ణాజిల్లా (1962)

తమిళ పంచకావ్యకథలు : శ్రీ చల్లారాధాకృష్ణశర్మ
లక్ష్మీనారాయణ గ్రంథమాల, తండయార్పేట, మదరాసు (1953)

తెలుఁగుకవుల చరిత్ర : శ్రీ నిడుదవోలు వెంకటరావు,
మదరాసు విశ్వవిద్యాలయము, మదరాసు (1953)

తెలుఁగు విజ్ఞానసర్వస్వము : మూఁడవ, ఆఱవ సంపుటములు,
తెలుగు భాషా సమితి, మదరాసు

తెలుఁగు సామెతలు : సంపాదకులు – కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాః
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు (1965)

దక్షిణదేశ భాషా సారస్వతములు – దేశి : శ్రీ కోరాడ రామకృష్ణయ్య
కోరాడ ప్రచురణాలయము, మదరాసు (1954)

దక్షిణ భారత సాహిత్యములు
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు

దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము లేక మధుర, తంజావూరు నాయకరాజుః
ఆంధ్రవాఙ్మయచరిత్ర :
డాక్టరు నేలటూరు వెంకట రమణయ్య
ప్రచురణ : శ్రీమతి అ. పంపమ్మ, సూర్యాపేట, హైదరాబాదు

దిగంబరకవులు (ప్రథమ, ద్వితీయ సంపుటములు)
సెంట్రల్ పాయింటు, 510 ట్రూప్ బజారు, హైదరాబాదు, (

పండితారాధ్య చరిత్రము : పాలకుఱికి సోమనాథకవి
పరిష్కర్త : డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు
ఆంధ్రగ్రంథమాల, మదరాసు (1939)

పదబంధ పారిజాతము : సంపాదకులు, శ్రీ నార్ల వేంకటేశ్వరరావు, విద
తిమ్మావజ్ఝల కోదండరామయ్య
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు (1961)

పద్యబసవ పురాణము : పీడుపర్తి సోమనాథకవి

పాలకురికి సోమనాథకవి : శివశ్రీ బండారు తమ్మయ్యగారు,
శివధర్మ గ్రంథమాల, మటికె నాగయ్య ధర్మ నిలయము,
సికిందరాబాదు (1948)

పాల్కుఱికి సోమనాథకవి లఘుకృతులు
పరిష్కర్తః శివశ్రీ బండారు తమ్మయ్య,
ప్రచురణః శివశ్రీ చిమిరాల చంద్రశేఖరయ్య, దేవరపల్లి, కృష్ణాజిల్లా

పాల్కుఱికి సోమనాథుఁ డెప్పటివాఁడు? : డాక్టరు నేలటూరు వెంకటర
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, మదరాసు, (1955)

పావులూరిగణితము: పరికర్మ, భిన్న (కలాసవర్ణ) గణితములు 1, 2 అధ్యాయాలు
పరిష్కర్త : శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ సిరీస్ సంఖ్య – 38
తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి, (1952)

బసవపురాణము : పాలకుఱికి సోమనాథకవి
పరిష్కర్త : శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
ఆంధ్రగ్రంథమాల, మదరాసు (1926)

బసవపురాణము (ద్వితీయముద్రణము)
పరిష్కర్త : శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు
ఆంధ్రగ్రంథమాల, మదరాసు (1952)

బసవపురాణము : పరిష్కర్త : శివశ్రీ బండారు తమ్మయ్యగారు
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, మదరాసు (1952, 1966)

బసవవచనామృతము : అనువాదము : శ్రీ బాడాల రామయ్య
బసవసమితి, బెంగుళూరు, (1965)

మంజీర గాథ : శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి గారు
అపర్ణ, జేమ్సుతోట, నెల్లూరు (1964)

యయాతి చరిత్రము : పొన్నిగంటితెలగన్న
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, మదరాసు

రంగనాథరామాయణము : గోనబుద్ధారెడ్డి
పరిష్కర్త : శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
ఆంధ్రవిశ్వవిద్యాలయము, వాల్తేరు

వీరశైవాంధ్ర వాఙ్మయము : శ్రీ శిష్టారామకృష్ణశాస్త్రిగారు
తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి

శతకమంజరి – భక్తి సంపుటము
ఆంధ్ర గ్రంథమాల, మదరాసు (1926)

శివతత్త్వసారము : మల్లికార్జునపండితుఁడు
పరిష్కర్త : కొమర్రాజు వేంకట లక్ష్మణరావు
ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ (1923)

శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి జీవిత చరిత్రము :
శ్రీ కాళ్లకూరి సూర్యనారాయణ
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, మదరాసు (1955)

సమగ్ర ఆంధ్రసాహిత్యము : (మొదటి మూఁడు సంపుటములు) : శ్రీ ఆరుద్ర
యం. శేషాచలం అండ్ కంపెనీ, మదరాసు (1965)

సాహిత్య శిల్ప సమీక్ష : శ్రీ పింగళి లక్ష్మీకాంతకవి
మాలికో పబ్లిషర్లు, తిరుపతి (1966)

సాహిత్య సమితి వ్యాసావళి :
సాహిత్య సమితి, తిరుపతి (1967)

సింహాసన ద్వాత్రింశిక (1,2 భాగములు) : కొఱవి గోపరాజు,
ఆంధ్ర సాహిత్య పరిషత్తు, తిరుపతి (1956)

## పత్రికలు

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (సంపుటములు)
ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ

పరిశోధన (సంపుటములు) సంపాదకులు, శ్రీ తిరుమల రామచంద్ర,
శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య, (1954-55)

భారతి (సంపుటములు)
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యా పరిశోధనాలయపత్రిక (సంపుటములు)

హిందీలో భావకవిత్వం (అముద్రితవ్యాసము) :
శ్రీ ముటుమ్నూరి సంగమేశంగారు, తిరుపతి.

**తమిళము :**

తొల్కాప్పియము : పొరుళ్ అధికారము. ఆంగ్లానువాదము :
శ్రీ ఇ. యస్. వరదరాజ అయ్యర్; అణ్ణామలై విశ్వవిద్యాలయము, అణ్ణామలై నగర్, (1948)

తొల్కాప్పియము : పొరుళ్ అధికారము. ఆంగ్లానువాదము.
డాక్టరు పి. యస్. సుబ్రహ్మణ్య శాస్త్రి
శ్రీ కుప్పుస్వామి శాస్త్రి పరిశోధనాలయము, మైలాపూరు, మదరాసు (1949)

శిలప్పదిగారము

పురనానూరు (సంకలన గ్రంథము)

కంబ రామాయణము

**కన్నడము :**

కర్ణాట కవిరాజమార్గము
సంపాదకులు : ఎ. వెంకటరావు, పండిత హెచ్. శేష అయ్యంగారు, మదరాసువిశ్వవిద్యాలయ ప్రాచ్య విద్యాపరిశోధనాలయము, మదరాసు (1929)

పంప భారతము : సంపాదకులు బి. లూయిస్రైస్, బెంగుళూరు (1998)

బసవవచనామృత : బసవ సమితి, బెంగుళూరు – 9
సంపాదకుఁడు : డాక్టర్ ఎల్. బసవరాజు, మానసగంగోత్రి, మైసూరు (1966)

## ENGLISH

Bengali Literature · J C. Ghosh, Oxford University Press, London (1948)

Contemporary Indian Literature· Sahitya Akademi, New Delhi

Hindi Semantics . Hardev Bahri, Allahabad University, Allahabad (1959)

History of Bengali Language and Literature Prof Dinesa Chandra Sen, University of Calcutta (1954)

History of Kanarese Literature : E.P. Rice, The Heritage of India Series (1915)

History of Malayalam Literature P K Parameswar Nair, Sahitya Akademi, New Delhi

History of Orya Literature : Mayadhar Mansimha, Sahitya Akademi, New Delhi

Thus Spake Basava Translated by A Sundera Raj Theodore, Devendra Kumar Hakari, Basava Samiti, Bangalore (1965)

Vacanas of Basavanna Translated by Armando Meneze, S.M Angadi. Annana Balaga, Sirigire, Mysore State (1965)

